మద్రాసు విశ్వవిద్యాలయాంధ్ర గ్రంథమాల-నెం-6.
(బులెటిన్)

శ్రీ

నన్నిచోడదేవ

# కుమారసంభవవిమర్శము

---

రచయితః

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రీ
ఆంధ్ర సహాయోపన్యాసకుఁడు
ప్రాచ్య పరిశోధన సంస్థ
మద్రాసు విశ్వవిద్యాలయము




మద్రాసు
ఆనంద ముద్రణాలయము
ముద్రితము
1937

వెల. రు. 2-0-0]

# PREFACE.

A critical study and appreciation of Nannichodadeva's *Kumarasambhava* has long been a thing highly desired and expected by the literary intelligentzia of the Telugu Country, not merely on account of the intrinsic merit of that work, but also on account of the peculiar importance it has acquired owing to a controversy that has been raised on its first publication, as regards its date and place in the history of Telugu Literature. A greater antiquity than Nannaya's Telugu Bharata has been claimed for it, so as to dethrone the latter from the first place in Telugu Literature generally assigned to it, through the ingenious efforts of its first editor, who deserved all credit not only for raising it from a long oblivion, but also for having at the same time made its first publication a highly sensational event.

Chronology is the bugbear of Indian History as of Indian Literature. The dates of some of the most shining stars in the political as well as in the literary world are still subjects of great controversy. In Telugu Literature the date of Nannichoda is one such. For, many are the families of the Chodas, and many are the individuals who happened to bear this name, and all the sources of external evidence so far tapped yielded us no definite conclusive proof as regards the time and identity of the author of this work. However the general trend of the opinion of the scholars of the Telugu country so far, seems inclined to place him somewhere after Nannaya thus restoring him (Nannaya) to the first place in Literature already assigned to him. It is the endeavour of the author of this critique to show up the futility of the inscriptional and other available external evidence in fixing the date and identity of the author of *Kumarasambhava*, and then to try conclusions with the internal evidence—to see how far the points of evidence thrown up by a critical intensive study of the work lend themselves to throw light on the vexed question of the date of its author.

The points of internal evidence that are put up for consideration chiefly bear upon the sources and the treatment of the theme, as well as on other literary and linguistic parallels and peculiarities.

The question of the sources has been thoroughly dealt with. Evidence has been brought forward to show that Nannichoda followed or taken hints not only from the first eight sargas of Kalidasa's *Kumarasambhava*, but also from the other portion of the work attributed to some later scholar probably of about the 13th century A. D., and from Udbhata's work on Alankara, wherein an incident from the story of *Kumarasambhava*—namely Siva assuming the form of a 'vaṭu,' has been utilized by him to frame illustrations for his Alankaras. Incidentally Nannichoda's reference to Udbhata, is interpreted as referring to the authorship of his only work on Alankara and not, as is alleged by some, to several works of his—as *Kumarasambhava*, *Haralila*, etc. It is shown that Nannichoda has been inspired also by Tikkana and his contemporary poets, and that he has taken hints from Tikkana's descriptions of Bharata War. Arguments based on linguistic, prosodial and other peculiarities which are brought forward by the sponsers of the pre-Nannaya theory have been examined, and such of the special features which are considered peculiar to Nannichoda and alleged as proofs of his antiquity, have been traced to the later Saivite and Kanarese influences. On the basis of the evidence thus collected from internal sources the author brings down Nannichoda to about the end of the 13th century A.D., and his evidence is well worth the consideration of the Telugu scholars. The textual criticism and the literary appreciation offered points to the necessity of a new edition of this work of Nannichodadeva.

ORIENTAL RESEARCH INSTITUTE,
UNIVERSITY OF MADRAS,
*15th April 1937.*

K. RAMAKRISHNAIYA,
*Head of the Telugu Department.*

శ్రీ

శ్రీ రాజశిఖామణియుఁ గవిరాజశిఖామణియు నగు నన్నిచోడదేవుఁడు రచించిన కుమారసంభవ మాంధ్రప్రబంధములకు మేలుబంతి. ఇది మ. రా. శ్రీ. మానవల్లి రామకృష్ణకవిగారు మొదటఁ బ్రకటించిరి. దీని నింకను జక్కఁగఁ బరిష్కరించి, సరియగు పాఠములతోను విపులవ్యాఖ్యతోను బ్రకటింప వలయు నను తలంపు గొన్ని సంవత్సరములనుండియు నాకుఁ గలదు.

తత్ప్రకటనమునకంటె ముం దొక విమర్శనము రచింపఁ దగు నని యెంచి యిదివఱకుఁ బూర్వము ప్రకటింపఁబడిన విమర్శనములలో నాకు లభ్యము లగు వానిని బరిశీలించి, యథామతి నీ విమర్శనము రచించితిని.

ఇది నాతివిపులము గాన, నిందలి విషయము లన్నియు నిచటఁ దెలుపుట యనావశ్యకము. అయినను, పాఠకప్రరోచనార్థము ప్రధానవిషయములను దెలివెదను.

నన్నిచోడుఁ డాంధ్రప్రబంధము రచించునపుడు కాళిదాసోద్భటుల కుమారసంభవములను మూలగ్రంథములనుగా నేర్పఱిచికొనెను. కాళిదాసు పేర నెవరో రచించిన కుమారసంభవోత్తరసర్గములలోని భాగమునుగూడ నన్నిచోడుఁడు సేకరించెను. యుద్ధవర్ణనమున భారతఫక్కిని మనకవి యనుకరించెను.

బహిరంగసాక్ష్య మనఁబడు శాసనములను జూపుచుఁ గొందఱు 'నన్నిచోడుఁడు నన్నయ్యకుఁ బూర్వుఁ' డనియు మఱికొందఱు 'నన్నయ్య తిక్కనల నడిమివాఁ'డనియుఁ దెలిపిరి. వారిలోఁ గొంద ఱాంతరంగికసాక్ష్య మనఁబడు గ్రంథస్థప్రయోగ విశేషాదులను జూపిరి కాని; వారు చూపిన శాసనములు సరిగా మనకావ్యకర్తను దెలుపుట లేదనియుఁ బ్రయోగవిశేషాదులను బరిశీలింపఁగా నన్నిచోడుఁడు తిక్కనకుఁ దర్వాతివాఁ డనియుఁ నాకుఁ దోఁచినది. ఇందలి గుణదోషములకు సహృదయహృదయమే ప్రమాణము.

నన్నిచోడుఁడు సంస్కృతాంధ్ర గ్రంథములనుండియే కాక, కర్ణాటక గ్రంథములనుండియుఁ గొన్ని విషయములు గ్రహించెను. కన్నడపు గ్రంథముల పరిశీలనమున నాకు సాహాయ్య మొనరించిన మద్రాసు విశ్వవిద్యాలయ కర్ణాటకశాఖా పండిత శ్రీ శేషయ్యంగారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఒండు రెండు పట్టులఁ దమిళ మళయాళసంప్రదాయములను దెలిసికొన నాకుఁ దోడ్పడిన మద్రాసు విశ్వవిద్యాలయ తమిళ మళయాళపండితులయెడలఁ గృతజ్ఞుఁడను.

విమర్శరచనాకాలమునఁ గొన్ని విషయములు నేను వినుపింప, సావధానముగా విని, సంవాదము గావించి, సరసాభిప్రాయములను దెలుపుచు నాకుఁ బ్రోత్సాహముఁ గలిగించిన మద్రాసు విశ్వవిద్యాల యాంధ్రశాఖా ప్రధానోపన్యాసక శ్రీ కోరాడరామకృష్ణయ్యగారికిని, నా విమర్శముఁ బ్రకటించిన మద్రాసు విశ్వవిద్యాలయమువారికిని నా కృతజ్ఞతలఁ దెలుపుచున్నాను.

ORIENTAL RESEARCH INSTITUTE,
UNIVERSITY OF MADRAS,
1—5—37.

ఇట్లు:
శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రి.

—

# వి ష య సూ చి క

---

శ్రీ

# నన్నిచోడదేవ

# కుమారసంభవవిమర్శము

రవికులశేఖరుండు గవిరాజశిఖామణి గావ్యకర్త స
త్కవి భువి నన్నిచోడఁ డటె కావ్యము దివ్యకథం గుమారసం
భవమఁటె సత్కథాధిపతి భవ్యుఁడు జంగమ మల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁడట్టె వినం గొనియాడఁ జాలదే. (౧-౫౭)

కావ్యప్రశంస

అని యసాధారణమయిన పొగడ్తనొందిన కుమారసంభవమహాకావ్యముఁ జదువఁ జదువఁ గవి చెప్పినట్లు "కవికి నైసర్గికముగానుండు నలువదినాలుగు విద్యలయందలి నేర్పును, ఆర్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలుసూక్తులును, ప్రబంధసద్రసబంధురతయు" సహృదయులహృదయంబులఁ గావ్యానంద రసప్రవాహమున నోలలాడించును.

ఆంధ్రమున నిరుపమానమగు నీ కావ్యము ప్రాచీనకవులును, ప్రాచీన లాక్షణికులును గొందఱు చూచినట్లు కొన్ని నిదర్శనము లున్నవి గాని భారతాదిగ్రంథములవలెఁ బొందఁదగినంత ప్రచార మిది పొందలేదు. మధ్యకాలమందున్న లాక్షణికుల దృష్టికి గోచరము గాకపోవుటయే మన శ్రవణములకు గోచరము గాకపోవుటకుఁ గారణము. ఇతర కారణములులేవు. కవి కాళిదాసునంతవాఁడే. కుమారసంభవము కుమారసంభవమే. పైఁగాఁ జేర్చినది మహాకావ్యగుణపుష్టికరమే. ఇట్టి మహాగ్రంథము లెన్నియో యాంధ్రమున రచింపఁబడియు నంతరించియుండును. ఉదాహృతపద్యాదులను బట్టి కొన్నిటినామము లప్పుడప్పుడు వెలువడుచున్నవి. కొన్ని గ్రంథములును లభించుచున్నవి. అట్టివానిలో నిది యొకమహాకావ్యరత్నము. కవి కావ్యావసానమున—

"ధ్రువమై జంగమ మల్లికార్జునమునీంద్రుం బేర్మిఁ బేర్కొన్న సత్
కవిరాజోక్త కుమారసంభవ మహాకావ్యంబు భూ భూధరా
ర్ణవవేదానిలతారకాంబరసదానంతాంతదిక్కాలముల్
సవిలాసస్థితి నుండునంత కిల నాచంద్రార్కమై యుండెడున్."

(౧౨-౨౨౦)

అని యాశాసించినట్లు ఆచంద్రార్కము నీ మహాకావ్యమునకుఁ బ్రచారము గలుగు నదృష్టము గలుగుట యాంధ్రులయదృష్టమే. అట్టి యదృష్టము మనకు లభింపఁజేసిన భాషాభిమానులు మ. రా. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు. వారు వ్యయప్రయాసముల కోర్చి యెన్నో ప్రాచీనగ్రంథములు సంపాదించి ప్రకటించిన భాషోపకారకులు. వారి ప్రకటన లన్నిటిలోను నేతత్ కావ్య ప్రకటన మెంతయో ముఖ్యము. ఆంధ్రలోక మేతద్గ్రంథ సంపాదకులయెడల నెంతయో కృతజ్ఞతఁ జూపవలయును.

**లభించుప్రతులు**

మ. రా. శ్రీ రామకృష్ణకవిగారు కుమారసంభవమందలి మొదటి యేడాశ్వాసములుగల భాగమును మొదటి సంపుటముగా 1909-వ సంవత్సరమునఁ బ్రకటించిరి. మిగిలిన యైదాశ్వాసముల భాగమును ద్వితీయసంపుటముగా 1914-వ సంవత్సరమునఁ బ్రకటించిరి. రెండు సంపుటముల చివరను లఘుటీకలును, రెండవ సంపుటము చివర ముఖ్యపాఠభేదములును గలవు. పీఠికలలో ముఖ్యముగాఁ గవి కాలనిర్ణయాదులను గుఱించి తమభావములు ప్రకటించిరి.

**వ్రాతప్రతి, దానికాలము**

దీని వ్రాతప్రతి తాళపత్రగ్రంథమొకటి తంజావూరిలో మహారాజా శరభోజీ సరస్వతీ మహాల్ పుస్తకభాండాగారమునఁ గలదు. తద్భాండాగార పుస్తకసంఖ్య 'నూటయెనుబదితొమ్మిది. అందు నూటయిరువది యేడు తాటియాకు లున్నవి. అక్కడక్కడఁ గొంచెము శిథిలమయియున్నను మొత్తముమీఁద మంచిస్థితిలోనే యున్నది.

అం దాఱవ యాశ్వాసము చివర "శ్రీమద్రాజాధిరాజ మహారాజ సహాజిరాజ భూపాలక సార్వభౌమస్య విజయోస్తు; యిష్టార్థాస్సంతు."— "భవానీశంకర కృపయా ఆయుష్యాభివృద్ధి రస్తు." అనియు, అష్టమాశ్వాసము చివర "శ్రీమద్రాజాధిరాజ సహాజిరాజ భూపాలక సార్వభౌమస్య యిష్టార్థః (ర్థాః?) భవానీశంకరకృపయా సఫలాః సంతు." "ఉమామహేశ్వరోరక్షతు." "శివాయనమః." అనియు వ్రాయఁబడియున్నది. అది ప్రతివ్రాయునతఁడు వ్రాసియుండును. దీనినిబట్టి యాప్రతి సహాజీకాలమున వ్రాయఁబడిన ట్లూహింపవలసి యున్నది. సహాజీ కొంచె మించుమించుగా నిప్పటికి నూట యేఁబదిసంవత్సరముల ప్రాంతమువాఁడని చరిత్ర ప్రసిద్ధి. అందలి యక్షరముల పోలికయుఁ దత్కాలమునే సూచించుచున్నది. ఒకవేళ, ఆప్రతి వ్రాసినవాఁడు విచారణ లేకుండఁగ దానిమాతృకలోనిది గ్రహించెనేమోయని సంశయము గలిగినను ఆప్రతికి మాతృకయైన నాకాలమున వ్రాయఁబడియుండు నను

టకు సందేహపడ నక్కఱలేదు. ఈ ప్రతి ననుసరించి యాంధ్రసాహిత్యపరిషత్తువా రొక ప్రతియు, మద్రాసువిశ్వవిద్యాలయమువా రొక ప్రతియు వ్రాయించి యుంచిరి.

ముద్రితమునకు మూలము

"కుమారసంభవప్రతులలో నొకటి నాకు నైజామురాజ్యమునఁ బ్రాచీనశాసన శోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాటకదేశముననే లభించెను. తక్కినవి రెండును శుద్ధద్రవిడదేశముననే యగపడియె." (కు. సం. ౨ సం. పీఠిక, ౯ పు.) అని సంపాదకులు వ్రాసిరి. శుద్ధద్రవిడదేశమున నగపడిన రెండు ప్రతులలోను తంజావూరిప్రతి చేరినదో లేదో స్పష్టముగాఁ దెలియదు. చేరనిచో సంపాదకులకుఁ దంజావూరిప్రతిగాక మఱిమూఁడుప్రతులు దొరకినవన్నమాట. వాని యాధారమునఁ బాఠపరిష్కారము గావించి సంపాదకులు ప్రకటించియుందురు. ద్వితీయ సంపుటాంతమున ముఖ్యపాఠభేదములను శీర్షికక్రిందఁ జేర్చిన పాఠములు తంజావూరి ప్రతిలోని పాఠములతో సరిగానున్నవి. ఆ పాఠభేదములలోఁ గొన్ని పద్యపాదములే మాఱియున్నవి. వానిచేత భావములును, చరిత్రాంశములును గూడఁ గొంత వ్యత్యాసము చెందినవి. వానిలోఁ గొన్ని మచ్చునకై చూపుట యుక్తము.

I. "క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జన సత్యాశ్రయునిఁదొట్టి చాళుక్యనృపుల్." (౧-౨౩)

అని మూలము. రెండవ సంపుటమున నిచ్చిన ముఖ్యపాఠభేదములలో నిట్లున్నది:

"రంధ్రవిషయంబునఁ జనఁ జాళుక్యరాజు మొదలగు పలువుర్."
ఈ పాఠమే తంజావూరిప్రతిలో నున్నది.

II. "గీ. తజ్జ్ఞునం దేరనగుఁ గవితావిశేష,మజ్ఞునం దేమియెఱుఁగంగనగునమస్త
కనకవర్ణోత్కరమ్మును గానవచ్చు, వన్నెలెఱుఁగంగఁ బోలునే వట్టిరాతఁ." (౧-3౨)

మొదటి సంపుటముచివరనున్న "యశుద్ధసూచిక"లో ఈ క్రిందిరీతి నున్నది: "రమ్ము-రాత; ర మ్మొరగంట నొరసి చూచికా కెఱుగవచ్చునే నుద్దరాత." ఇదే ముఖ్యపాఠభేదములలోఁ గొంచెపుమార్పుతోఁ గలదు.

"తజ్జ్ఞునం దెర్గనగు ... కనక వర్ణోత్కర మ్మొరకంట నొరసి చూచికా కెఱ్గవచ్చునె నుద్దఱాత." తంజావూరి ప్రతిపాఠము నిదియే. మొట్టమొదటి

పాఠము "అశుద్ధసూచిక"లో దిద్దఁబడుటచేఁ బాఠాంతర మనుకొన నవకాశము లేదు. అది యెక్కడనుంచి వచ్చినదో!

రెండవ సంపుటములోని పాఠభేదములు ఒకటి రెండు దక్క మిగిలినవన్నియుఁ దంజావూరి ప్రతిలోని పాఠములతో సరిగా నున్నవి.

III. "వెలయ నెత్తిన వలపు దీవియలు వోలె." (౮-౭౭) ప్రధాన పాఠము. ముఖ్యపాఠభేదము "నెత్తిన రాగదీపికలు వోలె." తం. ప్ర. పా. "రాగదీవియలు వోలె." అని యున్నది.

IV. "సితరుచీందుఖండ శిఖనేత్ర గరళంబు, లొడల జడల నుదుట మెడను దాల్చి, పొల్చుశంభు నొర్తు పోలి చూపలు."(౮-౯౯) దీనిలో ముఖ్య పాఠభేదము "గళకంబు, తొనలజడలను దల నుదుట మెడనిండఁ దాల్చిపొల్చిన శంభుసొర్తు" అని యున్నది. ఈ పాఠమే తంజావూరి ప్రతిలోఁ గనఁబడు చున్నది.

V. "క ... కలయఁ గైసేసి విటవిటి, కలు నిలిచిరి పురము వీథికల నభినవమై." (౮-౧౨౦) ఇది ప్రధానపాఠము. ఇంక ముఖ్యపాఠభేదము "విట విటి, యలు నిలిచిరి పురము వీథులం దభినవమై." తం. ప్ర. పా. "విటవిటి యలు పురము మిలం దభినవమై." అని యున్నది. రెండిటిలోను "విటవిటి యలు" అనియే యున్నది.

VI. ౧౨౭-వ పద్యమున "అమరకాంత." ప్రధానపాఠము. "అమర లేమ." ము. పా. భే. 'అమరలేమ.' అని తం. ప్ర. పాఠము.

ఇట్టివి యెన్నియో కలవు. వీనివలన ముఖ్యపాఠభేదములలో నిచ్చిన పాఠములు తంజావూరి ప్రతిపాఠములే యనఁదగియున్నవి. ముద్రిత ప్రధాన పాఠము లితరమగు ప్రతులలోని వని యూహింపవలయును గాని యట్లను కొనుటకు వీలులేని విషమసందర్భ మొకటి కనఁబడుచున్నది. తంజావూరి ప్రతి లోని తాటియాకులు చినిఁగిపోవుటచేఁ గలిగిన లుప్తభాగములు ముద్రితపుఁ బ్రతిలోఁ గూడ లుప్తములుగానే యున్నవి. తంజావూరు ప్రతినిబట్టి వ్రాయఁబడినట్లే యున్నవి. చూతము:

I. "క. తానేలవచ్చు భూపతి, మానవపతి చరిత నీతి మార్గం బైనన్." (౧౦-౧౭౮) అని ముద్రితమున కందపద్యపాదములు రెండే కలవు. తర్వాతి రెండుపాదములును లుప్తమయినవి. తంజావూరి ప్రతిలోను మొదటి రెండు పాదములే యున్నవి. అన్ని ప్రతులలోను ఆ భాగమే పోవుట వింతయేకదా.

II. "చ. తనకని దాఁప కర్థికి సుధామయపక్వఫలంబు లిచ్చు నో

లిన కొనుగాలివహ్నికిఁ జలింపక మార్కొని నిల్చి కాలు నీ

మనుజులు గొంద ఱా యడవి మ్రా(కులకంటెను గష్టమర్థి వెం.

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

క. ... ... ... చుఁ జాగియును నే(నీ?) ననియ తలఁచు లోభి యెప్పుడు ననికిన్
జాననిరె తలఁచు వీరుఁడు, జాననియ తలంచు పంద సరియెట్లగునో."

(౧౧-౪౭)

వ్రాఁతప్రతిలోఁ బయి పద్యములలో చంపకమాల మూఁడుపాద ములును, కందములో మొదటఁ గొంత లోపింపఁగా మిగిలిన భాగమును కలసి పోయియున్నవి. మూఁడవపాదము చివర "వెం" అను నక్షరముతో నాఁగి పోవుటయు, కందమున నొకగణము పోవుటయు తంజావూరు ప్రతిలోను, ముద్రితగ్రంథములోను సమముగా సంభవించినది.

III. "వడి నరకుఁ డేయునమ్ములు, నడుమనె తెగనేసి మార్గణము లొండ్లొగినిం, డొడకుండ ముందఱఁ గ్రక్కింతు నంచు నచ్యుతునంచున్ బృందారకతతి చెదర ముకుందుని నొదిరికొనియె మరుఁ డలుకన్."

అని రెండు కందపద్యములు కలసిపోయిన భాగను వ్రాఁతప్రతిలోఁ బైరీతిని గనఁబడుచున్నది. ఆ భాగమున మొదటిపద్యము చివరను, రెండవపద్యము మొదటను కొంత లుప్తము. సంపాదకులు ముద్రించునపుడు ఈ క్రిందిరీతిని విడఁదీసిరి:

"క. వడి నరకుఁ డేయునమ్ములు, నడుమనె తెగనేసి మార్గణము లొండ్లొగినిం
డొడకుండ ముందఱఁ గ్రక్కింతు నంచు ... ... ... ...

క. ... ... ... ... ... ... ... ... ... ... నచ్యుతునంచున్
బృందారకతతి చెదర ము, కుందుని నొదిరికొనియె మరుఁడలుకన్."

(౧౨-౮౧)

ఇందు లుప్తభాగము లొక యక్షరమున నయినను భేదము లేకుండఁగా వ్రాఁతప్రతిలోను, ముద్రితమునను గూడఁ గనఁబడుచున్నవి. పయి పద్య విభాగమునను గొంతమార్పు అపేక్షణీయమే.

ఇంకను నిట్టి వెన్నియో కలవు. పయిపద్యములు తంజావూరిప్రతి నుండి గ్రహింపఁబడినవని చెప్పుటకుఁ దగిన యత్యంతసాదృశ్యము గలదు. అది కాదేని ముద్రితపుఁ బ్రతికి మూలాధారములని చెప్పఁబడు ప్రతులకును, తంజావూరిప్రతికిని మాతృకాపుత్రికాభావమో, లేక యేకమాతృకత్వమో యుండి తీరును. లేకున్న నన్నిప్రతులలో నొకేయక్షరము దగ్గఱనే లోపము సంభవించునా ? ఇంత సాదృశ్యముగల ప్రతులఁజూచి . పరిష్కరించునపుడు తంజావూరిప్రతిపాఠములకంటె భిన్నమగు పద్యభాగము లెట్లు వచ్చినవో

దురవగాహము. ఏది యెట్లున్నను మొత్తముమీఁదఁ దంజావూరిప్రతియే సర్వమునకు శరణమనుట తప్ప వేఱుగతి గనఁబడదు. పరిశీలింపఁగా ముద్రితభాగములకంటె భిన్నమగు ముఖ్యపాఠభేదము లనునవి తంజావూరి ప్రతి ననుసరించి యున్నవి. దానిచే మొదటిపాఠమునకు నితరగ్రంథములు మూలములు గావలయును. తంజావూరి ప్రతితో నంతయైనను భేదము లేకుండఁగ నున్న పైభాగములు చూడఁగా తంజావూరి ప్రతినుండియే మూలము గ్రహింపఁబడిన ట్లున్నది. ఈ సందర్భ మెట్లు సంగతమగునో ?

ఆవ్రాఁత ప్రతిలోని యక్షరములస్థితి కొంత తెలిసికొనఁదగినదే. సర్వసామాన్యముగాఁ దాళపత్రపు వ్రాఁతప్రతులలో ఇ, ఎ, ఒ, అక్షరములకు దీర్ఘాక్షరపుగుర్తు లుండవు. నిల, నీల అను రెండిటికి నిల అనియే యుండును. అట్లె నెల అనునది నెల, నేలలకు గుర్తు. సొప సోదలకు వ్రాఁతలో భేదము లేదు. కొన్నిచోట్ల హల్లుపైది ఇత్వమో ఎత్వమో స్పష్టపడదు. ఇంక హల్లులలో గర,ల ట,కళ,మ య, న స, ఘు యు యములకు భేదము సుగమముగాదు. ఈ చిక్కుల వలన నక్షరములను సందర్భానుసారముగా గ్రహింప వలసియుండును. అట్లు గ్రహించుట వారివారి సంస్కారానుసారముగా నుండును.సంస్కారశూన్యులు అది చూచి వ్రాయవలసి వచ్చినచోఁ దలయుఁ దోఁకయు నేర్పడకయే యుండును. కావుననే తంజావూరు ప్రతి ననుసరించి వ్రాయించిన ప్రతులలోఁ గూడఁ గొన్నిచోట్ల భేదము గనఁబడుచున్నది. ప్రారబ్ధము చాలక యొక్క యక్షరము నడుమఁ బురుపుగొట్టి వేసినచో అప్పు డెవరియిష్టము వచ్చినట్లు వారు దానిని బూరింతురు. ఆ పైని ఎవరైనను పూరింపవలసినదే కదా అనుమాట వచ్చును. ఆ పైని పూరించిన వానిలో నేది సరసము, ఏది కవ్యుద్దిష్టము అను ప్రశ్నమునకు సహృదయ హృదయ ప్రామాణ్యము గతియగును. అక్షరవ్యత్యాసమునఁ గలుగు బాధలు రెండు చూతము:

"క. ఆ నెపమున ద్రోహమునకు, వానిన పొందరసి యతని వంశం బెల్లన్
గానుపునఁ బెట్టియార్చిన, నేనియుఁ జాల దది పెద్దయే దక్షునకున్."

(౧-౯౪)

'వానినపొందరసి' అనుచోట 'వాని-ందరిసి' అని వ్రాఁతప్రతిలో నున్నది. 'వానినపొం దరసి' అని సంపాదకులు గ్రహించిరి. 'ని' తర్వాత పురుగు కొట్టివేసిన గుర్తుగలదు. అచట బిందువువలెఁ గనఁబడునది కకార దీర్ఘచిహ్నమగునని తోఁచెడిని. కావున 'కాదరసి' అనవలెను. ఇది దక్షుని గుఱించి బ్రహ్మ శివునితో నన్నవాక్యము. అట్టుచేసిన ద్రోహమునకు వానినేకాదు అతని వంశమంతయు సరసి గానుపులోఁ బెట్టి యాడించినను జాలదు. దక్షునకిది యొకపెద్దయా అని తాత్పర్యము. 'వానిన పొందు' అనునది యన్వ

యించుట యెట్లో? పరిష్కరించు నపుడు మూలమగు వ్రాఁతకు దగ్గఱగా నుండు రీతిని, సమన్వయము గలుగురీతిని సవరింప వలయును గదా.

II. “ఆక్రోశ్రీకాఁ రనురాజుమ్రోలల నిజరావానంత గేయాభ్ర నా
దైకాణోద్యము గూర్చి మ్రోయ సురగోపాంభోజరాగత్విషా
నీకోద్య ద్ధరిదశ్మకస్థల లస న్నృత్యోర్వరు రంగస్థలిన్
గేకీపాత్రము లాడె భావముగ నుత్ క్షిప్తాగ్రపింఛంబులై.” (౬-౭౯)

ఇది వర్షాకాలవర్ణనము. పై దానిలో “సురగోపాంభోదరాగత్విషానీక” అనుభాగమున కర్థము సంగతముగాఁ గనఁబడలేదు. వ్రాఁతప్రతిలో ‘సురగోపాంభోజరాగతృణా’ అని కలదు. అది సమన్వయించును. వర్షాకాలమున రాజు మ్రోలఁ గేకీపాత్రములు పింఛము లెత్తి భావద్యోతకముగా నాడినవి. అక్కడినృత్యరంగస్థలమున ఆరుద్రపురుగు లనుపద్మరాగమణులును, పచ్చిక పట్టు లనుపచ్చరాళ్లు (హరిదశ్మములు)ను ప్రకాశించుచున్నవి అనిభావము. దీనిలో ‘రాగతృణా’ అనుచోట ‘రాగత్రిణా’ అని సవరణచేసికొనవలె. లేకున్నచో ఛందోభంగము గలుగును. తృణశబ్దమునకు రూపాంతరమగు త్రిణశబ్దము వాచస్పత్యాది నిఘంటువులలోఁ గలదు. ఈ పద్యమున నింకను విచారణచేయఁదగిన విషయము లున్నవి. గ్రంథముననిట్టి వనేకములు గలవు.[1] మచ్చున కివి చాలును. ప్రతిస్వరూపము తెలుపుట కింత చెప్పవలసి వచ్చెను. ప్రాచీన తాళపత్రలేఖనములు పెక్కు లిట్లేయున్నవి.

ఈ మహాకావ్యము చక్కఁగఁ బరిష్కరించి వ్యాఖ్యతోఁ బ్రకటించుట యుక్తమని తోఁచినది. ఆ సందర్భమున దీనిపైని వెలువడిన కొన్ని విమర్శనములు చదువుట తటస్థించినది. అవి కవికాలనిర్ణయప్రయత్నము ముఖ్య

---

1. వేసినదే యొకముద్రణము. కొన్నిచోట్ల నొకప్రతిలో నొకరీతిగను, మఱొకప్రతిలో వేఱొకరీతిగను గలదు:

I. “క. త్రిలోకాహిత దనుజతతికి లోఁబడరువశే” (౪-౯) అని యొక ప్రతిలో గలదు; మఱొక ప్రతిలో “...దనుజ తతికి లోఁబడితిరటే” అని కలదు. “లోఁబడరువశే” అనియే తంజావూరిప్రతిపాఠము.

II. “స్మరకలహంబునఁ బతిదెస, గిరిసుతదిరుఁడైన నక్షకేళి మహేశున్, మరుడు దగిలించి గెలువఁగఁ గరమమరిన...గతి నింపొప్పున్” అని యొకప్రతి.

“స్మర హాలహంబునఁ బతిదెస, గిరిసుత తిరులైన నక్షకేళి మహేశున్ మరుఁడు దగిలించి గెలువఁగఁ, గర మమరిన గళలనంగఁ గచమిం పొప్పున్” (౩-౭౧) అని మఱొకప్రతి. ఇందు మొదటిపాఠమే తం. ప్ర. పాఠము. ఒకే ముద్రణమునందిట్టి భేద మెట్లు వచ్చెనను సందేహము గలిగినది. ఫారమునఁ గొన్నిప్రతులు ముద్రించిన తర్వాతఁ జేసిన మార్పుగావచ్చు ననుకొంటిని.

ముగాఁ జేసికొని రచించినవి. వానిఁ జదువఁగా నింకను సవిమర్శముగాఁ గావ్య భాగము పరిశీలించుట యావశ్యకమని తోఁచినది.

దీనివలెనే మొదట మనచెవులఁ బడినవియు, తర్వాత వెలువడినవియు, ననేకములున్నను ఈ గ్రంథమునకు విమర్శకులదృష్టి నంతగా నాకర్షించు ప్రాముఖ్యము గల్గుటకుఁ గారణ మొకటి గలదు. అదేమన: నన్నిచోడుని కావ్యము నన్నయ్యభట్టు రచించిన భారతభాగముకంటె నూఱు సంవత్సరములు ప్రాచీన మనుటయే.

ఇప్పటివఱకు లభించిన ప్రబంధములలో నన్నయ్య భారత మే ప్రాచీన తమమగుటచేత నన్నయ్యభట్టే యాంధ్రమున నాదికవియని కొంద ఱందురు.

నన్నయ్య ఆదికవి యనఁగా ?

ఈ సందర్భమున 'నన్నయ్యభట్టు ఆదికవి' యను విషయము కొంత పరి శీలింపవలసియున్నది. మొట్టమొదట నాదికవిశబ్దోపయోగము చూతము. సంస్కృతమున నాదికవిశబ్దము బ్రహ్మకును, వాల్మీకికిని బర్యాయముగా నున్నది. వేదమందలి ఋక్కులు మొట్టమొదట బ్రహ్మ ముఖమునుండి వెలు వడినవని సంప్రదాయము. లౌకికభాషలో ఛందోబద్ధమగురచన లేని కాల మున నిషాదుఁడు క్రౌంచద్వంద్వమందలి యొకదానిని జంపినపుడు వాల్మీకి చూచి దుఃఖావేశము నొందఁగా నాతని నోటనుండి 'మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీః సమాః; య త్క్రౌంచమిథునా దేక మవధీః కామమో హితమ్' అనునది వెలువడెనఁట. అప్పు డాతని శిష్యులును నాతఁడును శోకావేశ మున వచ్చిన యా వాక్యములు ఛందోబద్ధములయి సమాన పాదములతో నుండుట గ్రహించి వింత నొందుచుండఁగా బ్రహ్మ ప్రత్యక్షమై 'శోకమున వచ్చిన నీ మాటలకు శ్లోకనామము గల్గును. ఈ రీతిని రామచరిత్రమంతయు రచింపు'మని యానతిచ్చెననియు, వాల్మీకి తదాదేశానుసారము రామాయణము రచించెననియు సంప్రదాయము. కావున రామాయణ మాదికావ్యమయ్యె. తదాదిభాగమున నీ వృత్తాంతము కూర్పఁబడెను. తదాది వాల్మీకి యాదికవి యను సంప్రదాయము పరంపరగా వచ్చుచున్నది. నన్నయ్యభట్టు విషయ మున నట్టి సంప్రదాయముగాని, ప్రతీతిగాని లేదు. నన్నయ్యభట్టుగాని, యాతని తర్వాతివారుగాని యట్టి భావమును సూచింపలేదు. పై పెచ్చు నన్నయ్యభట్ట రచితగద్యపద్యభాగములు చూచినచో నప్పటికే యాంధ్రమున సుకవులును, ఉభయభాషాకవులును గలరని స్పష్టమగుచున్నది.

ఆశ్వాసాంత గద్యములందు "ఇది సకలసుకవి జనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన మహాభారతంబునందు." అని కలదు. కావున నన్నయేతరులు

సుకవి జను లనేకులు అప్పటికే కలరనుట స్పష్టము. ఆ సుకవిజనులు ఆంధ్ర భాషేతరభాషా సుకవు లగువా రందురేమో! తన యాంధ్రమహాభారత రచన ప్రశంసలో ఆంధ్రేతర సుకవిజన వినుతుఁడ నని నన్నయ్యభట్టు చెప్పికొనునా? అది గాక:

"ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తి నిధి నన్నయభట్టు దెనుంగునన్ మహా
భారత సంహితా రచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్."

(ఆది. ౧-౨౬)

తెనుఁగు భారత రచనయందు ప్రసన్న కథా కలితార్థ (ఇట 'కవితార్థ' అని పాఠభేదము గలదు.) యుక్తి లోనారసి మేలు అనఁదగిన కవీంద్రులు ఆంధ్ర మెఱుంగనివా రందుమా ? మఱియు "లోకజ్ఞు నుభయభాషాకావ్య రచనాభిశోభితు సత్ప్రతిభాభియోగ్యు." (ఆది. ౧-౯) అను నన్నపార్యుని వర్ణనము పరిశీలింపఁగా నన్నయ్యకాలమున కుభయభాషాకావ్యరచన సుప్రసిద్ధమని యొప్పక తప్పదు. దానికి దృష్టాంతముగా నన్నయ్యభట్టునకుఁ బూర్వమందుఁ గూర్పఁబడిన శాసనములు[1], గద్య పద్యాత్మకరచన ప్రత్యక్షము గాఁ గలదుగదా! వానిలో యతిప్రాస విశిష్టములగు తరువోజలు, అక్కరలు, సీసములు, సీసములలో నియమవిశేషములు గలరచనలు కనఁబడుచునే యున్నవి.

నన్నయ్యతర్వాత భారతభాగ మాంధ్రీకరింపఁబూనిన తిక్కయజ్వ నన్నయ్యను ఆదికవి యనలేదు. ఈ రీతిగా వర్ణించినాఁడు:

"వ. భారతాఖ్యానామ్నాయమును ... ... ...

ఉ. ...అ, ష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెనుపొందియుండ నం
దాదిఁ దొడంగి మూఁడు కృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్."

(విరా. ౧-౬)

ఆంధ్రకవిత్వమున విశారదుఁ డనుటచే నప్పటి కవులలో నిపుణుఁడని భావము గాని ఆదికవియని కాదు.

"కం. ... సత్కవి, తారీతియుఁ గొంత దోఁపఁ దద్రచనయకా, నారణ్య పర్వశేషము పూరించి"న యెఱ్ఱాప్రగడయు, "తే. ఎఱ్ఱనార్యుండు ... సకలలో

---

1. బెజవాడ యుద్ధమల్లుని శాసనము, దీర్ఘాసి శాసనము, అద్దంకిశాసనము - చూడఁ దగును.

కై కవిదితుఁ, డయిన నన్నయభట్ట మహాకవీంద్రు; సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ, జెందుటయు." (భార. అర. ౭-౪౪౯) అనుటలో నన్నయ్య కాది కవి యనుప్రసిద్ధి యున్నట్లు సూచింపనైన లేదు. కేతన యేమియును ఎత్త లేదు. మారన 'ఆంధ్రకవితాగురువు' అని మాత్రము వర్ణించెను. శ్రీనాథుఁ డును నన్నయ్య యాదికవి యనెడి భావము తెలుపలేదు.

"మ. మహి మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితి మూలమై నిలుప శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁదత్ప్రాగల్భ్యమూహించెదన్."

(వసు. ౧-౧౦)

అను పద్యమున వసుచరిత్రకర్త నన్నయ్య బహుళాంధ్రోక్తి మయప్రపంచ మును సృజించినట్లు చెప్పినాఁడు. ఇది శ్లేషప్రధానముగాఁ గావించి రచించి నది గాన యథార్థోక్తికిఁ బనికిరాదు. ఈపద్యమున ముఖ్యముగా నెంచిన శ్లేష ప్రాధాన్యము నిలుపుకొనుటకై శ్రీనాథ సోములకు, భాస్కరునకును గాల పౌర్వాపర్యముగూడ నవివక్షితమయ్యెను.

కానిండు: తిక్కనయన్న 'విద్యాదయితుఁడు' అన్నశబ్దము, నన్నయ్య చెప్పికొనిన 'శబ్దశాసన'[1] శబ్దము, ఇతరులన్న 'వాగనుశాసన'పదము నన్నయ్య బ్రహ్మత్వమును దెలుపుచున్నవే. దానిచేత వాల్మీకివంటి యాదికవి కాఁడు గాని బ్రహ్మవంటి యాదికవి యని యనరాదా యని కొంద అనవచ్చును. తిక్కనను గవిబ్రహ్మ యని కొంద అనిరి. శ్రీనాథుఁడు కాశీఖండమున నితరకవివర్గముతో పాటు తనపితామహుని దలంచుచు "తే. మత్పితామహుఁ గవిపితామహుని దలఁతు." అన్నాఁడు. శ్రీనాథుని తర్వాతికాలమున సుప్రసిద్ధుఁడగు ఆంధ్ర కవిపితామహుఁడు పెద్దన్నగా రున్నారు. వీరందఱును ఆదికవులే యగు దురా ? అట్టి యాదికవి యీతఁడును గావచ్చును. కావున నన్నయ్యకు ఆది కవిప్రతీతి తిక్కనాదుల కాలమున నున్నట్లు తోఁపదు. ఆకాలమునకు భార తమేకాక యితరాంధ్రప్రబంధములలో, పురాణములలో, ఇతరములలో యుండి యుండును.

ప్రకృతము-ప్రకృతమేకాదు-లక్షణకర్తయగు నప్పకవి కాలమునుం డియు నన్నయ్యభారతముకంటెఁ బ్రాచీనములగు గ్రంథములు లభ్యములుగా

1. 'విపులశబ్దశాసనసంహితాభ్యాసు' అని పాఠాంతరము గలదు. విపులమగు శబ్దశాసన సంహితయందు (వ్యాకరణ శాస్త్రిమున) నభ్యాసముగలవాఁడని భావము. ఆయన విపులశబ్ద శాసనుఁడను అని యొకబిరుదముగా చెప్పుకొననే లేదేమో!

లేవు. మారన నన్నయ్యభట్టు కవితాగురువని ప్రశంసించుటచే నప్పటికే యితరగ్రంథములు లభ్యములుగా లేవేమో! దేశమున సంభవించిన యుపద్రవములలో ననేకములు నశించిపోయి యుండును. వేదమతేతరగ్రంథములు నిరాకృతములయి యుండును. వేదమతాభిమానమును, శైవమతాభిమానమును గలసియున్న యాకాలమున భారతము రచింపఁబడుటచేతఁ బ్రజల యాదరము నొందుట యేకాక రాజరాజనరేంద్రవంశస్థులు దానిని బ్రాణాధికముగా భద్రపఱుచుటచే నది నిలిచి యాంధ్రులయదృష్టరూపమయి లభించెను. భారతము మనకు లభించినగ్రంథములలో నాదిగ్రంథము గాన నన్నయ్య ఆదికవి అనుకొనిన ననుకొనవచ్చును.

నన్నిచోడ కవి కుమారసంభవము బయలువడిన తర్వాతఁ గొందఱి మతము ననుసరించి లభ్యమగువానిలో మొదటిది నన్నయ భారతభాగము అనుట కవకాశము లేదు. కావుననే నన్నిచోడ మహాకవికావ్యము విమర్శకులదృష్టి నంతగా నాకర్షించినది. ఆతని కవితారీతులును పాఠకమనముల నాకర్షించు నట్టివే. అయినను కాలమును గుఱించిన వాదప్రతివాదములే దేశమునఁ బ్రబలినవి. కవి కాల నిర్ణయవిషయమునను, కవితాప్రాశస్త్యమునను తోఁచిన భావములఁ బొందుపఱుచుటయే యీ రచనకుఁ బ్రధానము.

**కాలనిర్ణయ సాధనములు**

కావ్యమందు చరిత్ర తెలుపు భాగములు కావ్యనిర్మాణకాలమును గంఠోక్తిగాఁ జెప్పినచోటఁ గవికాలము నిర్ణయించుటకు సందేహమే లేదు. అది మనకవుల కభ్యస్తముగాదు. కాని తమకుఁ బ్రేరకులగువారిని బ్రశంసించుట గలదు. వారు సుప్రసిద్ధ పురుషులయి రేని, వారు లిఖించి స్థాపించిన శిలాశాసనాదులవలన వారికాలము నిర్ణీతమయ్యెనేని, వారికాలపుఁ గవుల కాలము సులభముగా నిర్ణయింపఁబడును. అదియుఁ గంఠోక్తప్రాయమే. ఆ రీతియు లేనినాఁడు కవి ప్రశంసించిన పూర్వకవుల కాలమునుబట్టి వారి తర్వాతివాఁ డనవచ్చు. సమకాలికుల నుదాహరించినచో నది సరిగా వారిని దెలిపెనేని నదియు నట్టిదియే. ఇవి యేవియుఁ గుదురనినాఁడు కావ్యమునకు మూలమగు గ్రంథము, కవి ప్రయోగించిన భాషారీతి, ఛందో వ్యాకరణాది విశేషములు, ఇతర కవి గృహీత పద్యభాగభావాదులును జక్కఁగాఁ బరిశీలించి కవికాల సమున్నయనము గావింపవలెను.

**చారిత్రిక విషయములు**

ఏ సాధన మవలంబింపఁదలఁచినవారికైనను కావ్యమునఁ గల చారిత్రిక విషయములు తెలిసికొనుట మొదట ముఖ్యము గావున కృతికర్తనుగుఱించి కావ్యమునఁ గల విషయము గ్రహింతము.

"సీ. కుతలంబు నడుకొనఁ గొలకొండగా నిల్పి, శరనిధి గ్రొచ్చిరి సగరసుతులు
మిన్నులపైఁ బాఱుచున్నయే టిలఁ దెచ్చి, వారాశి నించె భగీరథుండు
గోత్రాచలము లెత్తికొని వచ్చి కడసన్న, రత్నాకరము గట్టె రాఘవుండు
జలధిమహీసతి మొలనూలుగాఁ జుట్టి, పాలించెఁ గరిఁ గరికాలచోడు
వరుస నిట్లు సూర్యవంశాధిపతు లంబు, నిధియ మేరగాఁగ నిఖిలజగము,
నేలి చనినవారి కెనవచ్చు సుశ్లోక[1], ధనుఁడ నన్నిచోడ జనవిభుండ.

చ. అరినరపాలమౌళి దళితాంఘ్రియుగుండయి పాకనాఁటియం
దిరువదియొక్క వేయిటి కధీశుఁడునాఁ జనుచోడబల్లికిం
జిరతరకీర్తి కగ్రమహిషీతిలకంబన హైహయాన్వయాం
బరశశిరేఖయైన గుణభాసిని శ్రీసతికిం దనూజుఁడన్."

(౧-౨౨, ౨౩)

నన్నిచోడుఁడు చోడబల్లిశ్రీసతు లనుదంపతులకుఁ దనూజుఁడు. శ్రీసతి హైహయ వంశమువారి యాఁడుఁబడుచు; చోడబల్లికిఁ బట్టపుదేవి. చోడబల్లి పాకనాఁటియం దిరువదియొక్క వేయిటి కధీశుఁడు నాఁ జన్నవాఁడు. నన్నిచోడుఁడు అంబునిధియ మేరగాఁగ నఖిలజగము నేలిన సూర్యవంశపురాజులకు నెనవచ్చుకీర్తి గలవాఁడు. మఱియు,

"క. కలుపొన్నవిరులఁ బెరుగం, గలు కోడి రవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
బొలుచు నొఱయూరి కధిపతి,నలఘు పరాక్రముఁడఁ డెంకణాదిత్యుండన్."

(౧-౨౪)

"క. పాత్రుఁడ ననదృశకాశ్యప,
గోత్రుఁడ సచ్చరిత నుభయకులశుద్ధుండన్
మిత్రాన్వయ శేఖరుఁడఁ బ,
వి త్రీకృత దేహుఁడను వివేకాబ్జజుఁడన్[2]." (౧-౨౫)

అసాధారణ లక్షణములు గల యొఱయూరి కధిపతి, టెంకణాదిత్యుడు, కాశ్యపసగోత్రుఁడు, సూర్యవంశ్యుఁడు, వివేకమున బ్రహ్మ యంతవాడు-అని తెలియుచున్నది. ఒఱయూరిపురాధిపతులు, టెంకణాదిత్యులు మొదలగునవి చోడవంశమువారి బిరుదములే. సంపాదకులు రెండవసంపుటము పీఠికలో "ఆంధ్రచోడులు కారితకావేరీతీరకరికాలచోడవంశజు లగుటయు నొరయూరి రపువరాధీశ్వరు లగుటయుఁ జూడ శాసనవిఖ్యాతాంశములు. అయినను నన్నెచోడుని వర్ణనము నించుక చక్కఁగా నాలోచించినచో నతఁ డొరయూరికే

1 శ్లాఘ - ముద్రితము. 2. 'వివిధయజ్ఞములన్' అని ముద్రితము.

పరిపాలకుఁడనియుఁ, గేవలము కులక్రమాగత బిరుదములను బేర్కొన్నవాఁడు గాఁడనియుఁ దోఁచక మానదు.'' అని వ్రాసిరి. 'ఒంకణాదిత్య' అనుబిరుద ముతోపాటు తత్సహచరితన్యాయమున ఒఱయూరు పురాధీశ్వరత్వముగూడ బిరుదముగానే చెప్పినాఁడని యేల తోఁపఁగూడదు? చోడరాజులకు ఒఱి యూరుపురవరాధీశ్వరేత్యాదిప్రశస్తి పదునాలుగవ శతాబ్ది ప్రాంతమునఁ గూడఁ గనఁబడుచున్నది. అది బిరుదమాత్రద్యోతక మనుట కవివివక్షితము గాకపోయినచోఁ దనతండ్రి నేల యొఱయూరుపురాధిపతి యని చెప్పలేదు? కేవలము పాకనాఁటియం దిరువదియొక్కవేయిటి కధీశునిగానే యేల చెప్పెను? ఒఱయూరి కధిపతి తాననియు, తనతండ్రి పాకనాఁటియం దిరువది యొక్కవేయిటికే యధిపతి యనియుఁ జెప్పుట కవియుద్దేశ మనఁజాలము. చోడరాజులకు నొఱయూరి పురాధీశత్వము అతిప్రాచీనముగా నున్నదిగదా. ఒఱయూరి ప్రసిద్ధి ముందు వివరింపఁబడును. కవి వంశపవిత్రతాదివిషయముల జెప్పుచు మిగిలినవంశబిరుదములు చెప్పికొనియుండును. తండ్రి కాలమునకుఁ బాకనాఁటిలో నిరువదియొక్క వేయిటికి మాత్రమే యధీశత్వ మున్నదని చెప్పుటలోనే యొఱయూరిపురాధీశత బిరుదమని తోఁపఁజేయును. ఈవిష యము చరిత్రశాసనవిషయములను గుఱించి వ్రాయుభాగమున వివరముగాఁ దెలుపఁబడును. కావున ఒఱయూరికి స్వయముగాఁ బ్రభుత్వము చేసినట్లే తోఁపఁ జేయుననుటకు వినిగమకము కనఁబడదు. చోడరాజప్రసిద్ధప్రశస్తినే కవి చెప్పినాఁడని తోఁచెడిని.

**కవినామము**

ఆశ్వాసాంతగద్యమందు "కవిరాజ శిఖామణి నన్నిచోడదేవ ప్రణీతం బైన కుమారసంభవంబను కథయందు" అని యుండుటచేతను, "రవికుల శేఖ రుండు కవిరాజశిఖామణి గావ్యకర్త సత్కవి భువి నన్నిచోడఁడట కావ్యము దివ్యకథం గుమారసంభవ మటె" అని చెప్పుటచేతను కవిరాజశిఖామణి యను ప్రసిద్ధి యాతనికి సుప్రసిద్ధమయి యుండెను. దాని నాతని కవితారీతియే ధ్రువపఱుచుచున్నది. ఈ మహాకావ్యము చదివినవారు 'కవిరాజశిఖామణి' యనునది కవి కన్వర్థమే యనక మానరు. ఈతఁ డిట్లు చెప్పుకొనుటచే ఆత్మస్తోత్ర ప్రియుఁడని యొకరు వ్రాసిరి గాని యితరకవు లీవిషయమున నీతనికిఁ దీసి పోయినవారు గారు. అదిగాక ఆ రీతిని ప్రసిద్ధవిషయము చెప్పికొనుట సంప్ర దాయసిద్ధమే. ఈవిషయ మాలంకారికులు కవికులసంప్రదాయముగా గ్రహించిరి. వానివంశాచారప్రకారము దేవశబ్ద సహితముగా 'నన్నిచోడ దేవ' అను నామము సుప్రసిద్ధము. దేవశబ్దరహితముగాఁ నన్నిచోఁడు అనియు వాడియున్నాఁడు. శాసనములయందు శ్లోకమధ్యమున 'నన్నిచోడః' అనియే వాడఁబడియున్నది.

ఇంక నన్నిచోడఁడా, నన్నెచోడఁడా [1] అనుసందేహ మొకటి కలదు.

"నన్నియ భట్టాది శబ్దములలో ద్వితీయాక్షర మికార మగుటను, గొన్ని శాసనములలో నన్నిచోడుఁడని యుండుటచేతను, 'నన్ని' యని సత్యార్థవాచక ముండుటచేతను, నన్నిచోడుఁడని చెప్పనొప్పును. ... ... ... అయినను నాప్రతులలో నన్నెచోడుఁడని యున్నందున శబ్దరూపనిష్పత్తి లెట్లున్నను దాని వర్ణక్రమము మార్చి వ్యవహరింప ధైర్యము చాలక యట్లే ప్రయోగించుచున్నాఁడను." అని సంపాదకులు ద్వితీయసంపుట పీఠికలో వ్రాసియున్నారు. తంజావూరిప్రతిలో నన్నెచోడఁడనియే కలదు. 'న్ని' 'న్నె'లకుఁ గలభేదము సరిగా కనిపట్టఁజాలక వ్రాఁతగాఁడు వ్రాసెనేమో యని యనుమానించుట కవకాశము గలదు. దక్షిణభారతశాసనసంపుటములలో నాఱవదానియందు 206 సంఖ్యగల శాసనమున [2] 'నన్నిచోడః' అనియే రెండు చోట్లఁగలదు. ఆశాసనమందలి కొంతభాగమునకు ప్రతిబింబము శ్రీజయంతి రామయ్యపంతులుగారు ప్రకటించిరి.[3] అందు 'నన్ని' అని స్పష్టముగా నున్నది. ఇట వ్రాఁతప్రతి ప్రామాణ్యము కంటె శిలాశాసనప్రామాణ్యమే ఆదరణీయము. శబ్దార్థమును ఆరూపమునే ధ్రువపఱుచుచున్నది. చోడరాజ నామములలో కిల్లి, జిక్కి, నన్ని, బల్లి, మల్లి అను తత్సమేతర పదములు కనఁబడుచున్నవి. అందు 'నన్ని' అనునది దేశ్యము; కన్నడమున [4] సత్యాదిపర్యాయముగా నున్నది. తమిళమున [5] నన్ఱి (நன்றி) అనునది సుగుణాదిపర్యాయముగాఁ గలదు. ప్రాచీనసంజ్ఞావాచకములలో తమిళమున [6] 'నన్నన్' అనునది కనఁబడుచున్నది. చోడరాజుల ప్రశస్తియందు 'సత్యరత్నాకర' మొదలయినవి

---

1. చోడుఁడు, చోడఁడు, చోళు, చోడు అనియుఁగలవు. తత్సమపదములమీఁది డువర్ణకమునకుఁ బూర్వ ముత్త్వము లేకపోవుట కొన్ని శాసనములలోఁ గలదు. సంజ్ఞావాచకముల యందును, బిరుదములయందును ఉకారము రాకపోవుటయే ప్రాయికము. మఱియు డువర్ణక రహితమయి, ఉకారసహితమగు 'చోడు' రూపము ప్రథమావిభక్తిగాను కవి వాడియున్నాఁడు. ఇట్టివి శైవకవులలో ప్రాయికములు.

2. South Indian Inscriptions, Vol. VI, No. 206.

3. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, ౧౪-వ సంపుటము, ౨-వ సంచిక.

4. నన్ని = Truth, certainty; certainly, etc., (సత్య, సైజ, మొ.) 2. Love, affection, attachment—Kittel.

5. నన్ఱి. n. (నన్-మై) 1. Goodness, నన్మై; 2. Help, kindness, benefit, favour; 3. Gratitude; 4. Virtue, merit—Tamil Lexicon.

6. నన్నన్. n. The Chief of Cenkanma and Hero of Malaipatukatam.—Tamil Lexicon.

కలవు. చాళుక్యరాజులలో సంస్కృతపదముతో 'సత్యాశ్రయ' అనియున్నట్లును, ఇతరులలో 'సత్యరాజ', 'ధర్మరాజ' మొదలగుపదము లున్నట్లును సత్యాద్యర్థకమగు నన్నినామము దేశీయపదముతో చోడరాజులలో పెక్కండ్రకుఁ గలదు. కావున నన్నిచోడశబ్దముతోనే వ్యవహరించుట యుచితతరము.[1] పెక్కండ్రు విమర్శకులును 'నన్ని' అనియే వాడియున్నారు.

**కృతిపతి**

జంగమ మల్లయ ప్రసాదమున నీతనికి సత్కవిత లభించెను. కవియ తనినే కృతిపతిగాఁ గావించెను.

" నింగిముట్టియున్న జంగమమల్లయ, వరమునందుఁ గనిన వస్తుకవిత దగిలి వానియంద నెగడింతు." (౧-౪౯) అనియెను. ఆ గురువునే యిష్టదైవముగాను, ప్రభువుగాను భావించినాఁడు.

"చ. గురువున కిష్టదైవమునకుం బతికిం గృతిసెప్పి పుణ్యమున్
వరమును దేజముం బడయవచ్చు జగంబుల నిశ్చయంబు మ
ద్గురువును నిష్టదైవమును గూర్చ్చని జేశుఁడు దాన నాకుఁ గా
కొరునకు నిట్లు సేకుఱునె యొక్కట లాభము లెన్ని యన్నియున్." (౧-౫౦)

అని యెంచి గురువగు జంగమమల్లికార్జునదేవునిఁ బరమేశ్వరునితో నభిన్నునిఁగా భావించుటకును, పరమేశ్వరాదిపర్యాయములు తనగురువున కన్వయించుటకును కారణములను దెలుపుచు నీ క్రిందిరీతిని షష్ఠ్యంతములకు ముందు స్పష్టపఱిచెను.

"చం. ... ... ... ... ... ... కావ్యము దీవ్యకథం గుమార సం,
భవము బె సత్కథాధిపతి భవ్యుఁడు జంగమమల్లికార్జునుం,
డవిచలితార్థయోగధరుఁ డట్టె వినం గొనియాడఁ జెల్లదే.

వ. కావునం బరమశ్రీనగోత్తుంగమణిశ్రీసంగతమల్లికార్జునదేవతాకంబై జగమునం బ్రత్యక్షంబై ప్రవర్తిల్లుట జంగమమల్లికార్జునదేవుండై

1. కొన్ని శాసనములయందు సంజ్ఞావాచకముల చివర ఎకార ముండుటయుఁ గలదు. S. I. I. Vol. VI, శా. సం. 160 లో భీమెనాయకుఁడు; 141 లో పులిప్రోలె తమ్మండు పేరె; 144 లో సూరిబోయని కొడుకు ప్రోలె; 149 లో రాఘవె—ఇత్యాదులు. మఱికొన్నిటిలో ఇదంతరూపములును కనఁబడుచున్నవి:—181 లో చిక్కినాయకుఁడు, భీమినాయకుఁడు; 143 లో వెన్నిసెట్టి; 152 లో సూరిసెట్టి; 153 లో జిక్కి చోడదేవ మహారాజులు; 239 లో కొమ్మి నాయకుడు; 176 లో సెవ్విశెట్టి; 198 లో కొమ్మిరడ్డి, ప్రోలిరడ్డి మొదలగునవి. కావున తన్నిర్ణయము సుసాధము కాదు. నన్నిశబ్దము ఇకారాంతముగానే కనఁబడుచుండుటచే నన్ని యనివాడుటే ప్రకృత ముచితమని తోఁచెడిని.

ప్రాణాయామాదిషడంగోపాంగసకలయోగిజనారాధితుం డగుటం బరమయోగీంద్రుండై న్యాయవైశేషికాది షట్తర్కకర్కశుం డగుటం బరవాదిభయంకరుండై జన్మమరణాదిదుఃఖార్ణవోత్తీర్ణసంస్తూయమానమానసుండగుటనుం బరమానందహృదయుండై ఘోరసంసారపారావారోత్తరణ కారణానూనవైరాగ్య నిరతుండగుట సమ్యఙ్జ్ఞానస్వరూపుండై [1]దురంధతావివేకతమఃపటల (వి ?) ఘటన పరాయణుం డగుటం బరంజ్యోతిః స్వరూపుండై వేదషడంగశాస్త్రపురాణేతిహాసాగమాదిసకలకళాస్వరూపాపారవాణీధరుండగుట నిఖిలవిద్యాగురుండై సకలజనాభీష్టవిమలజ్ఞానానూనఫలప్రదాయకుండగుటం బరమస్వరూపుండై సమస్త విద్వజ్జనమనోమానసకేళీలాలసుండగుటం బరమహంసస్వరూపుండై యత్యుత్తమపురుషార్థప్రవర్తితుండగుటం బురుషోత్తముండై నిఖిలముముక్షుజనైకధ్యేయాత్మకుండగుటం బరమబ్రహ్మస్వరూపుండై నిస్త్రైగుణ్యపదార్థప్రవర్తితుం డగుట గుణగణాతీతుండై సద్భక్తజనాత్మాలోకనైకహేతుభూతుండగుట మునిజనముఖమణిముకురుండై నెగడు సద్గురుండైన జంగమమల్లికార్జునునకు.

క. శ్రీకంఠమూర్తి కమల, శ్లోకునకు ... ..." (౧-౫౭,౫౮,౫౯)

"క. ... ... ... ... ... ... మల్లికార్జున మునికి ... ...

వ. పరమభక్తియుక్తి నావర్జితహృదయుండనై సకలభువనభవనావతారకారణుండైన పరమేశ్వరునవతారం బగుటయుం దదంశావతారంబుగా వ్యావర్ణించి నాచెప్పంబూనిన దివ్యకథాసూత్రం బెట్టిదనిన." (౧-౬౬,౬౭)

కృతిపతికిని, కథానాయకుఁడగు నీశ్వరునకును నభేదము ప్రతిపాదించి యాశ్వాసాద్యంతములందు వర్ణించుటయేకాక కథామధ్యముననను ఆ యభేదము పాటించినాఁడు.

పార్వతి తపోవనమునకుఁ బోవునప్పుడు నడుమఁ గనఁబడిన శబరాలయముల వర్ణించుచు—

---

1. 'దురంధతా... బరంజ్యోతి స్వరూపుండై' అనుభాగము ముద్రితమున జాఱిపోయినది. ఇట్లే జాఱిపోయినపట్టులు ముద్రితగ్రంథమున నింకను గలవు:—దేవదూతవధోద్యుక్తుఁడైన తారకునకు శుక్రుఁడు నీతిచెప్పు సందర్భమున (౧౦ ఆ.)

"క. గురులను మునులను సుకవుల, నరిదూతల బూతులను వరాంగనల మహీ,
సురులను మిత్రుల బాలుర, నిరతముఁ జంపఁదగ దెంత నేరమియున్నన్"

అనుపద్యము మద్రాసు విశ్వవిద్యాలయమువారు వ్రాయించిన ప్రతిలోఁ గూడఁగలదు చూడవచ్చును.

"చ. పటికపుబోల ముల్ వెదురుఁబ్రా లొగిఁ బోయుచు గారుకొమ్ముబోఁ
కటఁ గొని దంచుచుర్ శబరకామిని వెక్కులు రాగముల్ మదో
త్కటముగఁ బాడెఁ జట్టినమృగంబులు సోమ మనుష్యరూపధూ
ర్జటి మునిముఖ్యులోకగురు జంగమలింగము మల్లికార్జునున్." (౬-౪౩)

అని తనగురువునే శివునిఁగా వర్ణించెను. అంతేకాక పార్వతికి శైవాగమదీక్షా గురునిగా విప్రముఖ్యు జంగమ మల్లికార్జునునే చెప్పినాఁడు:—

"ఉ. వాసనగా శివాగమము వర్ణనకెక్కఁ ద్రయీసదర్థముల్
దేసిగ నాత్మశిష్యులకుఁ దెల్పుచు సద్విధి నున్ననిష్కళా
భ్యాసమునందు లీనమగు భావము నిల్పి వెలుంగుచున్నసద్
భూసురముఖ్యవిప్రమునిపుంగవు జంగమమల్లికార్జునున్." (౬-౭౯)

మత్తకోకిల. వృక్షమూలనివాసు నాతతవేదవేది ననూనరు
ద్రాక్షధారి నఘారి నత్యమలాంగు నున్నతమోక్షసా
పేక్షితుర్ నిరపేక్షితుర్ బుధవృద్ధవంద్యు ననింద్యు ను
గ్రాక్షపాదసరోరుహార్చకు నాత్మవిత్తము నత్తముర్. (౬-౮౦)

వ. కని భూరిప్రీతిం బ్రణమిల్లి గురుస్థానంబుగా స్వీకరించి పార్వతి పరమభక్తియుక్తి నారాధించి తత్ప్రసాదంబునఁ బడయునిజాభిమతం బెఱిం గించి శైవాగమవిధి దీక్షగొని." (౬-౮౧)

నన్నిచోడకవి పై రీతిని ఈశ్వరావతారముగా భావించినజంగమ మల్లికార్జునునకు సర్వసమర్పణము గావించినభక్తుఁడు. అతఁడు శివునితోనే కాక బ్రహ్మ విష్ణువులతోఁ గూడ గురువున కభేదాధ్యవసాయము చేసెను. "క. శ్రీశ్రితవత్సుఁడు వాణీ, శ్రీశ్రిత సుముఖుఁడు," "శ్రీరమణీరమణుఁడు," ఇత్యాదులు ఎన్నిచోట్లనో మల్లికార్జున గురువునకు విశేషణములుగా నుపయో గించి యుండెను. ఆవిషయమును సమర్థించుటకే మొదట వచనమునఁ బురు షోత్తమత్వ వాణీధరత్వ పరమహంసత్వ జ్యోతిః స్వరూపత్వాదులు యౌగిక ముగా సమర్థించి యున్నాఁడు.

అంతేకాక ఆశ్వాసాద్యంతములందుఁ దత్కథాసందర్భోపస్థితపురుషు లకును, గృతిపతికిని నభేదము గావించి దత్తత్ప్రకరణానుగతవిభక్త్యంతపద ములతో వర్ణించుట[1]నిర్వచనోత్తరరామాయణ దశకుమారచరిత్రాదులలోఁ గలదు. ప్రకృతకావ్యమునఁగూడ నట్లే యున్నది. దాని కనుకూలముగా నుండు నట్లు మనకవి యాశ్వాసవిభాగము గావించికొన్నాఁడు. సంస్కృత కుమార సంభవమందలి యొకసర్గ కొకయాశ్వాస మగునట్లు రచించినచోట్లఁగూడ జంగ

1. ఈ విషయము 'ఆశ్వాసాద్యంతరీతి' అను శీర్షిక క్రింద వివరింపఁబడును.

మమల్లికార్జునుని ప్రసక్తి వచ్చుటకై యాశ్వాసము పెంచియుఁ ద్రుంచియు రచించి యున్నాఁడు. కథానాయకకృతినాయకుల కభేద మెంచినవాని కాని యమము సుగమమే కదా.

కథామధ్యమందు వచ్చిన దేవతాస్తోత్రాదులందుఁ దత్తత్ప్రకరణోపలబ్ధదేవతకును కృతిపతియగుస్వాభీష్టదేవతకును నభేదము గావించుట బహుకవి సాధారణము. హరిహరనాథునకుఁ గృతియిచ్చిన తిక్కనసోమయాజి భారత కథామధ్యమందు ధర్మరాజుచేఁ జేయించిన యీశ్వరస్తుతిని హరిహరనాథ స్తుతిగాఁ బరిణమింపఁ జేసినాఁడు.—

"చ. స్ఫురితషడర్ధనేత్రునిఁ ద్రిశూలసముజ్జ్వలు నిర్గుణుఁ గుణా
దరసముపాత్తమూర్తిఁ గలితప్రభవస్థితిసంహృతిక్రియా
నిరతి వివర్తితత్రిభువనీమహనీయుని దైత్యమర్దన
ప్పురుషవరుం జతుర్భుజు విభుత్వమహోన్నతు నాశ్రయించెదన్."

(భార. శల్య. ౧-౨౬౫)

ఇట సంస్కృతభాగమున నిట్టిరీతి లేదు. పై గురువర్ణనాదులలో గురునిదివ్యత్వము ప్రకటితమయ్యెనుగాని మానుషచరిత్ర యంతగాఁ బ్రకటితము గాలేదు.

ఇంకఁ గృతిపతియొక్క మానుషచరిత్రము పరిశీలింతము :

'బ్రహ్మకులోత్తంసుఁడు' (౧౨-౨౨౫), 'భూదేవకులశేఖరుఁడు' (౧౨-౨౨౭), 'సువర్ణసవర్ణశరీరుఁడు' (౧ - ౧౩౦), 'సుందరాంగుఁడు' (౧-౧౩౧), 'వాణీరుచిరాననతిలకుఁడు' (౬ - ౧౭౧), 'సుధీజనవరేణ్యుఁడు' (౧౨-౨౨౭), 'బుధలోకస్తోత్రపాత్రుఁడు' (౮-౧౯౭), 'చాపష్టికళాసంయుతుఁడు' (౬-౧౬౭), 'కుంభజతత్త్వజ్ఞుఁడు' (౧౨-౨౨౩), 'సజ్జనశిఖామణి' (౬-౧౬౮), 'దివ్యమునిశిఖామణి' (౪-౧౨౧), 'మితభాషి' (౮-౧౯౯), 'ఇహాముత్రభోగాద్యనిష్టుఁడు' (౧౦-౨౦౪), 'కాంతాసంయోగవియోగభోగసంత్యక్తుఁడు' (౬-౧౬౯), 'తురాషాడ్భోగి, నిర్వాణయోగి' (౧-౧౩౪), 'ఊర్జితైశ్వర్యుఁడు' (౧౦-౨౦౩), 'శ్రీపీఠంబున నిడుతన, శ్రీపాదుకలందు వ్రాలి సేవించెద' (౧-౧౪)— మొదలగునవి మల్లికార్జునునిమానుషచరిత్రమూహించుట కాధారములు. ఈతఁడు గృహస్థాశ్రమమందు సమస్తసౌఖ్యములనుభవించి యత్యాశ్రమము స్వీకరించినవాఁడనికాని, ఆజన్మబ్రహ్మచారి యనికాని, బ్రహ్మచర్యమున నుండియే సన్న్యసించినవాఁడనికాని చెప్పుట కవకాశము కలదు. ఇతఁడు ఎట్టివాఁడయినను శ్రీచక్రమునఁ బాదమిడి శిష్యబృందములఁ దరింపఁ జేసిన గురువర్యుఁడు.

"ఇట్టిముని తప్పక బ్రహ్మచర్యానవస్థితుఁడుగాని, ఇంద్రియసుఖము లనుభవించి దౌర్బల్య దారిద్ర్య యత్యాశ్రమాదులవలన సంగసుఖమును బరిత్యజించి 'హృజ్జన్మాస్త్రా నభిజ్ఞుఁడు, నస్పృష్టరాగుఁ' డనుబిరుదము వహించిన వాఁడు కాఁడు—" అని ద్వితీయసంపుటపీఠిక (పు. ౨) లో సంపాదకులు వ్రాసిరి. 'హృజ్జన్మాస్త్రా నభిజ్ఞుఁడు' (౮ - ౧౯౨), 'అస్పృష్ట రాగుఁడు' (౨ - ౧౧౯)—అనునవి బిరుదములు కావు. ఈ భావమును తెలుపు విశేషణములు గ్రంథమున నెన్నియో కలవు. అంతియేకాక, మల్లికార్జున నామములో శైవగురువును పేర్కొన్నచోట్లనెల్ల గురువునకు సామాన్యవిశేషణములుగా నుపయుక్తము లయియున్నవి. అవి శివునితో నభేదము చేయుటచేత నన్వర్థములని యన్వయించుకొనఁ దగును. అవి శేషణములనుబట్టి యితరుల లక్షణములకంటె నొకవిశేషలక్షణముగా నెంచి యన్యవ్యవచ్ఛేదము చేయుట కవకాశము లేదు. మనకవిరాజశిఖామణి మునిశిఖామణిని శివాభిన్నునిఁగా వర్ణించినాఁడు గదా. గురువుగాను, ఇష్టదైవముగాను, రాజ్యమిచ్చిన ప్రభువుగాను వర్ణించుట శైవులలోఁ గలదు. సర్వము గుర్వర్పణము గావించి వారి యాజ్ఞ ననుసరించి పాలించుట ప్రాచీనకాలమునఁ గలదు. ఒకప్పుడు మఠాధిపతులే ప్రభువులుగా భావింపఁబడిరి. పై విషయములు మాత్రమే కృతిపతి కృతికర్తలను గుఱించి నవి గనఁబడుచున్నవి. వీనిని బట్టి కాలనిర్ణయముచేయ నవకాశము కలుగుట కష్టము.

పూర్వకవిస్తుతి

ఇంకఁ బూర్వకవిస్తుతివిషయము చూతము: మనకవి వాల్మీకి, వేదవ్యాస, కాళిదాస, భార, వృద్భట, బాణు లనుసంస్కృతకవులను స్తుతించి, "[1]క. మును మార్గకవిత లోకం,బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం,గు నిలిపి రంధ్రవిషయం,బునఁజనఁ జాళుక్యరాజు మొదలగు పలువుర్." (౧-౨౩) అని యాంధ్రభాషలో చాళుక్యరాజులు దేశికవితనుబుట్టించి తెనుంగు నిలిపిరని వచించి,

"చ. సురవరులం గ్రమంబున వచోమణిసంహతిఁ బూజసేసి మ
ద్గురుచరణారవిందములకుం దగ సమ్మతిఁ జేసి మ్రొక్కి వి
స్తరమతులం బురాణకవిసంఘము నుత్తమమార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతిఁ జేసి మనోముదంబునన్." (౧-౨౪)

---

1. ఇది తంజావూరు భాండాగారమున నున్నప్రతి ననుసరించిన పాఠము. ఇదే ముఖ్యపాఠభేదము లనుశీర్షికతో ననుబంధముగా రెండవసంపుటముతుది నీయఁబడినది.

మొదటి సంపుటమున "మును...రంధ్రవిషయమునఁ, జననత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్" అని కలదు.

అన్నాఁడు. ఈ పద్యమునందుఁ జెప్పిన విషయములలో దేశిసత్కవుల స్తుతి తప్ప మిగిలినవన్నియు గ్రంథమునఁ గనఁబడుచున్నవి. దేశిసత్కవులనుగూడ సంస్కృత కవులనుబోలె వేఱువేఱుగా స్తుతించియుండు నేమోయని యెంచ వచ్చును. కావుననే కవుల చరిత్రమున (౧౮౭ పు.) "దేశిసత్కవులను స్తుతింప నిది స్తుతించితి నని కవి యబద్ధము వ్రాసియుండఁడు. అందుచేత "మునుమార్గ కవిత"యను పద్యమునకును, "సురవరులన్" అను పద్యమునకును నడుమను తెలుఁగు కవులను స్తుతించినపద్య మొకటి యుండియుండవలెను. మాతృకను జూచి పుత్రికను వ్రాసినలేఖకుని ప్రమాదము వలననో, మాతృకను లిఖంచిన వానిలోపమువలననో యాపద్యము విడిచిపెట్టఁబడియుండును. ఆ పద్యమే యుండియుండిన యెడలఁ గవికాలము కొంతవఱకుఁ దెలిసియుండును" అని కవి చరిత్రకారులు తెలిపిరి. కాని తంజావూరు ప్రతిలో పై రెండుపద్యములకును నడుమ నేదైన లుప్తమయినదేమో యనుటకు వీలుగా లేదు. ఆ ప్రతి వ్రాసిన వారు తన్మాతృకనుండి గ్రహించుటలో విడిచిపెట్టిరేమో చెప్పఁజాలము. సంపాదకులకు దొరకిన ప్రతులలోను లేదనుట స్పష్టమే కదా! కేతనకవి సంస్కృత కవులలో వాల్మీకి కాళిదాసులను స్తుతించి "సుకవిచరణాభివందనంబునుం జేసి" యనియెను. సంస్కృత కవులకును, తెనుఁగుకవులకును నుపలక్షణముగా వాల్మీకి కాళిదాసులను జెప్పియున్నాఁడు. కేతన ప్రత్యేకించి దేశిసత్కవుల నెత్తలేదు. ఈతఁడు కేతనవలెనే సంస్కృతకవులను స్తుతించి యూరకుండె ననుకొనఁదగునుగాని "దేశిసత్కవుల సంస్తుతిఁ జేసి" అని ప్రత్యేకించి చెప్పుటచే నట్లు తృప్తిపడ నవకాశము లేదు. కొందఱమతమున దేశిసత్కవుల సంస్తుతి చేసి అని చెప్పుటగూడ నొకవిధమగు స్తవమేయగును. మఱియును దీనిపై పద్యమున దేశికవితఁ బుట్టించిన చాళుక్యనృపులను స్మరించుటచేతనే చాళుక్య కాలపుఁగవులను స్మరించినట్లు గ్రహింపవచ్చును.

**సమకాలికులు**

కవిసమకాలికు నొకనిఁ గవియే చెప్పినట్లు ద్వితీయసంపుటము లఘుటీక లోను, కవిచరిత్రముననుఁ గానవగును. అది పరిశీలింతము:—దశమాశ్వాసమున బృహస్పతిచే శివుని స్తుతింపఁజేసిన పద్యము లున్నవి. అవి "దారిద్ర్య విద్రావణా" అను మకుటముతో రచింపఁబడినవి. అందు,

"శ్రీరామేశ[1]గవీశ్వరాదు లెడ నీశ్రీపాదముల్ భక్తితో
నారాధించి సమస్తలోక సముదాయాధీశులై రన్న సం
సారుల్ దుఃఖనివారణార్థ మభవుం డర్వేశు లోకత్రయా
ధారున్ నిన్ మదిఁ గొల్వకున్కి యుఱవే దారిద్ర్యవిద్రావణా."

(౧౦-౭౭)

1. 'కవీశ' అని ముద్రితము.

అని కలదు. దీని లఘుటీకలో "రామేశకవి యనునతఁడు నన్నిచోడుని కాలము నకుఁ బ్రఖ్యాతుఁడై యుండునని ధ్వనితము." అని సంపాదకులు వ్రాసిరి. కవి చరిత్రకారులు "ఈ రామేశ్వరకవీశ్వరుఁడు కవికాలమునాఁటికిఁ బ్రసిద్ధుఁడయి యుండినశివభక్తుఁడైన యాంధ్రకవియై యుండును." (౧౮౭ పు.) అని వ్రాసిరి. తంజావూరి ప్రతిలో "శ్రీరామేశ గవీశ్వరాదు లెడ్డ" అని యున్నది. శ్రీరామేశ = విష్ణువు, గవీశ్వర = బ్రహ్మ అని యర్థము. ఈ కవి యితర స్థలములందుఁగూడ గవేశ శబ్ద ముపయోగించుట గలదు. కావున ఇట (గవేశ్వర) అని కవ్యుద్దిష్టమేమో! రెండును సాధువులే కదా. బ్రహ్మవిష్ణువులు మొదలగువారందఱును ఈశ్వరానుగ్రహముననే సమస్తలోకాధీశు లయినట్లు కవి వర్ణించినాఁడు. అందు కవీశ్వరశబ్దమే లేదు. 'గవీశ్వర' అనియే యుండుట చేత రామేశ్వరుఁ డను నాంధ్రకవి నన్నిచోడునకు సమకాలమువాఁ డున్నాఁడనుట భ్రాంతిజనితము. సంపాదకులప్రతిలో 'కవీశ' అని యున్నదేమో! ఉన్నను అది బ్రహ్మపర్యాయమే కావచ్చును. ఇందు ఎడ, అనుటకు 'ఎడ్డ' అని యున్నది. సంపాదకుల పాఠమును 'ఎడ్డ' అనియే కలదు. వారు, ఇందు 'డ' కారమును దేల పలుక వలయును, అని యధోజ్ఞాపికలో వ్రాసిరి. 'ఎడ్డ' అను చోట నంత యక్షర సామ్యముగల ప్రతిలో నేకపఙ్క్తిలోనే 'గవీశ' అన్నది 'కవీశ' అని మాఱుట యొకవిశేషమే కదా. దానివలనఁ గొ్రత్తధ్వని బయలు దేఱినది. నన్నిచోడ కవికి సమకాలికుఁ డొకఁడు వెలసినాఁడు. రామేశ్వర నామము కవినామముగా నేశాసనముననో కనఁబడినంతనే కొందఱు నన్ని చోడునితో సంబంధము కలుపఁదలంప వచ్చును. అట్టి భ్రాంతి పరిహరించుటకై ప్రతులలో నున్నరీతి ప్రదర్శింపఁ బడియెను. కవి చరిత్రకారులు వ్రాతప్రతి పరిశీలించినచో నట్లు వ్రాసియుండరేమో!

మఱికొందఱు సమకాలికులు కావ్యమునఁ జెప్పఁబడిరని కొందఱి యూహలు:—

క. "తారకవిరచిత కృతియుం, దారకవిరచిత సుకృతియుఁ దానడఁగు సదా
చారకవి బుధాళికి సువి, చారకవిబుధాధినాథు షణ్ముఖుఁగనినక్."

(౧౦-౧౩౧)

ఇది దేవదూత యగుసుమతి కుమతియగు తారకాసురుని దురాలాపంబులు విని కోపించి పలికినది. దాని లఘుటీకలో సంపాదకులు "తార కవి, రచిత- ఇందుఁ గవియనఁగా శుక్రుఁడని గ్రహించినను శబ్దశ్లేష పనుపడదు. నన్నెచోడకాలమునఁ బ్రఖ్యాతులగు తారకవియును షణ్ముఖకవియు నుండిరని తోఁచుచున్నది" అని వ్రాసిరి.

మఱియు రెండవసంపుటము పీఠికలో (౧౨-వ పు.) సంపాదకులు ఇట్లు వ్రాసిరి:—"కవి యవతారికలో అన్యతారకవితతు లనాదరించి, వెలయ సత్కవి బుధగురు బలము వడసి । యొనర దైవజ్ఞునట్ల శుభోదయమున । దివ్య సుకృతిఁ బ్రతిష్ఠింతుఁ దిరముగాఁగ" అను పద్యములో 'నన్యతారక' అనఁగా శుభేతరగ్రహములు; 'వితతు' లనుటకు 'వికృతు' లనుట యొప్పు. అశుభ గ్రహవికారముల ననాదరించి యని యర్థము. అర్థాంతరమున అన్యుఁడగు తారుఁడను కవియొక్కకృతుల ననియర్థము ద్యోతకము. ఇట్లే తారకవి నామము ౫౧౮-వ పద్యములో మరల శ్లేషార్థమున వచ్చుచున్నది. వీఁ డెవ్వఁడో యెఱుంగరాదు."

ఇందు 'వితతులు' అను దానికి 'వికృతులు' అను మార్పు కావించుట యొకవిశేషము. తారకశబ్దము నక్షత్రపర్యాయముగా ప్రసిద్ధముకాని గ్రహ పర్యాయముగా ప్రసిద్ధముగాదు. * 'అర్థాంతరమున అన్యుఁడగు తారుఁడను కవియొక్క కృతులనని యర్థము ద్యోతకము' అనిరి. ఆయర్థము దేనికి ద్యోత కము? పదములు తెగఁగొట్టి అర్థాంతరము చెప్పుచున్నప్పుడుద్యోతకత్వమేమి? ఇవి పొసఁగుట లేదు. వారిమత ప్రకారము నన్నిచోడుఁడు తత్సమకాలికుల నిద్దఱను దెలిపెనని తేలినది. ఇందు తారకవిశబ్దమును కొందఱు విమర్శకులు నన్నయ్యకు ముడిపెట్టిరి అది యెట్లో తెలిసికొన వారిమాటలే గ్రహింతము.

శ్రీ నడకుదిటి వీరరాజుగారు తమ వ్యాసమున[1] కొందఱు విమర్శకులు చెప్పుచున్నారని యుదాహరించిన వానిలో నీక్రింది వాక్యములు గలవు:

* * * *

"ఇప్పుడు గ్రామ్య గ్రాంథికభాషా వాదులకుఁ బరస్పరము వివాదములు జరుగుచున్నట్లే యక్కాలమున నన్నియ యనుశాసనములనుగూర్చి రాజన రేంద్రాస్థాన పండితులకు, చోడరాజ, పాశ్చాత్య చాళుక్యరాజ, సంస్థాన పండితులలో వాదోపవాదములు జరిగియుండును. ఎట్టకేలకు నప్పుడు చక్ర వర్తియైయున్న రాజనరేంద్రునియాస్థానపండితులకే విజయము చేకూరి యుండును.

"నన్నియచేసిన యాసంస్కారమున కిష్టపడకుండుటచేతనే నన్నిచోడుఁ డచ్చటచ్చట కాళిదాసాదులు దిఙ్నాగాదులంబోలె, నన్నియభట్టును (తారక పురనివాసిని) తారకవి యనుపేరితో నప్రకృతశ్లేష వచ్చునట్లు నిందించి యుం డునని తోఁచెడిని:—

---

* ఆప్టే సంస్కృతాంగ్ల నిఘంటువున తారశబ్దార్థములలో Star or planet అని యున్నది. కాని ఇతర నిఘంటువులలో నక్షత్ర పర్యాయముగానే కలదు.

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, ౧౪ సం. ౨ సంచిక, ౧౨౦, ౧౨౧ పుటలు.

గీ. "అన్యతారకవికృతుల నాదరించి, వెలయ సత్కవిబుధగురుబలము వడసి
యొనరదైవజ్ఞునట్లశుభోదయమున, దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతుఁ దిరముగాఁగ."

(ఇందు తారకవితతులని ముద్రిత తాళపత్ర గ్రంథములందుఁ గలదు. వికృతులని యందు మార్పు చేయఁబడినది. ఇది సంపాదకుల ద్వితీయసంపుట పీఠికలోని మాటలనుబట్టి చేయఁబడినదేమో.)

క. "తారకవి రచిత కృతియుం, దారక విరచితసుకృతియుఁ దానఁడగు సదా
చారకవిబుధాళికి సువి, చారకవిబుధాధినాథు షణ్ముఖుఁ గనినన్."

(౧౦-౧౩౧)

"కొందఱు విమర్శకులు చెప్పెడు పైకథలోని యాథార్థ్యమును భావి పరిశోధకులు కనుంగొందురను తలంపున దీని నుదాహరించితిని. నన్నియ నన్నిచోడ కవీంద్రులిద్దఱును సమకాలికులను వారికి సయితము కొన్నియాధార ము లాయిద్దఱిగ్రంథములందును బ్రయోగసామ్యమును జెంది కానంబడుచున్నవి."

వారు దీని కుపోద్బలకముగ నొకకథ గలదని యీ క్రింది వృత్తాంతమును జెప్పుచున్నారు.

[1]"నన్నియభట్టు మొదటి నివాసము వేఁగిదేశములోనితణుకుగ్రామము, అని యొక ప్రసిద్ధి గలదు. నన్నియ కాలమున దీనికి తారకాపురము (తారకపురము) అను నామముండెడిదని పెద్దలు చెప్పుదురు. తారకాసురుఁ డిచ్చటనే రాజ్యము చేసెననియు ఇప్పుడు తణుకునకుఁ జేరువనున్న వేల్పూరే, దేవతలు విడిసిన స్థలమనియు, 'దేవదానవపుంత' యనఁ బడునది దేవతలు దానవులు నడిచిన మార్గమనియుఁ జిరకాలమునుండి యొకవాడుక పరంపరగా వచ్చుచున్నట్లు పెద్దలు వచింతురు. మఱియు నన్నియభట్టు స్వస్థలమగు తారకాపురను (తణుకు) న యజ్ఞముచేసెననియు అచ్చట (యజ్ఞశాలకడ) జమ్మిచెట్టు పూర్వ ముండెడిదనియు వృద్ధులు చెప్పుచుండెడివారని యొకజనశ్రుతి గలదు. (ఇటఁ అధోజ్ఞాపికలో, 'నన్నియనివాసము తణుకనియు నచ్చట నాతఁడు యజ్ఞము చేసెననియు, పట్టమట్ట సరస్వతీసోమయాజి తనపృథు చరిత్రమున వ్రాసి యుండుటచే నీవృత్తాంతము సత్యమనుటకు సందేహములేదు' అనియున్నది.) తరువాత నన్నియ తనవిద్యా మహిమచే రాజరాజనరేంద్రునిదయకుఁ బాత్రుఁడై తణుకునకుఁ గొంతసమీపముననున్న రాజధానికిఁ (రాజమహేంద్రవరమునకుఁ) బోయెనని చెప్పుదురు."

---

1. ఆం. సా. ప. సం. ౧౮-౨ సంచిక. ౧౯౯౯, ౧-౨౦ పు.

"నన్నియ భట్టారకుఁడు శబ్దానుశాసనుఁడయ్యెనని మనమెఱుఁగుదుము. ఇక్కాలమున మహమ్మదీయాంగ్లేయాద్యన్యభాషాపదములు మన తెలుఁగుమాటలలోఁ గలసిపోయి వ్యవహరింపఁ బడుచున్నట్లే, పూర్వకాలమున నఱవము, కన్నడము మొదలగు నితరభాషలపదములు లెక్కలేని వాంధ్రమునఁ జేరిపోయి యప్పటి వారిచే యథేచ్ఛముగ వాడుకొనఁ బడుచుండెడివి. కవులును వానిని తమగ్రంథములందు నిరంకుశముగఁ బ్రయోగించు చుండెడివారు."

"అప్పుడు రాజరాజుచే నెల్లవిధముల గౌరవింపఁబడుచున్న నన్నియ మహాశయుఁడు, తనకు ముందున్న యాంధ్రగ్రంథములలోని పదప్రయోగములను గనుఁగొని యనేకములగు నితరభాషాపదము లందుండుటఁ గాంచి తన ప్రభువుతోడను తనతోడిపండితులతోడను నాలోచించి బహుభాషాకవిశేఖరుఁడగు నారాయణభట్టుసాహాయ్యమున శబ్దసంస్కారమొనర్చి యన్యభాషాపదములను ద్రోచివైచి గ్రంథరచన కారంభించెను. కావుననే దేశమునందంతటను సామాన్యమైయున్న సంస్కృతభాష యాతని గ్రంథమున నాలుగింట మూఁడు పాళ్లుగలది యయ్యెను. ఆ సంస్కారము నన్నిచోడాది కవీంద్రుల కిష్టములేక పోయినది."

* * * *

ఇంకఁ బయి కల్పనలకు ప్రమాణముగా వారు నుదాహరించినపద్యములను సందర్భసహితముగాఁ బరిశీలింపవలసియున్నది:— ఇతివృత్తమునఁ బ్రతినాయకునినామమగు తారకశబ్దమును శ్లేషించుట మనకవికిఁ బ్రియమయినట్లు కనఁబడుచున్నది. చూతము:—

I కుమారస్వామి సమరోద్యుక్తుఁడయి భేరి సఱవంబంచుదినమునఁ గలుగు సూర్యోదయము వర్ణించు సందర్భమున:

"క. తారకతేజం బడఁపఁగు, మారక నీవేల పంపు మహిఁ దారకసం
హారకు నన్ననుగతిఁ దిమి,రారాతి ప్రతాపయుక్తుఁడై యుదయించెన్."

II తారకాసురసంహారానంతరము కురిసిన పుష్పవృష్టివర్ణనము:

"మ. అరుణపరాగ మంబరమునందుఁ గడల్కొనఁ బుష్పవృష్టి పైఁ
గురిసెఁ బురారిసూతికి నగుర్వగఁ దారకు నోర్చి మాఘుఁ దా
నిరతము దారకాహ్వయము నిల్పినవాఁడని రాగభాతి వి
స్తరముగఁ బెల్లుతో నెఱఁగు తారకపఙ్క్తియొ నా వెలుంగుచున్."

(౧౨-౧౮౯)

III దేవదూతయగు సుమతి కుమతియగుతారకుని దురాలాపంబులు విని కోపించి కుమారకు విశేషించి, తారకు నిరాకరించి పలికినపలుకులలో నిది యొకటి:—

" క. ఇనుఁ డుదయింపక ముందఱ,
ఘనముగ వ_ర్తించుఁ దారకప్రభ గాక
య్యినుఁ డుదయించిన పిమ్మటఁ,
గనుఁగొన లోకమునఁ దారకప్రభ గలదే. (౧౧—౧౩౦)

ఇటఁ గవి యినశబ్ద తారక శబ్దములు శ్లేషించి తారక సంహారము సూచించినాఁడు. ఇన శబ్దము షణ్ముఖపర్యాయము గాకున్నను బ్రభు పర్యాయముగాఁ గుమారుఁడను నర్థమునఁ గవి యుపయోగించినాఁడు. దీని తర్వాతి పద్యము ప్రకృతము పరిశీలింపవలసిన వానిలో నొకటి:—

" క. తారక విరచిత కృతియుం,
దారక విరచిత సుకృతియుఁ దా నడఁగు సదా
చారక విబుధాళికి సువి,
చారక విబుధాధి నాథు షణ్ముఖుఁ గనినన్.

తారక = నక్షత్రములచేత, విరచిత = చేయఁబడిన, కృతి = పని (అనఁగా ప్రకాశించుట)యు, తారక = తారకాసురునిచే, విరచిత = చేయఁబడిన (అనఁగా సంపాదింపఁబడిన) సుకృతి = సుకృతము, తపస్సుచే బ్రహ్మను సంతోషపెట్టి సంపాదించినపుణ్యము, లేక పుణ్యఫలమగు శ_క్తి (క్రమముగా), సువిచారక = మంచి ధర్మరక్షణవిచారముగల, విబుధాధినాథున్ = సురో_త్తముని అనఁగా సూర్యుని, "సురో_త్తమో దినమణిః పద్మినీవల్లభో హరిః" అని యమరశేషము, లేక కవిశబ్దము సూర్యపర్యాయముగాఁ గొన్నినిఘంటువులలోఁ గలదుగాన, సువిచారకవిన్ = ధర్మరక్షణాలోచనగల సూర్యుని అనిచెప్పవచ్చును. అప్పుడు బుధాధినాథున్ అనునది విశేషణముగా నన్వయింపవచ్చును. షణ్ముఖున్ = కుమారస్వామిని, కనినన్ = చూడఁగా - చూచినంతనే అని భావము. సదాచారక + విబుధాళికి=సదాచారముగల పండితాళికిని (తారకాసురపక్షమున) మంచిప్రవ_ర్తనగల దేవతల సమూహామునకును, అడఁగున్ = అదృశ్యమగును-అనఁగానక్షత్రకాంతి సూర్యుని జూచినంతను, తారకాసురుని పుణ్యఫలము కుమారస్వామిని జూచినంతను అంతరించు నని భావము. ఇది కవి యుద్దేశము అని తోఁచెడిని. ఈ యర్థమున తారకవికి సంబంధము లేదు. స్థూలదృష్టితోఁ జూచినపుడు తోఁచినవ్యాఖ్య మఱియొకటి గలదు. అది క్లిష్టముగా నున్నది. అయినను దద్రీతి చూపఁబడును:—

తారక + విరచిత + కృతియు, తారకవి + రచిత + సుకృతియును = తారకాసురుఁడు చేయు చేష్టయును, కుకవులు రచించు కావ్యమును, సువిచారక విబుధాధినాథు షణ్ముఖుఁ గనినంత=మంచిపరి జ్ఞాతలగు దేవతల కధిపతియగు

కుమారస్వామిని జూచినంత నని తారకాసురకృతిపక్షమునఁ జెప్పవలెను. కుకవి కృతిపక్షమున—సువిచార + కవి + బుధ + అధినాథున్ = మంచి విచారణ గల కవులకును బుధులకును ప్రభువగువానిని, [1]షణ్ముఖున్=కుమారస్వామితోఁ దుల్యుఁ డగువానిని(లేదా, షడ్దర్శనవేత్త యనికాని, షడ్భాషావేత్తయనికాని చెప్ప వచ్చును.) చూచినంత, సదాచారక + విబుధాళికి = (తారకపక్షమున) మంచి ప్రవర్తనగల దేవతల సముదాయమునకు (కుకవిపక్షమున) సదాచార + కవి+ బుధ + ఆలికి=మంచిసంప్రదాయముగల కవులయు, బుధులయు సంఘమునకు, అడఁగును = నమ్రమగును. తారకాసురచేష్ట కుమారుని చూచినంతనే దేవతల యెడల నమ్రత నొందును. కుకవికృతి కవిబుధాధినాథుని జూడఁగనే కవిబుధా వళియెడల నణఁగియుండును అని భావము. ఈ పక్షమున కుకవి పర్యాయముగా 'తారకవి' శబ్దము కవి ప్రయోగించియున్నాఁడు అనవలసియున్నది. తారకవులు అనఁగా ప్రతారకులగు కవులు. తారశబ్దము వంచనార్థద్యోతకమగు 'ప్ర' అను నుపసర్గ లేకున్నను వంచనార్థము తెలుపవచ్చును. ఉపసర్గలకు ద్యోతకత్వ మను పక్షము వ్యాకరణ సమ్మతమే కదా. కన్నడనిఘంటువున కిట్టెలు పండి తుఁడు తారశబ్దమునకు వంచనార్థము తెలిపియున్నాఁడుగాని, మైసూరు ప్రాంతపుఁ దెనుఁగుపదముగా సూచనచేసినాఁడు. ఏ ప్రాంతముననైన నట్టి యర్థము బోధించుటయు, సంస్కృతపదములతోఁ గలసియుండుటయుఁ గల దేమోయనుట కవకాశము గలదు. లేదా, తారకవులు = శబ్దాడంబర

---

1. సంస్కృతమున హాలాస్యచరితమందు సుబ్రహ్మణ్యేశ్వరాంశమున జనించిన మూగ యొకఁడు ఈశ్వరకృతశ్లోకవ్యాఖ్యాతల రచనలలో శ్రేష్ఠత్వమును తనయానందబాష్ప ప్రకటన మూలమునఁ బ్రకటించెనని కలదు. సుబ్రహ్మణ్యేశ్వరుని గావ్యకళా పరిజ్ఞాతనుగాఁ ఆలంకారి కులు గ్రహించిరి. చతుర్ముఖ సహస్రముఖులతోఁ గలిపి షణ్ముఖుని విద్యావిశేషవేత్తగాఁ బేర్కొ నుట ప్రాయికముగాఁ గలదు. అదిగాక సుబ్రహ్మణ్యస్వామికి జ్ఞానోపదేశమున గురుత్వము తఱ చుగా వర్ణింపఁబడినది.మఱియు ద్రావిడ (తమిళ)సంప్రదాయమున "తిరుమురు కాట్టిప్పడై" అను గ్రంథమున సుబ్రహ్మణ్యేశ్వరుని స్తుతించు సందర్భమున నిట్లుకలదు. "మాలై మాప మాలరిపులవ అందణర్ వెఱుక్కై, అరిందోర్ సొన్మలై." (పుష్పమాలలు ధరించువాఁడా! శాస్త్రము లెఱిఁ గిన విద్వాంసుఁడా! సన్న్యాసులకు లేక యోగులకు ధనమా! జ్ఞానులకు పర్వతమా! అని దానిభావము.)

ఆంధ్రభాగవతమునఁ బీఠికలో కవితాసందర్భమున షణ్ముఖప్రశంస గలదు:

శా. పుట్టం బుట్ట శరంబునన్ మొలవ నంభోయానపాత్రంబునన్
నెట్టం గల్గను గాలిఁ గొల్వను బురాణింపం దొరంకొంటి మీఁ
దెట్టే వెంటఁ జరింతుఁ దత్సరణి నా కీవమ్మ యోయమ్మ మేల్
పట్టున్ నాకగుమమ్మ నమ్మితిఁజుమీ బ్రాహ్మీ! దయాంభోనిధీ! (౧ స్కం-౭)

ప్రధానకవులు, కుకవులు అని స్పష్టముగాఁ జెప్పుకోవచ్చును. ఆ పక్షమున కుకవికృతికి సుకృతి యని కవి యుపయోగించునా యను నాశంక గలుగుచున్నది. అది యధిక్షేపార్థకమనియో వాక్యాలంకారమనియో గ్రహింపవలసియున్నది. ఈ సందర్భమున విచారింపవలసిన పద్యము మఱొకటి గలదు.

కావ్యావతారికలో కవితావిశేషము తజ్జ్ఞునం దెలుఁగవచ్చునుగాని యజ్ఞునం దేమియెఱుంగంగనగునని కవిచెప్పి,

"అది యెట్లనిన.

తే. గీ. అన్యతారక వితతుల నాదరించి
వెలయ సత్కవిబుధగురుబలము వడసి
యొనర దైవజ్ఞునట్ల శుభోదయమున
దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతుఁ దిరముగాఁగ" (౧-౩౨.)

అన్నాఁడు.

ఇందుఁ గవికిని దైవజ్ఞునకును సమానధర్మములతో దివ్యసుకృతిప్రతిష్ఠాపనము చెప్పఁబడినది. దైవజ్ఞుఁడు దివ్యమగు శుభకార్యమును స్థిరపఱుచును. కవి దివ్యమగుకావ్యమును స్థిరముగా నుండునట్లు రచించును. (దైవజ్ఞపక్షమున) అన్య + తారక + వితతులన్ = ఇతర నక్షత్రసముదాయములను, ఆదరించి = గౌరవించి, అనగా నక్షత్రబలము చూచికొని అని భావము. సత్ + కవి + బుధ + గురుబలము వడసి = శుభగ్రహములయిన శుక్ర బుధ బృహస్పతుల బలమును బొంది, దివ్యసుకృతిఁ బ్రతిష్ఠించును. (కావ్యపక్షమున) అన్య + తార + కవి + తతులను = ఇతరులను తరింపఁజేయు కవుల సముదాయములను, (దీనిచేత శైవకవులు సూచితు లయిరనియు ననవచ్చును.) ఆదరించి = సమ్మానించి, సత్ కవి + బుధ + గురుబలమువడసి = సత్కవియుఁ బండితుఁడునగు గురుని బలమును పొంది, దివ్యమగు కావ్యము రచింతునని భావము.

ఈ పక్షమున 'తారకవి' సంబంధము లేనేలేదు. వెనుకటి పద్యమునవలెనే ఈ పద్యమునను భంగ్యంతరమున నర్థము చెప్పవచ్చును:—

(దైవజ్ఞ పక్షమున) అన్య + తారక + వితతులు=ఇతర నక్షత్ర సముదాయములను, అనాదరించి=నిరసించి; అనగా నక్షత్రబలము లేకున్నను లక్ష్యము చేయక, సత్కవి బుధ గురు బలమువడసి = సౌమ్యగ్రహములగు శుక్ర బుధ గురువుల బలమును పొంది; (కావ్యపక్షమున)అన్య +తారకవి+తతులు అనాదరించి = ఇతరులగు కుకవుల సమూహములను నిరాకరించి, సత్కవులయు, బుధులయు, గురునియు, బలము పొంది, దివ్యసుకృతి రచింతునని భావము.

"తారకవి" శబ్దము కుకవిపర్యాయముగా నీ కవిచేతనే వేఱొకచోటఁ ప్రయోగింపఁబడినదనుపక్షమున నిచ్చటను అట్టి భావ ముండునేమోయని ఈ మార్గము గ్రహింపఁబడినది. ఈ పక్ష మవలంబించినపుడు సామాన్యముగాఁ గుకవినింద చెప్పఁబడిన దనఁదగును. స్త్రీకర్ణవర్ణనయందు స్త్రీకర్ణములకు సుకవి కావ్యము నుపమానముగా నీకవియే గ్రహించినాఁడు. "క. హారము లాశ్రిత భాషా, సారము లాసకలవస్తు సంపూర్ణాలం, కారములు శ్రీవర్ణా, కారంబులు చెవులు సుకవికావ్యము వోలెక్." 3-౬౭, అట్లే తారకకృతితోఁ గుకవికృతిని పోల్చియుండు ననవచ్చును. కాని తారుఁడనువానినొకనిఁ గల్పించుకొని యర్థము కుదురక 'వితతుల'ను 'వికృతు' లను గావించుకొని యా పైని తారునకుఁ బ్రతిపక్షునిగా షణ్ముఖుఁడనువాని నెంచుకొనుట యుచితము గాదు. మహాకవి తన మహాకావ్యమునఁ దాత్కాలిక పురుష నామమును ప్రధానవర్ణ్యముగా గ్రహించియుండఁడు. అంతేకాక ప్రధానముగా నుండఁదగిన యర్థములు చెప్పినతర్వాత నట్టి పేర్లుగల పురుషు లున్నారని యితర నిదర్శనములనుబట్టి స్థిరపడనేని ధ్వనిగా నట్టిపేర్లుగలవారి నామములును, సంబంధములును స్ఫురింపఁ జేయఁబడుచున్నవి యనిచెప్పుట సంప్రదాయసిద్ధము. ప్రధానార్థముననే తారషణ్ముఖ నామకులను గ్రహించుట నుసంగతముగాదు; సాంప్రదాయికమును గాదు.

ఇట్లుండఁ బైనిచెప్పినట్లు విమర్శకులు సంపాదకులమాటలలోఁ గొన్నింటిని గ్రహించి ప్రధానార్థమును వీడి, షణ్ముఖుని విడిచిపెట్టి తారుఁడనువాని గ్రహించి యాతారుఁడు నన్నయ్య భట్టేయనియు నన్నిచోడుఁడు నన్నయ భట్టు నప్రకృతశ్లేషతో నిందించియుండుననియు నిరూపింపఁబూనిరి !

అట్టికల్పనలు చేయఁబూనినయెడల నసంఖ్యాకములగు కల్పనలు బయలు దేఱవచ్చును. ఒకచోట మనకవియే—

"క. ఆనాకపతిగజంబు ష, డాననుఁ గని వెఱచి పఱచె నది చోద్యమె పం
చాననున కోడుకరులు ష, డాననవిపరీతగతి భయంపడకున్నే."

అని చెప్పెను. (౧౦-౬౯)

ఇటఁ బ్రధానార్థబాధ లేకుండఁగనే పంచాననషడాననవామకులు నన్నిచోడ సమకాలికు లుండి ననవచ్చును. అదియు సమ్మతమే యందురేని "తేభ్యో మహద్భ్యో నమః!" మొత్తము పరిశీలింపఁగా తారషణ్ముఖు లనుపేర్లుగలవా రున్నారనిగాని వారు మన నన్నిచోడకవికి సమకాలమువారనిగాని చెప్పుట కవకాశము లేదు. నన్నయభట్ట సమకాలికత్వవాదమును గుదురదు.

నన్నిచోడదేవుఁడు కళావిలాసమను గ్రంథ మొకటి రచించినాఁడని లక్షణగ్రంథోదాహృత పద్యములనుబట్టి తాము గ్రహించినట్లు సంపాదకులు

వ్రాసిన ప్రథమసంపుట పీఠికనుండి తెలియుచున్నది. అది క్షేమేంద్రరచిత కళావిలాసమునకుఁ దెనుఁగుసగాదనియు వ్రాసిరి. తద్విషయమేమియుఁ గుమార సంభవమునఁ గానరాదు.

**ఒఱయూరు పురము**

[1] ఒఱయూరు కావేరీతీరమునఁ దిరుచునాపల్లికి సమీపమున నుండెడి చోళదేశపు రాజధాని. ఈ పురమునకు [2] కోటియను నామాంతరమును గలదు. చోడరాజులలోఁ బూర్వుఁ డొకఁడు గజారూఢుఁడై సేనలతోఁ బోవుచుండఁగా నొకచోటఁ గోళ్లు పోరాడుచుఁ దప్పుకొనలేదు. రా జాయేనుఁగును వానిపైకిఁ ద్రోలఁగా నవి గజము నెదిరించి గోళ్లతోను ముక్కుతోను చీలిచి పొడిచియా గజమును బడఁగొట్టినవి. ఆ వింతచూచి యాకోళ్ల కట్టిశక్తి గలుగుటకుఁ గారణ మాస్థలమహత్త్వమే యని యారాజు నిర్ణయించి, యచటఁ దాను పురమును నిర్మించెను. ఆ పురమునకు నివసింపఁదగినయూరను భావము గలుగునట్లు తమిళమున ఉఱైయూరు అను పేరు పెట్టెనని కొంద అందురు. కోడి యసాధారణ బలముచూపిన ప్రదేశము గాన నాపురమునకుఁ గోటి అనియుఁ బేరుపెట్టెనని కొందఱు. కోడియాకారము గలుగునట్లు పురము నిర్మించెఁగావున కోటి యనుపే రాయూరికిఁ బ్రసిద్ధమయ్యెననియు మఱికొందఱు చెప్పుదురు. ఈ పురము గుఱించిన ప్రశంస మిక్కిలి [3] ప్రాచీనమగు 'చిలప్పదికారమ్' అను గ్రంథమునఁ గనఁబడుచున్నది.

౧౦ నాడుకాణ్ కాతై.
"ముఱఙ్జెవివారణమ్ మున్ చమ మురుక్కియ
పుఱఙ్చిరై వారణమ్ పుక్కినర్ పురిన్దెన్."

ముఱఙ్జెవి = చేటవంటి చెవిగల, వారణమ్ = ఏనుఁగును, మున్ = పూర్వము, చమమ్ = యుద్ధమందు, మురుక్కియ = చంపిన, పుఱఙ్చిరై = ప్రాకారముగల, వారణమ్ = కోటి అను పేరుగల పురమును, పురిన్దెన్ = ఆసక్తితో, పుక్కినర్ = ప్రవేశించిరి. పుఱఙ్చిరై వారణమ్ అనుచోట ఊరికిబయట

1. ఉఱైయూర్. N. Name of an ancient Chola capital, now a suburb of Trichinopoly—(చిలప్. 10-242.) కోటి. Tamil Lexicon.

2. Koli. N. కోటి. T. Kodi, K. Ma. Kōḷi, Tu. Kori] Gallinaceous foul; కుక్కుటమ్. Vurayūr, a town near Trichinopoly, once the capital of the cholas, where a cock is said to have conquered an elephant—Tamil Lexicon.

3. కొందఱు క్రీ. శ. ౨-వ శతాబ్ది ప్రాంతమనియుఁ గొందఱు ౬-వ శతాబ్ది ప్రాంతమనియు నందురు.

పల్లెలుగల కోటి అను ఒఱియూరు అని యొక్క వ్యాఖ్యాత వివరించెనఁట. ఏమైనను ఏనుఁగును చంపిన కోడిపేర నేర్పఱచిన పురము ఒఱియూరనుట సుప్రసిద్ధమే.

ఒఱియూరు కోళ్లకుఁ బ్రసిద్ధమనుటయు, చోళరాజధానికి కోటియను పేరు గలదనుటయు మఱొక తమిళగ్రంథమువలనఁ దెలియుచున్నది. పరిపాడల్.

"నావిల్ అన్దణర్ నవిల్ కురల్ ఎడుప్ప
ఏమ ఇఱ్ఱుయిల్ ఎఱుదల్ అల్లదై
వాటియ వంజియుం కోటియుం పోల
కోటియిఱ్ఱ ఎఱాఱెం పేరూర్ తుయిలే."

ఇది మధురాపురవర్ణనము. మధురాపురమున వేదాధ్యయనధ్వనిచేతఁ బురమువారలు నిద్రనుండి మెలఁకువ చెందుదురు. కేరలరాజునకు రాజధాని యైన వంజి అను పురమునఁ బోలెను చోళరాజు రాజధానియైన కోటి (ఉఱై యూరు) అను పురమునఁ బోలెను కోడిధ్వనితో పురమువారు నిద్రనుండి లేవరు అని తాత్పర్యము.

స్థలప్రభావమును దెలుపు కోడివృత్తాంతము తిరుచినాపల్లి స్థలపురాణమున నున్నది. విజయనగరనిర్మాణ సందర్భమున నిట్టి విపరీతబలవిషయ మొకటి ప్రతీతిలోఁ గలదు. కుందేళ్లు వేటకుక్కలను దఱుముట చూచి యాకుందేళ్ల కంతశక్తి కలుగుటకుఁ గారణము ఆ స్థలబలమే యని నిశ్చయించి యచటఁ బురము గట్టిరను ప్రతీతి రాయవాచకమునఁ జెప్పఁబడినది. ఇట్టి స్థల ప్రభావసూచన లనేకములు మనదేశమునఁ గలవు. ఇవి చోడరాజులలోఁ బూర్వులకాలమునఁగల్గిన వైచిత్ర్యమును స్థల మాహాత్మ్యమును దెలుపుటకై గొప్పగాఁ జెప్పుకొనుట కలదు. ఇట్టివి యితరవంశరాజులలోను గొన్ని గలవు.

**కలుకోళ్లు, కలుపొన్నలు**

అట్టి కోళ్లప్రభావమును జిరకాల స్మరణీయముఁ జేయుటకై వాని రూపున రాతివిగ్రహములు చేయించి యుంచుటయు నా కలుకోళ్లే సమయ విశేషములందుఁ గూయుటయుఁ గలదని యూహ్యము. అట్లే యీశ్వర పూజార్థము దేవలోకమునుండి తెచ్చినపొన్నలు అంతర్ధానమునొందఁగా ఆ పొన్నల ఱాతివిగ్రహములు చేయించుటయు నాకలుపొన్నలు సమయవిశేషములఁ బూచుటయు సంభావ్యము. ఇవి శైవప్రభావములను దెలుపును. ఇవి యొఱియూరనే కాక శైవుల యితరపురములందును నున్నట్లు గలదు. ఇది శైవ సంప్రదాయము.

"రోషించి మల్లికార్జున పండితయ్య, శాపోదకము లెత్తి చల్లె నత్షణమ, చూపఱు భీతియుఁ జోద్యంబుఁబొందఁ, గాదింక నీ పానుగంట నుండఁగ మ, హాదేవభక్తుల కనుచుఁ గట్టలుక, మసలక పండిత మల్లికార్జునుఁడు, వెనఁదలిర్పఁగఁ బురి వెడలంగ వెనుక, నక్కజంబుగఁ బూచె నంతఁ గల్ పొన్న, కుక్కరోకుక్షి ని కూసెఁ గల్ కోడి, పురి మహోత్పాతముల్ పుట్టె వెండియును."

(పండితారాధ్యచరిత్ర, మహిమ. పుట. ३०౧.)

హాలాస్య మాహాత్మ్యమున ఱాతియేనుఁగు చెఱకుతిన్నట్లు చెప్పఁ బడెను. ఇట్టి ప్రభావములు చెప్పుట శైవకవులలో హెచ్చుగాఁ గనఁబడును. అట్లే మనకవి కలుకోడికూఁతలను కలుపొన్న పూఁతలను.

"క. కలుపొన్నవిరులఁ బెరుగం, గలు కోడి రవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్, బొలుచు నొఱయూరి కధిపతి "నని యొఱయూరి పూర్వ ప్రసిద్ధ విషయమును తెలిపెను. దీనినిఁ బట్టి కొందఱు చెప్పునట్లు నన్నెచోడుఁ డొఱ యూరిలో స్వయముగా రాజ్యము చేసెననియు నప్పుడు కలుకోళ్లు కూయుచుం డెననియుఁ గలుపొన్నలు పూచుచుండెననియుఁ జెప్ప వీలు కనఁబడదు. కలు కోళ్ల కూఁతలతో పాటు నన్నిచోడకాలము నాఁటికి వారి యొఱయూరు పురా ధీశత్వముగూడ భూతపూర్వమే యని స్పష్టమగుచున్నది. పై విషయములలోఁ గవికాలము నిర్ణయించుసాధనములు స్పష్టముగాఁ గనఁబడవు. ప్రకృతము గ్రంథస్థవిషయములు మాత్రము ప్రదర్శింపఁబడినవి.

---

# ద్వితీయ ప్రకరణము

కృతిపతి కృతికర్తృవర్ణనాదులలోఁ గొన్ని విషయములు మాత్రము దెలుపు శాసనభాగములు గ్రహించి కొందఱు కవికాల నిర్ణయము చేసిరి. దానికి విమర్శనములును, వానికి ఖండనాదులును బయలుదేఱినవి. ఇంతకంటెఁ బ్రబలమగు నాధారము దొరకువఱకు నిదియే సరియని తృప్తిపడవలయునని కొంద అనిరి. శాసనాధారమున సరియగు కాలము నిర్ణయించుట కవకాశము లేనపుడు కవిప్రయుక్త భాషాదులనుబట్టి కాలనిర్ణయముచేయుట యొక సాధనము గాన, నా రీతిని భాషాది సాధనమును గొందఱు పరిశీలించిరి. అందును అభిప్రాయభేదములు గలిగినవి. కావున భాషా ప్రయోగాదులనుబట్టి కవి యెప్పటివాఁడని యూహించుట కవకాశముగలదో సవిమర్శముగాఁ మొదటఁ బరిశీలించుట యుక్తము అని తోఁచినది. అందుఁ బ్రస్తుత కావ్యమునకు మూలగ్రంథమేది యను విషయము కావ్యపరిశీలనమునకుఁ గాలనిర్ణయమునకును గూడ ముఖ్యమే కావున, మొట్టమొదట నా విషయము పరిశీలింతము.

**మూలగ్రంథము**

ఈ విషయమున సంపాదకులీ క్రిందిరీతిని ప్రథమసంపుట పీఠికలో వ్రాసిరి:—

"ఈ కుమారసంభవము కాళిదాస కావ్యమునకుఁ దెనుఁగుగాదు. ఇందుఁ బేర్కొనఁబడిన సంస్కృత కవులలో నుద్భటుఁడనువాఁడు భావగర్భము గల కుమారసంభవమను కృతి విరచించినట్లు కవి చెప్పుచున్నాఁడు. కాశ్మీర కవులలో జయాపీడ సంస్థాన విద్యాపతియగు నుద్భటుఁడొకఁడు క్రీ. శ. ౮౦౦ లో కావ్యాలంకార సారసంగ్రహము రచించి దానిలోఁ దన కుమారసంభవకావ్యములోనుండి శ్లోకము లుదాహరించుకొనెను. కావున, నా యుద్భటుని కుమారసంభవమే నన్నెచోడుఁడు చూచెనని యేర్పడుచున్నది. ఆ గ్రంథమిప్పుడు లభించునదిగాదు. దానిలోని శ్లోకముల నుద్భటుఁడు దన యలంకార గ్రంథమునందును, ప్రతీహారేందు రాజను వ్యాఖ్యాతయు, కావ్యప్రకాశమునకు సంకేత మనువ్యాఖ్యానమునందు మాణిక్య చంద్రుఁడను కవియు, వల్లభదేవుఁడును ఉదాహరించియున్నారు. అయ్యుదాహృత పద్యములన్నియుఁ బోల్చి చూడఁగాఁ దెనుఁగు కుమారసంభవ ముద్భటుని కావ్యమునకుఁ దెనుఁగుగాదని యేర్పడుచున్నది." మఱియు నా శ్లోకములనుబట్టి చూడఁగా నుద్భటుఁడు శబ్దచిత్రములయందును నప్రస్తుత శ్లేషలయందును బ్రీతిగలవాఁడని తోఁచుచున్నది. కొన్ని శ్లోకము లుదాహరించినఁ జదువువారు రెండు కావ్యములలోను భేదమును గుర్తెఱుంగుదురని చూపుచున్నాను.

"విరళా స్తాదృశా లోకే శీలసౌందర్యసంపదః,
నిశాః కియంత్యో వర్షేఽపి యా స్విందుః పూర్ణమండలః."
"స గౌరీశిఖరం గత్వా దదర్శోమాం తపఃకృశామ్,
రాహు వీతప్రభ స్యేందో ర్జయంతీం దూరత స్తనుమ్."
"యా శైశిరీ శ్రీ స్తపసా మాసేనైకేన విశ్రుతా,
తపసా తాం సుదీర్ఘేణ దూరా ద్విదధతీ మధః."
"దంతప్రభానుమనసం, పాణిపల్లవ శోభినీమ్,
తన్వీం వనగతాం లీనజటావట్చరణావలీమ్."
"స్వయంచ పల్లవాతామ్ర భాస్వత్కరవిరాజినీమ్,
ప్రభాత సంధ్యేవాస్వాప ఫలలుబ్ధే హితప్రదా."
"ఇందుకాంతముఖీ స్నిగ్ధమహానీలశిరోరుహా,
ముక్తా శ్రీ స్త్రిజగద్రత్నం పద్మరాగాంఘ్రిపల్లవా."
"అపారిజాతవార్తాఽపి నందనశ్రీ ర్భువిస్థితా,
అబిందుసుందరీ నిత్యం గళల్లావణ్య బిందుకా."
ఇత్యాదులు చూడఁగా
"యాతా స్తే సరసా రసగ్రహవిధిం నిష్పీడ్య నిష్పీడ్యయే,
వాక్తత్త్వేక్షులతాం పురా కతిపయే తత్త్వస్పృశ శ్చక్రిరే,
జాయం తేఽద్యయథాయథంతు కవయ స్తే తత్ర సంతన్వతే,
యేఽనుప్రాస కఠోర చిత్రయమక శ్లేషాది శిల్పోచ్చయమ్."
అను మంకుకుని శ్లోకము స్మరణకు వచ్చుచున్నది.

ఈ కథ నితఁ డించుక మార్చియున్నాఁడు. సంస్కృత కుమారసంభవ కథలలో లేని గణపతి జననమును పార్వతీ దాక్షాయణులు (?) కైలాస వనభూముల స్వేచ్ఛగా విహరించు గజయూధములఁ జూచి యపూర్వరతిదత్తచిత్తులై గజరూపములు దాల్చి క్రీడింపఁగా గణేశ్వరుఁ డుద్భవించెననియు, రెండవది, శరవణమను సరస్సున సప్తర్షులభార్యలు జలక్రీడ సేయుచుండ నగ్నిహోత్రుఁడు మోహించి వారల సమీపింప, వారిలో నరుంధతి తొలఁగినఁ దక్కిన యార్గురును నగ్నిఁ బురుషునిఁగా గ్రహింపక శీతాపనోదనార్థము నిరంబరలయి సమీపింప నగ్ని వారిం గౌఁగిలించి తాను ధరించి యుండిన శంభువీర్యభారమును దొలంగించుకొనెను. వారలు సద్యోగర్భంబువడసి జడిసి గర్భపిండంబుల వెలార్చి కమలపత్రంబున నిడి, ఇండ్లకు మగిడి,పతిశాపతప్తలయ్యుఁ బరమేశ్వరవీర్యధారణప్రభావంబున జ్యోతిర్లోకము సెందినట్లును మార్పులు గలిగించి యున్నాఁడు. ఈ మార్పు లీ కవి చేసినవేయని యూహించెదను. ఎట్లైన నివి మనోహరములే."

పయి విషములు సుసంగతములుగాఁ గనఁబడవు. కవి తన కావ్యమునకు దేనినిమూలగ్రంథముగా గ్రహించినాఁడుని మూల మున్నపుడుగదా కొన్ని మార్పులు చేయుట! కాళిదాసోద్భటుల కావ్యములకుఁ దెనుఁగు గాదని స్పష్టముగా సంపాదకులుమఁందుచెప్పి యున్నారు గదా. ఇది యెట్లు పొసఁగును ? ఉద్భటుని కుమారసంభవమునుండి మనకవి కొంత విషయము గ్రహింపక పోలేదు. మనకవికావ్యమునకు మూలగ్రంథము కాళిదాసకావ్యమే కావునఁ గాళిదాసకావ్య సంబంధము పరిశీలించిన తర్వాత నుద్భట కావ్య సంబంధ పరిశీలనము చేయుదము. కాళిదాసకావ్యమునకుఁ దెలుఁగు గాదనుట యాలోచనీయము. సర్వత్ర, పదమునకుఁ బదముగాఁ (ఫక్కికి ఫక్కి మక్కికి మక్కి అన్నట్లుగా) దెనిఁగింపలేదు. కాని మొత్తమునఁ గాళిదాసకావ్యమే నన్నిచోడునికావ్యమునకు మూల మని స్పష్టముగాఁ గనఁబడుచున్నది. సంస్కృత కుమారసంభవోత్తర సర్గలలోని భాగముగూడ నన్నిచోడునిచే గ్రహింపఁబడుటచేత నుత్తరసర్గలుగూడ నితఁడు చూచినట్లు స్పష్ట మగుచున్నది. కుమార సంభవోత్తర సర్గకర్తృత్వము కాళిదాసున కారోపితమైనను సవిమర్శనముగాఁ బరిశీలించినచో కాళిదాసేతరుఁడగు నెవనిచేతనో రచితమయినట్లు స్పష్టమగును. అదియు మనకవికాల మూహించుటకును గొంత తోడ్పడ వచ్చును. కావున, సంస్కృత కుమారసంభవ కర్తృత్వమును గుఱించి వివరము దెలుప వలసి యున్నది.

సంస్కృత కుమారసంభవము

సుప్రసిద్ధ మహాకవియగు కాళిదాసు రచించిన మహాకావ్యములలోఁ గుమారసంభవ మొకటి. ఆ కుమారసంభవమున నెనిమిదిసర్గలు గలవు. ఆంధ్రదేశమునను, దక్షిణదేశమునను ఇతరప్రాంతములందును ఎనిమిది సర్గలు గల గ్రంథమే సుప్రసిద్ధముగా నున్నది. పదునేడు సర్గలు గల గ్రంథ మొకటి కాశీ సంస్కృత (సీరీస్) పుస్తకమాలలో 14 వ సంపుటముగా ముద్రితమయియున్నది. అది మద్రపురమున వావిళ్ల ముద్రాలమునను ముద్రితమయినది. ఇం దన్నిసర్గలచివరనుగూడఁ గాళిదాస కృతమనియే కలదుగాని, తొమ్మిదవ సర్గ మొదలు చివరవఱకుఁగల భాగమునందున్న శైలిగాని భాషగాని వ్యాకరణప్రయోగవిశేషములుగాని పరిశీలించినయెడల మొదటి యెనిమిది సర్గలలోని భాగముతోఁ జివరభాగమునకుఁ బోలికయే కానరాదు. చివరభాగ మెవరో రచించి కాళిదాసనామము దాని కతికించినట్లు స్పష్టమగును. ఆ విషయమున కుమారసంభవ వ్యాఖ్యాతలరీతి ననుసరించి, సుప్రసిద్ధ సంప్రదాయ మెట్లున్నదో తెలిసికొనుట యావశ్యకము.

సుప్రసిద్ధ సంప్రదాయము

కుమారసంభవమున కనేకులు వ్యాఖ్యలు రచించియుండిరి. వారిలో మల్లినాథసూరి సర్వదేశ విఖ్యాతకీర్తియు సుప్రసిద్ధుఁడు నయినవాఁడు. ఆతనికిఁ బూర్వకాలముననే యనేకవ్యాఖ్య లుండెను. వానిలోఁ గొన్ని కాళిదాసభావములను బ్రకటింపఁ జాలకపోవుటయేకాక, విరుద్ధరీతిని దెలుపుచుండెనని యూహింపవలసి యున్నది. కువ్యాఖ్యావిషమూర్ఛితయగు కాళిదాసభారతిని బునరుజ్జీవింపఁజేయుటకై తాను వ్యాఖ్య రచించుచు, దానికి సంజీవిని యని పేరువెట్టినట్లు మల్లినాథుఁడు కుమారసంభవ వ్యాఖ్యా రంభమున నీ క్రిందిరీతిని "భారతీ కాళిదాసస్య కువ్యాఖ్యా విషమూర్ఛితా, ఏషా సంజీవినీ వ్యాఖ్యా తామద్యోజ్జీవయిష్యతి." అని తెలిపినాఁడు. ఆతఁడష్టమ సర్గాంతమునకే వ్యాఖ్య రచించెను. దాని తర్వాతిభాగమున్నట్లు సూచనమైనఁ జేయలేదు. మల్లినాథుఁడు పదునాల్గవ శతాబ్దియం దున్నవాఁడు. అప్పటికి నవమసర్గాదిభాగము లేదనియో, దక్షిణదేశమున సుప్రసిద్ధముగాదనియో చెప్పుటకు సందేహపడ నక్కఱలేదు.

మల్లినాథుని రఘువంశవ్యాఖ్యలో నుదాహృతమయిన నాథవ్యాఖ్యానములోని వాక్య మొకటి కనఁబడుచున్నది. రఘువంశము ౧-౩౩. శ్లో. మల్లినాథవ్యాఖ్య "నాథస్తు చతుర్విధం వృద్ధత్వమితి జ్ఞాత్వా అనాకృష్టస్యేత్యాదినా విశేషణత్రయేణ వైరాగ్యజ్ఞాన శీలవృద్ధత్వాన్యుక్తానీత్యప్యూచత్" అని కలదు. మల్లినాథునిచే స్మరింపఁబడిన నాథుఁడు అరుణాచలనాథుఁడు. ఆతఁడు రఘువంశ కుమారసంభవములకు వ్యాఖ్యానములు రచించియుండెను. అందుఁ గుమారసంభవ వ్యాఖ్యకుఁ బ్రకాశిక యనిపేరు. ఆతని వ్యాఖ్యానమునఁ గేశవస్వామినానార్థార్ణవ సంక్షేపమునుండి యొక ప్రమాణము గ్రహింపఁబడెను. నానార్థార్ణవ సంక్షేపకర్త క్రీస్తుశకమున ద్వాదశ శతాబ్దియందలివాఁడు అని నిర్ణయింపఁ బడినది.

కేశవస్వామి నుదాహరించుటచేఁ బండ్రెండవ శతాబ్దికి దర్వాతివాఁడనియు మల్లినాథునిచే నుదాహృతుఁడగుటచేఁ బదునాల్గవ శతాబ్దికిఁ బూర్వుఁడనియు భావింపఁబడు నరుణాచలనాథుఁడు (అరుణగిరి నాథుఁడు) కుమారసంభవమునకు వ్యాఖ్య రచించి, యష్టమసర్గాంతిమశ్లోకవ్యాఖ్యాంతమున రచించిన [1]శ్లోకమును పరిశీలించినచో వ్యాఖ్య పూర్తి యయినదని స్పష్ట

1. "యేవాక్యార్థ విచార కర్కశధియో యేవా రసస్రోతసి
స్వేచ్ఛామజ్జనకేళిషు వ్యసనినో యేవా శివా (శివే?) సంశ్రితాః
తే నిర్మత్సరసావధానమనసో మత్కాంమనోహారిణీం
సంగృహ్ణంతు కుమారసంభవసముద్యోతాయ టీకా మిమామ్."

మగును. ఇతరసర్గవ్యాఖ్యాంతమున శ్లోకము రచించు నలవా టాతని కున్నట్లు కనఁబడదు. ప్రారంభమున 'రఘువంశమునకు వ్యాఖ్యరచించి యుంటిని. కుమారసంభవమునకుఁ గూడ వ్యాఖ్యరచించెద' నని ప్రతిజ్ఞ తెలుపుటకు [2]శ్లోకములు రెండు రచించినాఁడు. అంతియగాక కుమారసంభవమునఁ గార్యమేమియని యాశంకచేసికొని తారకవధమా ? కుమారోత్పత్తియా ? అను విషయము సయుక్తికముగ విమర్శించి కుమారోత్పత్తి యని సమర్థించి తారకాసుర వధాంతకథ కవి చికీర్షితము గాదని నిర్ణయించినాఁడు. అష్టసర్గభాగమే కుమారసంభవమని యాతని నిర్ణయము. కావున నరుణాచలనాథుని కాలమగు పదుమూఁడవ శతాబ్దికిఁ గుమారసంభవ మష్టసర్గమే యనుట నిర్వివాదము.

అరుణాచలనాథుని ప్రకాశికకు వివరణరూపమగు వివరణాఖ్యవ్యాఖ్య రచించిన నారాయణపండితుఁడు ఇంచుమించు మల్లినాథసూరికిఁ బ్రాంతమందుండియుండును. ఆతఁడు తన వ్యాఖ్యారంభమునఁ గుమారసంభవ నామౌచిత్యమునుగుఱించి యాశంకచేసికొని యితరవాదములు పరిహరించి కుమారసంభవాంతకథయే కవిచికీర్షితమనుట మిక్కిలి సమంజసమని సమర్థించినాఁడు. కుమారోత్పత్తి పార్వతీ పరమేశ్వరుల సంభోగరీతి వర్ణించుటచే నుపక్షిప్తమయినది గానఁ గుమారోత్పత్తి తెలుపు నీ గ్రంథమునకుఁ గుమారసంభవనామమే యుచితమని సవిమర్శముగా సిద్ధాంతము గావించినాఁడు. ఆతని కాలమునకుఁగూడ నెనిమిది సర్గలే కుమారసంభవకావ్యమునఁ గలవనుట నిశ్చయము. కాని, యాకాలమున నీక్రింది ప్రతీతి గలదనితోఁచుచున్నది. కాళిదాసు తారకాసురవధాంతకథ రచింపఁ దలఁచి యష్టమసర్గమునఁ బార్వతీ పరమేశ్వరసంభోగము వర్ణించుటచేఁ బార్వతి కోపమొంది శాపమిచ్చెననియు దాననే గ్రంథ మంతటితో నాఁగిపోయెననియుఁ గొందఱు చెప్పుకొనుచుండిరి కాఁబోలు. వివరణ వ్యాఖ్యాకర్తయగు నారాయణపండితుఁడు ఆ భావము గుమారసంభవోద్ధృత శ్లోకముల నుదాహరించుచు ఖండించి కాళిదాసచికీర్షిత మష్టమసర్గస్థ కథాంతమే యని సిద్ధాంతము చేసినాఁడు.

మొత్తముమీఁదఁ గుమారసంభవ మష్టసర్గమే యని పూర్వసంప్రదాయము తెలుపుచున్నది.

---

2. "రఘువంశే మహాకావ్యే విమృశ్యరససంపదమ్,
కాళిదాస కవీంద్రస్య జ్ఞాతాస్వాదేన సూక్తిషు.
అరుణాచలనాథేన ద్విజపాదాబ్జ సేవినా
కుమారసంభవాఖ్యేపి మయా టీకా వితన్యతే."

పదునేడు సర్గలు గల గ్రంథమొకటి కనఁబడుచున్నదిగదా. అందలి నవమసర్గాది సప్తదశ సర్గాంత భాగము పరిశీలించినచోఁ గాళిదాసకృతముగాదని స్పష్టమగును. 'కీత్' [1]మొదలగు ఆంగ్లవిమర్శకులు నట్లే యభిప్రాయపడిరి. జాకోబి అను విమర్శకుడు "నవమసర్గాది కుమారసంభవభాగమునందు అంతే అనుపదము సప్తమీవిభక్తి ప్రత్యయముగా వాడఁబడెను. [2]అంత అనునది మహారాష్ట్ర భాషలో సప్తమీవిభక్తి ప్రత్యయము. ఈభాగమున నది తఱచు ప్రయోగింపఁ బడినది. కాళిదాసు పేర మహారాష్ట్రుఁడొకఁడు రచించియుండు" నని వ్రాసినట్లు కీతుపండితుఁడు వ్రాసినాఁడు. నవమసర్గాదిభాగము పరిశీలింతము. 13—8-'నభోంతే' 15—41-'వనాంతే' మొదలగుచోట్ల 'అంత' శబ్దము ప్రాయికముగా నుపయుక్తము. అచట 'అంతే' అనునది కేవలము సప్తమీవిభక్త్యర్థమును తెలుపుననుటకంటె మధ్యమందు (లోపలి భాగమున) లేక ప్రదేశమున అనునర్థమును తెలుపుననుట యుక్తము. ఆభాగము రచించిన కవియే (14—27) 'మహాగుహాంత ప్రతినాదమేదురైః', (14—18) 'అద్రితటాంత చారిణా' (14—29) 'గుహాగృహాంతాత్' ఇత్యాది స్థలములందుఁ బైయర్థములందు 'అంత' శబ్ద ముపయోగించుట గనఁబడుచున్నది. ఆ కవికి అంతశబ్దోపయోగ మభ్యస్తము. ఆ కారణమున మహారాష్ట్రరచితమని చెప్పుటకు ధైర్యము చాలదు గాని మహారాష్ట్రరచితమనుట కితర కారణములు కొన్ని కనఁబడుచున్నవి. అందు ముఖ్యమగు నదొకటి పరిశీలింతము.

"అనన్యసాధారణ సిద్ధ ముచ్చై
స్తద్దైవతం ధామ నికామరమ్యమ్,
కస్మాదకస్మా న్నిరగా ద్భవద్భ్యః
చిరార్జితం పుణ్య మివాపచారాత్ "

దీనికి వ్యాఖ్యాన మిట్లున్నది:—

"దైవతం ధామ స్వర్గ మకస్మాత్ సహసైవ కస్మాద్ధేతోః భవద్భ్యోఽపచారా త్పాపా ద్ధేతోః చిరార్జితం బహుకాలోపార్జితం పుణ్య మివ

(1) He is so fond of the superfluous anta at the end of compounds—which we have seen in Vatsabhattia—that Jacobi has canjcetured that he was a Maratha, in view of the Maratha locative ānta.—History of Sanskrit literature, A. Berriedale Keith D. C. L.,D. Litt.

2. అంత అనుమహారాష్ట్రభాషాసప్తమీవిభక్తి ప్రత్యయము అకారాంతముగా వ్రాయఁబడినను 'ఏ' కారాంతముగాఁ బలుకఁ బడును.

నిరగాత్ నిర్గతమ్. "తుర్ఘాంపానూన స్థల కసేం జాహావే" ఇతి లోకో క్తిరీతి రను సంధేయా" అని కలదు. దీనినిబట్టి ఈవ్యాఖ్యాత మహారాష్ట్రుఁడనియు మూల కర్తయు మహారాష్ట్ర సంప్రదాయానుసారివాక్యాన్వయము గూర్చినవాఁ డనియు నూహింపవచ్చును.

ఇంక నష్టమసర్గానంతరభాగమునఁ గల ప్రయోగములు పరిశీలించిన యెడలఁ గాళిదాసకృత మనుట కవకాశము గనఁబడదు. కొన్నిచూతము:

12—36 'పరిత్యజధ్వం'—'పరిత్యజత' అనవలెను. అది పరస్మైపద ధాతువు. ఆత్మనేపదప్రత్యయము చేర్చుట తప్పు. వ్యాఖ్యాత "ఆత్మనేపదం చింత్యమ్" అని వ్రాసెను. 10—11 'మద్విగ్రహ మధి న్యధాత్'—'అధిమ ద్విగ్రహమ్' అనవలెను. ఇట వ్యాఖ్యాతలలో నొకఁడు "మహాకవి ప్రయోగా న్న దోషాయ" అనియు, మఱొకఁడు "కవే ర్నిరంకుశత్వాచ్చ సమాధేయః" అనియు సరిపెట్టుకొనిరి. 11—13 'శర స్తంబ మధి' ఇదియుఁ బైదానివంటిదే. 12—8 'అధిష్ఠితం సంసది రత్నమయ్యాం' 'రత్నమయీం సంసద మధిష్ఠితమ్' అనిద్వితీయాకారక ముపయోగింపవలెను.అందుఁబదౌచిత్యమునుగూడఁ గొంత తక్కువ. దేశ్యానుసారిగా గనఁబడును. దాని కొకయుదాహరణము చూతము. 11—29 'నేత్రసుధైక సత్రం పుత్రమ్' ఇట వ్యాఖ్యాత "సుధాయాః అమృతస్య ఏకం సత్రం సదాదానం. నేత్రయోః సంబంధి సుధైకసత్రం యేన నేత్రయో రమృతవత్ సుఖదాతార మిత్యర్థః" అని వివరించెను. మఱొక వ్యాఖ్యాత "నయనామృ తైకదానమ్" అని రచించెను. అనుశీలన కర్తలు పొరఁటచివర "నేత్రసుధైకపాత్రం" అనిచేర్చిరి. పైవ్యాఖ్యాతల పాఠమున నేత్రసుధైకసత్రమ్ అనియే పాఠముఁ గలదు. పుత్రునికి విశేషణ ముగాఁ 'నేత్రసుధైకసత్రమ్', అని ప్రయోగించుట కాళిదాస రీతికాదు.

పాదపూర్తికై చేర్చిన పదములు అలమ్, సద్యః, సు మొదలగునవి చూచినచో నెవ్వరును గాళిదాసకృత మన నొప్పరు. అలమ్-10-45; 16-3; 16-28; 16-51; 17-3; 17-37; సద్యః 13-14; సు. 9-32. "సుసంపదా" 10-32 "సుదంతుర" 10-40 "సుదుర్విషహమ్" 10-44 "సుస్నాతానామ్" 13-47 "సుదేవతానామ్." 14-13 "సుచారు" ఇట్టివి శతాధికములు గలవు. వీనిలోఁ గొన్నిచోట్ల నౌచిత్యభంగముగూడఁ గలదు. మొత్తముమీఁద ఛందోవ్యాకరణాది విషయములను బరిశీలింపఁగా నది కాళిదాసకవిత్వ మను టకు మన సొప్పదు.

రసవిషయము

మఱియు, మహాకావ్యమునకుఁ బ్రధానమగు రసమునుబట్టియుఁ దత్పోషణమునుబట్టియు విచారించినచో నష్టమసర్గాంతమే మహాకవికృత మని చెప్పవలయును. లేకున్నచో రసభంగము వాటిల్లును. కుమారసంభవమహాకావ్యమందుఁ బ్రధానరసము శృంగారరసమా? దయావీరరసమా? అను వివాదమున కవకాశము లేకపోలేదు. కాని, ప్రకృతమున శృంగారరస మని భావించి పరిశీలింతము. దయావీరరస మన్నను ప్రకృతవిషయమున సమానమేయగును.

పార్వతీ పరమేశ్వరులు ప్రధాననాయకులు. అందుఁ బార్వతి పూర్వజన్మమున సతీదేవి. పితృకృత మగు భర్త్రవమానము సహింపలేక శరీరత్యాగము గావించినది. ఆమెవియోగముచే విరక్తుఁడయి తపము గావించుచుండుపరమేశ్వరుఁడు నాయకుఁడు. పార్వతికి శివునియందుఁ బ్రథమానురాగముగలిగినది. ఆమె శివునికిఁ బరిచర్య చేయుచుండ నాతనికిని మనోవికారము గలిగినది. వారి యనురాగము పెంపొందెను. లోకానుసరణమునఁ బెద్దల యనుమతిచేఁ బరిణయ మయ్యెను. పాణిపీడనానంతరము వారు కామకేళీరతులయి సుఖ మనుభవించుచుండిరి. ఈశ్వరుఁడు పార్వతీ రతిలోలుఁడయ్యె. ఇది కథాసారము. ఇందు శృంగారరసము అంకురితమై పల్లవితమై పుష్పితమై, ఫలిత మైనది. ఇంక ముందుకథ యేమి చెప్పినను రసభంగమే యగును. పార్వతీపరమేశ్వరసంయోగ మధ్యమున విఘ్నము గలిగెను. తద్వీర్యమే కుమారరూపము దాల్చుటచేఁ బార్వతీగర్భము వర్ణించుటగాని, కుమారజననము వర్ణించుటగాని యావశ్యములు గావయ్యె. కావునఁ గాళిదాస మహాకవి పార్వతీపరమేశ్వరులసంయోగము చెప్పుటచేఁ గుమారోత్పత్తి ప్రోక్తప్రాయ మని యెంచి సంయోగవర్ణనముతోనే పరిసమాప్తి గావించి, కుమారసంభవనామ మీ మహాకావ్యమున కుంచినాఁ డని యెంచఁదగును.

అష్టమసర్గానంతరభాగమునఁ గల కథాంశమును, రసపోషణమును గమనించినచో వీరరసమునఁ గుమారస్వామిశౌర్యవర్ణనమును, చిట్టచివర నింద్రునకు స్వర్గాధిపత్యలాభమును గనఁబడును. మొదటఁ బ్రధాననాయకులుగా గ్రహింపఁబడిన పార్వతీ పరమేశ్వరులప్రసంగముగాని, ఆదిని ఎత్తుగడచేసిన శృంగారరసమును స్పృశించుటగాని కానరాదు. అష్టమసర్గాంతభాగము శృంగారరససంపూర్ణము. తర్వాతిది వీరరసయుక్తము. అంగాంగిభావము సమర్థింప యత్నించుటకైనను వీలులేదు. పరస్పర సంబంధము లేకుండఁగ నున్నవి. రసప్రధానమహాకావ్యము రచించు కాళిదాసమహాకవి యిట్లు రచించునా? కాళిదాసచికీర్షితము అష్టమసర్గాంత మనుటయే సరసము.

నన్నిచోడ మహాకవి తారకాసుర వధాంత కథ గ్రహించినను, తాను గూర్చిన కూర్పును బట్టి ప్రధానముగా నెత్తినశృంగారరసమునకుఁ బ్రాధాన్యము చూపించి, వీరరసమును గౌణము గావించినాఁడు. అది నన్నిచోడ మహాకవి రసపోషణ పద్ధతిఁ జూచిన స్పష్టమగును.

కాళిదాసే ద్వాదశసర్గరచయిత యయినచోఁ దాను ద్వితీయసర్గలోఁ జెప్పిన తారకునివలని బాధలను మరల నట్టి వర్ణనలతోనే ద్వాదశసర్గలో రచించునా ? అది నన్నిచోడుఁడు గమనించియే కాఁబోలు ద్వాదశసర్గలోని భావములుగూడ రెండవసర్గలోని కథాభాగమునను పదించినపుడు గొంచెము గలిపివేసి ద్వాదశసర్గకథ నొకపద్యముతోఁ గొట్టివేసినాఁడు.

పార్వతీపరమేశ్వరసంయోగాంతకథయే కాళిదాసచికీర్షిత మైనచోఁ గుమారసంభవ మని పేరుపెట్టుటకంటె మఱొకపేరు పెట్టియుండునేమో యను సందేహము గలుగుట కవకాశము లేకపోలేదు. కాని పైని చెప్పినట్లు గర్భధారణ దౌహృదలక్షణాదులు వర్ణించుట కవకాశము లేదు గావునను, వారి సంయోగమునకు ఫలితము కుమారోత్పత్తియే కావునను కుమారజననము స్పష్టపఱచినట్లే కవి యెంచియుండును. కుమారసంభవవ్యాఖ్యాతలయినయరుణగిరినాథ నారాయణపండితులు చెప్పినట్లు పార్వతీపరమేశ్వరసంయోగవర్ణనమునఁ గుమారోత్పత్తి యుపక్షిప్త మయినదని గ్రహించుటయే సహృదయాదరణీయమును, సంప్రదాయసిద్ధమును నయి యున్నది.

దీనికి శ్రీ మహామహోపాధ్యాయ కుప్పుస్వామిశాస్త్రులువారు ప్రసంగవశమునఁజెప్పినసమర్థన మొకటి గలదు. అది శాస్త్రీయమార్గానుసారము. అదెట్లంటే, పార్వతీ పరమేశ్వరులు కుమారుని జననము నిమిత్తము కలియుటయే కుమారసంభవము అనుపదమున కర్థము. సంభవ మనఁగా సంయోగము (సమావేశము) అని పూర్వసంప్రదాయసిద్ధార్థము. గర్భాధానాది సంస్కారముల ప్రణాళికను విధించు గృహ్యసూత్రములలో దంపతులు సంయోగము చేయవలెను అనుదానిని తెలుపుటలో సంయోగశబ్దమునకుఁ బర్యాయముగా సంభవము అను పదము గలదు.

ఖాదిర గృహ్యము—౧-౪-౧౬ "సంభవే ద్గర్భం ధేహీతి;" దానికి రుద్రస్కందవృత్తి "సమ్యగాలోచ్య ముహూర్తాది మిథునీభవేత్" అని కలదు.

గోభిలీయగృహ్యసూత్రము— ౨ ప్ర. ౫-౫౦-౯ "దక్షిణేన పాణినోపస్థ మభిమృశే ద్విష్ణు ర్యోనిం కల్పయి త్వేత యర్చా గర్భం ధేహి సినీవాలీతిచ" ౨ ప్ర. ౫౫౦-౧౦. "సమాప్యర్చా సంభవతః" "సమాప్య సంభవత ఏవ నేతరత్ కుర్యాత్"—అని వ్యాఖ్య.

పైవాని ననుసరించియే కాంబోలు వాచస్పతి యీ క్రిందిరీతిని దన సంస్కృత నిఘంటువునఁ జేర్చినాఁడు. "సంభవ—(సంభూ + అప్) ఉత్పత్తౌ; ఆధేయస్యాధారే; సమావేశనయోగ్యత్వరూపే వ్యాపారే." వామనశివరామ ఆప్టే అనునిఘంటుకర్త తనసంస్కృతాంగ్ల నిఘంటువున 'సంభూ' అను ధాతువు క్రింద [1]రతియందుఁ గలియు అనునర్థము చూపినాఁడు. గృహ్యాములలోఁ గ్రియారూపముననే యీ యర్థము గనఁబడుటచేతఁ గాంబోలు క్రియకాయర్థము చూపినాఁడు. విశేష్యమున కాయర్థము చూపలేదు.

సంపూర్వకభూధాతువు సంయోగవాచి కలదు గాన సంభవశబ్దము సంయోగపర్యాయముగా నుండవచ్చును. కుమారార్థమగుసంభవము కుమారసంభవము అనునర్థము చెప్పుట శాస్త్రసమ్మతముగానే యుండును. కాని యీపదమున కాయర్థమున సుప్రసిద్ధ ప్రయోగములు గావ్యప్రపంచమున లేకుండుటచేతను, కుమారార్థమగు సంయోగ మని యన్వయము ఝుడితిస్ఫూర్తికి దూర మగుటచేతను సాహిత్య సారస్యలోలుర కది యంతసరసముగాఁ గనఁబడక పోవచ్చును. కాళిదాసశైలిలో నామకరణముననే యట్టి క్లిష్టత యుండునా? సంయోగ మనఁగనే యెవరిసంయోగము అను నాకాంక్ష గలుగును గాని, ఎవరినిమిత్తము సంయోగము అనునాకాంక్ష గలుగునా? అని వితర్కించువారి కిది రుచింపక పోవచ్చును. శాస్త్రీయమగు సమర్థనము గానఁ బ్రదర్శింపఁబడినది.

ప్రకృతమునకు వత్తము. మొత్తముమీఁదఁ గాళిదాస కుమారసంభవ మష్టసర్గమే యను సిద్ధాంతము గ్రహింపవచ్చును. కొందఱు సప్తసర్గభాగమే కాళిదాసరచిత మందురు. అది విచారసహము గాఁజాలదు. శాఖోపచంక్రమణమేల?

**సంస్కృతాంధ్ర కథల సామ్యము**

మహాకవియగు కాళిదాసు రచించిన కుమారసంభము నాధారముగాఁ గొని నన్నిచోడదేవమహాకవి రచించిన ప్రబంధరీతిఁ బరిశీలింతము:

సం. కు. సం. ౨౦ శ్లో॥ అథావమానేన పితుః ప్రయుక్తా దక్షస్య కన్యా భవపూర్వపత్నీ । సతీ సతీ యోగవిసృష్టదేహా తాం జన్మనే శైలవధూం ప్రపేదే॥ అను శ్లోకములోని భావమున [2]ననుసంధానము చేసికొనవలసిన సతీ

---

1. 'సంభూ...8. to have sexual intercourse with.' The Practical Sanskrit Dictionary by Vaman Shivaram Apte, M. A.

2. మల్లినాథవ్యాఖ్య: "పురాకిల సతీదేవీ దక్షాధ్వరే తత్కృతాం స్వభర్తృవిజ్ఞా మసహమానా పితరం ప్రసూం చోపేక్ష్య మత్కర్తవ్యం త్వ జ్ఞామాత్రైవ కరిష్యతీతి నిర్ధార్య

K—6

దేవీవృత్తాంత మత్యావశ్యక మని యెంచియుఁ బ్రధాననాయికానాయకు లగు పార్వతీపరమేశ్వరుల పూర్వప్రేమ తద్వియోగకారణములు తెలిపి వారి ప్రేమాతిశయము చూపి ప్రధానరసమును బోషింపఁదలఁచియు "సతి జన్మంబున్ గణాధీశ్వరు జననము, దక్షక్రతు ధ్వంసమున్" మొదటి రెండాశ్వాసముల యందును నన్నిచోడకవి ప్రబంధించినాఁడు.

ప్రథమాశ్వాసకథ—ప్రకృతి స్వరూపమగు నాధారశక్తి దక్షునకు వరమిచ్చిన ప్రకారము తత్పుత్త్రికయయి సతీనామముతో వర్ధిల్లి పరమేశ్వరునకుఁ బత్ని యయ్యెను. సతీపరమేశ్వరులు కైలాసముమీఁద విహరించుచుండిరి. అచటఁ గామకేళీలాలసములగుకరికరేణువులను సతీదేవి చూచి తాదృశసుఖాభిలాషతోఁ గరిణీరూపము నొందెను. శివుఁ డామెభావ మెఱిఁగి కరిరూపము నొంది యామెను సంతోషపఱచెను. అంత నామెకు సద్యోగర్భమున గజాననుఁ డుదయించెను. నిజస్వరూపము నొందిన శివశక్తులు కుమారునిఁ జూచి యానందించుచుండిరి. పరమేశ్వరపుత్త్రుఁడు గజాననుఁ డగుటకుఁ [1]గారణములు పురాణములలో వేఱువేఱు రీతులఁ గలవు. ఏరీతి పురాణములందుఁ గనఁబడలేదు. మళయాళ రామచరితయందు విఘ్నేశ్వర [2]స్తవమునఁ 'గరికరేణురూపములుదాల్చిన పార్వతీపరమేశ్వరుల కుజన్మించిన గజాననుఁడా' యని కలదు.. పర్వత ప్రాంతములను గజములుండుట సుప్రసిద్ధము. గిరిశుఁడును గిరీశుఁడును నగుశివునిఁ దత్పత్నిని గరికరిణీరూపులఁగాను దత్పుత్త్రుని గజాననునిగాను బర్వతప్రాంతమువారు భావించుట సహజమేకదా. మన నన్నిచోడకవి యాసంప్రదాయము ననుసరించి యీ భాగము రచించెను. ఈ యాశ్వాసమున ౧౩౫ గద్యపద్యము లున్నవి.

ద్వితీయాశ్వాసము—పరమేశ్వరుఁడు గజానను నెత్తికొని యాడించుచు సతీదేవిని నవ్వించుచుఁ దాను నవ్వుచున్న సమయమున దక్షుఁ డల్లుఁడైనశివునిఁ జూడవచ్చి దురభిమానమున శివునకు నమస్కరింపఁడయ్యె. దానిచే శివుఁ డాతనియెడఁ బరాఙ్ముఖుఁడయ్యెను. దక్షుఁడు మనమున క్షుబ్ధుఁడయి

దేవ శార్యాణి సాధయితుంచ యోగాగ్నినా స్వశరీరం దదాహేతి పురావృత్తకథానుసంధేయా:" శిశుహితైషిణీ వ్యాఖ్యా. "పురాకిల దక్షో యజ్ఞోత్సవే స్వత్రిణో జామాతౄన్ సర్వాన్నిమంత్రయామాస నచ శంభు మితి రుష్టా సతీదేహం త్యక్త్వా మేనాగర్భేయయావితి పురాణప్రసిద్ధిః."

1. పార్వతి ద్వారపాలకునిగ నుంచిన నలఁగుపిండిబొమ్మతలనుశివుఁడు నఱికి పార్వతీప్రార్థనమున మరల జీవింప జేయునపుడు గజము తల నతికించెనని ప్రసిద్ధి. 2. శాననజ్జళరన్ కళిరుమాయ్ కరిణియాయ్, శాల్ నడుజ్జియుమ తమ్మిల్ విళయాడి నటన్న, న్నాననం పడివుళ్లానవ వడివాయవతరి, త్తాతియే నల్లవినాయక నే నోమ్మరమలనే.

యింటికిఁబోయి తనపత్నితోఁ జెప్పి యీశ్వరునకుఁ బరాభవముఁ జేయఁదలఁచి యాగమొకటి తలపెట్టి యందఱ నల్లురను బిలిపించి శివునిఁ బిలిపింపలేదు. పైపెచ్చు తనయాగవైభవముఁ జూడ సతినిఁ బిలిపించెను. సతి తనతండ్రి తన ప్రియునిఁబిలుచుటకు భయపడియుండునని తలఁచి "తండ్రీ! పరమేశ్వరుఁడు భక్తవత్సలుఁడు నీవు పిలిచితే రాఁడా" యన నతఁడు దురభిమానమున శివుని దూషించెను. సతీదేవి పితృకృత నిజపతిదూషణము వినఁజాలక యోగాగ్నిచే శరీరము దగ్ధము గావించుకొనెను. శివుఁ డావార్త విని దక్షాధ్వర ధ్వంసము చేసి తుదకు శరణుసొచ్చినదక్షు ననుగ్రహించెను. ఈవిషయము ౩, ౧. (136) మొ. ౩, ౧౦౮. (243) వఱకుఁగలదు. పై రెండాశ్వాసములందలి కథయుఁ గాళిదాసు సూచించి విడిచెను.

ప్రథమసర్గ విషయములు—హిమవద్వర్ణమును, "పార్వతి జన్మంబును, భవ్యోగ్ర వ్రతచరితయు" పార్వతి శివపరిచర్య చేయుటయును. ఇవి ఆంధ్ర కుమారసంభవమునఁ దృతీయా శ్వాసమున ౧౧౩ గద్యపద్యములలో (244 మొదలు 356 వఱకు[1]) ఛాయారూపముగఁ గనఁబడును.

ద్వితీయసర్గ విషయములు—దేవతలు తారకాసురబాధితులై బ్రహ్మ దర్శనమున కేగి, తమ బాధ లెఱిఁగించుటయు, నాతఁడు తద్వధోపాయంబు విచారించి పార్వతీపరమేశ్వరుల వీర్యమున నుదయించు కుమారుఁడు తారక సంహారముచేయును గాన, పార్వతియం దీశ్వరునకుఁ బ్రేమము గలిగించు సాధనము చూడుఁ డని యింద్రాదుల కుపదేశించుటయును. ద్వితీయసర్గ కథ తెనుఁగున (357) మొ. (387) వఱకుఁ గల ముప్పది గద్యపద్యములలోఁగవి యిమిడ్చినాఁడు.

తృతీయసర్గవిషయములు—ఇంద్రుఁడు మన్మథునిఁ దలఁచుటయు నాతఁడు ఈశ్వరునిఁ గామలోలునిఁ గావింపఁ బ్రతిజ్ఞసేయుటయుఁ దత్ప్రియత్నమును, మన్మథదహనము, హిమవంతుఁడు వివశయగుపార్వతినిఁ దీసికొని నిజగృహంబునకుఁ బోవుటయును. ఇవి తెనుఁగున ౪,౩౨. (389) మొదలు ౫, ౫౬. (536) వఱకుఁ గల భాగమునఁ బ్రతిపాదింపఁబడినవి.

---

1. ప్రకృతము ముద్రితమయిన పుస్తకము రెండు భాగములుగా నున్నది. అందు గద్య పద్యసంఖ్య యాశ్వాసములనుబట్టి కాక మొదటిభాగమందున్న యేడాశ్వాసములలోను మొదట నుండి ౫౯౬ గద్య పద్యములుగాను, రెండవభాగమందున్న యెనిమిదవ యాశ్వాసమునందలి మొదటిపద్యము మొదలు పండ్రెండవ యాశ్వాసము చివరవఱకు ౧౦౧౯ గద్యపద్యములుగాను ఏర్పఱుపఁబడినది. ఆశ్వాససంఖ్యయుఁ బద్యసంఖ్యయుఁ జూపినతర్వాతఁ బ్రకృత లభ్య పుస్తకానుసారమగు సంఖ్య కుండలాకారచిహ్నమధ్యమున నాంగ్లాంకములలోఁ జూపఁబడినది. మొదటి భాగమునకు భాగసంఖ్యవేయలేదు. రెండవ భాగమునకు మాత్రము భాగసంఖ్య వేయఁబడినది.

చతుర్థసర్గవిషయములు—రతీవిలాపము, రతీదేవి చితాప్రవేశ యత్నము చేయుట, ఆకాశవాణి పలుకుట, దానిచే భర్తృపునరుజ్జీవనాశతో రతి జీవించియుండుటయును. ఇవి తెనుఁగున ౫, ౫౭. (537) మొ. ౫-౧౦౪, (583) వఱకుఁ గల భాగమున గ్రహింపఁబడినవి.

పంచమసర్గవిషయములు—పార్వతీవిరహము, ఆమె తపస్సు చేయుట, పరమేశ్వరుఁడు కపటవటువేషము ధరించి వచ్చి పార్వతి నధిక్షేపించుట, ఆమె ప్రేమభక్తులఁ బరీక్షించి సంతసించి నిజస్వరూపము చూపి "అద్యప్రభృత్య వనతాంగి తవాఽస్మిదాసః క్రీత స్తపోభిః" అని నిజభావము ప్రకటించుట యును. ఇది తెనుఁగున ౫, ౧౦౪. (583) మొదలు ౬, ౭౯.(909) వఱకుఁ గల భాగమున సరసముగా స్వీకరింపఁబడెను. ఆఱవ సర్గలోని మొదటి మూఁడు శ్లోకముల భావము పై భాగముననే గ్రహింపఁబడినది. ఆశ్వాసాద్యంతము లందుఁ గృతిపతియగుగురుని శివునితో నభిన్నునిఁ జేసి వర్ణించుట కను వగునట్లు మార్పు చేయఁబడెను.

షష్ఠసర్గవిషయములు—ఈశ్వరుఁడు సప్తఋషులను స్మరించి రప్పించి కన్యావరణమునకై హిమవంతునియొద్దకుఁ బంపుటయు, వారు కృతార్థులయి తిరిగి వచ్చి పరమేశ్వరునకుఁ దెలుపుటయును. ఇవి తెనుఁగున ౬, ౮౫. (914) మొదలు ౬, ౧౬౦. (990) వఱకును అష్టమాశ్వాసమున ౧౮ వ పద్యము వఱకును గలవు. ఇందలి హిమవదాది వర్ణనము కొంత ప్రథమసర్గభాగమునుండి గ్రహింపఁబడినదే. కొంచెమించుమించుగా సంస్కృతకుమారసంభవషష్ఠసర్గాంతమువఱకుఁగల భాగమును, ఆంధ్ర కుమారసంభవ సప్తమాశ్వాసాంతము వఱకుఁగల భాగమును సరిపడియున్నవి.

సప్తమసర్గ విషయములు—ఈశ్వరుఁడు పెండ్లికై దేవతలతోఁ దరలి హిమవంతుని గృహంబునకు వెడలుటయు, అందు లోకరీతిని, శాస్త్రరీతిని వివాహమహోత్సవము జరుగుటయు మన్మథునిపునరుజ్జీవనమునకు నింద్రాదుల కనుజ్ఞయొసఁగి యీశ్వరుఁడు పార్వతీ సహితుఁడై యుండుటయును. ఇవి తెనుఁగున, ౮,౧౯. (II, 19) మొదలు ౯, ౧౪౪. (II, 343) వఱకుఁ గలవు. ఇందు జలక్రీడా మధుపానగోష్ఠీవివాహోత్సవవిశేషము లదనముగా వర్ణింపఁబడినవి. అష్టమసర్గమందుఁ జెప్పఁబడిన మధుపానప్రసంగము చక్కఁగా మార్చి యిందుఁ జేర్చినాఁడు. కాళిదాసు పరమేశ్వరు నంత వానిని గామలోలునిఁ గావించినాఁడు. సంగమకాలమున నున్మాదము గలిగించు మధుపానము పరమేశ్వరుఁడు పార్వతిచేఁ జేయించినట్లు కాళిదాసు రచించెను. నన్నిచోడుఁడు మధుపానగోష్ఠి నచ్చటివారిలోఁ గొందఱకే కల్పించెను.

పార్వతికి మధుపానప్రసక్తి గలిగించుట మన శైవమహాకవి కిష్టమయి యుండదు గదా!

అష్టమసర్గవిషయము—పార్వతీపరమేశ్వరులసంయోగవర్ణనము. ఇందు కామశాస్త్ర లోకానుభవముల ననుసరించి దంపతుల శృంగారచేష్టా విశేషములు వర్ణింపఁబడినవి. ఇది తెనుఁగున ౯, ౧౮౪. (II, 345) మొదలు ౯, ౧౯౭. (II, 356) వఱకుఁ గల పది పండ్రెండు పద్యములలో నిమిడ్చివేయఁబడినది.

మొత్తముమీఁద మూఁడవ యాశ్వాసము (I వ భాగమున 244) మొదలు నవమాశ్వాసముచివర (I, 996 వఱకును, II, భాగమున మొదటి 365) వఱకును గల ౧౩౬౧ పద్యగద్యములుగల భాగమున: కుమారసంభవ మష్టసర్గ భాగము మనకవి సరసముగా స్వతంత్రముగా జాతీయ రీతిని ప్రబంధ బంధురంబుగ నిబంధించినాఁడు. కొంచెమించుమించుగా సర్గ భాగమొకయాశ్వాసమునకుఁ గిట్టును. కాని యాశ్వాస విభాగములు చేయుటలో నన్నిచోడునికిఁ గల నియమ విశేషమునుబట్టి కొంచెము భేదము పాటింప వలసివచ్చినది. ఆతని నియమవిశేషమును ఆశ్వాసాద్యంతములరీతి యను శీర్షికక్రింద వివరింపఁబడును. సంస్కృతమున నితర కృతమగుభాగమునఁ దొమ్మిది సర్గలును, తెనుఁగున మూఁడాశ్వాసములును మిగిలియున్నవి. వానిని దర్వాతఁ బరిశీలింపనగును.

ఇంతవఱకుఁ గల కథాసంవిధానమున వర్ణనాదులయందును, భావనా విశేషములందును, సంస్కృతాంధ్ర కుమారసంభవముల కెంత సంబంధము గలదో తెలిసికొనుటకుఁ గొన్ని యుదాహరణములు పరిశీలింతము.

| కాళిదాస కుమారసంభవ | నన్నిచోడ కుమారసంభవ |
|---|---|
| శ్లోకములు. | పద్యములు |
| అనూత సానాగవధూపయోగ్యం<br>మైనాక మంభోనిధిబద్ధసఖ్యమ్,<br>క్రుద్ధేపి పక్షచ్ఛిది వృత్రశత్రా<br>వవేదనాజ్ఞం కులిశక్షతానామ్. ౧, ౨౦. | క. మేనకకు నాహిమాద్రికి<br>మైనాకనగంబు పుట్టె మణికనకమయా,<br>ఖానూన భాపహాసిత<br>భానుద్యుతి విదితదివిజ పతిగిరిషేర్మిన్.<br>౩, ౨౦. (263) |
| | వ. ఇట్లుదయించిన మైనాకనగంబు కులిశ కులిశపాతభీతిం బయోనిధినిమగ్నుం బైన నపగత పుత్రావలోకనసుఖతత్పరులై చింతించి. ౩, ౨౧. (264) |
| | క. వారిరువురు సద్విధి శ<br>క్త్యారాధనసేసి రతిశయస్థిరభక్తిం<br>గోరికవదలక తమకడు<br>పారసతీదేవి కూఁతురైజన్మింపన్.<br>౩, ౨౨. (265) |

వై శ్లోకమున "మేనక మైనాకునిఁ గన్నది. అతఁ డంభోనిధి బద్ధసఖ్యుఁడు కావుననే కులిశక్షతవేదన నెఱుఁగనివాఁ"డని కలదు. తెనుఁగున "మేనకకు మైనాకుఁడు పుట్టెను. అతఁడు పుట్టినను, కులిశపాతభీతిం బయోనిధి నిమగ్నుండగుటచేఁ బుత్రావలోకనసుఖమునకు మేనకాహిమవంతులు దూరులగుటను మరలఁ బుత్రుఁడు జన్మించినను ఇంద్రునివలన భయము తప్పదుగాన బుత్రావలోకన సుఖాభిలాషవదలికొని పుత్రికాసంతతి నపేక్షించినా"రనుట యుక్తియుక్తము. మల్లినాథ వ్యాఖ్యలో మైనాక వృత్తాంతకథనము అభ్రాతృకకన్యావివాహము నిషిద్ధము గావున పార్వతి సభ్రాతృకయని తెలుపుట కని తెల్పఁబడినది గాని నన్నిచోడుని కారణకల్పనము సరసముగా నున్నది. మేనకాహిమవంతులు శక్త్యారాధనము చేయఁగా సతీదేవి వరమిచ్చి వారికిఁ బుత్రికయయ్యె ననిచెప్పుట సరసము.

ప్రసన్నదిక్పాంసువివిక్తవాతం
శంఖస్వనానంతర పుష్పవృష్టి,
శరీరిణాం స్థావరజంగమానాం
సుఖాయ తజ్జన్మదినంబభూవ.
("తూర్యస్వనా"అని పాఠాంతరముకలదు.)
౧-౨౩.

మ. వివిధామోద విమిశ్రితానిలము లొగిన్
వీచెన్ మరుద్దుందుభుల్
దివిరెన్ భోరనఁ బుష్పవృష్టిగురిసెన్
దేవాంగనాగానము
త్సవలీలన్ వినిచెన్ సమస్తభువనో
త్సాహంబు సంధిల్లె ది
గ్వివరంబుల్ వెలిఁగెన్ నిధుల్, దెలిచె ను
ర్విన్ గౌరి జన్మించినన్.
3, 3౦. (273)

ఇందు 'తూర్య' అను పాఠాంతరమే నన్నిచోడుఁడు చూచియుండును. కావుననే 'మరుద్దుందుభుల్' అని గ్రహించియున్నాఁడు. దుందుభిధ్వనులు మొదలగునవి యేతాదృశవర్ణనాసామాన్యలక్షణములైనను కొంత యనుకరణ మిందుఁ గలదు.

తయా దుహిత్రా సుతరాం సవిత్రీ
స్ఫురత్ప్రభామండలయా చకాసే,
విదూరభూమి ర్నవమేఘశబ్దా
దుద్భిన్నయా రత్నశలాకయేవ.
౧, ౨౪.

సీ. వేలావనమునందు విలసిల్లు విద్రుమ
వల్లిక యుదయించు వడువుఁబోలెఁ,
బూర్వదిక్సతి కతిస్ఫురణతోఁనుత సుధా
కరరేఖ యుదయించు కరణిఁబోలెఁ,
ద్రిదివంబునందు సమ్మదమొందఁ గల్పల
తాంకుర ముదయించునట్లుఁబోలెఁ,
దేవతానదికి శోభావహమ్మగ హేమ
రాజీవ ముదయించు రమణఁబోలె,

ఆ.వె. పరవిదూరభూమివై డూర్యముదయించు
తెఱఁగువోలె దిశలు తేజరిల్ల,
మానినీలలామ మేనక కుదయించె
రాజవదన శైల రాజకన్య.

3, ౨౯. (272)

ఇందు, "విదూరభూమిః" "రత్న శలాకయేవ" అను మూలభాగమును బ్రధానముగాఁ గొని తత్సదృశోపమానములు కొన్ని గ్రహించి వెంచి రచించుట యెంతయో సరసముగానున్నది. కవియొక్క భావనావిశేషము వ్యక్తమగుచున్నది. అట్టి భావనాస్ఫూర్తికిఁ గాళిదాసమూలమే కారణమగును. ఇతరోపమానములతో సరిపుచ్చుటకై నవమేఘశబ్దవిషయము పరిహరించుట సమీచీనతరము.

వ. అంతం బార్వతి శరచ్చంద్రరేఖయుం
బోలె సకలజన నయనేందీవరానందకరంబై
వెలుఁగుచుం గ్రమక్రమంబున.

3, 3౧. (274)

దినేదినే సాపరివర్ధమానా,
లబ్ధోదయా చాంద్రమసీవ రేఖా. ౧, ౨౫.

సీ. పరమేశు మన ముద్దపరి ముట్టిసాధింప
నెత్తినగతిఁ దలయెత్తఁదొడఁగె,
హరునూరుపీఠంబు నందుండు వెర విట్టి
దనుగతిఁ గూర్చుండు ననువు వడసె,
నొకధాత్రి తనుఁదాల్పనోపదన్ గతిధాత్రి
పై నిజధాత్రి చేపట్టినిలిచెఁ,
గలహంసకుల మందగమనంబునయ మిట్టి
దని చూపుగతి నడపాడఁదొడఁగె,

ఆ. వె. రాజకీరములకు రసవంతముగఁబల్కు
మెలపు దెలుపు కరణిఁ బలుకఁగలచె
హిమనగేంద్రునింట నీడితైశ్వర్యంబు
పెరుఁగునట్టు లగజ పెరుఁగఁదొడఁగె.

3, 3౨. (275)

ఇందు క్రమపరివర్ధమానత్వ మెంతయు స్వభావోక్తితో నలంకరింపఁబడెను. అందుఁ బరమేశుమనమును సాధించుటయు నంకపీఠమం దుండుటయు ననుభావివిషయములను సూచించుచు నుత్ప్రేక్షించుట పార్వతికిఁగల సహజ శివభక్తిని దెలుపుచున్నది.

మందాకినీసైకతవేదికాభిః,
సాకందుకైః కృత్రిమపుత్రకైశ్చ,
రేమే ముహు ర్మధ్యగతా సఖీనాం,
క్రీడారసం నిర్విశతీవ బాల్యే. ౧, ౨౯.

చ. తరుణులు చిల్కబొమ్మలును,
దంతపుబొమ్మలు మేలిగాజు బ
న్నరులును, మ్రానిచొప్పికలు,
నగ్గడ నోలినపేర్చి లీల జో
కుర బొమరిండ్లఁ జేయ నగు
గూళ్లను,వండుచు బొమ్మపెండ్లి మా
సరముగఁజేసి యాడ నగ
జాత శివార్చనసేయు నయ్యెడన్.
3, 3౯. (279)

పై శ్లోకమందలి 'కృత్రిమపుత్రకైః' అనుదానినిబట్టి బొమ్మల రకములు గొన్ని మన కవికి స్ఫురించియుండును. కావుననే నన్నిచోడుఁడు క్రీడాసాధనములు మఱికొన్ని చెప్పి బొమ్మరిండ్ల బొమ్మలపెండ్లి చేయించి యచట (గుజ్జన) కూళ్లువండించి శివార్చన చేయించుట పార్వతికి సహజమగు శివతత్పరతను స్ఫుటపఱచుట. "బాల్యే క్రీడారసంనిర్విశతీవ" అని క్రీడానురాగముగలబాల్యము ననుభవించుచున్నట్లున్నదని సంస్కృతమున నున్నది. బాల్యమునందలి యాటలలోఁగూడ శివార్చనచేయుచున్నదని తెలుఁగున శివతత్పరత సూచితమయి యున్నది.

స్థిరోపదేశా ముపదేశకాలే,
ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః,
(ఇట "గురూపదేశాత్" అని
పాఠాంతరము కలదు.) ౧, 3౦.

సీ. హరుమ్రోల సద్భక్తినాడుచోటన నాట్య
విషయము లన్నియు వెలయఁగఱచె
లీల నీశ్వరునంకమాలికల్ వాడుచో
గీత భేదంబులరీతు లెఱిఁగె
శివరూపు పల్మఱుఁ జిత్రించి చూచుచో
వినుతంబుగాఁ జిత్రవిద్య వడసె
శశిమౌళిఁ జిత్రపూజలు సేయుచోటఁ బ
త్రచ్ఛేద కుసుమ బంధములు నేర్చె
ఆ. వె. మఱియు నిఖిలలోక మాన్యంబులగు
విద్య, లెల్ల నివ్విధమున నెసకమెసఁగ,
నభ్యసించె నీశ్వరార్చనా బలమున,
హరుఁడుగురుఁడుగాఁగ నగతనూజ.
3, 3౨. (281)

పార్వతికిఁ బూర్వజన్మమందు స్థిరమగు నుపదేశము గలదుగాన మేధావిని యయ్యెను. దానిచే ఈ జన్మమున నుపదేశమాత్రముననే పూర్వజన్మవిద్యలు లభించినవని సంస్కృతమున నున్నది. నన్నిచోడుఁడు హరుఁడు గురుఁడు గాఁగ హరపూజాదిసమయముననే సకలకళలు నామె కబ్బిన

వని చక్కగ విద్యలన్నియు సమకూర్చి నాగరకులకుఁ దగినస్త్రీవిద్యాస్వరూపము స్పష్టపఱచి రాజశిఖామణిత్వ కవిశిఖామణిత్వములను జాటినాఁడు. నాట్య, గీత, చిత్రకళా, పత్రచ్ఛేద, కుసుమబంధములును, నఖిలలోక మాన్య విద్యలును నామెకు శివారాధనకాలముననే యలవడినవని వర్ణించెను. శివుని గురునిఁగావించెను. 'గురూపదేశాత్' అను పాఠ మాతనికి లభించియుండును. అదియే యట్టి కల్పనచేయుటకుఁ గారణమయి యుండును.

ఉన్మీలితం తూలికయేవ చిత్రం
సూర్యాంశుభిర్భిన్నమి వారవిందమ్,
బభూవ తస్యాశ్చతురస్రశోభి
వపుర్విభక్తం నవయౌవనేన. ౧, ౩౨.

వ. మఱియుం గౌమారానంతరంబున లేఁదీగకు మవ్వం బెక్కినట్లు పువ్వునకుం దావి వొందునట్లు చిత్రరూపంబునకు మెఱుఁగెక్కువిధంబున నిఖిలజనమనోభిరామం బగుచు. ౩, ౩౯. (182)

అసంభృతం మండన మంగయష్టే
రనాసవాఖ్యం కరణం మదస్య,
కామస్య పుష్పవ్యతిరిక్త మస్త్రం,
బాల్యాత్పరం సాఽథ వయః ప్రపేదే. ౧, ౩౧.

చ. మలపఁగ నున్నకల్పలత
మన్మథునారి నమర్ప నున్నకో
మలతరపుష్పబాణ మహి
మద్యుతిఁ జూడఁగ నున్నపద్మకు
ట్మల మలరంగ నున్నమధు
మంజరి నా మదజృంభితాంగదో
హలరుచి నొప్పె గౌరినవ
యౌవన సంగమలీల డాయఁగాన్. ౩, ౪౦. (283)

'సూర్యాంశు నిర్భిన్న మివారవిందమ్' అనుటలో సూర్యకాంతిచే వికసించిన పద్మ మని కలదు. వికసించినపద్మ మనుటకంటె వికసింప సిద్ధముగానున్న పద్మమనుట యుచితతర మని నన్నిచోడుఁడెంచి 'అహిమద్యుతిఁ జూడఁగనున్న పద్మకుట్మల' మని రచించెను. 'కామస్య పుష్పవ్యతిరిక్త మస్త్రమ్' అనుదానికి వ్యతిరిక్తముగా 'మన్మథునారి నమర్పనున్న కోమలతరపుష్పబాణము' అని మనకవి రచించెను. 'అనాసవాఖ్యం కరణం మదస్య' అనుదానిని 'మధుమంజరి నా మదజృంభితాంగదోహలరుచి' అనియుత్ప్రేక్షామూలమున వర్ణించెను.

అభ్యున్నతాంగుష్ఠనఖప్రభాభి
ర్నిక్షేపణా ద్రాగ మి వోద్గిరంతౌ,
ఆజహ్రతు స్తచ్చరణౌ
పృథివ్యాం స్థలారవిందశ్రియ మవ్యవస్థామ్. ౧, ౩౩.

క. మెఱుపును గెంపును సుస్థితి
దరులియుండేని లేదు తమ కమవలనన్
నిలుకడ యగు నని తత్పద
తలములనెలఁసె ననఁబాదతలములువొల్చున్. ౩, ౪౨. (285)

క. అరుణాంబుజ దళములలోఁ
బరగుతటిత్తి్వషలు నించి పైనభ్రకణముల్,
బొరలెత్తి కదియ మూసిన
కరణి నుమాదేవి పదనఖంబులు వెలుఁగున్. ౩, ౪౪. (287)

మొలుపును ఎఱుపును దలిరులయందయినను తమకు నిలుకడ లే దని పార్వతిపదతలముల నాశ్రయించినట్లు కవి గుణములను బ్రధానముగావించి రచించెను. నఖములు రక్తవర్ణము వెలిఁబుచ్చుచున్నవని పై శ్లోకమున వర్ణింపఁబడెను. నఖకాంతి తెల్లనిదిగా అభ్రకపు తేకులతోఁబోల్చి వర్ణించుచుఁ బాదతలముల యెఱుపు వర్ణించుటకై 'అరుణాంబుజదళములలోఁ దటిత్త్విషలు నించి ... కరణి' అని తెనుఁగున మనకవి యుత్ప్రేక్షించెను.

వృత్తానుపూర్వే చ న చాతిదీర్ఘే
జంఘే శుభే సృష్టవత స్తదీయే. ౧, ౩౫.

క. అతనుం డోపని శివు వశ
గతుఁజేసి భవాని మదనుకవదొన లతిలోకో
న్నతినాచికొనియెనో యను
గతిఁజెలుఁదొడ లమరు బ్రీహిగర్భాభము లై.
౩, ౪౭. (290)

శ్లోకమునందలి వృత్తానుపూర్వత్వము (ఆఁదోకగానుండుట) ఉపమానములచేఁ దెలుపఁబడినది. అదియే బ్రీహిగర్భాభత్వస్ఫూర్తికిఁ గారణమయి యుండును. కావుననే యాయుపమానము చేర్పఁబడియుండును.

నగేంద్ర హస్తా స్త్వచి కర్కశత్వా
దేకాంతశైత్యా త్కదళీవిశేషాః,
లబ్ధ్వాపి లోకే పరిణాహి రూపం
జాతా స్తదూర్వో రుపమానబాహ్యాః.
౧, ౩౬.

క. స్మరమందిరమ్ము శోభా,
కరనుగ మెఱుఁగారుపసిఁడికంబములనఁ గాఁ
గర మొప్పు నగతనూజకుఁ
గరభోరులు వొలుచు మదనకరికరలీలన్.
౩, ౪౮. (291)

పైశ్లోకమందు గజచర్మము కర్కశముగాన నుపమానబాహ్యమయినదని చెప్పఁబడెను. సామాన్యకరికర ముపమానబాహ్యమైనను మదనకరికరముతోఁ బోల్పవచ్చు నని నన్నిచోడుఁడు తలఁచెను గాఁబోలు. కరభసామ్యమునుగూడఁ జేర్చి వింతగా స్మరమందిరమున కుంచిన పసిఁడి స్తంభము లని విశేషించినాఁడు.

క. మారుమకు వేదిమధ్యమె
యారతియద్దంపుఁబిడియొయన నెంతయుఁబొ
ల్పారఁ గడు నలికమై సుకు
మారికి మధ్యంబు సింహమధ్యమువోలెన్.
౩, ౫౧. (294)

మధ్యేన సా వేదివిలగ్నమధ్యా
వళిత్రయం చారు బబంధ బాలా,
ఆరోహణార్థం నవయౌవనేన
కామస్య సోపాన మివ ప్రయుక్తమ్. ౧, ౩౯.

క. పొరి దలముగాని జవ్వన మన్
సిరికుచముల కెక్క నడవఁ జేసిన కార్త
స్వరసోపానములన ము
త్తరఁగలుదగునంగజాబ్ధితరఁగలు వోలెన్.
౩, ౫౩. (296)

పై భావము విడఁదీసి రెండు పద్యములుగా రచించి చక్కఁగానిరూపించినాఁడు. 'వేదివిలగ్నమధ్యా' యన్న నతనికిఁ దృప్తి లేక 'మూరుమఘువేది' యని సౌకుమార్యము తెచ్చినాఁడు. కామునిసోపానము మార్చి యౌవనముసిరి యెక్కుటకు స్వర్ణసోపానములను మనకవి గట్టించినాఁడు. మనకవిరాజశిఖామణి రాజశిఖామణి గదా! ఈ కల్పనకు మూలశ్లోకభావమే మూలము.

అన్యోన్య ముత్పీడయ దుత్పలాక్ష్యాః
స్తనద్వయం పాండు యథా ప్రవృద్ధమ్,
మధ్యే యథా శ్యామముఖస్య తస్య
మృణాలసూత్రాంతర మప్యలభ్యమ్.
౧, ౪౦.

క. ఆంధ్రీ స్తనాపహాసులు
సంభృతమధుపాబ్జముకుళసదృశములతి నీ
రంధ్రములు గుచము లఖిలపు
రంధ్రీజనతిలక మచలరాజాత్మజకున్.
3, ౫౮. (297)

ఇందు ఆంధ్రీస్తనాతిహృద్యత నదనముగాఁ జేర్చి 'శ్యామముఖస్య తస్య' అనుదానిని బట్టి సంభృతమధుపాబ్జముకుళసదృశత తెల్పుటచక్కఁగ నలంకరించుట గదా! 'శ్యామముఖస్య' అనునదే యీయుపమానమును మనకవికి స్ఫురింపఁజేసి యుండును.

నిర్ధూర్ణితాశోక దళప్రసూతి
పాణిద్వయం చారునఖం తదీయమ్,
నవోదితేందుప్రతిభస్యశోభాం
వ్యోమ్నః ప్రదోషే వికలీచకార.
(౪౧, ౪౨. శ్లోకముల నడుమనున్న ప్రక్షిప్తశ్లోకమిది.)

క. రుచిరాశోక దళద్యుతి
నచలజకరతలము లొప్పు నతిశయరాగో
పచిత రతిరాజపల్లవ
రచితోభయమేఘ డంబరంబులఁబోలెన్.
3, ౫౩. (300)

నన్నిచోడునిపద్యము కాశీ సంస్కృత 'సీరీసు' పుస్తకమున అధోజ్ఞాపికలోఁ బ్రక్షిప్తముగా నున్న శ్లోకము ననుసరించి కొంత యుండుటచేత నాపాఠమతనికాలమునఁ గ్రంథమధ్యమునఁ గలదని తోఁచెడిని. మొదటి భాగమునఁ జెప్పిన యశోకపల్లవసామ్యమును బట్టి పల్లవరచితరతిరాజచ్ఛత్రసామ్యమును చేర్చినాఁడు. మూలమందలియుపమానము విడిచిపెట్టినాఁడు.

శిరీషపుష్పాధిక సౌకుమార్యౌ
బాహూ తదీయా వితి మే వితర్కః,
పరాజితేనాపి కృతౌ హరస్య
యౌ కంఠపాశౌ మకరధ్వజేన. ౧, ౪౧.

క. శివునంగయష్టి నిరియఁగ
నవిరళముగఁబట్టి ప్రాఁకనని కడునెమ్మిన్
నివుడునవకల్పలతికల
పవిదిని మృదుబాహులతలుపార్వతికొప్పున్.
3, ౫౭. (299)

శ్లోకమునఁ గాళిదాసు చూపిన మన్మథపరాభవకథ యీకావ్యమందింకను దెలుపఁబడలేదుగదా యని తలంచియే కాఁబోలు, ఆభావమును విడిచి శివునంగయష్టినవిరళముగఁ బట్టి ప్రాఁకననెడి కారణమును జెల్లిమెను. ఇది యుచితతరము.

చంద్రంగతా పద్మగుణాన్న భుఙ్త్తే
పద్మాశ్రితా చాంద్రమసీ మభిఖ్యామ్,
ఉమాముఖంతు ప్రతిపద్య లోలా
ద్విసంశ్రయాం ప్రీతి మవాప లక్ష్మీః. ౧, ౪౩.

క. అమృతోద్భవు లగుమీలో
నమరదుపగయని సుధాకరాబ్జములకుఁ గూ
టము దనముఖమునఁజేసెనొ
యుమయన రదనాంశుగండయుగ గతినొల్చెన్.
3, ౭౧. (304)

తెనుఁగునందలిభావమునకు మూలము సంస్కృతమే కాని చివరఁ గొంత పెంపుచేసి రదనాంశువులను జంద్రకాంతితోను గండమును బద్మములతోను బోల్చిచెప్పెను. గండములకుఁ బద్మోపమానము అంతప్రసిద్ధము గాదేమో! కాని విరుద్ధపదార్థముల నొకచోటఁ జేర్చుట యిచటఁ బ్రధాన విషయము. వానియుపమేయములనుగూడ స్పష్టపఱచినాఁడు. మూలమున ముఖ మని సామాన్యముగాఁ జెప్పబడినది. తెనుఁగున ముఖమందలి రదనాంశు గండయుగము లని స్థానభేదము తెలుపఁబడినది.

లజ్జా తిరశ్చాం యది చేతసి స్యా
దసంశయం పర్వతరాజపుత్ర్యాః,
తం కేశపాశం ప్రసమీక్ష్య కుర్యుః
వాలప్రియత్వం శిథిలం చమర్యః. ౧, ౪౮.

క. చమరీతతియుఁ గలాపులు
సమకేశతమాలతరు లతోగ్రాటవిలో
రమియింపఁగఁ దగు నవఁదగి
సమ మగు వారి నవ్యనీలచలదలిసమమై.
3, ౭౧. (314)

చమరీవాలముతోనే తృప్తిపడక యితరోపమానములు గూడఁ దెనుఁ గునఁ గవి గుదిగ్రుచ్చినాఁడు.

సర్వోపమా ద్రవ్య సముచ్చయేన
యథాప్రదేశం వినివేశితేన,
సానిర్మితా విశ్వసృజా ప్రయత్నా
దేకస్థసౌందర్యదిదృక్షయేవ. ౧, ౪౯.

సీ. శశిబింబమణిహేమ సౌదామినీచయో
త్కరకాంతులన్నియు నరసి తెచ్చి,
నవలతాపుష్పపల్లవబిసకోమల
విభవంబు లన్నియు వెదకి తెచ్చి,
కర్పూరచందనకాశ్మీరమృగమదా
మోదంబు లన్నియు మంచితెచ్చి,
పరివాదినీశుక పరపుష్ట మధుకరా
రావంబు లన్నియు రాచితెచ్చి,
ఆ. వె. హావభావరూపలావణ్యసారముల్
త్రిభువనముల నేర్చి తెచ్చి నేర్పు
సూపఁదలఁచియాఁడు రూపుఁజేసెనొ యించె
నని నుతింప నొప్పు నగతనూజ.
3, ౭౫. (321)

'సర్వోపమాద్రవ్య సముచ్చయేన' అను దానిని వివరింపఁ దలఁచిన మనభావకకవి తెనుఁగున నుపమాద్రవ్యములు దెలిపి వాని నన్నిటిని

నౌచిత్యానుసారమునఁ గూర్చి 'యాఁడురూపు సేసెదననేర్పు సూపదలచి' యని వర్ణించెను.

చ. " ...........................భో
రనఁజనుదెంచె నారదమహాము
నితద్గిరిపాలుపాలికిన్'' 3, ౧౨౨. (325)
వ......హితోపదేశంబు సేయఁదలంచి.

తాం నారదః కామచరః కదాచిత్
కన్యాం కిల ప్రేక్ష్య పితుః సమీపే,
సమాదిదే శైకవధూం భవిత్రీం
ప్రేమ్ణా శరీరార్ధహరాం హరస్య. ౧, ౫౦.

క. ఈదేవి లోకజనని మ
హాదేవున కగ్రమహిషి యై పేర్మి సురేం
ద్రాదుల కర్చిత యగు నని
యాదేశము సేసి యమహాముని సనియెన్.
3, ౧౨౪. (327)

ఆంధ్రకవి, నారదునివర్ణించి యాతని రాక తెలిపి పూజా గౌరవములు ప్రకటించి శివశక్తిభేదములు తెలిపించి పార్వతీపూర్వచరిత్ర చెప్పించి 'ఈదేవి లోకజనని'ఇత్యాదిపద్యమున 'శరీరార్ధహరాంహరస్య'అనుదానిభావమును విస్తరించెను.

తే. గీ. సతివియోగాగ్ని మనములోసంతతంబు
దగిలికొని కాల దానికిఁ దనువు సేయఁ
దలఁచియో కాదు నిక్కముతపము సేయ
వలచియో హిమగిరికి నీశ్వరుఁడువచ్చె.
3, ౧౨౭. (330)

యదైవపూర్వే జననే శరీరం
సా దక్షరోషా త్సుదతీ ససర్జ,
తదా ప్రభృత్యేవ విముక్తసంగః
పతిః పశూనా మపరిగ్రహోఽభూత్. ౧, ౫౩.
సకృత్తివాసా స్తపసే యతాత్మా
గంగా ప్రవాహోక్షిత దేవదారు,
ప్రస్థం హిమాద్రే ర్మృగనాభిగంధి
కించిత్క్వణత్కిన్నర మధ్యువాస.
౧, ౫౪.

సీ. రసరసాయననిర్ఝరప్రవాహోనూన
గంగాప్రవాహశీకరము లడరఁ
దనుపార నెలరారు ఘనసార సురదారు
మందార చంపక చందనముల
...............................
...............................
ఋశ్యసారంగ మృగచమరీ మృగములఁ
బావనం బగుదివ్యతపోవనంబు
3, ౧౨౯. (332)

గీ. క్షీరవారాశికెలఁగిన కారుమొగులు
కరణి శశికాంతవేదిపై గారుతోలు
పరచి విలసిల్లు నం దుండి పరమపరుఁడు,
వొలిచె నొగిమొగలుపైఁదటిత్పుంజమనఁగ.
3, ౧౩౨. (335)

ఈ పద్యములందు సంస్కృత శ్లోకములలోనిభావములు మనకవి వివరించెను. 'కృత్తివాసుఁడు' అను భావము గ్రహించి ఒకపద్యముగా రచించి మఱియొక యుపమానము చేర్చుట మనకవి భావనావిశేషమును తెలుపును.

సీ. పద్మాసనస్థుఁడై భావించిశోషణ
దాహనప్లావన తర్పణముల
..............................
వడి శాహ్యావర్తనల్ విడిచి ప్రత్యాహార
గతి మన స్సంతర్ముఖమ్ముసేసి

తత్రాఽగ్నిమాధాయ సమిత్సమిద్ధం
స్వమేవ మూర్త్యంతర మష్టమూర్తిః,
స్వయంవిధాతా తపసః ఫలానాం
కేనాపి కామేన తప శ్చకార. ౧, ౫౭.

ఆ. వె. తన్నుఁ దానె కాంచి తనయందుఁ జేతోల
యంబు సేసి నిశ్చలాత్మయోగ
మయసుఖామృతాబ్ధిమగ్నుఁడై వరదుండు
నిరతిశయసమాధినిష్ఠ నుండె.
౭, ౯౩. (336)

తే. గీ. తనకుఁబరమొండు లే దనఁ దనరి వెలుఁగు
చుండు పరమేశ్వరుండు దా నుగ్రతపము
చేసె భక్తులు దనుఁ బ్రీతిఁ జేరవచ్చు
తెలువు దాఁ దీర్చి చూపెడు తెలుఁగువోలె.
౩, ౯౫. (338)

కాళిదాసు తనశ్లోకమున నగ్నియు సమిధలుమొదలగునవి తపస్సాధనములుగాఁజెప్పినను శైవాద్వైతియగు నన్నిచోడకవి నిరతిశయసమాధినిష్ఠయు దానిపూర్వరూపము మొదలగునవి శైవాచారప్రకారమునఁదెలిపెను. శివుఁడు ఆప్తకాముఁడు గావున 'కేనాపికామేన' (ఏదోకోరికతో) అని కవియన్నట్లు వ్యాఖ్యాత చెప్పినాఁడు. కాని నన్నిచోడుఁడు 'భక్తులు తనుఁజేరవచ్చు తెలుఁగు దానే తీర్చిచూపెడు తెలుఁగువోలె' అని యుక్తియుక్తముగా నుత్ప్రేక్షించినాఁడు.

ఉ. అంతకుమున్న సన్మతిఁ బురాంతకురాకయు
వచ్చి యున్నవృత్తాంతము మేలుగా
నెఱిఁగి యా హిమవంతుఁడు.........

అనర్ఘ్య మర్ఘేణ త మద్రినాథః
స్వర్గౌకసా మర్చిత మర్చయిత్వా,
ఆరాధనా యాస్య సఖీసమేతాం
సమాదిదేశ ప్రయతాం తనూజామ్. ౧, ౫౮.

వ. నిజాశేషకులకళత్రపుత్రీసమేతుండై చను
దెంచి పరమేశ్వరుం గని ముహుర్ముహుర్న
మితలాలంకృతసర్వాంగుండై నిజదేహాది
సమస్తరాజ్యవిభవంబులు నీశ్వరు శ్రీ
పాదంబులకు నివేదించి. ౩, ౯౭. (340)

సీ. ఈబాల దన్నుఁ దా నెటిఁగినకోలె న
నన్యశరణ్యయై యహరహంబు
నిన్నుఁగొల్చుచునుండు...............
..........................................
గావున నిచ్చఁదగినవరువుఁ
ఆ. వె. బనులు సేయుచుండుఁ బార్వతియునికికి
వరదయిచ్చగింప వలయు ననిన
నలనివిన్నపమున నంతకు భక్తవ
త్సలుఁడు నెమ్మనమున సంతసించి.
3, ౧౦౨. (345)

ప్రత్యర్థి భూతా మపి తాంసమాధేః
శుశ్రూషమాణాం గిరిశోఽనుమేనే,
వికారహేతౌ సతి విక్రియంతే
యేషాం న చేతాంసి త ఏవ ధీరాః॥ ౧, ౫౯.

వ. అదత్త్రపతివచనుం డైనదానికి మహాప్రసాదం
బని.........
క..............
శిక్షించి గౌరినందు సు
రక్షితముగ నునిచి నిజపురంబున కరిగెన్.
3, ౧౦౪. (347)

క. వినుతింపఁ గామ సుఖ స్సా,
ధనమగు నా గౌరిఁజంద్రధరుఁడు దపస్సా
ధనముగఁ జరించె నుత్తము
లనయము విపరీతచరితు లైనను జనదే.
౪, 3. (359)

పార్వతిని హిమవంతుఁడు శివునియుపచారార్థ మనుమతింపఁ గోరఁగా శివుఁడు భక్తవత్సలుఁడు గాన దాని కనుమతించె ననుట భక్తవాత్సల్యము ప్రకటించుటయే కదా. కాళిదాసు 'వికారహేతు వున్నను చిత్తచాంచల్యము లేమి ధీర లక్షణ' మనియెను. ఆ భావము మార్చి మనకవి ఉత్తములు విపరీత చరితులైనను జనదే, యనునర్థాంతరన్యాసముచూపి సుఖసాధనమ్మును దపస్సాధనముగాఁ జేసిన విపరీతత్వము స్పష్టపఱచి నాఁడు.

సీ. చమరీజ బర్హమార్జనులఁ బరీక్షించి
నయమున సమ్మార్జనంబు సేయుఁ
గర్పూరతైలార్ద్రకస్తూరికాకర్ద
మంబుల ననులేపనంబు సేయుఁ
గాశ్మీరమాంజిష్ఠ గరుడాండ హరినీల
ముక్తాఫలంబుల ముగ్గువెట్టుఁ
గుసుమపల్లవలతాతోరంబులఁ జిత్ర
భామంబులొనరించుఁబావిఖిగులఁ

అపచితబలిపుష్పా వేదిసంమార్గదక్షా
నియమవిధిజలానాం బర్హిషాం చోపనేత్రీ,
గిరిశ ముపచార ప్రత్యహం సా సుకేశీ
నియమితపరిఖేదా తచ్ఛిరశ్చంద్రపాదైః.
౧, ౬౦.

తే. గీ. బుష్పమందిర మొనరించుఁ బుణ్యవారి
సౌరభము లించి మణికలశముల నించు
నచలపతిసుత మది నిట్టులవారహంబు
శివున కనురక్తిఁ బరిచర్య సేయుచుండె.
3, ౧౦౬. (349)

సంస్కృతమున నున్న 'వేదిసంమార్గదక్షా' అనుదానివలన మన మహాకవికి గృహాలంకరణరీతు లన్నియు స్ఫురించినవి. తాను మహారాజుగాన మహారాజగృహాలంకరణపద్ధతి యిందుఁగూర్చినాఁడు. 'నియమిత పరిఖేదా తచ్ఛిరశ్చంద్రపాదైః' అనుదానినిబట్టి చంద్రశేఖర తపోవనమునఁ బార్వతి సఖులతో శివపరిచర్య చేయురీతి చెప్పఁబడెను. 'అవచిత బలిపుష్పా' అనుదాని వలన మనకవికిఁ బసిఁడితామరలు స్ఫురించియుండును. అవి యెట్టివి పూజకర్మములలో భావనసేసి తెలుపుచు సరసముగాఁ బసిఁడితామరలను వర్ణించెను. ఆభావనావిశేషములుగల పద్యములు ఈక్రింద గ్రహింపఁబడును.

చ. పొలుపుగఁ జంద్రశేఖరు తపోవనమంగజ
చక్రవర్తి దో, ర్బలమున ముట్టిచూఱగొనఁ
బంచిన దండుకో నాఁగఁబొల్చి శ, న్యలు
దనుఁగొల్చిరా నచలనందన సుందరలీల
నిచ్చలుం, గొలుచుచు నుండె భక్తి నహి
కుండలమండితగండమండలుల్.
3, ౧౦౭ (350)

సీ. మొన లావులించి వాసనసల్లఁ బసిగొని
తేఁటేఁటి గమి లెంగిలింపకుండ,
నెడనూఱగొని వేచి సుడియు తెమ్మరలచేఁ
బొడముపుప్పొడి వొలివోవకుండ,
దరణికూటమున మే యొరలి పద్మిని మేన,
మొలతెంచు మధుమద మొలుకకుండ
మేల్కని గోమిని మెలఁగి మై మురిసిన
బొదిగొన్నయకరువు సెదరకుండఁ
తే. దెలిసి జక్కవ లొండొంటిఁ గలయఁదారు
కలకలంబున రేకులు గదలకుండ
మున్న కొనివచ్చి గణికాసమూహితోడ
గిరిజ పూజించెఁ బసిఁడితామరల వరదు.
3, ౧౦౮. (351)

నన్నిచోడుని కావ్యమందలి మూఁడవయాశ్వాసము కాళిదాసకావ్యము నందలి ప్రథమసర్గకు స్వేచ్ఛగాఁ గావించినపరివర్తనము. స్వతంత్రప్రబంధ రీతిని నిబంధించుటయే పూర్వకవుల యనువాదరీతి గదా!

తస్మిన్ విప్రకృతాః కాలే
తారకేణ దివౌకసః,
తురాసాహం పురోధాయ
ధామ స్వాయంభువం యయుః. ౨, ౧.

అథ సర్వస్య ధాతారం
తే సర్వే సర్వతోముఖమ్,
వాగీశం వాగ్భి రర్థ్యాభిః
ప్రణిపత్యోపతస్థిరే. ౨, ౩.

వ. ఇట్లు పరమేశ్వరుండు దపోవృత్తిం దగిలి
జగద్వ్యాపారంబు లారయ కునికిం జేసి
తారకాసురుం డను ఘోరాసురుం డేచి.
హరిపరమేష్ఠిపురందరాదుల కజేయుండై
సకల జగజ్జనంబుల కనేకోపద్రవంబులు
సేయం దొడంగిన. ౪, ౪. (360)

క. వానిపటు దండనుల కమ
రానీకము లబ్బగింప కపగతరాజ్య
శ్రీనిలయులై పితామహుఁ
గానఁగఁ జనిరెందుఁబొందుఁగానక భీతిన్
౪, ౫. (361)

వ. ఇట్లు శతానందుండు సదానందకంద
ళితహృదయారవిందుం డగుచున్నంత
బృందారకబృందంబు గాందిశీకులై కంది
తదీయాననారవిందమకరందంబులకెఱఁ
గునలినందోహంబునుంబోలె నెఱఁగి
నానావిధస్తుతిరవంబు లులియ నభయ
మభయ మనుచున్న దేవేంద్రాదిగణంబు
లంగని విరించికరుణించియోడకలెండని.
౪, ౭. (364)

పైవానిలో ఛాయ స్పష్టముగానే కనఁబడుచున్నది. సంస్కృతమున ద్వితీయ సర్గలోనినాల్గవశ్లోకము మొదలు పదియేనవ శ్లోకమువఱకు బ్రహ్మస్తవముకూర్పఁ బడినది. అందు 'నమస్త్రిమూర్తయే తుభ్యమ్' మొదలగువానితో బ్రహ్మను త్రిమూర్త్యాత్మకుని గాను జగత్కారణముగాను సర్వశ్రేష్ఠునిగ్గాను వర్ణించిన రీతులు గలవు. అందు సాంఖ్యాదిమతములరీతిని బ్రహ్మ వర్ణింపఁబడియెను. బ్రహ్మకే పారమ్యము తెలుపఁబడినది. మనకవి శైవుఁడు గావున బ్రహ్మకుఁ బారమ్య మంగీకరించి వర్ణించుట కిష్టపడక కాఁబోలు 'నానా విధస్తుతిరవంబు లులియ' అనుదానితో సరిపెట్టినాఁడు. అదిగాక ప్రబంధరచనయందు వివిధ మతానుసారముగాఁ గావించిన స్తోత్రరీతు లనావశ్యకము లని మనకవి మాని వేసియుండును. కాని యీశ్వరస్తవప్రకరణమున నట్లు మానఁడు. మనకవి బృహస్పతిచేఁత దారిద్ర్య విద్రావణస్తవ మనుపేర నొకయష్టకము చెప్పించి నాఁడుగదా!

కి మిదం ద్యుతి మాత్మీయాం
న బిభ్రతి యథాపురా,
హిమక్లిష్టప్రకాశాని
జ్యోతీంషీవ ముఖాని వః. ౨, ౧౯.
సురాః సురాధీశపురస్సరాణాం
సమీయుషాం వః సమ మాతురాణామ్,
తద్బ్రూత లోకత్రయజిత్వరాత్కిం
మహాసురా త్తారకతో విరుద్ధమ్. ౧౨, ౪౦.

క. మీ కింత వంది కంద భ
యాకులతం బొంది నిర్గతైశ్వర్యులరై
రాకకుఁ గారణ మేమి త్రి
లోకాహితదనుజపతికిలోఁబడరువశే(గదే?)
౪, ౯. (365)

దేవతలు బ్రహ్మదర్శనము చేయఁగానే బ్రహ్మ వారికిఁ దారకాసురుని వలనఁ గలిగినబాధలు గ్రహించి తానే వారి కష్టస్థితిఁ బరామర్శించె నని కలదు. ఇంద్రాదులు కుమారప్రార్థనార్థము శివదర్శనమునకుఁ బోయిన సందర్భమునఁ బండ్రెండవ సర్గలోఁ గూడఁ నట్లే యున్నది. దానిలోనిది కొంత యిందుఁ గలియుచున్నది. కావున ద్వాదశసర్గలోనిశ్లోకముగూడఁజూపఁబడెను.

బృహస్పతి తారకాసురునిదోషవిశేషంబులు విజ్ఞాపింపం దలంచి చెప్పిన వానిలోఁ గొన్ని మాత్రము చూతము.

వీజ్యతే సహి సంసుప్తః
శ్వాససాధారణానిలైః,
చామరైః సురబందీనాం
బాష్పశీకరవర్షిభిః. ౨, ౪౨.
ఉత్పాట్య మేరుశృంగాణి
క్షుణ్ణాని హరితాం ఖురైః,
ఆక్రీడపర్వతా స్తేన
కల్పితాః స్వేషు వేశ్మసు. ౨, ౪౩.
మందాకిన్యాః పయ శ్శేషం
దిగ్వారణ మదావిలమ్,
హేమాంభోరుహసస్యానాం
తద్వాప్యో ధామ సంప్రతి. ౨, ౪౪.
యజ్వభిః సంభృతం హవ్యం
వితతే ష్వధ్వరేషు సః,
జాతవేదోముఖా న్మాయీ
మిషతా మాచ్ఛినత్తి నః. ౨, ౪౫.

సీ. వ్రేళ్లతోడుతఁగల్పవృక్షముల్ వెఱికించి
కొనిపోయి తన కుపవనముఁ జేసెఁ
గనకాద్రిఁ గొనిపోయి తన కెక్కుడయాడ ని
జారామభూమిఁ గ్రీడాద్రిఁ జేసె
నమరారి తనపేరియుచ్చులు పెట్టించి
సురధేనువమితిఁ గీలరముఁ జేసె
గరుడోరగామరతరుణుల నందఱఁ
జేకొని తనవిలాసినులఁ జేసె.
ఆ. వె. వేదవిహితవృత్తి విప్రుల నుడిచెఁ ద
త్సకులపురుషభక్తి పలుపు డుడిచెఁ
బుణ్యకర్మ మడిచె భువి నిట్లు నిఖిలాప
కారకుండు బలిమిఁ దారకుండు.
౪, ౧౧. (367)

పయి సంస్కృతాంధ్రములం దున్న ఛాయ సుబోధముగానే యున్నది. 'ఉత్పాట్యమేరుశృంగాణి'అను దానిలోనిభావమును మనకవి చూడఁగా

నాతనిభావనయందుఁ దత్సాదృశ్యముగల భావములు గొన్ని యూరినవి. మనకవి యవి యన్నియుఁను సంగతముగా సరసముగాఁ గూర్చెను. అంతేకాక ప్రబంధశైలిని శ్లేషలతోను వక్రోక్తులతోను జిత్రముగా 'బ్రహ్మకుఁగూడ నవ్వు పుట్టించు'నట్లు బృహస్పతి వాక్యములు మనకవి కూర్చెను. అందు రెండు పద్యములు మాత్రము గ్రహింతము.

క. ఇలఁ జిత్రము తారకకర
తలసంగతమైన ఘోరతరవారి సొరన్
నిలు పగుఁ దనుఁ జోర కడరినఁ,
దలపఁ నుఁశ యగు న్విరోధితతి కబ్జభవా.
౮, ౧౮. (370)

సీ. అనిమిషపతిపుర మనిమిషాస్పద మయ్యె
ననలుప్రో లెల్లను ననలమయము
ప్రేతాధిపతివీడు ప్రేతసంగతము ప
లాళను నెలవు పలాళయుతము
వనధీశునగరంబు వనవరాకీర్ణంబు
మారుతాలయము భీమారుతంబు
గనకాధిపతివీడు గనకోదరంబు శి
వావాస మెల్ల శివాన్వితంబు
ఆ. వె. నేఁడు గానఁ దారకాసురుఁడెన విప
రీతవృత్తిలేక రిత్తదూఱు
లేటి కనిన నాసుకేశ్వరామాత్యువ
క్రోక్తి విని సరోజయోని నగుచు.
౮, ౨౬. (384)

సంయుగే సాంయుగీనం తముద్యతం ప్రసహేత కః,
అంశాదృతే నిషిక్తస్య నీలలోహిత రేతసః.
సహి దేవః పరంజ్యోతి స్తమఃపారే వ్యవస్థితం,
పరిచ్ఛిన్నప్రభావర్ధి న మయా నచ విష్ణునా.
ఉమారూపేణ తే యూయం సంయమస్తిమితం మనః,
శంభోర్యతధ్వ మాక్రష్టు మయస్కాంతేన లోహవత్.
3, ౫౬; ౫౭; ౫౯.

చ. వెలయ సుమామహేశ్వరుల
వీర్యమునం దుదయించునట్టిదో
ర్బలకలితుండు గాని సుర
పాలకవిద్విషుఁ దారకాసురున్
గెలువఁడు పోరిలో మకర
కేతనుఁ బంపుఁడు వారికిం దప
శ్చలనము చేసి మైవడిఁ బ్ర
సంగము సేయ జగద్ధితంబుగాన్.
౮, ౨౯. (386)

బ్రహ్మ తారకవధోపాయము చెప్పుసందర్భముననే మన్మథునిఁ బంపుట నుపాయముగా నన్నిచోడుఁడు స్పష్టపఱచెను.

కః సాధ్వసూయాపదకాంక్షిణా తే
నితాంతదీర్ఘై ర్జనితా తపోభిః,
యావ ద్భవ త్యాహితసాయకస్య
మత్కార్ముక స్యా స్య నిదేశవర్తీ. ౩, ౪.

మ. అతినిష్ఠాపరులై సురేంద్రవిభవ
వ్యాసక్తి సుగ్రాధిక
వ్రతముల్ సేకొని ధీరులై నడతు మీ
వా రెవ్వ రైనన్ శుభ
స్థితి నెందేనియుఁ గల్గినం బనుపు నన్
శీఘ్రంబ పుష్పాస్త్రసం
హతివిచ్ఛిన్నమనస్కులన్ విషయమా
యాగ్రస్తులం జేసెదన్.
౪,౪౦. (397)

కామేకపత్నీవ్రతదుఃఖశీలాం
లోలం మన శ్చారుతయా ప్రవిష్టామ్,
నితంబినీ మిచ్ఛసి ముక్తలజ్జాం
కంఠే స్వయంగ్రాహనిషక్తబాహుమ్.
౩, ౭.

క. పరమపతివ్రతలై సుర
పురములు సాధింప నున్న పుణ్యస్త్రీ లె
వ్వరు గలరు చూపు చూతాం
కురశరహతిఁ దిరులుమరులుగొలిపెద
వారిన్.
౪, ౪౧. (398)

తవప్రసాదా త్కుసుమాయుధోఽపి సన్
సహాయ మేకం మధుమేవ లబ్ధ్వా,
కుర్యాం హరస్యాపి పినాకపాణేర్
ధైర్యచ్యుతిం కే మమ ధన్వినోఽన్యే. ౩,౧౦.

క. వెరవున భుజశౌర్యంబున
సురవల్లభ! పసుపు నీవ చూడఁగఁ బరమే
శ్వరునైన నోర్తుఁ జెలసుర
నరఫణిదివిజాధిపతులు నా కెదురుదురే.
౪, ౪౫. (402)

దీని నే భంగ్యంతరమునఁ గవి వివరించినరీతి తెలిసి కొనఁదగినది.

సీ. జలశాయి నసుఁ గన్న జనకుండు హరి చక్రి
యైనను స్వామికార్యంబు గాఁగ
వేదజడుం డైన విధి పాశసంయుక్తుఁ
డైనను నాదుమాహాత్మ్య మమరఁ
బరమతపోనిధి పరమేశుఁ డుగ్రాక్షుఁ
డైన నపారశౌర్యంబు వెలయ
మఱియు నమర్త్యాహిమర్త్యాధిపతు లెంత
ఖచు లయ్యు నాయుధశూరులైన
ఆ. వె. నీక్షణంబ సతుల కెఱఁగింతుఁ బుష్పాస్త్ర
కౌశలమున నదియుఁ గాక పోర
నీను దళ్కనీక సెఱఁగింతు నత్యుగ్ర
బాణశక్తిఁ దన్నుఁ బంపు దేవ.
౪, ౪౪. (401)

అమీహి వీర్యప్రభవంభవస్య
జయాయ సేనాన్య ముశంతి దేవాః,
సచ త్వదేకేషునిపాతసాధ్యః
బ్రహ్మాంగభూ ర్బ్రహ్మణి యోజితాత్మా.
తస్మై హిమాద్రేః ప్రయతాం తనూజాం
యతాత్మనే రోచ యితుం యతస్వ,
..........................
..........................
గురో ర్నియోగాచ్చ నగేంద్ర కన్యా
స్థాణుం తపస్యంత మధిత్యకాయామ్
అన్వాస్తే. ౩, ౧౫; ౧౬;౧౭.

వ. హరగిరిజలు స్రష్టి కానుష్ఠానులై హిమ
వంతంబున నున్నవారు. వారికి సంగమంబు
నేసి జగద్ధితంబు నేయు మిది యనన్యవిష
యంబు నీవలనఁగాని యొరునకు సాధ్యంబు
గాదు కావున నిన్నుం బ్రార్థించితిమి.
౪, ౯౬. (403)

పయివానివలన వర్ణనలయందే కాక కథానువాదమున వివరించినరీతు లును సంగ్రహపఱిచిన రీతులును స్పష్టపడుచున్నవి.

ఈ సందర్భమున నొక పద్యము గలదు. దానికి మూలము కాళిదాస కృతభాగమున లేదు గాని పంౘౘండవసర్గలో తారకబాధఁ దెలుపుకొన వచ్చిన దేవతల నోదార్చుచు శివుఁడు వచించిన సందర్భమునఁ గలదు.

పరాభవం తస్య మహాసురస్య
నిషిద్ధ మేకోఽహ మలంభవిష్ణుః,
దావానలప్లోషవిపత్తి మన్యో
మహాంబుదా త్కిం హరతే వనానామ్.
౧౨, ౪౧.

మ. ధర నత్యుత్తము లైనధీరుల
మనస్తాపంబు వాపన్ మహా
పురుషానీకము యోపుఁ గాక మహి న
ల్పుం డోపునే యద్ధరా
ధరనై దాఘనితాంతదాహ ముడుపన్
ధారాధరానర్గళో
త్కరధారావళిఁ గాక యార్ప నగునే
గండూష తోయంబులన్
౪, ౯౭. (404)

వ. అని తన్ను నగ్గించుచున్న సురవల్లభుం
జూచిరతివల్లభుండు విజృంభించి.
౪, ౯౮. (405)

శ్లోకమున నుత్తరార్ధభాగమందుఁ గల భావమును ప్రధానముగాఁ జేసి కొని 'ధీరుల మనస్తాపము ధీరులే పాపఁగలరుగాని యల్పులు పాపఁ జాల'రను మార్పుతో సందర్భోచితముగ నలంకరించినాఁడు.

కుబేరగుప్తాం దిశ ముష్ణరశ్మౌ
గంతుం ప్రవృత్తే సమయం విలంఘ్య,
దిగ్దక్షిణా గంధవహం ముఖేన
వ్యలీకనిశ్వాస మి వోత్ససర్జ. ౩, ౫.

క. తననూడగు ధనదదిశాం
గననినునొడఁగూడఁబోకఁగఁ యామ్యదిశాం
గన నొచ్చి వెచ్చ నూర్చెనొ
యన శిశిరవిముక్తదక్షిణానిలమెసఁగెన్.
౪, ౧౫. (442)

మధు ద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వా మనువర్తమానః,
శృంగేణ చ స్పర్శనిమీలితాక్షీం
మృగీ మకండూయత కృష్ణసారః.
దదౌ రసా త్పంకజరేణుగంధి
గజాయ గండూషజలం కరేణుః,
అర్ధోపభుక్తేన బిసేన జాయాం
సంభావయామాస రథాంగనామ్నా.
గీతాంతరేషు శ్రమవారిలేశైః
కించిత్సముచ్ఛ్వాసితపత్రలేఖమ్,
పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి
ప్రియాముఖం కింపురుష శ్చుచుంబే.
౩, ౩౬; ౩౭; ౩౮.

సీ. కరి యిచ్చె నరమేసి కరిణికి సల్లకీ
పల్లవ ముల్లంబు పల్లవింప
మృగ మర్థిఁ గబళించి మృగి కిచ్చెఁ [illegible]ంచుద
ర్భాంకురంబులు చిత్త మంకురింప
హంస పెక్కువ నిచ్చె హంసికి నోరోర
నెలమూఁడు మొగముల నెలమి మిగుల
భృంగంబు దావితో భృంగికి దయ నిచ్చె
మధుధారముఖరాగమదము దలఁక
ఆ. వె. కిన్నరుఁడు గ్రోల్చెఁ గిన్నరివీనుల
రాగరసము మేన రాగ మెసఁగ
మధువిడంబనమున మగలును మగువలు
విరలిగొనిరి మదనపరవశమున.
౪, ౧౧౭. (469)

వసంతావిర్భావవర్ణనమున శ్లోకములలోనిభావము లాధారముగాఁ గొని యాంధ్రసంప్రదాయానుసారముగాఁబాదాంతములందు 'పల్లవముల్లంబుపల్లవింప' 'దర్భాంకురంబులు చిత్త మంకురింప' మొదలగునవి నియమముగాఁ జేర్చి శబ్దార్థాలంకారంబుల నలంకరించితదనుకూలముగాఁ గొంత మార్పు గావించి మనకవి సంస్కృతశ్లోకమునకు మెఱుఁగు పెట్టి యున్నాఁడు.

లతాగృహద్వారగతోఽథనందీ
వామప్రకోష్ఠార్పితహేమవేత్రః,
ముఖార్పితైకాంగులిసంజ్ఞ యైవ
మా చాపలా యేతి గణాన్వ్యనైషీత్. ౩, ౪౧.

క. శంభుసమాధికి విఘ్నా
రంభములై యులియువనచరములకు జిహ్వా
స్తంభగతి స్తంభము న
స్తంభములుగ నందిహస్తసంజ్ఞ నదల్చెన్.
౫, ౬. (486)

నిష్కంపవృక్షం నిభృతద్విరేఫం
మూకాండజం శాంతమృగప్రచారమ్,
తచ్ఛాసనా త్కాననమేవ సర్వం
చిత్రార్పితారంభ మి వావతస్థే. ౩, ౪౨.

వ. అంతం దదాజ్ఞాప్రభావంబున.
౫, ౭. (487)

క. మెలఁగక మృగములు విహగము
లులియక లేఁబొఱలఁజిగురులూత్తక మలయా
నిలుఁడు సలింపక నెలవుల
నలవడి వన మమరెఁ జిత్రితాటవివోలెన్.
౫, ౮. (488)

వసంతావిర్భావమునఁ గలిగినయుద్రేక మణఁగుటనేకాక సర్వము నిశ్చేష్టితమగుటను మూలానుసారముగా నలఁతిపలుకులలో మనకవి స్పష్టపఱచి నాఁడు.

వ. (కంతుఁడు) గౌరిహృదయం బున్మదనాస్త్రింబున భేదించిన నాక్షణంబ.

౫, ౨౯. (508)

వివృణ్వతీ శైలసుతాఽపి భావ
మంగైః స్ఫురద్బాలకదంబకల్పైః,
సాచీకృతా చారుతరేణ తస్థౌ
ముఖేన పర్యస్తవిలోచనేన. ౩, ౬౮.

మ. అలికాగ్రంబునఁ గ్రాలియాడి బొమలా
హ్లాదింపఁ గన్గోనలం
దలఁకన్ సమ్మదవారి మోవి యదరెం
దన్వంగిమై నొత్తె మత్
పులకల్ గంపము గూడ నూర్పు లెలమిం
బొండెన్ మనం బాత్మలో
నొలసెన్ రాగము మోమునం బొలసె గం
డోల్లాస హాసప్రభల్. ౫, ౩౦. (509)

గౌరి యవయవంబులతోఁ బ్రకటించిన సాత్వికాదిభావములు తచ్చేష్టావర్ణనతోఁగవి భావనావిశేషమున స్వభావోక్తిగాఁ బై పద్యమున వివరించి నాఁడు.

(హరుఁడు) మఱియుఁ గనుబేటంబైన దావ
గొనక. ౫, ౪౪. (523)

హరస్తు కించిత్పరిలుప్తధైర్యః
చంద్రోదయారంభ ఇవాంబురాశిః,
ఉమాముఖే బింబఫలాధరోష్ఠే
వ్యాపారయామాస విలోచనాని. ౩, ౬౭.

సీ. పులకాంకురంబులు దలలెత్తిమేను గం
పింపఁ గోమలిఁ గౌఁగలింపఁ దలఁచు
రాగోత్కటమున సైరణ లేక మానినిఁ
గాయ్యానఁ బైఁబడి కవయఁ దలఁచు
లలితాంగి యవయవములు సూచి మఱిఁ దని
వోవక చూడ్కులఁ ద్రావఁ దలఁచు
నధరోష్ఠ మదరంగ నంతస్స్మితాంశులు
దలుకొత్త నేమేనిఁ బలుకఁ దలఁచుఁ
తే. దన మహత్త్వంబు దలఁపక తరుణిపొందు
వడయఁ గీడ్పడి తేఁకువ వాపఁ దలఁచు
భావజాస్త్రాభిహతి మహాదేవుఁ డొక్క
ప్రేలిమిడిఁ బెంపుసెడి కడు విరలిగొనియె.

౫, ౪౫. (524)

పై వానిలో సీసమందలిమూఁడవపాదములోనిభావము మూలశ్లోకైకాంశము. మూలములోని యుపమాలంకారమును విడిచిపెట్టి హరుని భావజ

వికారచేష్టలు మనకవి పెంచినాడు. * ఇం దుద్భటుని కుమారసంభవముపోలిక కొంతగనఁబడుచున్నది.

వ. అంత కంతకాంతకుండు కంతుం గనుంగొని
కోపించి ప్రళయకాలాగ్నిరౌద్రోద్రేకంబునం
బెరిగి దహనాంబకంబు విచ్చిచూచిన.
౫,౪౮. (527)

తపః పరామర్శవివృద్ధమన్యోర్
భ్రూభంగదుష్ప్రేక్ష్యముఖస్య తస్య,
స్ఫుర న్నుదర్చిః సహసా తృతీయా
దక్ష్ణః కృశానుః కిల నిష్పపాత. 3, ౭౧.

చ. పొగయక రాజ కొక్కుమొగి
భోరన మంటలు విస్ఫులింగముల్
నెగసి రయంబునం గలయ
నిండిఘటచ్చట ఘుగ్ఘుగద్ధగ
ద్ధగ యన మండి పంచశరు
దగ్ధముచేయుచ యాక్షణంబులో
మగిడె పురారినేత్రశిఖి
మత్తమహాశనిపాతభీమమై. ౫,౪౯.(528)

క్రోధం ప్రభో సంహర సంహరేతి
యావ ద్గిరః ఖే మరుతాం చరంతి,
తావ త్స వహ్ని ర్భవనేత్రజన్మా
భస్మావశేషం మదనం చకార. 3, ౭౨

చ. అనల శిఖాళిఁగాంచి య
భయం బభయం బని దేవతల్ నభం
బునఁ జెలరేఁగి చీరుటకు
మున్నమనోభవు నీఱుసేసి పో
యినఁ గని దిక్పతుల్ సురలు
నింద్రుఁడు శోకభయార్తులై మరుం
బనవుచుఁ బాటి రొండొరుల
పట్టులు గానక భీవికారులై. ౫,౫౩.(532)

ఇందు రుద్రుని 'దుష్ప్రేక్ష్య' తయుఁ దృతీయనేత్రాగ్నిసహసానిష్పతనమును దేవతలభయోద్వేగమును నన్నిచోడకవి చక్కఁగా వివరించుచు రచించెను.

సపది ముకుళితాక్షీం రుద్రసంరంభభీత్యా
దుహితర మనుకంప్యా మద్రి రాదాయ దో
ర్భ్యామ్,
సురగజ ఇవ బిభ్ర త్పద్మినీం దంతలగ్నాం
ప్రతిపథగతి రాసీ ద్వేగదీర్ఘీకృతాంగః.
3, ౭౬.

వ. అంత వృత్తాంతంబు హిమవంతుం డెఱింగి
రయంబునఁ జనుదెంచి యాక్షణంబున.
౫,౫౬. (535)

గీ. కేలు ప్రిదిలి తటిల్లత నేలఁబడినఁ
బరవసంబున శారదాభ్రంబు మగుడ
నెత్తికొని పోవుగతి సుమ హిమనగేంద్రుఁ
డెత్తికొని నిజపురమున కేఁగె నంత.
౫, ౫౭. (536)

* చూ. ఉద్భటుని కుమారసంభవము అనుశీర్షిక.

పై శ్లోకములో నున్న 'పద్మినిని సురగజము వ్రాలె' అను నుపమానమునఁ బద్మినీగజములకు విరోధిభావము సుప్రసిద్ధము గాన నది యుచితము గా దని యెంచికాఁబోలు మనకవి మార్చినాఁడు.

తీవ్రాభిషంగప్రభవేణ వృత్తిం
మోహేన సంస్తంభయ తేంద్రియాణామ్,
అజ్ఞాతభర్తృవ్యసనా ముహూర్తం
కృతోపకారేవ రతి ర్బభూవ. ౩, ౭౩.
అయి జీవితనాథ జీవసీ
త్యభిధా యోత్థితయా తయా పురః,
దదృశే పురుషాకృతి క్షితౌ
హరకోపానలభస్మ కేవలమ్. ౪, ౩.

వ. ఇట్లు రతిపతి నగ్నిశిఖలు గప్పుడు భయరసావేశంబునం దల్లడిల్లి.

క. పరవశయై పడి రతి సె
చ్చెర దెప్పిఱి లేచి చూచి శిఖిపొడవు నిజే
శ్వరుపొడవు గాన కచ్చటఁ
బురుషాకృతినున్న భస్మపుంజముఁ గాంచెన్.
౫, ౫౯. (538)

మొదటి శ్లోకములోనిభావమును 'భయరసావేశంబునఁ దల్లడిల్లి పరవశయైపడి' అనుదానిలో సంగ్రహపఱచినాఁడు. 'హరకోపానల భస్మకేవలమ్' అనుదానిలో నున్న 'కేవల'శబ్దభావమును వివరించుటకై శిఖిపొడవును, నిజేశ్వరుపొడవును గానరావయ్యె నని స్పష్టపఱచెను.

మదనేన వినాకృతా రతిః
క్షణమాత్రం కిల జీవి తేతి మే,
వచనీయ మిదం వ్యవస్థితం
రమణ త్వా మనుయామి యద్యపి. ౪, ౨౧.

గీ. నన్ను నొరయంగ వేఁడియే నాథ యిచటఁ
బొడవు చూపక డాఁగి తీ పొదలలోన
నిన్నుఁ బాసి భరింతు నే నిమిషమైనఁ
గామరహితంబుగా రతి గలదె యెందు.
౫, ౬౩. (542)

క. రతిహితుఁడ వనఁగ నెప్పుడు
రతిసంగతి నుండు దీవు రతి నిప్పుడు దుః
ఖితఁజేసి పోయి తక్కట
రతి వంచన చేసి పోక రసికులగుణమే.
౫, ౬౪. (543)

ఇట మూలభావము గ్రహించి కొంచెము మితిమీఱి 'రతి వంచన సేసిపోక రసికులగుణమే' అని సమయానుచితధ్వని కవకాశము మనకవి కల్పించినాఁడు.

రచితం రతిపండిత త్వయా
స్వయ మంగేషు మ మేద మార్తవమ్,
ధ్రియతే కుసుమప్రసాధనం
తవ తచ్చారు వపు ర్న దృశ్యతే. ౪, ౧౮.

చ. సలలితసాంద్రకుంకుమము
చన్నులపై మెయిఁ బ్రీతి నాకు నీ
వలఁదినచందనంబు తడి
యారదు నేనియు నంగజన్మనీ
విలసితచారురూపతను
విభ్రమసంపద లీక్షణంబులోఁ

బొలుపఱఁ గాలి యాఱె నహి
భూషణకోపదవానలాహతిఁ.

గ, ౭౨.(551)

'నీవు గావించిన వాసంతపుష్పాలంకారము అట్లే యున్నది. వాడనైన లేదు. నీ వింతలోనే యంతరించితివి' అనుమూలములో నలంకరణనిర్మాణమునకును మన్మథునిమరణమునకు వ్యవధిలేమిని దెలుపుటయే ముఖ్యముగాన మన మహాకవి 'పుష్పాలంకరణ మంత శీఘ్రముగాఁబోవునది కాదు' అని యెంచి యంతకంటె నవ్యవధిని దెలుపుటకై 'నీ వలఁదినచందనంబు తడి యాఱదు నేనియు' నని మార్చినాఁడు. ఆతని కాభావము తోఁచుటకు మూల శ్లోకభావమే మూలము కావచ్చును. మనకవి దానికి మెఱుఁగు పెట్టినాఁడు.

పరలోకనవప్రవాసినః
ప్రతిపత్స్యే పదవీ మహం తవ,
విధినా జన ఏష వంచిత
స్త్వదధీనం ఖలు దేహినాం సుఖమ్. ౪, ౧౦.
అవగమ్య కథీకృతం వపు,
ప్రియబంధో స్తవ నిష్ఫలోదయః. ౪, ౧౩.

సీ. ప్రీతి నీ విసుకలి చేటంబుగొనియున్న
వెలఁదుల చేటంబు వృథయకాఁగ
గర మర్థి నినుఁజూచి కనుకలిఁ గలిచిన
పడఁతుల కల్పు నిష్ఫలముగాఁగ
దివుటతో నినుడాసి కవయంగఁగోరెడు
వనితలకోరిక వమ్మగాఁగ
ననురక్తి నినుఁగూడి మనఁగంటి మంటి నే
ననురతిమనువు మాయంబుగాఁగ
తే. జగములందు నీ ప్రాపుచే నెగడి నెరయఁ
బ్రబలుఁడైన వసంతుప్రాపు చెడఁగ
దగునె వలరాజ నీకింత తెగఁదలంచి
పరమ క్రోధాగ్నిలోఁబడి యెరసిపోవ.

గ, ౭౪. (553)

లోకము విధిచే వంచిత మయ్యెనని సామాన్యముగా సంస్కృతమున నున్నది. స్త్రీస్వభావానుసారముగఁ బ్రియసౌందర్యాతిశయాదులను సూచించునట్లు విశేషాపేక్షితముగా దైవవంచితులను మనకవి చెప్పినాఁడు. అట్లు చెప్పుటకు ౪, ౧౩వ శ్లోకములోని భావము కొంతస్ఫురణ గలిగించియుండును.

క్వను మాం త్వదధీనజీవితాం
వినికీర్య క్షణభిన్నసౌహృదః,
నలినీం క్షతసేతుబంధనః
జలసంఘాత ఇ వాసి విద్రుతః. ౪, ౬.

గీ. తగిలి నాజీవమునకు సాధారమైన
నీవు ననుఁబెట్టి పోఁజన్నె భావజన్మ
కట్ట యవియుడు నీరులు గల్వవాసి
బయలుపడ డించిపోయిన భంగినోలె.

'కల్వ'యనుచోట 'కట్టు' అని ముద్రితము.

గ, ౭౭ (557)

ఇది కొంచెము మార్పుతోఁ జేసిన యనువాదము.

ఉపమాన మభూ ద్విలాసినాం
కరణం య త్తవ కాంతిమ త్తయా,
త దిదం గత మీదృశీం దశాం
నవిదీర్యే కఠినాః ఖలు స్త్రియః. ౪,౫.

ఆ. వె. ప్రాణవల్లభుండు భస్మపుంజముగ నా
యెదురఁ జూడఁ జూడ నెరసిపోక
గనియు నోడలఁబాఁచఁ గనదయ్యె నగ్గడి
జీవ మింక నేమి సేయుదాన.
౫, ౯౨. (571)

తే. అంత నొచ్చంబు లేని నెయ్యమునఁగూడి
యున్నపతిఁ బాసి తెగువ లేకున్నదాన
నేను మొదలుగ నింక నొండెవ్వ రాఁడు
వారు సిక్కని డెందంబు వారు జగతి.
౫, ౯౩. (572)

ఇందు శ్లోకములోని చివరపాదములందలిభావమును ఆత్మనిందాధిక తతో మనకవి వివరించెను. కేవలము విలాసితకంటె 'నొచ్చెములేనినెయ్యము ఎక్కువది' యని యాతఁడు భావించెను.

కొన్నిశ్లోకములభావము ప్రత్యక్షముగా మనకవి గ్రహించినను సందర్భవిశేషముల నెట్లు మార్పు గావించునో చూతము. రతీదేవి భర్తృవియోగ దుఃఖమున చితాప్రవేశము చేయఁబోవ నాకాశవాణి యామెను నివారించుచుఁ బలికిన పలుకులు రెండు గ్రంథములందును సవిమర్శముగాఁ బరిశీలింపఁదగును.

కుసుమాయుధపత్ని దుర్లభ
స్తవ భర్తా న చిరా ద్భవిష్యతి,
శృణు యేన స కర్మణా గతః
శలభత్వం హరలోచనార్చిషి.
అభిలాష ముదీరి తేంద్రియః
స్వసుతాయా మకరో త్ప్రజాపతిః,
అథ తేన నిగృహ్య విక్రియా
మభిశ ప్తః ఫల మేత దన్వభూత్.
పరిణేష్యతి పార్వతీం యదా
తపసా తత్ప్రవణీకృతో హరః,
ఉపలబ్ధసుఖ స్తదా స్మరం
వపుషా స్వేన నియోజయిష్యతి.
ఇతి చాహ స ధర్మయాచితః
స్మరశాపావధిదాం సరస్వతీమ్,
అశనే రమృతస్య చోభయో
ర్వశిన శ్చాంబుధరా శ్చయోనయః.
౪౯; ౪౦; ౪౧; ౪౨; ౪౩.

వ. అగ్నిప్రవేశంబు సేయుదు నని రతి మరణనిశ్చయంబు సేసిన.

క. ఆకాశవాణి మృదురుతు
లాకాశమునందుఁ జెలఁగ నంగజు దయతో
నీ కిచ్చు నిక్కువముగఁ ద్రి
లోకహితార్థమ్ముగాఁ ద్రిలోచనుఁడనినన్.
౫, ౯౫. (574)

వ. సంభ్రమించి వియత్తలంబు గనుంగొని యాలించి మఱుమాట లేమికిం దురపిల్లుచు నుగ్రకోపానలాహతుం డయ్యెను గ్రమ్మఱ నే యనుచున్నదానికి గగన సరస్వతి నిశ్చయంబుగా వెండియు నిట్లనియె. ౫, ౯౬. (575)

ఉ. అట్టి మహోగ్రకోపదహ
నాంబకుఁ డట్టె దయాగుణంబు దాఁ
బుట్టి మనోజు నిచ్చునటె
పోలదు నాఁ జన దభ్రపఙ్క్తిలోఁ
బుట్టె నిరమ్మదాగ్నియును

ఘూరితరామృతవృష్టి దీనిచా,
పృట్టిది నాఁగ నెవ్వరికి నీశ్వర
తత్త్వ మెఱుంగఁ బోలునే.

గ, నా. (576)

ఆకాశవాణి యిట్లనియె. 'నీ భర్త నీకు మరల లభించును. మన్మథుఁ డేకర్మముచేత నీశ్వరనేత్రాగ్నిలో శలభమయినాఁడో చెప్పెద విను. మున్ను (మన్మథునిచే) నుద్రేకింపఁ జేయఁబడిన యింద్రియములు గలవాఁడయి బ్రహ్మ తనకూఁతు నభిలషించెను. అంతలో నింద్రియముల నిగ్రహించు కొని బ్రహ్మ నీభర్తను శివనేత్రాగ్నిలో దగ్ధుఁడగునట్లు శపించెను. అపుడు 'లోక రక్షణార్థము మన్మథుని ననుగ్రహింపు' మని కోరిన ధర్ముఁడను ప్రజాప తితోఁ 'బార్వతిని శివుఁడు పెండ్లాడినపుడు శివుఁడు మన్మథుని మరల సశరీరునిఁ గావించునని' బ్రహ్మశాపావధిని జెప్పెను. (అంతగాఁ గోపమునొందిన వాని కిట్టి శాంతి యెట్లు గలిగె ననంగాఁ జితేంద్రియులును సంబుధరములునుపిడు గునకు నమృతమునకుఁగూడఁ బ్రభవస్థానములు గదా అని శ్లోకములలో నున్నది. బ్రహ్మశాపమును మన్మథకర్మఫలమును దెనుఁగునఁబరిత్యక్తములు: 'లోకహితార్థ మీశ్వరుఁడు నిశ్చయముగా నంగజు నిచ్చును' అని యాకా శవాణి యూఱకుండిన 'నీశ్వరకోపానలాహతుఁడు మరల జీవించునే' అని యను చున్న రతికి 'నీ వట్లనుకొన నక్కఱలేదు. ఈశ్వరతత్త్వ మెఱుంగ శక్యమా! అభ్రపఙ్క్తిలో నిరమ్మదాగ్నియు నమృతవృష్టియుఁ బుట్టుటలేదా యని' సమ ర్థించి చెప్పెను. ఇందీశ్వరునకే ప్రాధాన్యము చూపఁబడినది. మరుఁడు మ రలఁ గ్రమ్మఱునాయని సంశయముతోఁ బ్రశ్నసేయురతీదేవికిఁ జెప్పిన ప్రత్యు త్తరమునుబట్టియామెకు దివ్యవచనంబులందు నమ్మిక యెక్కువ యగుటకు నవ కాశము చూపఁబడినది. 'అశనే రమృతస్య చోభయో ర్వశిన శ్చాంబుధరా శ్చయోనయః' అను నర్థాంతరమును మూలమునుండి గ్రహించి సందర్భ భేదమునఁ జక్కగ నతికించుటలో మనకవినై పుణ్యము విదిత మగుచున్నది. నాటక రచనారీతి యిందుఁ దోఁచునట్లు కూర్పఁబడినది.

యథాప్రసిద్ధై ర్మధురం శిరోరుహైర్
జటాభి రప్యేవ మభూ త్తదాననమ్,
నషట్పదశ్రేణిభి రేవ పంకజం
సశైవలాసంగ మపి ప్రకాశతే.
గ, నా.

తే. కురులతోఁగూడ విలసిల్లు గిరిజ మొగము
జడలు దాల్చినఁగడు చెడం గడరి పొల్చె
భృంగములు మూఁగి చెలువొందు విసరు
హంబు
పాఁచిదాల్చియుఁ గరమొప్పు భంగివోలె.
కు, నా. (742)

ఇది తూఁచినట్లు రచించిన యనువాదము.

పున ర్గ్రహీతుం నియమస్థయా తయా
ద్వయేఽపి నిక్షేప ఇవార్పితం ద్వయమ్,
లతాసు తన్వీషు విలాసచేష్టితం
విలోలదృష్టిం హరిణాంగనాసు చ. ౫, ౧౩.

చ. అలకలపొల్పు తేఁటిగము
లందు మదాలసయానలీల హం
సలకడ వక్త్రభాతి జల
జంబులపైఁ దనుకోమలంబుఁ దీ
గలదెస దృగ్విలాసము మృ
గంబులచే నగజాత యిల్లడల్
గలయఁగఁ బెట్టె నాఁ దనువి
కాసము లేఁడెఁ దపఃప్రసంగతిన్.

౬, ౯౧. (748)

కాళిదాసు పార్వతిచేఁ దనువిలాసవిలోలదృష్టులు రెండే లతాంతహరిణాంగనలందు వరుసగా నిల్లడవెట్టించినాఁడు. నన్నిచోడుఁడు మఱి మూఁడు పదార్థములు మఱిముగ్గురయొద్ద నిల్లడయుంపించినాఁడు. మొదటి రెండును జూడఁగా భావకకవికి మఱి మూఁడుస్ఫురించుట సహజమేకదా. తోఁచిన భావన నణఁపక యాపద్దులో జమకట్టినాఁడు.

స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధనిపాతచూర్ణితాః,
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోదబిందవః. ౫, ౨౪.

చ. అడరునవాంబుధారలు
జటాటవిలోఁబడి విభ్రమించి వె
ల్వడి చనుదెంచి రాలుగొని
పక్ష్మముల న్వెడ నిల్చిమోవిపైఁ
బడి కుచఘట్టనం జెదరి
పాటి రయంబున ముత్తరంగలన్
మడుఁగులు వాటి నాభి కడ
మానక చొచ్చె ననుక్రమంబునన్.

౬, ౧౧౦. (767.)

మూలమునం దున్నదానికంటెఁ బ్రథమమున జటాటవీపతనము మాత్రము తెనుఁగున నధికముగాఁ జేర్పఁబడినది. అవి సహజముగాఁ బక్ష్మములమీఁదఁబడు నప్పటి విలాసము వర్ణింపఁబడినది.

ముఖేన సా పద్మసుగంధినా నిశి
ప్రవేపమానాధరపత్రశోభినా,
తుషారవృష్టిక్షతపద్మసంపదాం
సరోజసంధాన మివాకరోదపామ్.౫,౨౭.

తే. తనరి హేమంత మగుడుఁబద్మంబు లడఁగి
పోయెఁబోయినగొల నొక్కపువ్వు తనకు
విత్తుగా దాఁచికొనియున్నవిధము పోలె
శైలసుతముఖ ముదకవాసమున నొప్పె.

౬, ౧౨౭. (788.)

ఈ భావముపయినే మఱికొంత భావనచేసి కవి రచించినపద్యమురీతి చూతము.

చ. వనజములెల్ల మంచుగొని
వాడినచో నొకపువ్వు నిల్చినక్
గని యలు లన్నియు న్నెలవు
గైకొని దీనికి ముచ్చు వచ్చునో
యనువగ మీఁదఁ బిండుకొని
యడ్డము నిల్చెనొ నాఁగ నంబుజా
ననముపయిన్ జటావళి పె
నంగి నగాత్మజ కొప్పున త్తఱిన్.

౬, ౧౨౮. (785)

ఈ భావములస్ఫురణకు కాళిదాసశ్లోకమే మూలకారణముగా వచ్చును.

శుచౌ చతుర్ణాం జ్వలతాం హవిర్భుజాం
శుచిస్మితా మధ్యగతా సుమధ్యమా,
విజిత్య నేత్రప్రతిఘాతినీం ప్రభా
మనన్యదృష్టిః సవితార మైక్షత. ౫, ౨౦.

మ. పరితాపోగ్రనిదాఘవేళ శిలపైఁ బంచాగ్ని
మధ్యంబునన్, బరమధ్యానసమేత యై
నిలిచి విభ్రాజిల్లె నుద్యత్తప, శ్చరణాలం
కృతకైలనందన గనత్సంధ్యారుణాం
భోధరో, త్కరమధ్యస్థిరకాంతకాంతి
యుతశీతద్యోతిలేఖాకృతిన్.

౬, ౧౪౨. (799)

క. ఛటఛటఁ బేలుచు నలుగడఁ
బటుతరశిఖిశిఖలు నెగయఁబదిలముగా నుం
గుటము ధర నూఁది సుస్థితిఁ
గుటిలాలకవదన మెత్తికొని రవిఁ జూచెన్.

౬, ౧౪౩. (800)

తెనుఁగున సంస్కృతముకంటెఁ గొంచె మధికవర్ణనము గనఁబడు చున్నది.

అథాజినాషాఢధరః ప్రగల్భవాగ్
జ్వల న్నివ బ్రహ్మమయేన తేజసా,
వివేశ కశ్చి జ్జటిల స్తపోవనం
శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా. ౫, ౩౦.

సీ. మెఱుఁగుఁదీగెలతోడి మేఘంబు నాజన్ని
దములతోఁ గృష్ణాజినము ధరించి
మకరధ్వజుతోడి మరుపచ్చవిల్లు నాఁ
గోఁచితో మోదుగుఁ గోలవట్టి
చంద్రికతోడి తుషారపుంజంబు నాఁ
దనుకాంతితో భూతిధామ మెసఁగ
వీణారవముతోడి వేదనాదంబు నా
రాగమ్ముతోడ శివాగమములు
తే. చదువుచును బ్రహ్మవర్చసపదవితోడి
దివ్యతేజంబు మొగమునఁ దేజరిల్ల

సుందరాకార మమర బాలేందుధరుఁడు
దాల్చి చనుదెంచె గిరిరాజతనయకడకు.
౭, ౩. (834)

మూలమునందున్న 'యజినాషాఢధరత్వమును, ప్రగల్భవాక్త్వమును,' ఉత్ప్రేక్షలతోఁ గొంతచేర్చి మనకవి పెంచినాఁడు.

విక్షీర్ణసప్తర్షిబలిప్రభాసిభి
స్తథా న గాంగైః సలిలైర్దివశ్చ్యుతైః,
యథా త్వదీయైశ్చరితైరనావిలై
ర్మహీధరః పావిత ఏవ సాన్వయః ౫, ౩౭.

చ. పరమకపర్దసంగమునఁ
బావనమైనసురాపగాంబువుల్
శిరమునఁ దాల్చి ముందఱు ప్ర
సిద్ధియు సిద్ధియుఁ గన్నకంటె నీ,
పరమతపఃప్రభావమునఁ
బర్వతవల్లభుఁ డిప్పు డెంతయున్
నిరుపమకీర్తిమైఁ దనరి
నిర్మలుఁ డయ్యె జగంబులోపలన్.
౭, ౧౩. (844)

సీ. స్వర్గార్థియందమే స్వర్గంబు దమహిమ
గిరిచరులం దోళకెలన నుండు
నర్థార్థియందమే నర్థేశకంటెను
దనపుట్టినింటనె ధనము గలదు
పురుషార్థియందమేఁ బురుషులు
దనుఁ గోరి తపమర్థిఁ జేయంగఁ దగినరూపు
మోక్షార్థియందమే ముగ్ధ దా మోక్షంబు
దలఁపంగ నేనియుఁ దఱియుఁ గాదు
తే. ముఖవికాసంబు చూడ నీముదితవలనఁ
గామభోగాభిలాషయ కలిగినదియ
దీనిఁ దగిలించి తగులక తాన స్థైర్య
వంతుఁడైయున్న సొబగుఁ డెవ్వండొ జగతి.
౭, ౧౫. (848)

దివం యది ప్రార్థయసే వృథాశ్రమః
పితుః ప్రదేశాస్తవ దేవభూమయః,
అథోపయంతార మలం సమాధినా
న రత్నమన్విష్యతి మృగ్యతే హి తత్. ౫, ౪౫.

గీ. నిన్నుఁ గోరి తపంబులు నిష్ఠ నొరులు
సేయఁగోరుచోఁ దప మీవు సేసె దబల
రత్నములు గోరి విని జనుల్ రాక జనుల
రత్నములు గోరి వైవడిరాకఁ బోలు.
౭, ౨౨. (853)

శ్లోకములోనున్న భావమే మిగిలినభావములను కవికి స్ఫురింపఁజేసియుండును. 'న రత్నమన్విష్యతి మృగ్యతే హి తత్' అనుమూలము నన్నిచోడునిచే వేఱొకపద్యము రచింపఁజేసినది. ఈసందర్భమున నింకను జెంపకము గలదు.

ద్రుమేషు సఖ్యా కృతజన్మను స్వయం
ఫలం తపఃసాక్షిషు దృష్ట మేష్వపి,
న చ ప్రరోహాభిముఖోఽపి దృశ్యతే
మనోరథోఽస్యాః శశిమౌళిసంశ్రయః.
౫, ౬౦.

సీ. ఈనీరజానన దాన కుదురు చేసి
వలయు బీజములెల్ల మొలవఁబెట్టి
నిచ్చలు నిష్ఠతో నీరులు వోయంగ
నెలమితో నన్నియుఁ గలయ మొలచి
పెరిగి నానావిధతరులతాగుల్మాదు
లేచె నయంబునఁ బూచి కాచి
ఫల మందె నేనియు మొలకయు మొలవ దీ
చెలువతపఃఫలసిద్ధివలన
తే. నింక నెన్నండు దయఁబర మేశ్వరుండు
గన్నడెఱచునో యని తనకున్న రూపు
నెఱయఁజెప్పిన విని కేలు చఱచికొనుచు
నఱమపాఱుండు ప్రక్కలు విఱుగనగుచు.
౭, ౧౯. (850)

తెనుఁగుపద్యము సంస్కృతశ్లోకమునకు వివరణప్రాయము.

ద్వయం గతం సంప్రతి శోచనీయతాం
సమాగమప్రార్థనయా పినాకినః,
కలా చ సా కాంతిమతీ కలావతః
త్వ మస్య లోకస్య చ నేత్రకౌముదీ. ౫, ౭౧.

చ. జనులు విరుద్ధవేషియగు
శంకరు నేలకొ యిందుఁ డొందెఁ బా
వనతరుఁజంచుఁ జిత్తముల
వందఁగ దానిపయిం ద్రిలోకశో
భన వగు నీవు నాతపసి
పాల్పడి మిక్కిలివంత చేసెదో
యని యనిశంబుఁ దద్దయు భ
యంపడుచున్నది లోక మింతయున్
౭, ౨౩. (854)

'ఏలకొయిందుడొందె' అనుచోట 'ఏలకొయందురొండె' అని ముద్రితము. అప్పుడు అన్వయము సరిపడదు గాననిట్లు సవరణ చేయఁబడినది. మూల శ్లోకములోని భావము సరిగా నాంధ్రీకరింపఁ బడినది.

అమంగలాభ్యాసరతిం విచింత్య తం
తవాఽనువృత్తిం న చ కర్తు ముత్సహే.
౫, ౬౫.
విలోక్య వృద్ధోక్ష మధిష్ఠితం త్వయా ౫, ౭౦.

క. తొడవులు చివికినయెమ్ములు,
గుడిముట్టు గపాల మిల్లు గుడి నుడియెద్దె
క్కుడు గట్టువలువు దో లగు
బడరునకై నవయ నేమి ప్రళయమువచ్చెన్.
౭, ౩౯. (870)

ఈపట్టున నధికభాగము మూలమునకు వివరముగా నున్నది.

వ. వరదుండు గౌరి నిశ్చలభక్తియుక్తికి
ననురక్తుండై యాక్షణంబ ప్రత్యక్షుండై నిజ
స్వరూపంబు చూపిన. ౭, ౫౭. (887)

స్వరూప మాస్థాయ చ తాం కృతస్మితః
సమాలలంబే వృషరాజకేతనః. ౫, ౮౫.

సీ. శిరమున సురసింధుశీకరావలికంటె
నటమున్న యొగసె శీతాంశురుచులు
ఫాలతటాంబకోద్భాసనంబునకు మున్న
మిడివడి తనరెఁ గెంజడలచాయ
గళమున విలసిల్లు గరళంబునకు మున్న
కాలాహిభూషణకాంతి మిగిలెఁ
బాండురాంగోన్నతప్రభకంటె ముందఱ
పర్వె లిప్తామలభస్మదీప్తి
తే. కటివృతవ్యాప్త చర్మంబుకంటె మున్న
మేఖలోరగ ఫణములు మిగిలి వెలిఁగెఁ
బాదపీఠోరు వజ్రప్రభాళికంటె
మున్న పదనఖసంకాశ మున్నతిల్లె.
౭, ౫౮. (889)

ఈశ్వరుఁడు ప్రత్యక్షమగునపుడు గోచరమగువిషయములను భావనాశక్తితోఁ గ్రమక్రమముగా శిరమునుండి పాదమువఱకుఁ జిత్తరువు కంటికిఁ జూపినట్లు రచించుట సన్నిచోడుని యనన్యసాధారణప్రజ్ఞను జాటుచున్నది.

అథ విశ్వాత్మనే గౌరీ
సందిదేశ మిథ స్సఖీమ్,
దాతా మే భూభృతాం నాథః
ప్రమాణీక్రియతా మితి. ౬, ౧.

క. గిరిసుత కన్యాగుణ మా
దరమున మును సుప్రతిష్ఠితము సేసి లసత్
పరిణయపూర్వకమున నీ
శ్వర సుదతిఁ బరిగ్రహింపు సన్మార్గమునన్.
౭, ౭౬. (906)

యస్య చేతసి వర్తేథాః
స తావత్ కృతినాం వరః,
కిం పున ర్బ్రహ్మయోనే ర్య
స్తవ చేతసి వర్తతే. ౬, ౧౮.

క. త్రినయన నీ వెవ్వని మన
మునఁ దగ వర్తించి తతఁడు ముక్తుం డగు నీ
మనమున వర్తించితి మఱె
ధనదసఖా యేమె కామె ధన్యుల మెందున్.
౭, ౮౭. (916)

అలకా మతివా హ్యైవ
వసతిం వసుసంపదామ్,
స్వర్గాభిష్యందవమనం
కృత్వే వోపనివేశితమ్. ౬, ౩౭.
గంగా స్రోతః పరిక్షిప్తం.

సీ. వేదాదు లగుమహావిద్యలకెల్లను
వనజాసనుఁడు దాను నునికిపట్టు
శృంగారవతు లగునంగనావలి కెల్ల
నమరావతియుఁ దాను నాలయంబు
లనుపమానర్ఘ్యరత్నానీకముల కెల్ల
నంభోనిధియుఁ దాను నాకరంబు
లక్షయం బగునసంఖ్యార్థరాసుల కెల్ల

వప్రాంత ర్జ్వలనౌషధి,
బృహన్మణి శిలాసాలం. ౬, ३౮.
....................
యక్షాః కింపురుషాః పౌరాః
యోషితో వనదేవతాః. ౬, ३౯.

నలకయోఁ దానును నిలయము లన
తే. వఱలు పేర్మితో భారతవర్షమునకు
భూషణంబన నధికవిభూతి దనరి
పరఁగు హిమనగాధీశ్వరు పురవరంబు
ప్రస్తుతం బగునోషధీ ప్రస్థపురము.
౭, ౬౭. (923)

పై శ్లోకములలోని భావములను భావనావిశేషమున, సమరసముగాఁ బెంచి కూర్చెను. 'గంగాస్రోతః పరిక్షిప్తమ్' అనునది మనకవి రెండు పద్యములలో గంగను వర్ణించుటకు మూలకారణమైనది.

చూ. ౭, ౯౧ (920); ౭, ౯౨ (921).

యం సర్వశైలాః పరికల్ప్య వత్సం
మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే,
భాస్వంతి రత్నాని మహౌషధీశ్చ
పృథూపదిష్టాం దుదుహు ర్ధరిత్రీమ్. ౧, ౨.

సీ. మును మహీధేనువు చనువత్సమై కుడ్చి
వస్తుసంపూర్ణమై వఱలువాఁడు
కమఠోరగేంద్ర దిగ్గజరాజి దాల్చుభూ
భార మెక్కటి దాల్చి పరగువాఁడు
త్రైలోక్యజనని యై తనరుశర్వాణికి
జనకుండు నా నడిసన్నవాఁడు,
విశ్వైకగురుఁ డగునీశ్వరునకు నర్థి
మామ గా నెగడినమహిమవాఁడు
తే. తుహినకరతీవ్రకరహుతవహులు పరుసఁ
బాచు తమ మోషధీప్రభాభాతి దాన
పాచి విలసిల్లు పాండుదిగ్భరితకీర్తి
మంతుఁడచలుండుపతిహిమవంతుఁడతఁడు.
౭, ౧३౭. (965)

తే హిమాలయ మామంత్ర్య
పునః ప్రాప్యచ శూలినమ్,
సిద్ధం చాస్మై నివేద్యార్థం
తద్విసృష్టాః ఖ ముద్యయుః. ౬, ౯౪.

వ. (సప్తర్షులు) నగపతిచేత సత్కృతులై
వీడ్కొని చనుదెంచి రంత. ౭, ౧४४. (974)
వ. హిమవంతునకుఁ గూఁతుం గంతులు
ననిన మునిగణంబు మగిడివచ్చి. ౮, ౨.

పయి శ్లోకమందు సంక్షేపముగాఁ జెప్పిన విషయము విస్తరించి వర్ణించుటవలనఁ గొంత పెరిగినది. కాళిదాసు విస్తరించినచోట్ల సంగ్రహించుటయు సంగ్రహించినచోట విస్తరించుటయు మనకవి కభ్యస్తముగాఁ గనఁబడును.

వ. అని యనేక ప్రకారంబుల నగజరూప
విభ్రమసౌందర్యవిలాసంబులును.........
వర్ణించుచున్న సప్తమహర్షుల వచనంబు
లతనుపంచబాణంబులైన ట్లిందుధరుడెం

క మపర మవశం న విప్రకుర్యుర్
విభు మపి తం య దమీ స్పృశంతి భావాః,
పశుపతి రపి తాన్యహాని కృచ్ఛ్రా
దగమయ దద్రిసుతాసమాగమోత్కః.

౬, ౯౫.

దంబు భేదించిన రాగోత్కటంబునం
దావగొనక. ౮-౯౯.

శివుని యుత్కంఠ యిట సంగ్రహింపఁబడినది. నన్నిచోడుఁ డింతకు ముందే శివుని యుత్కంఠ సవిస్తరముగా వర్ణించి యున్నాఁడు.

త మభ్యగచ్ఛ త్ప్రథమో విధాతా
శ్రీవత్సలక్ష్మా పురుషశ్చ సాక్షాత్,
జ యేతివాచా మహిమాన మస్య
సంవర్ధయంతౌ హవిషేవ వహ్నిమ్. ౭, ౪౩.

క. హరిశంఖ కౌస్తుభంబులు
కరములనురమునను దాల్చి కమలాప్తసుధా
కరకుజనంభృతనవజల
ధరమో నా వచ్చుధరణిధరు హరిఁగంటే.

౮, ౭౬.

శుద్ధ మావిల మవస్థితం చలం
వక్ర మార్జవగుణాన్వితం చ యత్,
సర్వమేవ తమసా సమీకృతం
ధి ఙ్మహత్త్వ మసతాం హృతాంతరమ్.

౮, ౫౭.

క. సుతవర్ణాంతర నిమ్నో
న్నతతల నిఖిలోచ్చనీచ నానావస్తు
స్థితి సమము సేసె గతగా
రతఁ జీకటి దుర్వివేకిరాజ్యమువోలెన్.

౮, ౯౮.

సా మంగళస్నాన విశుద్ధగాత్రీ
గృహీతపత్యుద్గమనీయవస్త్రా,
నిర్వృత్త పర్జన్యజలాభిషేకా
ప్రఫుల్లకాశా వసుధేవ రేజే. ౭, ౧౧.

గీ. మజ్జనం బొప్పనాడి నిర్మలిన మగు దు
కూలములు గట్టి పొల్చెఁ గుత్కీలతనయ
వర్ష సమయము సన శరద్వ్యాప్తి వెలుఁగు
కాశసంకాశ మగు మహీకాంతవోలె.

౯, ౬. (II, 205)

లగ్నద్విరేఫం పరిభూయ పద్మం
సమేఘలేఖం శశినశ్చ బింబమ్,
తదాననశ్రీ రలకైః ప్రసిద్ధై
శ్ఛిచ్ఛేద సా దృశ్యకథాప్రసంగమ్. ౭, ౧౬.

గీ. అలికులాన్వితమగు వికచాంబుజంబొ
జలధరంబులో వెలువడుచంద్రమండ
లంబొ నానొప్పెఁ గుటిలాలకంబు లోలిఁ
దీర్చి సఖు లర్థిఁ జూడ నద్రిజమొగంబు.

౯, ౮. (II, 207)

ఇత్థం విధిజ్ఞేన పురోహితేన
ప్రయుక్తపాణిగ్రహణోపచారౌ,
ప్రణేమతు స్తౌ పితరౌ ప్రజానాం
పద్మాసనస్థాయ పితామహాయ. ౭, ౮౬.

వ. అంత బృహస్పతిదత్తసుముహూర్తంబునం బరమేష్ఠిహోమపురస్సరంబుగా విధివిహిత విధానంబున గిరిశుండు గిరిజం బరిణయమయ్యె. ౯, ౩౧. (II, 230)

వ. అయ్యవసరంబున సర్వేశ్వరుండు పార్వతీసమేతుండై పరమసుఖలీలం దగిలి ప్రస

దేవాస్తదంతే హర మూఢభార్యం
కిరీటబద్ధాంజలయో నిపాత్య,
శాపావసానే ప్రతిపన్నమూర్తే
ర్యయాచిరే పంచశరస్య సేవామ్. ౭, ౯౨.
తస్యానుమేనే భగవాన్ విమన్యుర్
వ్యాపార మాత్మన్యపి సాయకానామ్,
కాలప్రయుక్తా ఖలు కార్యవిద్భిర్
విజ్ఞాపనా భర్తృషు సిద్ధి మేతి. ౭, ౯౩.

స్నం డైయున్నకన్నెతెంగి సురవరులు
కామోత్పత్తి కిదియ యవసరం బని త్రిణ
యనుకరుణ వడసి మనసిజుం బడయ నుద్యు
క్తులై భక్తిపూర్వకంబున.
౯, ౩౯. (II,238)
వ....మదను దయసేయవలయు నని మ్రొక్కి
యున్న సురగురుప్రముఖాఖిలసురవరులకు
వరదుండు కరుణించి యంగజుండు
జగంబుల కనంగుఁడై రతికిం బ్రాక్తనస్వ
రూపుండై ప్రవర్తించు నని వరం బిచ్చి
యతనిపూర్వనియోగంబును దయసేసిన
నక్షణంబ. ౯, ౪౫. (II 244)

పయివానిలో సంస్కృతానువాదము స్పష్టముగాఁ గనఁబడుచున్నది. గ్రంథవిస్తరభీతిచేత నక్కడక్కడి భాగములే గ్రహింపఁబడినవి.

లోహితార్క మణిభాజనార్పితం
కల్పవృక్షమధు బిభ్రతీ స్వయమ్,
త్వా మియం స్థితిమతీ ముపాగతా
గంధమాదనవనాధిదేవతా. ౮, ౭౫.
ఆర్ద్రకేసరసుగంధి తే ముఖం
మత్తరక్తనయనం స్వభావతః,
అత్ర లబ్ధవసతి ర్గుణాంతరం
కిం విలాసిని మదః కరిష్యతి. ౮, ౭౬.
ఘూర్ణమాననయనం స్ఖలత్కథం
స్వేదబిందు మదకారణస్మితం,
ఆననేన నతు తావ దీశ్వర
శ్చక్షుషా చిర ముమాముఖం పపౌ.
౮, ౭౬.
మాన్యభక్తిరథవా సఖీజనః
సేవ్యతా మిద మనంగదీపనమ్,
ఇత్యుదార మభిధాయ శంకర
స్తా మపాయయత పాన మంబికామ్. ౮, ౯౫.

సీ. అసితోత్పలములపై నరుణేందుదీధితు
లెగసె నాఁ గనుఁగవ లెఱ్ఱనయ్యెఁ
దావలపైఁ బ్రాలేయలవములు దనరె నా
మొగములఁ జెర్బిందు లెగయఁ దొంచెఁ
గలహంసపదువులు గాళ్ళందుఁ దొడరెనా
మొత్తంపు నడపులు ముందటిల్లెఁ
దరుణవల్లరులపైఁ బురినమ్మ లూఁగెనా
వెన్నులఁ గ్రొవ్వెదల్ విరిసిత్రేలెఁ
తే. బరభృతావళి తొలిమొల్ల పండ్లరసముఁ
ద్రావె నన ముద్దుఁ బలుకులు దడుమనయ్యె
మధుమదాసక్తి నిజరూప మహిమ లెడసి
యభినవాంగ ప్రభాసిత లైరి సతులు.
౯, ౧౩౩. (II, 332)

పార్వతిచేఁ బరమేశ్వరుఁడు మధువు త్రావించె నని కాళిదాసకావ్యమునఁ గలదు. మదోద్రేకసాధనముగా దంపతులు మధువు త్రావుట పూర్వసంప్రదాయము. అదే కాళిదాసు చక్కఁగాఁ బ్రవేశపెట్టి మధుపానగుణము

లను వర్ణించినాఁడు. ఈశ్వరుఁడు పార్వతిని మధుపానమునకుఁ బ్రోత్సహించు నపుడు 'స్వభావసిద్ధముగానే నీకన్ను లెఱ్ఱగా నుండును. మధుమదము నీకే గుణాంతరము తీసికొని రాఁగలద'ని చెప్పినదానిలో మధుమదమునఁ గన్ను లెఱ్ఱ నగుటను ముఖ్యలక్షణముగాఁ దెలిపినాఁడు. తర్వాతిశ్లోకములోఁ జెప్పిన మధుపానగుణములు స్పష్టములు. అవియన్నియుఁ బార్వతికిఁ గలిగినట్లు మూల మున నున్నది. మన శైవకవి పార్వతి కట్టి వానిని గలిగించుట కిష్టపడక కావ్య లక్షణమగు మధుపానవర్ణనము విడువఁజాలక పురస్త్రీల కావికారములు గల్గినట్లుమార్చియందులోను నెల్లరకు నవి గలిగింపక కొందఱచేతనే మధు పానము చేయించి వారికాలక్షణములు గలిగినట్లు సరసముగా తెనుఁగున వర్ణించెను.

శిష్యతాం నిధువనోపదేశినః
శంకరస్య రహసి ప్రసన్నయా,
శిక్షితం యువతినైపుణం తయా
యత్తదేవ గురుదక్షిణీకృతమ్. ౮, ౧౪.

సీ.... పెక్కురతములు వరుసడి రతిశాస్త్రి
చోదితముగాఁగ
తే. సతికిఁ దెలియఁజూపెఁ బతివాని నన్నియు
మగువ వరుసఁ బతికి మగుడఁ జూపె
సతియుఁబతియు నేర్పులతిభక్తిఁదలపోయ
రతులు నవములయ్యెఁ బ్రతిదినంబు.
౯, ౧౫౨. (II, 351.)

హరుఁడు గురుఁడుగాఁగఁ బార్వతి బాల్యమున విద్యనేర్చినట్లే యీ విద్య యు నేర్చి పతికిఁ బ్రేమము వృద్ధిపఱిచినది. ఆప్రీతియే 'నవం నవం ప్రీతి రహో కరోతి' యన్నట్లు 'రతులు నవములయ్యెఁ బ్రతిదినంబు' అని ప్రతిదినము నూతనమగుచందమునఁ బార్వతీపరమేశ్వరులు మదనసుఖపరవశతనొందుట స్పష్టము చేయఁబడినది.

సమదివసనిశీథం సంగిన స్తత్రశంభోః
శత మగమ దృతూనాం సార్ధ మేకా నిశేవ,
న తు సురతసుఖేభ్య శ్ఛిన్నతృ ష్ణోబభూవ
జ్వలన ఇవ సముద్రాంతర్గత స్తజ్జలౌఘైః.
౮, ౯౧.

వ. ఇట్లు... పరమేశ్వరుం డనవరత రతనిర
తుండై జగద్వ్యాపారం బారయమికి నిం
ద్రాదిదేవత లుద్వేగించి విరించిపాలికిం జని
ఉ. క్రొవ్విరితమ్మితావిగొని క్రోలుమదంబునఁ
దేలుతేఁటి కాం, డెవ్విరిపువ్వుకంపు సొగ
యింపనిభంగి మహేశుఁ డయ్యుమా
యవ్వనవారిపూర్ణసురతాబ్ధివివ
ర్ధితుఁడై మదించి మైఁ, దివ్వఁడు లో
కవర్తనకు దేవత లెంత విహీనభాగ్యలో.
వ. అని నిర్వేదించి విన్నవించుసురవీరులకు...
౯, ౧౫౩. (II, 358)

పై పద్యము తంజావూరి వ్రాతప్రతినిబట్టి గ్రహింపఁబడినది. ముద్రితమున రెండవపాదము చివరభాగమును మూఁడవపాదమును "మహేశ్వరుండునా,జవ్వనియౌవనంబనెడు చంద్రికఁగ్రోలు చకోరభంగిమైఁ దివ్వఁడు . . ." అనిమాఱిపోయినది. గ్రంథసంపాదకులగు మ.రా. రామకృష్ణకవిగారు తాము రచించిన లఘుటీకలోఁ దంజావూరిప్రతిపాఠము నిచ్చి "అనియుఁబాఠము గలదు. ఇందులో 'యౌవనశబ్దము' 'యవ్వన' అని చెప్పుట దోషము. ప్రాచీనకవితలో నిట్టి ప్రయోగములు సాధువులై యుండఁగా వైయాకరణులు నాలంకారికులును దోషపరిచ్ఛేదములను విస్తారముగా వ్రాసి యించుక కఠినముగాఁ జేసినట్లు తోఁచుచున్నది. మహాప్రామాణికుఁడగు ననంతకవి భోజరాజీయమున "నవ్వుచుఁ జెక్కుమీఁటి నలినన్ఫుటలోచనమాటలేల నీ, యవ్వనలక్ష్మికిన్ భటుఁడనై తి ననుంగరుణింపుమంచు వాఁ,డువ్విళులూరుచుం బలుక నుత్పలగంధియు నోమహాత్మ." 2, ౧౦౮. అని ప్రయోగించెను. అనంతునకుఁ బ్రాచీనకవి ప్రయోగములు లక్ష్యములై యుండును" అని వ్రాసిరి.

వారు తంజావూరిప్రతిపాఠము చూచి 'యవ్వన' శబ్ద ప్రయోగము దోషమని యెంచి మూలమున నన్యథాగ్రహించిరి యని తోఁచుచున్నది. అందు'యవ్వని'ని 'జవ్వని'నిఁగాఁజేసి యతికై యవ్వనమును జంద్రికగా నిరూపించి దానిగ్రోలుటకై చకోరమును గల్పించుకొని పాదము పూర్తిచేసిరి గాని 'జవ్వనియౌవనంబనెడుచంద్రికఁ గ్రోలుచకోరభంగిమై' అనుటచే పార్వతీయౌవనము ననుభవించుట చకోరమునకుఁ దెచ్చిపెట్టిన దోషము సంపాదించి రని తోఁచుచున్నది. అది 'యవ్వన' శబ్దప్రయోగదోషమునకు మించినదోషము. ఈపాఠమెక్కడిదో ! లఘుటీకలో 'యవ్వన'శబ్దప్రయోగము సాధించి నన్నిచోడకవిప్రాచీనతాభంగప్రసంగము వచ్చునని భయమునఁ గాఁబోలును అనంతునికిఁ బ్రాచీనకవిప్రయోగములు లక్ష్యములై యుండు నని సరిపెట్టుకొనిరి. తంజావూరిప్రతిపాఠమే కవి రచించినదియై యుండును. దానిననుసరించియే మనకవి మూలశ్లోకభావ మెంత గ్రహించెనో చూచుటమనకుఁబ్రకృతము.మన మహాకవి.'యవ్వన'రూపముప్రాయికముగాఁ బ్రయోగించు సంప్రదాయములోనివాఁడే. పయిశ్లోకమున జలౌఘములచే బడబాగ్నిబోలె నీశ్వరుఁడు సురతసుఖములనుండి ఛిన్నతృష్ణుఁడు కాలేదను భావముగలదు. విచ్ఛిత్తిలేకుండఁగఁగలసియుండినను ఛిన్నతృష్ణతలేమియే ఈశ్వరబడబాగ్నులకుసాధర్మ్యము. కుమారసంభవకావ్య వ్యాఖ్యాతలలో నొకఁ డగు నరుణాచలనాథుఁడు బడబాగ్ని కాలాంతరమున సముద్రమును శోషింపఁజేసినట్లు ఈశ్వరుఁడును విషయతృష్ణోపలక్షితమాయాకార్యములకు మూలోచ్ఛేదము గావించువాఁడని తెలుపుటకు బడబాగ్న్యుపమానము కవి గ్రహించె నని వివ

రించెను. వివరణకారుఁడగు నారాయణపండితుఁడు 'బడబాగ్నికి సముద్రజల తృష్ణ స్వతస్సిద్ధముగా లేనేలేదు; అది ద్రష్టృజనప్రతీతిమాత్రసిద్ధము. అట్లే ఈశ్వరవిషయతృష్ణయును అని బడబాగ్న్యుపమానముచే ధ్వనించుచున్న' దని తెలిపెను. మల్లినాథుఁడు తృష్ణ ఛిన్నముగాలేదు. వృద్ధి నొందె నని వచించెను. రసికాగ్రేసరుఁడగు మనమహాకవి బడబాగ్నిశబ్దమును దదుపమానమును బరిహరించి శివుఁడు 'ఉమాయవ్వనవారిపూర్ణ సురతాబ్ధిని నోలలాడుచున్నాఁ' డని యబ్ధిశబ్దమును స్వతంత్రకల్పనతో నుపయోగించినాఁడు. మఱియు 'తమ్మి తావిఁగ్రోలు తేటికి మఱొకపువ్వుఁదావి సొక్కనట్లు లోకవర్తన శివునకుఁ జొక్కలేదు' అని చేర్చినాఁడు. మన భావనాప్రధానకవి కిట్టిది సహజముగానే తోఁచియుండును. అయినను నవమసర్గారంభమునఁగల "తథా విధేఽనంగరసప్రసంగే ముఖారవిందే మధుపః ప్రియాయాః" అను శ్లోకభాగము మనకవిభావము నకుస్ఫోరకము గావచ్చు నని తోఁచుచున్నది. "సమదివసనిశీథ" మిత్యాదిశ్లోక మష్టమసర్గాంతిమశ్లోకము. దాని తర్వాతిదే. "ముఖారవిందే మధుపః ప్రియాయాః" అని నవమసర్గాదిని గలదు. ఇది కాళిదాసేతరకృతమని తోఁచుచున్నది.

పైని ప్రదర్శించిన భాగములవలనఁ గాళిదాసకావ్యము ననుగమించుచు నడుమనడుమ వర్ణనవిశేషములను జేర్చి మనకవిరాజశిఖామణి ప్రబంధ రాజమురచించినాఁడనుట స్పష్టమగుచున్నది. కాళిదాసభావ మొక్కటిగ్రహించి దానితోఁ దులఁదూఁగు రెండు మూఁడు భావములు చేర్చి సరసముగాఁ గూర్చి 'కాళిదాసుతోఁ దులఁదూఁగినవాఁడు మనయాంధ్ర కవిరాజశిఖామణి' యని ప్రశంసించి యానందించుట మనకు ధన్యత.

ఉత్తరభాగమున సంస్కృతాంధ్ర కథాసామ్యము.

అష్టమసర్గాంత భాగమువఱకుఁ గల విషయము లెట్లు నన్నిచోడునిచే గ్రహింపఁబడినవో తెలిసికొంటిమి. ఇంకఁ దర్వాతిభాగముగూడఁ బరిశీలింతము.

నవమసర్గవిషయములు-అగ్ని యింద్రప్రేరితుఁడయి కపోతరూపమునఁ బార్వతీపరమేశ్వరుల కేళీగృహమునఁ బ్రవేశించెను. కపోతమును జూచి క్రోధ మందిన శివునకు నగ్ని నిజస్వరూప మెఱిఁగించి యింద్రసందేశము తెలిపి తన్ను క్షమింపవేఁడికొనెను. హరుఁడు తన వీర్య మగ్నియం దుంచెను. దానిచే వికృతరూపము నొందినయగ్ని యింద్రునియొద్దకుఁ బోయెను. ఇంక నక్కడ హరుఁడుపార్వతితో వినోదములాడుచుఁ బార్వతికలంకారరచనఁ జేయుచు విహరించు చుండెను. ఆంధ్రమునఁ బయివిషయము దశమాశ్వాసమున సంగ్రహింపఁబడినది. అందుఁ గొంత మార్పుగలదు. అగ్నిని జూచి పార్వతీపరమేశ్వరులు లజ్జాకలిత హృదయులయి. పరిధానంబులు సవరించుకొనిరి. రతిక్రి

విఘ్నము చేయుటచేఁ గోపించిన శివుఁడు నుదుటికంటితోఁ జూడ నగ్ని మాఱు మండెను. ఈశ్వరుఁడు తన వీర్యమాతనిపైఁ జల్లియాయగ్ని నార్పెను. అప్పుడగ్ని తేజోవిహీనుఁడయి మూర్ఛిల్లి తెప్పిఱిలి పితామహుపాలికిం జనియెనని యున్నది. నవమసర్గలోని ౫-౭ శ్లోకములఁగలభావము తెనుఁగునఁ బది గద్యపద్యములలో సంగ్రహింపఁబడినది. అందనావశ్యక మని యెంచినభాగము మనకవి పరిహరించినాఁడు.

దశమసర్గవిషయములు —అగ్ని విరూపముతో నింద్రసమీపమునకుఁ బోవ నింద్రుఁడు, మనమున క్షోభమొంది యగ్నివలన వైరూప్యకారణ మెఱిఁగి హరతేజస్సును గంగలో విడువ నుపదేశించెను. అగ్ని యట్లుసేయ నాతేజమును గంగ భరింపలేక బాధ నొందుచుండఁగా షట్కృత్తికలుస్నానార్థమువచ్చిరి. వారు స్నానమాడుచుండ హరతేజస్సు వారి శరీరములఁ బ్రవేశించె. అంత వారికి సద్యోగర్భము లయ్యెను. ఆగర్భములతో వారిండ్లకుఁ బోఁజాలక గర్భస్రావము గావించికొనిరి. అప్పు డామహాతేజస్సు కుమారరూపమును దాల్చెను. పైవిషయము తెనుఁగున ౧౦, ౧౧. (II, 377) మొ. ౧౦, ౪౬. (II. 413) వఱకుఁ గల భాగమునఁ గొంతమార్పుతోఁ గలదు. పితామహుఁ డగ్ని చెప్పినవృత్త మెఱిఁగి వరదుఁడు కుమారోత్పత్తికిఁ బ్రసాదించెనని సంతసించి తద్వీర్యము గంగలో విడువుమని యుపదేశించెను. అగ్ని యట్లు సేయ గంగయా మహాతేజము భరింపఁజాలక యగ్ని కడ్డమువచ్చి 'యిదియేమి మాయ పన్నితివి, యీ భరముతీసికొని పొ'మ్మనియగ్నియం దా తేజముంచెను. తద్వీర్యభరంబున నిశ్చేష్టితుఁడై యున్న యగ్నిని బ్రహ్మ చూచి సకలపదార్థములను ధరించుశక్తిగల శరవణమున కరుగు మన నతఁడు శరవణమున కేగెను. అప్పు డందు సప్తఋషుల భార్యలు దిగంబరలై జలక్రీడ లాడుచుండిరి. అగ్నికిఁ దన్మిత్ర మగు వాయువు కొంత దోడ్పడ నగ్ని కొంచెము ప్రజ్వలించెను. శీతబాధాపీడితు లగుమునిభార్యలు వెలుఁగుచున్న యగ్నిదరిని జేరిరి. అరుంధతీదేవి మాత్రము వహ్ని పరపురుషుఁ డని గ్రహించి వస్త్రము ధరించి దూరముగా నిలఁబడెను. మిగిలినవారు దిగంబరలై యగ్నిని సేవించుచుండిరి. ప్రజ్వలించునాయగ్ని వారిపైఁ బ్రసరించి తనయందున్న హరవీర్యమును వారలకుఁ దెలియకుండఁగనే వారి దేహములందుఁ బ్రవేశపెట్టెను. వారు సద్యోగర్భముల నొందిరి. పరపురుషుఁ డగునగ్నిని దిగంబరలై సేవించుటచే మీకు గర్భము లయ్యెనని యరుంధతిదూషింప, వారుమిక్కిలివిచారించి గర్భస్రావము గావించుకొని యాగర్భపిండములను పద్మపత్రములం దుంచి యిండ్లకుఁ బోయిరి. ఏదోషము నెఱుఁగనివారిఁ బోలెవారు భర్తలకు యథాపూర్వముగాఁ బరిచర్యలు సేయుచుండఁగా ఋషులు వారిదోషము గ్రహించి

వారిని బరిత్యజించిరి. వారు బ్రహ్మసన్నిధి కరిగి "యకామకృతదోషమునఁ బతులచే బరిత్యక్తల మయితిమి. మాకు గతియేమి?" యని విన్నవింపఁ "బతివ్రతాధర్మమున భ్రష్టురాండ్రయినను ఈశ్వరవీర్యధారణప్రభావమున జ్యోతిర్లోకమునఁ గృత్తికలనఁ బ్రవర్తింపుఁ డని వరమిచ్చెను. పద్మపత్రముల నున్న గర్భపిండములు పక్వస్థితికి వచ్చెను. అందుఁ గుమారుఁ డుదయమయ్యెను.

పై కథలు పురాణములందు రెండు విధములుగాను నున్నవి. నన్నిచోడుఁడు గ్రహించినదానిలో శరవణమునఁ గుమారోత్పత్తి తెలుపుట ముఖ్యము. తత్వ మెఱుఁగక స్త్రీవిహిత సామాన్యధర్మవిరుద్ధముగాఁ బ్రవర్తించిన స్త్రీలు భర్తృపరిత్యక్త లగుదు రనుసామాన్యస్త్రీనీతిధర్మమును మీఱి యజ్ఞానమునఁబ్రవర్తించినను ఈశ్వరవీర్యధారణప్రభావమున వారి కుత్తమ లోకప్రాప్తిగలుగు ననువిశేషధర్మము బోధింపఁబడినది. అట శివప్రభావమే పవిత్రకుఁగారణము. ఈ కథయంతయును ముప్పది గద్యపద్యములలో నిమిడ్చి పైరీతినిమార్చిరచించుట మనమహాకవికౌశలమును, లోకజ్ఞతను జాటుచున్నవి.

ఏకాదశసర్గవిషయములు— కుమారోదయమయినతర్వాత నింద్రాదులు వచ్చి యీబాలునకుఁ బాలి మ్మని గంగాదేవిని బ్రార్థింప నామె పాలిచ్చి పెంచుచుండెను. షట్కృత్తికలరూపములతో మునిపత్నులు యాదృచ్ఛికముగా నచటికి వచ్చియాబాలునిఁ జూచి 'యాకుమారుఁడు తమకుమారుఁ' డని వివాదముచేయ నారంభించిరి. అప్పుడు విహారార్థ మాకసమునఁబోవు పార్వతీపరమేశ్వరు లాబాలునిఁ జూడ వారికి సహజవాత్సల్యమునఁ గన్నుల బాష్పములు గ్రమ్మెను. వా రిరువురు క్రిందికి వచ్చి గంగాకృత్తికలవివాదము వినిరి. శివుఁడు వారికి సమాధానము చెప్పి 'వీనిచే నీవే సుపుత్త్రిణివి' యని పార్వతితోఁ జెప్పెను. పార్వతీపరమేశ్వరులు బాలునిఁ దీసికొనిపోయి కైలాసపర్వతమునఁ బుత్త్రోత్సవము గావించి యానందంబున నుండిరి.కుమారుఁడు బాల్యచేష్టలతోఁ దల్లిదండ్రుల సంతోషపఱుచుచుండెను.

ఈ సందర్భమున నన్నిచోడుఁడు రచించినరీతిఁ బరిశీలింతము. కుమారుఁడు శరవణమునఁ గమలనిలయుఁ డయి ప్రకాశించుచుండఁగా నారదుఁడు కలహాశనముకై తిరుగుచుఁ గుమారుని తేజము చూచి యితఁడు ప్రకృతిపురుషుఁడు, ఇతరుల కజయ్యుఁడు, ఇంద్రుఁ బ్రేరించి వీనితో యుద్ధము చేయించెద నని తలఁచి యింద్రుఁ బ్రేరింప నింద్రుఁ డాయుధధారియై బాలునియొద్దికి వచ్చెను. ఆ బాలునిఁ జూడఁ దనవేయికన్నులును మిఱుమిట్లుగొన సహింపఁజాలక యాబాలుని నైరావతముచేఁద్రొక్కించి చంపింపఁదలఁచి యైరావతమును బాలునిపైకింద్రుఁడుత్రోలెను. బాలుఁడుదానితొండము నాటవస్తువుగాఁ బట్టుకొనవెల్లెనుఁగు వెనుకకుఁ బాఱిపోయెను. ఇంద్రుఁ డాబాలునిపయి నస్త్రములఁ

ప్రయోగింప నవియు వ్యర్థము లయ్యెను. తుది కింద్రుఁ డాబాలునిధాటి కాఁగ లేక వెన్నిచ్చిపాఱిపోవుచుండ నాబాలుఁడు తఱుముచుండెను. ఇంద్రుఁడు తుదకు 'మహాదేవ నీవ శరణని' శివుని శరణుసొచ్చెను. శివుఁ డింద్రున కభయ మిచ్చి కుమారునిఁబార్వతికిఁ జూపి యీబాలుఁడు నీకుమారుఁ డని చెప్పనామె చప్ప టలుచఱచి చేతులు సాచి బాలు నాదరింపఁ గుమారుఁడు సహజస్నేహమున నామెకౌఁగిటఁజేరను. అప్పు డింద్రుఁడు పరమేశ్వరుని స్తుతించి యభయమొం దెను. నన్నిచోడమహాకవి యిట్లు రచించుట కుమారప్రభావప్రకాశకమై భావివీరరసపోషక మగుచున్నది. ఈకల్పన యొకవిశేషముగా మనకవి భావించి యుండెను. కావుననే దేవదూత తారకాసురుని గర్వోక్తులు విని మాఱుపలుకు నపు డిటు వినిపించెను.

చ. వడిఁద్రిదశాలి నోర్చు డొకవావిరి బీరముగాఁగ రజ్జు దె,
ప్పుడు నది నీవుచేసిన తపోవిభవంబున నబ్జగర్భుచేఁ
బడసినవిద్య గాక నిజబాహుబలం బని చూతె పుట్టి న,
ప్పుడు భుజశక్తి మాగుహుఁడు వ్రాలె సురాధిపుఁ బోర నోర్చితే.

౧౦, ౧౪౯. (II. 516)

పయివిషయములు ౧౦, ౪౭. (II, 414) మొ. ౧౦, ౯౨. (II, 465) వఱకుఁగల భాగమునఁగలవు.

ద్వాదశసర్గ విషయములు— ఇంద్రుఁడు తారకాసురపీడితుఁడయి హరునియొద్దకువచ్చిస్తుతించి ప్రక్కనున్న కుమారునిఁ జూచి జయాశ నొంది తారకుఁడు దేవతలను బెట్టుబాధలు చెప్పికొని కుమారుని సేనాధిపతిగాఁ బంపఁ బ్రార్థించెను. ఈశ్వరుఁడు కుమారునితో 'దేవసేనాధిపతి వయి తారకసంహార ముచేయు'మని యానతీయ నతఁడు పరమేశ్వరాజ్ఞ శిరసా వహించెను. పార్వతి యాతనిపరాక్రమాదులు చూచి సంతసించెను. తారకబాధావర్ణనము ద్వితీయసర్గమునవచ్చినదే మరల నేల కూర్పవలయు నని యెంచికాఁబోలు మనకవి సంగ్రహపఱిచి రచించినాఁడు.

"క. కలహమున సురలుదారకు,ప్రళయానలరూప ముదరిపడి యొక్కొకమార్
దలఁచిన మీసలుగడ్డము, నులివాడులువాడుచుండు నొందినభీతిన్.
అనియనేకప్రకారంబులఁ దారకాపరాధంబు విజ్ఞాపించి ... ... ఇక్కు
మారు నమరసేనాధరుం జేసి నిర్జింపవలయు" నని యొకపద్యమున నొకగద్యమునను మనకవి యిమిడ్చివేసెను.

౧౦, ౯౯; ౧౦. (II, 466; 467)

త్రయోదశసర్గవిషయములు— ఇంద్రాదిదేవతలు యుద్ధయాత్రార్హవే షములతో హరునిదర్శనమునకుఁ బోయి కుమారునిఁ బంపఁ బ్రార్థింపఁ బార్వతీ

పరమేశ్వరు లనుమతించిరి. ఇంద్రాదులు కుమారునితో బయలువెడలి స్వర్గము నఁబ్రవేశించుతఱి నింద్రాదులు భయపడుచుండినఁ గుమారుఁడు వారి కభయ మిచ్చి వారితోఁదానును స్వర్గమునఁబ్రవేశించె. కుమారుఁడు తారకకృతస్వర్గ వైకల్యముచూచి తారకుపైని కోప మొంది వైజయంతమునఁ బ్రవేశించి యదితికశ్యపులకు నమస్కరించి వారియాశీర్వచనములు గైకొనెను.

తెనుఁగున నున్నరీతిఁ జూతము— ఇంద్రుఁడు గుమారుని సేనాధీశుఁ గాఁబంపఁ బ్రార్థింప శివుఁడు కుమారునికి సేనాధిపత్యాభిషేకముచేసి రాజ చిహ్నము లిచ్చి పంపెను. ఆతఁడు స్వర్గమునకుఁ బోయి సుఖసంకథావినోదం బులఁబ్రవర్తించుచుండె నని సంగ్రహింపఁబడెను. అంతేగాక మనకవి మఱొక్కకథఁ జేర్చినాఁడు. కథావినోదములలో బృహస్పతి క్రౌంచాసురప్రభా వంబుఁ దెలుపుచు 'వజ్రము నోర్చినబిరు దీతఁడు క్రౌంచుఁ డన నభేద్యుఁడుపో రన్' అనిక్రౌంచపర్వతముచూపి 'వీని జయించినం దారకు నశ్రమంబున జయింప నగు'నని సిద్ధాదేశంబునుంగల దనెను. కుమారుఁ డప్పుడు నిజశక్తితోఁ గ్రౌంచుని జయించెను. ఏతత్ కథాకల్పనము దేవతలకుఁ గుమారునిశక్తియం దధికవిశ్వాసము గలుట కుపయుక్తము. మఱియు వీరరసపోషకమనివేఱ చెప్ప నక్కఱలేదు. సంస్కృతమున వేఱొకచోటఁ 'క్రౌంచస్యరంధ్రంవిశిఖేననిర్మమే'(౧౫, ౩౫) అనికుమారుని వర్ణనముననున్నది. గాని నన్నెచోడుఁడది మంచి సన్నివేశమునఁ జేర్చి కావ్యమును రసవత్తరముగాఁ గావించినాఁడు. ఇది ౧౦, ౧౧. (II. 468). మొ. ౧౦, ౧౪. (II, 486). వఱకుఁగల భాగమునఁ గూర్పఁబడినది.

చతుర్దశ సర్గవిషయము—తారకవధకై ఇంద్రాదులు కుమారునితోఁ గలసిపోవ సన్నాహము చేసిరి. కుమారుఁడు విజిత్వర మనురథ మధిరోహించెను. కుమారు ననుగమించుచుదిక్పతులు యుద్ధమున కేగిరి. సురసేనలు సన్నాహముతో వెడలెను.

తెనుఁగున నీ క్రిందిరీతిని గొంత పెంపకము గలదు. కుమారుఁడు క్రౌంచుని జయించి యాక్షణముననే తారకునిపై దండెత్తిపోవ నిశ్చయింపఁగాఁ జక్రపాణి 'వాని నెఱింగించి పంపక పైఁజనుట యనుచితం' బనిన దాని కొడంబడి కులవిప్రోత్తము రాయబారిఁగాఁ బంపెను. అప్పుడు రెండు పక్షములను రాయబారములు జరిగినవి. అందుఁ దారకాసురుఁడు తన్ను నిరాకరించి పలుకు దేవదూతను బాధింప నెంచుటయు, శుక్రుఁడు రాజనీతి చెప్పుటయు రాజనీతి ధర్మ బోధకములు. ఇది భారతమందలి శ్రీకృష్ణురాయ బారమును, దుర్యోధనుని యవినీతప్రసంగమును, భీష్మసంజయాదుల నీతి

బోధమును దలఁపించును. ఇది ౧౦, ౨౨. ౧, (II. 488) మొ. ౧౦, ౧౯౯ (II. 565) దశమాశ్వాసము చివరవఱకు సరిపడినది.

ప్రస్థాన భేరి నఱవఁ బంచి కుమారుఁ డింద్రాద్యనుగతుఁడై సురసేనలతో గంగాతీరంబునకు వచ్చి యందు విడిసెను. అచ్చట వీరభటులు మనోనిశ్చయ ప్రతిజ్ఞావచనములు పలుకుచు యుద్ధోత్సాహమున నుండిరి.

పంచదశ సర్గ విషయములు—ఇంద్రాదులు సేనానితోఁ గలసి తారకాసురునిపై వచ్చుట చారులు తెలుపఁ దారకాసురుఁడు గాకూత్తలాడి సైన్య సన్నాహము చేసికొని కుమారుని మార్కొనఁ బ్రయాణ మయ్యెను. అప్పుడ నేకోత్పాతము లనిష్టములను సూచించెను. అయినను యుద్ధయాత్రమానని తారకుని కాకాశవాణి యుద్ధయాత్ర వలదు వల దని నిషేధించినను లక్ష్యము సేయక ముం దింద్రునిఁ జంపెదను, తర్వాతఁ గుమారకుని జంపుదు నని ఖడ్గపాణియై యింద్రుని వైపునకు రథ మరలింప నాజ్ఞ యొసంగెను. దేవభటులు భయపడి పరువెత్తుచుఁ గుమారునికటాక్షప్రసారమున ధైర్యమును బూని రణరంగమున నిలిచిరి. తెనుఁగున నుత్పాతాకాశవాణీప్రసంగములు లేవు. తారకుఁడు కుమారునితో దేవసేనలు వచ్చుట యెఱిఁగి మహాసంరభముతో లోకభయంకరముగా రణరంగమునకు వచ్చెను.

ఇక్కడ మంచివిషయము కొంత గూర్పఁబడినది—రణరంగమున రెండు పక్షములవారు యుద్ధసన్నద్ధులై యుండుతఱిని తా నెవరితో యుద్ధము చేయవలయునో యందున్న వా రెవరో తెలుపు మని తారకుఁడు శుక్రు నడిగెను. కుమారుఁడు క్రొత్తవాఁడగుటచే నాతని నెఱుఁగకున్నను దారకుఁ డింద్రాదుల నెఱుఁగఁడా యను శంక నిరాకరింపఁ దలఁచినాఁడో యన్నట్లు "సురనరోరగ గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాద్యఖిల భువన భవనాధీశ్వరులు పూర్వపరిచితంబు (చితులి?) లైనం దదీయానంతైశ్వర్యప్రభావిభాతిశయంబు భేదింపనేరక విభ్రాంతాంతరంగుండగుచుఁ బన్ని నిలిచిన గీర్వాణానంతసామంతులెవ్వ రెవ్వ రిందుధరనందనుం డగుకుమారుం డెవ్వఁ డని దనుజగురు నడిగిన" అని కవి రచించెను. శుక్రుఁడు సురసేనలలోని వారిఁ దెలియఁబఱిచెను. రెండవ పక్షమున నట్లే "కుమారుండు నమరగురుం గనుఁగొని 'యీపని నిల్చిన దనుజసామంతు లెవ్వ రెవ్వ రిందుం దారకాసురుం డెవ్వఁ డెఱింగింపు మనిన' బృహస్పతి రాక్షససేనలోని వారి నెఱిఁగించెను. ఈరీతి సంస్కృతకావ్యమున లేదు.

౧౧—౮౫ (II. 654) మొ. ౧౧-౧౦౪ (II. 673) వఱకు నీ భాగము కలదు. ఈ భాగము భారతయుద్ధారంభమున నర్జునుఁడు కృష్ణుని "కైర్మయా సహయోద్ధవ్యమ్" అని యడిగినవాక్యములను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. అచ్చటి సన్నివేశమును బోలిన సన్నివేశమును గవి కల్పించెను.

షోడశసర్గ విషయములు — దేవదానవవీరభటు లన్యోన్యము మహా యుద్ధము సేయుట, సంకులయుద్ధము, అట్ట లాడుట మొదలగునవి వర్ణింపబడెను.

సప్తదశ సర్గవిషయములు- తారకాసురుఁడుభయంకరాకారముతో రణ రంగమునకు రాఁగా నతనిపై నింద్రుఁడు బాణవర్షము కురియించెను. మఱియుఁ దారక ప్రయుక్త బాణములను ఖండఖండములు గావించెను. తుద కింద్రాదు లు తారక ప్రయుక్తనాగపాశబద్ధులయి కుమారుని శరణుఁబొంది కుమారకటాక్ష ప్రసాదమున నే పాశవిముక్తు లయిరి. తారకుఁ డపుడు 'కుమారుని రణరంగ పశూపహారము గావించెద' నని గర్వముతో వానిఁజేరి బాలుఁ డని పరిహసించి యుద్ధమునుండి తొలఁగి నీతండ్రియంకమునఁ గూర్చుండఁ బొమ్మని హితోప దేశము చేసినట్లు చెప్పఁ గుమారుఁడు తారకా! గర్వమున నీవు పలుకినట్లు నీవే రణరంగమునుండి తొలఁగిపోవుట యుచితము. లేనిచో శస్త్రము పట్టుము. నీ బాహుబలము చూతు ననెను. తారకుఁడు కోపోద్రేకము నొంది బాణ ములు విడిచెను. సురసేన యంతయు నంధకారబహుళ మయ్యె. అప్పుడు కుమారుఁడు తారకబాణములను ఛేదించె. అంత రాక్షసేశ్వరుఁడు మాయా యుద్ధము సేయఁ బూని తుద కది వ్యర్థము కాఁగా వాయవ్యాస్త్రము ప్రయో గించెను. దాన దేవతాసేన చెల్లాచెదరగుటచేఁ దన్నిరోధకముగా నాగాస్త్రము కుమారుఁడు ప్రయోగించెను. తారకుఁడు ఆగ్నేయము ప్రయోగించెను. వారుణాస్త్రమున దానిని గుమారుఁ డణఁచెను.

అంత, తారకుఁడు కోపమొంది దేవతాసేనలు భీతిలి పాఱిపోవునట్లు శరవిశేషములు ప్రయోగించి కుమారుని మార్కొనెను. అప్పుడు కుమా రుఁడు శక్తిని బ్రయోగించెను. దానిచేఁ దారకుఁడు కూలెను. దేవతలు పుష్ప వృష్టి కురియుంచిరి. మహేంద్రముఖదేవతలు సంతసించిరి. ఇంద్రుఁడు నాకాధి పత్యమొంది విజయ మొందెను. ఇంతతోఁ గథ యంత మొందినది.

సంస్కృతమునఁ బదాఱవ పదేడవ సర్గలలోని యుద్ధము తెలుఁగున ౧౧, ౧౨ ఆశ్వాసములలో వర్ణింపఁ బడినది. అది యంతయు మహాభారత యుద్ధ మునుబోలి యున్నది. అది 'యుద్ధవర్ణన'మను శీర్షిక క్రిందఁ జూడఁదగును. సంస్కృతోత్తర భాగమునుండి గ్రహించుటకుఁ దగినంత సరసతగల పట్టులు లేనే లేవు. ఉన్నంతలోఁ గొంచెము మనకవి గ్రహించినాఁడు.

సంస్కృతకుమారసంభవమునుండి యష్టమసర్గాంతమువఱకుఁ గల భాగమునుండి గ్రహించినట్లు తర్వాతి భాగమునుండి నన్నిచోడుఁడు గ్రహింప లేదు. అందు గ్రహింపఁబడిన పట్టులును తక్కువగానే యున్నవి. అట్లని పూర్తిగా విడువక గ్రహించిన వానిలోఁ గొన్ని చూతము.

| శ్లోకములు. | పద్యములు. |
|---|---|
| ఉద్యోతితాంబర దిగంతర మంశుజాలైః<br>శక్తిః పపాత హృది తస్య మహాసురస్య,<br>హర్షాశ్రుభిః సహ సమస్తదిగీశ్వరాణాం<br>క్షోణోష్ణబాష్పసలిలై స్సహదానవానామ్.<br>శక్త్యాహతాసు మసురేశ్వర మాపతంతం<br>కల్పాంతవాత హతభిన్న మివాద్రి శృంగమ్,<br>దృష్ట్వా ప్రరూఢ పులకాంచితచారుదేహాః<br>దేవాః ప్రమోద మగమం స్త్రిదశేంద్ర ముఖ్యాః. | స్ర. జితదేశాధీశదర్పోర్జితబలుఁడు మహా<br>సేనశక్త్యాహతుండై<br>దివిజానీకంబుభీతిన్ ధృతి సెడి పఱవన్<br>దేవతల్ పొంగియార్వన్<br>కుతలం బల్లాడఁగా దిక్కులు సెలఁగపడిం<br>గూలె నుగ్రాజిలోనన్<br>శతధారాపాత పక్షక్షత విపులకుల<br>క్ష్మాధరాపాతభీతిన్.<br>౧౨, ౧౮౬. (II, 969) |

యత్రాపత త్పదనుజాధిపతిఃపరాసుః
సంవర్తకాలనిపతచ్ఛిఖరీంద్రతుల్యః,
తత్రాదధా త్ఫణిపతి ర్ధరణీం ఫణాభి
స్తద్భూమిభారవిధురాభి రధో వ్రజంతీమ్.

౧౬, ౫౦; ౫౧; ౫౨.

పయి శ్లోకములలోని భావమెంతయో సంగ్రహించి యుచితరీతిని గ్రహించిన రీతిని బరిశీలింతము "హర్షాశ్రుభిః ... దానవానామ్" అనునదియు "దేవాః ప్రమోద మగమం స్త్రిదశేంద్రముఖ్యాః" అనునదియుఁ గలిపి వేసి పునరుక్తి యేలయని యెంచి శాఁబోలు "దివిజానీకంబు భీతిన్ ధృతిసెడి పఱవల్ దేవతల్ పొంగి యార్వన్" అను భాగములో మనకవి సరిపెట్టినాఁడు. "కల్పాంత వాతహతభిన్నమి వాద్రిశృంగమ్" అని యొకచోటను "సంవర్తకాలనిపతచ్ఛిఖరీంద్రతుల్యః" అని మఱొకచోటను నుండుట చూచి యేక భావముగాఁ గలుపఁ దలఁచి తలమాత్రము కూలినచో నద్రి శిఖరముతోఁ బోల్చుట యుక్తమే కాని దేహమంతయుఁ గూలినపుడు పర్వతముతోఁ బోల్చుట యుచిత మని తోఁచినది శాఁబోలు "శతధారాపాతపక్షక్షత విపుల కులక్ష్మాధరాపాతభాతిన్" అని కూర్చినాఁడు. సంవర్త కాలమునఁ బడిన దనుటకంటె వజ్రాహతిచేఁ బడిన దనుటలోఁ గొంత విశేష మున్నది. సంవర్త కాలమునఁ బడుట సమస్తలోకసహజము. శతధారాహతిచేఁ గూలుట పర్వతైకవిషయము. మూఁడవశ్లోకమునఁగల "తత్రాదధాత్ ... ... ... ... వ్రజంతీమ్" "అనుదానిని "కుతలంబల్లాడఁగా దిక్కులుసెలఁగ" అనుదానిఁ తోఁబ్రకటించినాఁడు. సంస్కృతముతోఁబోల్చినచోఁ దెనుఁగున నర్థసముగా రచించినాఁ డనక తప్పదు.

తెనుఁగుపద్యమును జూచి సంస్కృతము రచించియుండఁగూడదా అనువారునుగలరు. వారే విమర్శించుకొనిననాఁడు తద్ రచనయే యాథార్థ్యమును బ్రకటించును. పూర్వముకంటె నుత్తరము రసవత్తరమగుట సహజము గదా. దేనికదే. రెండిటికి సంబంధము లేనేలేదు. ఇద్దఱకుఁదోఁచినది యొకటిగాఁగాకతాళీయమునఁ గలసిన దను కొనరాదా యను వారునుండకపోరు. వారికొఱకిది గాదు.

దేవోపి దైత్య విశిఖ ప్రకరం సచాపం
చాపైశ్చకర్త కణశో రణకేళికారీ,
యోగీవ యోగవిధిశుష్కమనా యమాద్యైః
సాంసారికం విషయసంఘ మమోఘవీర్యమ్.
౧౭, ౪౭.

ఐరావతం స్ఫాటిక శైలసోదరం
తతోఽధిరుహ్య ద్యుపతిస్త మన్వగాత్.
౧౫, ౫.

మదోద్ధతంమేష మధిష్ఠితః శిఖీ. ౧౫, ౬.

అధిష్ఠితః కాసర ముద్ధురం ముదా
వైవస్వతోదండ ధరస్త మన్వగాత్.
౧౫, ౭.

నైరృతః...ప్రేత మథాధిరూఢవాన్
౧౫, ౮.

వరుణః...యుద్ధాయ రూఢోమకరే.
మహత్తరే ౧౫, ౯.

మరుత్...మృగం మహీయాంస మధిష్ఠితః.
౧౫, ౧౦.

గదా మనూనాం నరవాహనో వహన్
౧, ౧౧.

రుద్రా స్తుషారాద్రిసఖం మహావృషమ్,
తతోధిరూఢా స్త మయుః పినాకినః.
౧౫, ౧౬.

అన్యేపి సంనహ్య...స్వర్గిణస్త మన్వయుః,
స్వవాహనాని ప్రబలా న్యధిష్ఠితాః
౧౫. ౧౭.

క. దనుజేంద్ర మాయ లన్నియుఁ
ద్రినయనసుతు శక్తి గనియదృశ్యం బయ్యెన్
వినుతాత్మ జ్ఞానంబునఁ
దనరుమహామాయ చెడువిధంబునఁ బోలెన్.
౧౨, ౧౮౨. (II. 965.)

క. గరుడే భాజ మహిష నర,
వర ఝష మృగతురగ వృషభ
వాహనులై శ్రీ-
ధర సుర పాగ్ని య మాసుర,
వరు ణానిల ధనద హరులు
వచ్చిరి సెమ్మిన్.
౧౧, ౧౦. (II, 580.)

పయి శ్లోకములలోని విషయ మెంతగా సంగృహీతమో చూడఁదగినది. 'అన్యేపి' అనుదానిభావముగా హరిని నాతనిగరుడవాహనమును మనకవి చేర్చి రచించెను.

ఉద్దండహేమధ్వజ దండసంకులాః
చంచద్విచిత్రాతపవారణోజ్జ్వలాః,
చలద్ఘన స్యందనఘోషభీషణాః
కరీంద్ర ఘంటారవచండచీత్కృతాః.
స్ఫురద్విచిత్రాయుధకాంతి మండలైః
రుద్ద్యోతితాశావలయాంబరాంతరాః,
దివౌకసాం సోఽనువహన్ మహాచమూః
పినాకపాణే స్తనయ స్తతోఽయయౌ.
౧౪, ౧౪, ౧౫.

దిఙ్మండలంవ్యోమతలం మహీతలమ్,
౧౫, ౧౬

సీ. అశ్వాశ్వతరశిబికాందోళకరికరి
ణీకరభారదానీకవాహ
నంబులు నిజవిభవంబులు వెలయంగఁ
గర మర్థినెక్కి భూచరులు నడవ
మానితానేకవిమాన సహస్రముల్
పరువడి నెక్కి ఖేచరులు నడవ
నాతపత్రధ్వజవాతపూరణములఁ
దనరి బ్రహ్మాండంబు దాఁకితూల
భూనభోంతరప్రపూరితంబై ధరి
దిశలనడుమ నెఱియఁదీటుకట్టి
జగములెల్ల నిమ్నసాలకమల్లడి
గొనియె గుహబలంబు కోలఁది మిగిలి.
౧౧, ౧౨. (II, 582)

హేమావనీషు ప్రతిబింబ మాత్మనో
ముహుర్విలోక్యాభిముఖం మహాగజాః,
రసాతలోత్కీర్ణగజభ్రమా త్క్రుధా
దంతప్రకాండప్రహతాని తేనిరే. ౧౪, ౨౩.

మ. కరణీబృందముఁ బాసి యొక్కమదనా
గంబద్రిరత్నోరుకం, దర సంక్రాంత
నిజప్రభాతిఁ బ్రతిబేదండంబ కాఁ జూచి
దుర్, ధరరోషంబునఁ బోరుచుండె నతి
మాత్సర్యంబునం దామసేశ్వరశై లేం
ద్రములోడనీలగిరివెల్పంబోరు నట్లున్నతిన్
౧,౮౯.

పదునాల్గవసర్గలోని శ్లోకమందున్న భావము సందర్భానుసారముగా మొదటి యాశ్వాసమున గ్రహింపఁబడినది. ఇట్టివి కొన్నికలవు. ఇట్టివి యితరకావ్యములనుండి యిద్దఱును గ్రహించి యుందు రనియు నూహింపవచ్చును.

కాళిదాస కుమారసంభవ తదుత్తర భాగానుసరణము నన్నిచోడుని యాంధ్రమహాప్రబంధమున స్పష్టముగాఁ గనఁబడుచున్నది గదా.



# తృతీయప్రకరణము



"క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవమ్ము నలంకా
రము గూఢవస్తుమయకా
వ్యముగా వారులీలఁ జెప్పి వారు మెప్పించెన్"

అని నన్నిచోడుఁ డుద్భటుని నాతని కుమారసంభవమును బ్రశంసించెనుగదా. దానికిని మన యాంధ్రకావ్యమునకును గాలిదాస కావ్యమునకుఁ బోలె సంబంధమేయయినఁ గలదా లేదా యను విషయమాలోచింపవలసియున్నది. దానికిఁ బూర్వ ముద్భటునికుమారసంభవమును గుఱించి విమర్శకులు గలిగించిన ప్రతీతియు దానిప్రామాణ్యాప్రామాణ్యములును దెలిసికొనుట యావశ్యకము. తర్వాత నన్నిచోడపద్యభాగము పరిశీలింతము. తదనంతర ముభయకావ్యసంబంధపరిశీలనము కర్తవ్యము.

**ఉద్భటుని కుమారసంభవము.**

సంస్కృతమున నలంకారగ్రంథములు రచించినవారిలో నుద్భటుఁడు సుప్రసిద్ధుఁడు. ఈతఁడు క్రీస్తుశకమున 778-813 సంవత్సరములనడుమఁ గాశ్మీరదేశము నేలినజయాపీడాధీశునిసభయందు విద్యాపీఠాధిపతిస్థాన మలంకరించిన యాలంకారికమహాకవి. ఈతనికి దినమునకు లక్షదీనారములు వేతనముగా రాజిచ్చుచుండె నని [1] తెలియవచ్చుచున్నది. కవికి దినమున కంత వేతనమా ? [2] ఇంతకు నంత వేతనముపుచ్చుకొను నితఁడు రచించినది చిన్నయలంకారగ్రంథమే తాత్కాలికకవుల గ్రంథములనుండి యుదాహరణముల

---

1. శ్లో. విద్వాన్ దీనార లక్షేణ ప్రత్యహం కృతవేతనః,
భట్టోఽభూ దుద్భట స్తస్య (జయాపీడస్య) భూమిభర్తుః సభాపతిః
రాజతరంగిణి ౪-౪౯౫.

2. The oldest text-books on Alankara, those of Bhamaha and Bhatta Nayaka hava been lost, but a great number are still extant, the earliest of which belong to the times of King Jayapida, 779—813 A. D. One of these, the Alankara Sastra of Bhattodbhata, I found together with a commentary of Prathihara Induraja, in Jesalmir.

Of this Bhattodbhata Kalhana says that he was Jayapida's sabhapathi, or chief pandit, and that he was paid daily a lakh of Dinaras.

K—12

నయిన నీయలేదు' అనికొందఱును అది ప్రతిదినవేతనముగాక రాజసభకుఁ [1]బోయినదినమున కిచ్చెడువేతన మయియుండు నని కొందఱు నభిప్రాయ పడిరి. కొందఱు వానిని నిరసింపఁ దలఁచి యతఁ [2]డనేకగ్రంథములు రచించినవాఁ డని సమర్థింపఁబూనిరి. కవుల కక్షరలక్షలును బండితుల కుదయలక్షలు నిచ్చిన వా రున్నవా రని చెప్పుకొను కాలమున విద్యాపీఠాధిపతికిఁ బ్రతిదినదీనా

---

It is to be regretted that the recipient of such munificent pay did not write a more extensive book, and did not give us extracts from contemporaneous poets. He has only composed a short treatise on Alankaras or ornaments to be used in poetry, and most egotistically takes his examples from his own work, a Kumarasambhava." (G. Buheler's Report of tour in Kashmir—*J. B. B. R. A. S.* Extra No. of 1877.)

1. "A hundred thousand Dinaras per day seem to be too exhorbitant a tax on the treasury of the king even for those days of unbounded wealth. Possibly Udbhata was not going to the court of the king every day but once in many days or months; and the remuneration of Laksha Dinaras probably pertained to the day when he attended the court." Page XI, Introduction of Kavyalankarasarasangraha, Bhandarkar Oriental Research Institute, Poona.

2. "అంతరా చ త మిమం కావ్యాలంకారాణాం సారసంగ్రహం భట్టోద్భట ప్రణీతో నాన్యోగ్రంథోఽద్య యావ దుపలబ్ధిపదం ప్రాప. వామన దామోదరగుప్తాదీనాం సమసమయః మనోరథాదీనాం కవివరాణాం సమాజపతిః కావ్యగోష్ఠీప్రవర్తకభావకపరీక్షకాణాం కాశ్మీర మహారాజానా మన్యతమ స్యోపజీవీ సభాపతిపదాభిషిక్తః ప్రత్యహదీనారలక్ష వేతనార్హో భట్టోద్భటః తాదృశి చ వినిర్మిత భారతీ బహులే కవిక్రియా శిక్షణ దక్షేచ కాలవిశేషే లబ్ధాత్మలాభః ప్రకృత మేక మేవ ప్రబంధం ప్రణినా యేతి కిం కేనాపి పార్యతే కల్పయితుమ్. నిపుణం చ నిరూప్యమాణే ప్రతీహారేందురా జోల్లిఖితం బహుభి శ్చాభి నవగుప్తాదిభి రంశతోఽనుపద మనూదితం భామహకావ్యాలంకారవివరణం తథా కుమారసంభవ మన్య త్కావ్యం చ ప్రతీహారేందురాజేన ప్రకృత వ్యాఖ్యాత్రా నిర్దిష్టం భట్టోద్భటేన ప్రణీత మితి నిర్ధారయితుం శక్యతే. అస్మా దేవ కుమారసంభవా దేకదేశభూతోఽనుగతః శ్లోకసందర్భః స్వప్రయత్నంయథోద్దేశ మలంకారాణా ముదాహరణతయా నివేశ్యాయ మలంకారసంగ్రహః సంఘట్టితో దృశ్యతే. రమణీయ మిదం కావ్య మేకదేశేన కేవలం కావ్యలింగాయమానేన బహిరవతీర్ణమంశాంతరేణ చ సర్వథా లుప్తం పఠితౄణాం పీడాం ప్రీతిం చ తనోతి. వినాచ కాంశ్చిచ్ఛ్లోకా నలంకారోదాహరణీ భవాయ కేవలం కల్పితకఠినవికృతపద సందర్భాన్ ప్రాయః సర్వేష్వన్యే శ్లోకా అతిమృదుళతయా స్ఫుటార్థతయా గంభీరయా చ శైల్యా సునివేశితా ఇ తీద మసంశయం వశ్యవాచం కవి ముద్భటం ప్రజ్ఞాపయతి"

See the introduction of Kavyalankarasarasangraha of Udbhata with Vritti edited by K. S. Ramaswami Sastri, Siromani, Oriental Institute Baroda.

రలక్షు లిచ్చి రన్న వింతయే ముండును? అది విశ్వసింతు రేని సమర్థనీయమే. అది యర్థవాద మందు రేని, రాజభోగము లనుభవింప ననువగు రాజాదరణమునకుఁ బాత్రుఁ డని గ్రహించినఁ జాలును. ఇతనిపాండిత్యగౌరవమే పరిశీలనీయముగాని యితఁడు చిన్నగ్రంథము రచించెనా? పెద్దగ్రంథము రచించెనా? అది వీని వేతనమునకు సరిపడియున్నదా? లేదా? అను విషయములు పరిగణనీయములు గా వనియే మనము భావింపవలయును. ఇంతకు నీతనిగ్రంథము లెన్నియుండెనో తెలియదు. అర్వాచీనలాక్షణికు లిచ్చిన యుదాహరణములవలనను వారుచేసిన యుద్భటప్రమాణస్మరణమువలనను నీతఁడు భామహాలంకారవివరణాది లక్షణగ్రంథములు రచించిన ట్లూహింపవలసియున్నది. ఈతని గ్రంథములలోఁ గావ్యాలంకారసారసంగ్రహము మాత్రము లక్ష్యమగు కుమారసంభవైకదేశముతోఁ బ్రకృతము మన కుపలబ్ధ మయి యున్నది. అందు గ్రంథాది యందుఁ దన్నామప్రతిజ్ఞాదులుగాని గ్రంథాంతమందుఁ దన్నామసహితోపసంహారవాక్యములుగాని కానరావు. అది యుద్భటుఁడు రచించినట్లు తద్వ్యాఖ్యాతలు ప్రసక్తివశమున రచించిన వాక్యములనుబట్టి నిశ్చయింపఁబడెను. ఆ రీతి పరిశీలింపఁ దగినది.

వ్యాఖ్యాతలరీతి.

తద్వ్యాఖ్యాతలలో నొకఁడగు ప్రతీహారేందురాజు దీపకాలంకారోదాహరణ వివరణానంతర ముపమాలంకారలక్షణాదికము వివరింపఁబోవుచు "నుద్దేశ (అలంకారగణన) ప్రకార ముపమాలక్షణాదులు దీపకలక్షణాదులకుఁబూర్వమే చెప్పవలసియుండఁగా [1]దీపకనిరూపణమునకుఁ దర్వాత నుపమానిరూపణము చేయనేల" యని యాశంకించుకొని "యీ గ్రంథకర్తచేత స్వోపరచితకుమారసంభవైకదేశ మిచట నుదాహరణముగా నుపన్యస్తమయినది. అందు ముందుగా దీపకోదాహరణము లున్నవి. తదనుసంధానావిచ్ఛేదముకొఱకు నుద్దేశక్రమము పరిత్యక్తమయినది. వృత్తభంగభయమున నుద్దేశ మట్లు చేయఁబడలేదు. ఉత్తరత్ర చెప్పఁబడు లక్షణములం దుద్దేశక్రమానుసరణముననే సమాధానముఁ జెప్పుకొనఁదగును" అని ప్రతిపాదించెను.

---

1. లఘువృత్తివ్యాఖ్య. ౧ వర్గ ౧౭-శ్లో. "నను ఉపమయా ఉపమాదీపకం చ ఇతి పూర్వముద్దిష్టత్వా ద్యథోద్దేశలక్షణ మితి న్యాయా త్తస్యా ఏవ పూర్వం లక్షణం కర్తవ్యం పశ్చాద్దీపకస్యే తి కథ మాదౌ దీపకం లక్షిత మితి వక్తవ్యమ్. ఉచ్యతే-అనేనగ్రంథకృతా స్వోపరచితకుమారసంభవైకదేశోఽత్ర ఉదాహరణత్వే నోపన్యస్తః. తత్ర పూర్వం దీపక స్యోదాహరణాని. తదనుసంధానావిచ్ఛేదా యాత్ర ఉద్దేశక్రమః పరిత్యక్తః. ఉద్దేశస్తు తథా న కృతో వృత్తభంగభయాత్, ఏవ ముత్తరత్రాపి లక్షణే షూద్దేశక్రమానుసరణేన సమాధి ర్వాచ్యః.

వివృతి యనువాఖ్య రచించిన రాజానకతిలకుఁ డుపమాలంకార వివరణాదినే "[1]వృత్తానురోధమున నుపమ ముందే చెప్పఁబడినను స్వయంకృత కుమారసంభవాఖ్యకావ్యసంగత్యనురోధమున దీపకమునకుఁ దర్వాత లిఖింపఁ బడెను. ఉత్తరత్రపరివర్తనమున నీ విశేషమే గ్రహింపఁదగును" అని విచారణ గావించెను.

తేలినదియేమి? "ఉపమా దీపకం చైవ ప్రతివస్తూపమా తథా" అని యలంకారములవరుస చెప్పఁబడినది. అలంకారనిరూపణమున దీపకము నిరూపింపఁబడిన తర్వాత నుపమ నిరూపింపఁబడినది. దానిని సమర్థింపఁదలఁచిన వ్యాఖ్యాతలు "ఉద్భటుని కుమారసంభవ ముదాహరణముగా నీయఁబడినది. అందుపమకంటెఁ బూర్వమే దీపకమున కుదాహరణముండుటచేతఁ దత్సంగతికై యుపమకంటెఁ బూర్వమే దీపకము నిరూపింపఁబడినది. గ్రంథకర్త యలంకారగణనలోని క్రమము విడిచినాఁడు. 'అట్లేలచేయవలెను? ఉద్దేశముననే దీపకము ముందు చెప్పరాదా? యందురేమో' 'దీపక ముపమా' అని పఠించినచో వృత్తము చెడిపోవును. కావున నట్లే యుంచినాఁడు." అని వ్యాఖ్యాతలు వివరించిరి.

వ్యాఖ్యాతలు చెప్పిన వృత్తభంగభయ మనుకారణ మంత తృప్తికరముగాఁ గనఁబడదు. ఈ కవి యీ గ్రంథమున నలంకారపరిగణనమునఁ దఱచు శ్లోకరచనలో 'చ, చైవ, తథా, తథైవ' మొదలగు పదములు [2]పాదపూరణమాత్రప్రయోజనములుగాఁ బ్రయోగించుట గలదు. కావున 'దీపకం చోపమా చైవ' యని పఠించినయెడల వృత్తభంగము లేదే! అత్రోవవ్యాఖ్యాత లేల యాలోచింప లేదో! దొరకినపాఠము "ఉపమా దీపకం చైవ" అని యుండి యుండును. విచారింపఁగా నుద్భటునికిఁ బూర్వుఁడగు [3]భామహుని యలంకార గ్రంథమున దీపక ముపమకుఁ బూర్వముననే యున్నది. వాని లక్షణములు లక్ష్యములు నట్లేయున్నవి. తర్వాత భట్టికావ్యమున లక్షణనిరూపణము లేకున్నను, అప్పటిలక్షణానుసారమున లక్ష్యములు ప్రదర్శింపఁ బడినవి. ఆలక్ష్య

1. వివృతివ్యాఖ్య. ప్రథమవర్గ-3౧ శ్లో. "వృత్తానురోధా దుపమా ప్రాగుపదిష్టాఽపి స్వయంకృతకుమారసంభవాఖ్యకావ్యసంగత్యనురోధా ద్దీపకస్య పశ్చా ల్లిఖితా. పరివర్తనే చోత్తరత్రాఽయ మేవ విశేషో జ్ఞేయః."

2. యథాసంఖ్య మథో త్ప్రేక్షాం స్వభావోక్తిం తథైవచ. కా. సా. సం. వర్గ. 3.
ఉపమేయోపమాం చైవ సహోక్తిం సంకరం తథా. కా. సా. సం. వర్గ. ౫.

3. అనుప్రాసశ్చ యమకో రూపకం దీపకోపమే
ఇతి వాచా మలంకారాః పంచై వాన్యై రుదాహృతాః.

భామహాలంకారము. ౨-౪

ములనుబట్టి లక్షణసమన్వయముచేయు వ్యాఖ్యానమునఁ దత్పూర్వలలక్షణము లును, తద్వివరణములును గలవు. అందును నుపమకంటె దీపకమే పూర్వము న నున్నది. [1] ఉపమ కర్థాలంకారప్రాథమ్యము భరతశాస్త్రమునందును వామనాద్యలంకార గ్రంథములందును గనఁబడును. భామహాది గ్రంథములందు రూపక దీప కోపమ లను వరుసయే కలదు. అందును నుపమకంటె దీపకమే పూర్వపుది. ఉద్భటుఁడును దీపకము ముందుగాఁ జేర్చిన పాఠము రచించెనేమో! ఒకవేళ నట్లు రచింపకపోయినను పౌర్వాపర్యము వివక్షచేయక తత్ పూర్వ సంప్రదాయబలమును బట్టి దీపకమే ముందు నిరూపించి యున్నాఁడేమో యని గ్రహింపవలసియున్నది. ఉద్భటుఁడు లక్ష్యలక్షణములలో నేది ముందు రచించి నను సరిపడినట్లు రచింపఁజాలనివాఁడా! దానిపై వెనుకముందులు వ్యాఖ్యాతలుసరిపెట్టవలెనా!

ఉద్భటకావ్య విషయము.

ఇంక నుదాహృతమగు కుమారసంభవమందలి విషయము చూతము. పూర్వాలంకారికులలోఁ గొందఱు లక్షణములు రచించి వానికి లక్ష్యములుగాఁ బరరచితపద్యములను గ్రహించెడివారు. వానితోఁ గొన్ని స్వరచితలక్ష్యములను గూడఁ గలుపువారు కొందఱు. కొందఱు లక్షణమున కనుకూలముగ లక్ష్యము లన్నియు స్వీయముగా రచించుటయే గౌరవముగాఁ జూచుకొనువారు. భామహుఁడు వర్గాంత శ్లోకములలో నిదర్శనములు [2]స్వయంకృతము లని యొక విశేషవిషయముగాఁ జెప్పికొనియున్నాఁడు. [3]జగన్నాథకవి (పండితరాయలు) దానిని మిగులఁ బ్రశంసించుటయేకాక పరోదాహరణ గ్రహణమును నిరసించెను. స్వయంకృతోదాహరణములు ప్రదర్శించుట యను సంప్రదాయము ప్రాలంకారికులలోఁగూడఁ గలదు. కావ్యాలంకార చూడామణికావ్యాలంకార

---

ఆదిమధ్యాంతవిషయం త్రిధాదీపకముచ్యతే. భామహ. ౨-౨౫.

విరుద్ధేనోపమానేన దేశకాలక్రియాదిభిః, ఉపమేయస్యయత్సామ్యం

గుణలేశేనసోపమా. భామహ. ౨-౩౧.

1. ఉపమా దీపకం చైవ యమకం రూపకం తథా
 కావ్యస్యైతే హ్యలంకారా శ్చత్వారఃపరికీర్తితాః. భరతశాస్త్రము ౧౬-౪౧.
2. శ్లో. స్వయంకృతై రేవ నిదర్శనై రియం మయా ప్రక్లృప్తా ఖలు వాగలంకృతిః
 అతఃపరం చారు రనేకథాపరో గిరా మలంకారవిధి ర్విధాస్యతే.
 భామహాలంకారము ౯౬.
3. నిర్మాయ నూతన ముదాహరణానురూపం కావ్యంమయాత్ర నిహితం న పరస్య కించిత్
 కిం సేవ్యతే సుమనసాం మన సాపి గంధఃకస్తూరికాజననశక్తిమతా మృగేణ.
 రసగంగాధరము

సంగ్రహాకారులు గూడ నట్లే కావించిరిగదా. భామహాదులు తత్తదలంకారములకుఁ దత్తదుదాహరణములు రచించిరి. భట్టి రామాయణకథానుగతి గలుగున ట్లుదాహరణములు మాత్రము రచించినవాఁడు. ఉద్భటుఁడు లక్షణములను రచించి తత్క్రమానుసారముగఁ దదనుకూలములగు లక్ష్యములను రచించుచు నాలక్ష్యశ్లోకము లన్నియుఁ గలిపినచో నొక యితివృత్తము గలుగునట్లు రచించినవాఁడు. అదే కుమారసంభవము.

కావ్యాలంకారసారసంగ్రహమునఁ జూపిన యలంకారలక్షణములకు వరుసగా నుదాహరణములు గుదురునట్లు కుమారసంభవైకదేశ ముద్భటుఁడు రచించెనుగాని కొంద ఱనున ట్లాతఁడు రచించిన కుమారసంభవ గ్రంథమునుండి యక్కడక్కడివో వరుసగా నున్నవో కొన్ని యుదాహరణముగా నిచ్చినాఁ డనుట కవకాశములేదు. మహాకవి యొకఁడు మహాకావ్యము రచించుచుఁ గావ్యశోభార్థము కూర్పవలసినయలంకారములను నవాంతరభేదములతోఁ దొంబదియైదు శ్లోకములలో వరుసగా రచించి యది తన యలంకారగ్రంథమునకు లక్ష్యముగా నిచ్చియుండుననుట యుక్తమో, లక్షణముల నెదుట నుంచుకొని వానికి లక్ష్యములను గూర్చుచు నందుఁ గుమారసంభవకథగూడ నుండునట్లు రచించె ననుట యుక్తమో సహృదయు లాలోచింపఁదగును. ఒకవేళ లక్షణశ్లోకముల కూర్పు లక్ష్యరచనానంతరమే చేసె నని యొప్పుకొనినను లక్షణక్రమము లక్ష్యరచనకుఁ బూర్వమే నిర్ణీతము గావించుకొనినాఁ డనక తప్పదు. ఆతని లక్షణములును వానిక్రమమును తాను మార్పులు గావించిన చోట్లను గ్రొత్త యలంకారములు నిరూపించిన చోట్లను దక్కఁ దదితరస్థలములందు భామహపద్యానుసారులే యనిస్పష్టముగాఁ గనఁబడుచున్నది. గ్రంథవిస్తరభీతిచే నిచట నది వివరింపఁ దలంపలేదు. పోనిండు. ఆతఁ డలంకారములకా తొంబదియైదు శ్లోకము లిచ్చినట్లే మిగిలినభాగమందు గుణరీత్యాదులకుదాహరణములు వచ్చునట్లు కుమారసంభవకథ యంతయు రచించియుండునేమో యని యూహింపరాదా యనుట కైన నవకాశము గనఁబడదు.

భామహాదులు గుణ దోషహాని రీత్యాదులను, అనుప్రాసాది శబ్దాలంకారములను, రూపకాద్యర్థాలంకారములను కావ్యశోభాదాయకము లగుటంజేసి సామాన్యముగా నలంకారశబ్దముతో వ్యవహరించిరి. కావున వారి కావ్యములయందు కావ్యవిశేషనిరూపణ గుణరీత్యాదివివరణానుప్రాసరూపకాది లక్షణాదులు గలవు. కావుననే భామహుఁడుతనగ్రంథమునకు భామహాలంకారమనియే నామకరణము గావించెను. వామనుఁడు గుణముల నలంకారములుగాఁ గణించి యుపమాదులను శోభాతిశయహేతువు లని చెప్పినాఁడు. అట్లే ఉద్భటుఁడు గుణరీత్యాదులకంటె ననుప్రాసాదులు నుపమాదులును గావ్యశో

భాతిశయదాయకత్వమున ముఖ్యము లని యెంచినవాఁడు. కావ్యాలంకారము లలో సారములగు నలంకారములనే తన గ్రంథమున నిరూపింపఁ దలఁచి భామహ కాలమున కించుమించుగా నున్న నలువది తొమ్మిదియలంకారములలోఁ గొన్నిటిని గొన్నియలంకారములలో నంతర్భవింపఁజేసియుఁ గొన్ని నూతనాలంకారములఁ గల్పించియును దుదకు నలువదియొక్కటిగా సంగ్రహించి, కావ్యాలంకారసారసంగ్రహ మని తన గ్రంథమునకుఁ బేరుఁబెట్టినాఁడు. ఇం దితరవిషయములను జేర్ప నవకాశము లేదు. డెబ్బదియైదు లక్షణ శ్లోకముల తోను దొంబదియైదు లక్ష్యశ్లోకములతోను నాతఁడు రచింపఁ దలఁచిన గ్రంథము పూర్తియైనది. ఆలక్ష్యములలోఁ గుమారసంభవైకదేశకథ యనుగతమై యున్నది. దానినే కొందఱు కుమారసంభవవాఖ్యకావ్య మనియుఁ గొందఱు కుమారసంభవైకదేశమనియు వాడియుందురు. ఈచిన్నకృతి కావ్యమగు నా యందు లేమో! రసవంతమగు నొకవాక్యమే కావ్యశబ్దవాచ్యమగు ననునపుడు తొంబదియైదు శ్లోకములు గలిగిన కుమారసంభవైకదేశకథ కావ్యమనిపించుకొనుటలో వింతయే మున్నది. అందలి కథ చూతము.

**కథాసారము.**

ఈశ్వరుఁడుమన్మథదహనానంతరము తపము గావించునపుడు శరత్కాలమునఁ గామోద్రేకము నొంది పార్వతీరూపవిభ్రమాదులను దలపోసి తలపోసి యిపుడుసాకు వలెనే పార్వతికిని నుత్కంఠ గలిగియుండును. చండాలసదృశుఁడ నగునేను మదనుని దహించి యంతర్ధానము నొందినపిమ్మట నిరాశ చేసికొనినపార్వతి మృతినొందెనేమో యని పశ్చాత్తాపము నొంది గౌరీశిఖరమునకుఁబోయి ఘోరతప మాచరించుచున్నపార్వతినిఁ జూచి తద్భావము గనిపట్టుటకయి కార్యాతురత చే బ్రచ్ఛన్నవటురూపము దాల్చి యామెకుఁ దనయెడఁ గల దృఢభక్తి ప్రేమములు గ్రహించి సంతుష్టుఁ డయ్యె ననెడి కథ యందుఁ గలదు. ఈశ్వరుని వటురూపధారణలీల యం దితివృత్తము. ఇది యుద్భటకృతాలంకారలక్షణానుసారిసర్వాలంకారసంశోభితము. ఇదియే కవి చికీర్షితము. ఇంతకు మించినకథ రచించె నని యూహించుట కవకాశమే కనుపట్టదు.

**ఉద్భటుఁడు కుమారసంభవకథ యంతయు రచించెనా ?**

"కాళిదాస కుమారసంభవకథయే యుద్భటుఁడును కావ్యముగా రచించినాఁడు. [1]దానిముం దిది నిల్వలేక పోయినది. అలంకారోదాహరణము లయిన శ్లోకములు మాత్రము నిలఁబడినవి. మిగిలినవి యంతరించినవి.

---

1. "The poem Kumarasambhava which was composed by Udbhata evidently contained the same theme that makes the story of Kumarasambhava of Kalidasa. And probably this was the reason why

కాళిదాస గృహీతమగు కథకాక వేఱేకథ యతఁడు గ్రహించి యున్నయెడల నది నిలిచియుండును. అందు నలంకారోదాహరణములగు శ్లోకములు నొక్క సర్గభాగమయి యుండును." అని కొంద అందురు. కాని య ట్లనుటకు వీలు గనఁబడదు. మహాకావ్యము రచించుచు నడుమ నొక సర్గలో సర్వాలంకారోదాహరణములు కృత్రిమముగాను బలాత్కారముగాను దెచ్చిపెట్టినట్లు రచించునా? భట్టి శబ్దప్రయోగ ప్రదర్శనైకపరుఁడై రచించునపుడు గుణాలంకారాదులకొక కాండము రచించెను. అదంతయు పనికట్టుకొని రచించిన లక్ష్యరూపకావ్యమే. ఉద్భటుఁ డట్లు రచించె ననుటయెట్లు? తన్మూలమగు లక్షణ గ్రంథమనుగూడ రచించినవాఁడుకదా! దానిని మించి లక్ష్యములు రచించెనన నాధార మేది? కావున కుమారసంభవైకదేశమే యుద్భటుఁడు రచించె ననుట సమంజసమని తోఁచెడిని. ఒకవ్యాఖ్యాత యన్న 'స్వోపరిచిత కుమార సంభవైకదేశ ముపన్యస్తమయ్యె' ననువాక్యమున "స్వోపరచితమగు కుమారసంభవైకదేశము" అని యని యన్వయింపఁదగును. స్వోపరచితమగు కుమారసంభవమున నేకదేశ మనుట రచయితయభిప్రాయము కాదని తోఁచెడిని. అనఁగా 'స్వోపరచిత' అను విశేషణము 'కుమారసంభవైకదేశశబ్దము నకుఁ గాని 'కుమారసంభవ' శబ్దమునకుఁ గాదు. పయివాక్యమును బట్టియే ఉద్భటుఁడు కుమారసంభవకావ్యము రచించి దానినుండి కొన్ని శ్లోకము లుదాహరణములుగాఁ గావ్యాలంకారసారసంగ్రహమున నుపన్యసించె నని యాంగ్లపండితులు[1] మొదట విమర్శనముల రచించిరి వానినే మన సంస్కృ

---

it was altogether lost to Sanskrit Literature except the fragment that exists in the shape of examples of Kavyalankarasarasangraha. Although it is no wonder that Kumarasambhava of Udbhata could not hold out for long against the established eminence of the poem of the prince of poets, still his poetry is not of a low order and if its subject were not the same as that of Kalidasa's Kumarasambhava it would surely have held its own up to this time.

The verses included in the present work as examples are 94 and they are probably one sarga of the whole poem as the thread of narrative goes on fairly unbroken from beginning to end. Sometimes thenatural order of verses seems to be changed" Introduction of Kavyalankarasara sangraha page xiv.

1. "Besides a lost Bhamahavivarana, Prateeharendu Raja tells us (P. 15.) that Udbhata wrote a poem called Kumarasambhava, from which are taken most of the illstrations in the text." De's Sanskrit pocties. page 74.

తాంధ్ర పండితులును [1]ననుసరించుచున్నారు. పయి సందర్భమునుఁబట్టి సహృదయులు నిర్ణయింపఁదగును.

కాళిదాసుని జాడలు.

అందును సుప్రసిద్ధమగు కాళిదాస కావ్యమందలి యేకదేశమే యతఁడు రచింపఁదలఁచినట్లు కొన్నిజాడలు గనుపట్టుచున్నవి. అవి పరిశీలింతము. కావ్యాలంకారసారసంగ్రహమున మొదటియలంకారము పునరుక్తవదాభాసము. తదుదాహరణముగా రచించిన కుమారసంభవమున మొదటిశ్లోకము పునరుక్తవదాభాసోదాహరణము.

"తదా ప్రభృతి నిస్సంగో నాగకుంజర కృత్తిభృత్
శితికంఠః కాలగళ త్సతీశోకానలవ్యథః.
సదేవ్యో దివ సాన్నిధ్యే తస్మిన్ శైలేంద్ర కందరే"

తదా ప్రభృతి యనుచోట 'తతః ప్రభృతి' అని పాఠాంతరము గలదు. "తతః ప్రభృతి = కామదహనా దారభ్య" (కామదహనము మొదలుకొని) అని వివృతికారుఁడు వివరించినాఁడు. "తదా ప్రభృతి = సతీవియోగాదారభ్య" (సతీవియోగము మొదలుకొని) అని లఘువృత్తికారుఁడు వ్యాఖ్యానముచేసెను.

అప్పటనుండియు నాగకుంజర కృత్తిభృత్తును నిస్సంగుఁడును శితికంఠుఁడును గాలగళత్సతీశోకానలవ్యథుఁడు నగు నామహాదేవుఁడు యాశైలేంద్రకందరమున దినములు గడపెను అని దాని భావము. దానికి మూల మనఁ దగు కాళిదాస శ్లోకము చూతము.

"యదైవ పూర్వే జనసే శరీరం సా దక్షరోషా త్సుదతీ ససర్జ
తదాప్రభృత్యేవ విముక్తసంగః పతిః పశూనా మపరిగ్రహోఽభూత్"

కాళిదాస కుమారసంభవము ౧-౫౩.

ఇటను "తతః ప్రభృత్యేవ" అను పాఠాంతరము కలదు.

సకృత్తివాసా స్తపసే యతాత్మా గంగాప్రవాహోక్షితదేవదారు
ప్రస్థం హిమాద్రే ర్మృగనాభిగంధి కించిత్క్వణత్కిన్నర మధ్యువాస.

కాళిదాసశ్లోకములోని 'తదా ప్రభృత్యేవ' అను దాని నందుకొని యుద్భటుఁడు కావ్యారంభము చేసియుండును. కాళిదాసుని 'విముక్తసంగః' అనునది యుద్భటుని 'నిస్సంగః' అయినది. కాళిదాసుని 'కృత్తివాసాః' అను పదము ఉద్భటుని కావ్యమునఁ బునరుక్త వదాభాసోదాహరణానుకూల్యము నకై 'నాగకుంజరకృత్తిభృత్' అనురూపమునఁ బరిణమించినది. పునరుక్తవదాభాస లక్ష్యార్థముచేర్చిన 'శితికంఠః కాలగళత్సతీశోకానలవ్యథః' అనెడి యుద్భ

1. దీనిలోనే 31-వ పుటలో నుదాహరించిన కుమారసంభవపీఠికలోని వాక్యములును ఇతర పత్రాదులో భాగ ప్రదర్శితములగు విమర్శక వాక్యములును చూడవలయును.

టుని ప్రయోగము కాళిదాసకావ్య మందున్న "శరీరం సా దక్షరోషా త్ససర్జ" అనుదానిలోని విషయమును స్పష్టపఱుచుచున్నది. 'ప్రస్థం హిమాద్రే రధ్యువాస" అను కాళిదాసవాక్యమును "దివసా న్నిన్యే తస్మిన్ శైలేంద్ర కందరే" యను నుద్భటవాక్యమును సమభావములే కదా. ఉద్భటుఁడు కాళిదాసుని ఛాయ గ్రహించె ననుటకు సందియమేల?

మఱొక విషయము. కాళిదాసకావ్యమునఁ బార్వతీసఖి వటురూపధారితోఁ బార్వతీ తపోవిషయము తెలుపునపుడు [1]అసహ్యా హుంకారనివర్తితమగుమదనబాణము పురారిని బొందఁజాలక పార్వతి హృదయమున నాటిపోయినది. అది మొదలు కొని పార్వతి యున్మదన యయ్యెనని చెప్పఁబడినది. అందు మదనుఁడు విశీర్ణమూర్తి యయినను అతనిబాణము పార్వతి హృదయమున నాటినది మొద లామె యున్మదన యయ్యె నని పార్వత్యున్మదనత్వము ప్రకటితమయ్యెను. పరమేశ్వరునకట్టి యున్మదనావస్థ కలిగినట్లు రచింపలేదు.

"మన్మథుఁడు పరమేశ్వరునిపైఁ [2]బ్రయోగింప సంమోహనాస్త్రము వింట సంధించినపుడు హరుఁడు [3]కించిత్పరిలుప్తధైర్యుఁడయి యుమాముఖమున దృష్టి నిలిపెను. అతఁడు వశ్యేంద్రియుఁడు గాన [4]నింద్రియములను నిగ్రహించి దానికంతకుఁ గారకుఁడగు మన్మథుని [5]దగ్ధునిఁ గావించి [6]స్త్రీ సాన్నిధానమును బరిహరింపఁదలఁచి యంతర్ధానమొందెను" అని తెలిపినతర్వాత

1. అసహ్యాహుంకారనివర్తితః పురా
పురారి మప్రాప్తముఖః శిలీముఖః
ఇమాం హృది వ్యాయతపాత మక్షిణో
ద్విశీర్ణమూర్తే రపి పుష్పధన్వనః.
తదాప్రభృ త్యున్మదనా పితుర్గృహే....౫-౫౪.

2...సంమోహనం నామ చ పుష్పధన్వా ధనుష్యమోఘం సమధత్తబాణమ్
కా. కు. సం. 3-౬౬.

3. హరస్తు కించిత్పరిలుప్తధైర్య శ్చంద్రోదయారంభ ఇవాంబురాశిః
ఉమాముఖే బింబఫలాధరోష్ఠే వ్యాపారయామాస విలోచనాని.
కా. కు. సం. 3-౬౭.

4. అథేంద్రియక్షోభ మయుగ్మనేత్రః పున ర్వశిత్వా ద్బలవ న్నిగృహ్య
హేతుం స్వచేతోవికృతే ర్దిదృక్షుః దిశా ముపాంతేషు ససర్జ దృష్టిమ్.,, 3-౬౯.

5. త మాశు విఘ్నం తపస స్తపస్వీ వనస్పతిం వజ్ర ఇవావభజ్య.

6. స్త్రీ సన్నికర్షం పరిహర్తు మిచ్ఛ న్నంతర్దధే భూతపతి స్సభూతః.
కా. కు. సం. 3-౭౪

నీశ్వరుని ప్రసంగమే చేయలేదు. పార్వతి మరలఁ దపముచేయునపుడు 'పార్వతి [1]మృణాళపేశలములగు నవయవములతోఁ జేయుతపస్సు తపస్వులు గఠినావయములతోఁ జేయు తపస్సును మించె' నని వర్ణించినవెంటనే [2]అనంతర మొక జటిలుఁడు తపోవనమునఁ బ్రవేశించె నని రచింపఁబడినది. అనంతరమనఁగా దేని కనంతరమో లేదు. ఆ వటువు ఎవఁడో తెలుపుసూచనమైనను లేదు. పార్వతీబ్రహ్మచారుల సంభాషణానంతరము ఆ వటువే పరమేశ్వర రూపము నొందె నని తెలుపఁబడినది. శివుఁ డంతర్ధాన మొందిన పిమ్మట నాతని స్థితిగతులు తలంపఁబడనేలేదు. అట్టి మదనాంతకునకుఁ బార్వతిపై మరల నను రాగము గలుగుటకుఁ గారణము గాని వటురూపము ధరించుటకుఁ గారణము గాని చెప్పక పోవుటచేఁ గథాధార కొంత తెగిపోయినట్లున్నది యని యొప్పుకొనక తప్పదు.

కాళిదాసు మహానాటకకర్తగాన నాటకశక్తిని వటువును బార్వతీ తపోవనమునఁ బ్రవేశపెట్టి తుదకుఁ బరమేశ్వరుఁడే వటురూపము దాల్చె నని రచింపఁదలఁచెనేమో! లేక నడుమ రచించినభాగము లుప్తమయినదో! కాశీ ముద్రిత కుమారసంభవమున నొక జటిలుఁడు తపోవనమునఁ బ్రవేశించె నని చెప్పుటకుఁ బూర్వము ప్రక్షిప్త శ్లోక మని [3]యొకటి పత్త్రాధోభాగమున నీయఁబడినది.

'అందు దుఃఖితులగు దేవతలు పరమేశ్వరవశీకరణసమర్థమగు పార్వతి తపస్సునుజూచి పరమేశ్వరునకు నమస్కరించి దేవతాసేనాధిపతియగు కుమారుని దయచేయు మని వేఁడికొని' రను భావముగలదు. అనంతరము జటిలుఁడొకఁడు పార్వతీతపోవనమునఁ బ్రవేశించె ననుభావ మున్నది. ఆ శ్లోక మచ్చటి సందర్భమునఁ గలలోపమును గ్రహించినవా రెవరో రచించినదియై యుండును. అదియో అట్టి భావముగలమరొకశ్లోకమో కాళిదాసు రచించి యున్నను బరమేశ్వరునకుఁ బార్వతిపై దృష్టి ప్రసరించుటకు దేవతాప్రార్థనమే కారణ మని స్పష్ట మగునుగాని వటురూపధారణకారణము తెలుపఁబడదు.

---

1. మృణాలికాపేశల మేవమాదిభి ర్వ్రతైః స్వ మంగం గ్లపయంత్య హర్నిశమ్
తపశ్శరీరైః కఠినై రుపార్జితం తపస్వినాం దూర మధశ్చకార సా.
కా. కు. సం. ౫, ౨౯.

2. అ థాజినాషాఢధరః ప్రగల్భవాగ్ జ్వల న్నివ బ్రహ్మ మయేన తేజసా.
వివేశ కశ్చి జ్జటిల స్తపోవనం శరీరబద్ధః ప్రథమాశ్రమోయథా.
కా. కు. సం. ౫. ౩౦.

3. సురాః సముద్వీక్ష్య నగేంద్రకన్యయా కృతం తపః శంభువశక్రియాక్షమమ్
యయాచిరే తం ప్రణిపత్య దుఃఖితాః పతిం చమూనాం సుత మాజిహేతుమ్.
కా. కు. సం. ౫, సర్గ ౨౯, ౩౦ శ్లోకములనడుమ నున్న ప్రక్షిప్తశ్లోము

ఆ సందర్భమునఁగల లోపమునో గూఢత్వమునో గ్రహించిన యుద్భటుఁ డాలోపమును బూర్తిచేయఁ దలఁచియో లేక గూఢత్వమును విప్పఁ దలఁచియో నచట నతుకుట కవకాశముగల రీతిని గ్రంథము రచింపఁ దొడఁగె నని తోఁచుచున్నది. కాఁబట్టి పార్వతికిఁ బోలెఁ బరమేశ్వరునికిఁగూడ నున్న దనావస్థ గల్పించుట కుద్భటుఁ డెంచెను. కావుననే పరమేశ్వరునకుఁ గామవికారోద్రేకమును బశ్చాత్తాపమును బ్రచ్ఛన్నరూపధారణమును సయుక్తికముగాఁ గల్పించెను. దీనివలన నుద్భటుఁడు కాళిదాసకుమారసంభవైకదేశమే రచింపఁ దలఁచి కాళిదాస కుమారసంభవమునఁ గొంత యవకాశము తీసికొనె నని గ్రహింపఁదగును.

తదాప్రభృతీత్యాది శ్లోకముల సామ్యమును బట్టియును కాలగళ త్సతీశోకానలవ్యథుఁడను విశేషణమునుబట్టియును తదాప్రభృతి యనఁగా సతీవియోగప్రభృతి యనుటయే కవివివక్షితమని తోఁచును. పరమేశ్వరుఁ డప్పటికి హిమవత్కందరమున నున్నవాఁడనియే కాళిదాసోద్భటులు చెప్పిరి. మన్మథదహనానంతరము పరమేశ్వరుఁడు హిమవత్పర్వతము వీడి వెడలె నని కాళిదాసు చెప్పెను గదా. మన్మథదహనానంతరము హిమవంతమును వీడి కైలాసమునకుఁ బోవుట సహజము. మన్మథ దహనప్రభృతి హిమ వత్కందరమున నుండె ననుట సందర్భశుద్ధము కాఁజాలదు. మునుముందు మన్మథుని దహించినదానికిఁ బడిన పశ్చాత్తాపమునుబట్టియుఁ బార్వతీనిరాకరణమునకుఁ బరితపించి చేసిన తద్రూపచింతనాదులను బట్టియు పార్వతీశుశ్రూషా మన్మథ దహనాదికథాభాగ మూహ్య మనుభావము కవి కుండి యుండును. ఒక యలంకారగ్రంథమున కుదాహరణముగా రచించిన దానిలో నట్లు సంగ్రహించుట వింతకాదు. ఈ యుద్భటునికావ్యమునఁ గల శరత్కాలవర్ణనవిష్ణు వర్ణనలను హిమవద్వర్ణనమును బరిశీలించినవారికిఁ గవి యలంకారోదాహరణములు నింపుకొనుటయే ప్రధానముగా నెంచినాఁ డని తోఁపకమానదు. అట్లని సరసముగా లే దనరాదు. అన్నియు నలంకారోదాహరణములే కానఁ దదలంకారదృష్టితోఁ బరిశీలించినచో నన్నియు సరసములే. అందును గొన్ని పట్టులు మనోహారతరములుగా నున్నవి.

కాళిదాసకావ్యమందు మొదటి సర్గలోని 'తదాప్రభృతి' అందుకొని యయిదవ సర్గలోని వటురూప ధారణముతోఁ బార్వతీహృదయపరిశోధనాంతమువఱకుఁ గల కథ యందు సంగృహీత మయిపోయినది. వెనుకఁ జెప్పినట్లు అలంకారోదాహరణములు సరిపడినది. ఇట్లు స్పష్టముగా నుండఁగాఁ గాళిదాస కావ్యకథ గల కుమారసంభవ ముద్భటుఁడు రచించినాఁడు, అం దిది యొకసర్గము వెట్టు అనుట యెట్లు పొసఁగును. 'తదా ప్రభృతి' అనుదానిలోని తచ్ఛబ్దము

పూర్వపరామర్శకముగాన నాతఁడు వెనుక రచించినదానిని బరామర్శించి యుండు నని కొంద ఱందురు. కాళిదాసచ్ఛాయ స్పష్టమగుచుండ నట్టి యూహ మున కవకాశమే లేదు.

ఉద్భటుని గుఱించి నన్నిచోడుని యభిప్రాయము.

ఈ యూహాలన్నియు నేల ? ఉద్భటుని గుఱించి మనకవిరాజశిఖామణి యగు నన్నిచోడుఁడు చెప్పినపద్య మేమిచాటుచున్నదో చూతము.

"క. క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవమ్ము నలంకా
రము గూఢ వస్తుమయ కా
వ్యముగా హరులీలఁ జెప్పి హరు మెంప్పిచెన్."

సంస్కృత కవులను స్తుతించు సందర్భమున వాల్మీకి వ్యాస కాళిదాస భారవిస్మరణానంతర ముద్భటుని స్మరించుచు నట్లు రచించెను. ఉద్భటుఁడు కవిత్వము మెఱయునట్లు కుమారసంభవమును (క్రమమున) వరుసగా నలంకార లక్ష్య గ్రంథముగాను గూఢమగు నితివస్తువు గలుగు కావ్యముగాను హరుని లీలను (= ప్రచ్ఛన్నవటురూపధారణలీలతో) చెప్పి హరుని మెప్పించె నని దాని తాత్పర్యము. కుమారసంభవ మలంకారలక్ష్యముల గ్రంథము. అం దితి వస్తువు గూఢముగాఁ గలదు. అందు వర్ణ్యము హరునిలీల. లీల లనఁగా భక్తానుగ్రహాది నిమిత్తమున హరిహరాదులుచేయు మానుషచర్యలు. పర మేశ్వరుఁడు ప్రచ్ఛన్నరూపము దాల్చుట యొకలీల. ఫలము పరమేశ్వరుని మెప్పు. సాధారణముగా లక్ష్యమాత్ర ప్రయోజనములగు నలంకారగ్రంథము లలో నితివస్తు వనుగతము గాదు గాన నుద్భటుని ప్రజ్ఞావిశేషమును బ్రక టించుచు నా విశేషము నన్నిచోడుఁడు వక్కాణించెను.

పయి పద్యమునే ప్రమాణముగాఁ గొని [1]కొంద 'ఉద్భటుఁడు అలంకార గ్రంథమును, కుమార సంభవమును, హరలీల యను మఱొక గ్రంథమును

---

1. "పయిపద్యమును బట్టి యుద్భటుఁడు హరలీల, కుమారసంభవము అలంకార గ్రంథము (కావ్యాలంకార సార సంగ్రహము) రచించినాఁడని తెలియనగుచున్నది. ఇందు గావ్యా లంకార సంగ్రహమొక్కటి తక్కఁ దక్కిన విప్పుడు కానరాకున్నవి. ఆతని కుమారసంభము నుండి కొందఱాలంకారికులు కొన్ని శ్లోకముల నుద్ధరించిరి. ఉద్భటుఁడు కాశ్మీరరాజగు జయా పీడుని సభలో విద్యాపతిగా నుండెనని (క్రీ. 779 నుండి 813 వఱకు) రాజతరంగిణిలో నున్నది." మ-రా-శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన యుద్భటారాధ్యచరిత్రపీఠిక. XVII. పుట.

2. కుమారసంభవ ప్రథమ సంపుటము -చివరనుబంధమున మ॥రా॥ మా రామకృష్ణకవి గారు "ఉద్భటుఁడుకుమార సంభవము, కావ్యాలంకార సార సంగ్రహము, హరలీలయుఁ జెప్పిన వాఁడు" అని వ్రాసిరి.

మొత్తము మూఁడు గ్రంథములు రచించె' నందురు. వారి మతమున గూఢ వస్తుమయకావ్యముగా అనునది దేనితో నన్వయించునో దాని భావమేమో తెలియదు. హారులీలతో నన్వయింతురేని అప్పుడు గూఢత్వ మెక్కడనుండును? అలంకార లక్ష్య శ్లోకములలో నితి వస్తువు గూఢమయి యనుగత మగుచున్న దనిన సరిపడును. అలంకార మన నలంకారలక్షణగ్రంథ మనియు వస్తుమయ కావ్య మన సంస్కృతకావ్య మనియు నర్థము లున్నవి గాని యవి యిచటఁ బొసఁగవు.

ఉద్భటకుమారసంభవ మిరువది సర్గములుగలకావ్య మొకటి రెండు వ్యాఖ్యలతోఁ గాశ్మీరదేశమునఁ గలదనియు,నదియున్నదన్న వార్తయైననెందును బ్రకటింపఁబడ లే దనియు, నాంధ్రకుమారసంభవప్రథమ సంపాదకులు చెప్పుదురు. వారును జూడలేదఁట. 'ఈ యుద్భటుఁడు శబ్దచిత్రములందును నప్రస్తుత శ్లేషల యందును బ్రీతిగలవాఁ'డని తోఁచుచున్నదని కొన్ని శ్లోకము లుదాహరించి 'ఇత్యాదులు చూడఁగా సరసులగు కవులు గతించిరి. అనుప్రాస కఠోర చిత్రయమక శ్లేషాది శల్కోచ్చయము గూర్చు కవులు పుట్టుచున్నా'రను భావము గల మంకకుని శ్లోకము స్మరణకు వచ్చుచున్న'దని నన్నిచోడ కుమారసంభవ పీఠికలో వ్రాయఁబడినది. దానిభాగము దీనిలో 31-వ పొరఁటలో గ్రహింపఁ బడినది గాన మరల నీయఁబడలేదు. ఉద్భటుఁ డట్లధమకవిగా భావింపఁ దగినవాఁడు గాఁడు. ఆతఁ డనుప్రాసాప్రస్తుతశ్లేషా ద్యలంకారముల కుదాహరణము లిచ్చు నపు డట్టి యుదాహరణ ములీయక యేవి యియ్యవలెనో! ఆతఁడు రచించిన వానిలో లభించినవే యఁలంకారలక్ష్యములు. వానిలోనివే కొన్ని మచ్చునకుఁజూపి యీకవి శ్లేషాదిశల్కోచ్చయము ప్రోగుచేయు కవులలోనివాఁ డనుటకు వారికి మన సెట్లొప్పినదో! వారు నన్నిచోడుని కావ్య ముద్భటుని కావ్యమునకుఁ దెలుఁగుకాదని యేర్పడుచున్నదనిరి. సరే తెనుఁగు గాదుగాని, నన్నిచోడకవిగూడ నీతనికావ్యమునుండి కొంతగ్రహింపకపోలేదు. ఆ యుద్భటకావ్యమందలి విషయము తెలిసినఁగాని దానితత్త్వము గ్రహించుట యెట్లు? ముం దది తెనుఁగున గ్రహింతము.

పువరుక్తవదాభాసము.

౧. [1]అప్పటనుండియు నామహాదేవుఁడునిస్సంగుఁడును నాగకుంజరకృత్తి భృత్తును శితికంఠుఁడును గాలగళత్సతీశోకానలవ్యథుఁడును నయి

1. కథామాత్రప్రధానముగా నాంధ్రీకరింపఁబడినను అలంకారభంగము గాకుండఁగ గ్రహింపఁబడినవి. అలంకారనామములు ప్రదర్శింపఁ బడును. గ్రంథ విస్తర భీతిచేఁ దదవాంతరభేదనామములు ప్రదర్శింపఁ బడవు.

ఛేకానుప్రాసము.

౨. ఆశైలేంద్ర కందరమున గరిష్ఠగోష్ఠీప్రథములగు ప్రమథులు గొల్చుచుండ దినములు గడపుచుండెను.

అనుప్రాసము.

3. (అంత శరత్కాలము ప్రాదుర్భవించెను.) ఆశరదృతువుతోయాశయా శేషవ్యాకోశితకుశేశయ. మఱియుశాలిశాకింశారుకపిశాశాముఖ.

౪. అందు శరత్తు స్యందిసాంద్రారవిందబృందోత్థమకరందాంబు బిందువులచే సుందరస్యందముగా నంది తేందిందిర యయి యున్నది.

౫. శరత్తు కొన్ని నెలవులఁ గేలిలోలాలిమాలాకలకోలాహలములచేతఁ గాననారూఢ శ్రీనూపురరవభ్రమము గలిగియున్నది.

లాటానుప్రాసము.

౬. శరత్తునఁ గాశములు గాశములవలె సరస్సులు సరస్సులఁబోలె నిమ్నగలు నిమ్నగలకరణి యువజనుల చిత్తము నాకర్షించినవి.

౭. శరదృతువున భర్తలు మహాపరాధములు చేసినను వారియెడ భార్యలు గోపింపరు. భార్యలు మహాపరాధములుచేసినను వారి యెడ భర్తలు గోపింపరు.

౮. కొన్నిచోట్ల శరత్తుత్ఫుల్లకమల, కమలభ్రాంతషట్పద, షట్పద క్వాణముఖర, ముఖరస్ఫారసారస యు నయియుండెను.

౯. జితాన్యపుష్పకింజల్క-కింజల్క-శ్రేణిశోభిత మగునసితోత్పలము కాంతా ముఖేందువులం దవతంసత నొందెను.

రూపకము.

౧౦. హంసలు హంసకులాలయ మగు మానససరమునుండి పద్మినీగాఢ స్పృహాచేత వచ్చి పద్మినిని దంతుర (మిట్ట పల్లు గలదాని)ను గావించెను.

౧౧. రాత్రికన్యకలు తారాకుసుమశారిత మగునాకాశోద్యానమునుజ్యో త్స్నాంబువులతోఁ జంద్రబింబకుంభమునఁ గ్రమముగాఁదడిపిరి.

౧౨. పింఛాలీవాలశాలులయి మీఁదికెగయుచుఁ గ్రిందికి దిగుచు నుండు రాజహంసలతో శరత్తు సహోన్నృపులకు వీఁచెను.

౧3. వనాంత దేవతావేణులును బాంథస్త్రీకాలశృంఖలలును మారప్రవీ రాసిలతలు నగు భృంగమాలికలు శరత్తునఁ బ్రకాశించెను.

౧౪. ఆసారధారావిశిఖములును నభోభాగప్రభానులఁను ధవళములు నగు వలాహకములచే నాశారాజ్యము బ్రసాధింపఁబడెను.

దీపకము.

౧౫. శరత్కాలము కదంబకుసుమసంపదలను, బ్రియవియోగినీ నిశ్శేష సుఖసంపదలను నుపసంహరింపఁజేసెను.

౧౬. ప్రవాసులకు విదేశవాసమును బ్రోషితభర్తృకాదర్శనమును, శరత్తును గేవలము దుఃఖమునకే మూలము లయ్యెను.

౧౭. శరత్తున స్ఫీతలావణ్యచంద్రికాభరనిర్భరమగు కాంతాననేందువు నిందువును నెవరి కానందసందాయకములు గావు ?

ఉపమ.

౧౮. శరత్తునఁ జంద్రచంద్రిక చందనమునుబోలె వియోగులకు క్షణము కామజ్వరనాశమునకును క్షణములోనే యధికసంతాపవృద్ధికిని గారణ మయ్యె.

౧౯. సరోవరలక్ష్ములు నేత్రములఁ బోలునుత్పలములతోను ముఖములఁ బోలుపద్మములతోను స్తనములవంటి చక్రవాకములతోను శరత్తునఁ బ్రకాశించెను.

౨౦. రాత్రులఁ బ్రబోధమువలనఁ దెల్లనయిన కుముదకాననము కింజల్కాలీనషట్పద మయి పూర్ణచంద్రబింబప్రతిమ మయ్యెను.

౨౧. రాత్రులఁ బ్రబోధమువలనఁ దెల్లనయినకుముదకాననముకింజల్కాలీనషట్పదమయి యఖండమగు చంద్రబింబముతోసమమయ్యె.

౨౨. సుముఖి యప్రార్థితోపపన్నయయి యనభ్రవృష్టివలె నెట్లయినను నా దృష్టిపథమునఁ బడునా !

౨౩. అకాండోడ్డామరుఁడగు ననంగహతకుని మూలమున నాకువలెనే యా గౌరికిని నిరర్గళయగు నుత్కంఠ గలిగియుండు నేమో.

౨౪. కలోల్లాసికాదంబకులసంకుల మగు శరత్కాలమునఁ ద్రిదశాధీశశార్దూలుఁడగు ధూర్జటి తాను చేసినపనికిఁ నొందిన బశ్చాత్తాపముతో.

౨౫. శశిచ్ఛాయవదనయు, నీలోత్పలదళేక్షణయు, సరోజకర్ణికాగౌరియు నగు గౌరిని మనమునఁ దలపోయు చుండెను.

౨౬. పరమేశ్వరుఁడు సమస్తైశ్వర్యసంపన్నుఁ డయినను దన్ను దురవస్థ నొందినవానినిగాఁ దలఁచుకొనుచు మిగులఁ గమనీయమగు కానన మున నున్నను నరకమం దున్నట్లుండెను.

౨౭. ప్రియకాంత దగ్గఱ లేకున్నయెడల జగత్తంతయు కృశానుమయమే. ఈశ్వరుని తత్త్వజ్ఞాన మహాతేజస్సు క్రమముగా ఖద్యోతముగాఁ జొచ్చెను.

౨౮. పార్వతీతపశ్శక్త్యాకృష్టబుద్ధి యగు నీశ్వరునిమనస్సును మన్మథాగ్ని సామాన్యజనమనోదాహముగా దహింపఁ జొచ్చెను.

౨౯. దగ్ధవిగ్రహుఁ డయినను వీర్యమాత్ర స్థితాత్ముఁ డయిన మదనుని చేఁ బరమేశ్వరుఁడు స్పృశింపఁ బడెను. అప్పుడు పరమేశ్వరుఁడు సామాన్య ప్రాణిచింతముగా నిట్లు చింతించెను.

౩౦. చండాలకల్పుఁ డనగు నేను మన్మథుని దహించి తిరోధానము నొందినపుడు ఆగౌరి నిరాశ చేసికొని యాశోకమున మృతి నొందిన దేమో!

ప్రతివస్తూపమ.

౩౧. అట్టి శీల సౌందర్య సంపదలు లోకమున విరళములు. సంవత్సరమంత లోను బూర్ణచంద్రమండలము గల రాత్రు లెన్ని యుండును!

ఆక్షేపము.

౩౨. ఆహా! రుద్రునిఁ గూడ నీదృశదశకుఁ దెచ్చిన స్మరుని మహాత్మ్య మెంత యని చెప్పవచ్చును. అది యటుండనీ! సముద్రోదకమును గుంభములతోఁ గొల్చుటకు మన మెంతవారము.

౩౩. ఇది చిత్రము. ఇట్లు చింతించురుద్రునిచింతలకు నవధి లేదు. కాలమునకును గామ వికారములకు నంత మెక్కడది?

అర్థాంతరన్యాసము.

౩౪. లోకమున నత్యంతకార్యికుఁడు (కార్యాతురుఁడు) చేయని పని యుండదు. భగవంతుఁ డగు పరమేశ్వరుఁడు గూడ వటు వయి సంచ రింప నున్నాఁడు.

౩౫. స్త్రీల భావముఁ బరీక్షించుటకుఁ బ్రచ్ఛన్నవృత్తియే శ్రేయస్క రము. భగవంతుఁడగు శర్వుఁడు వటురూపము స్వీకరించి బయలు వెడలెను.

౩౬. అంత హరుఁడు తన యాత్మను (మనస్సును) నాత్మయందుఁ (జీవము నందు) నిలుపునేసి ధ్యానము చేయుచుండెను. ప్రత్యక్షమునకు విసంవాదము గలుగవచ్చును గాని ధ్యానమున నిశ్చయించిన దానికి విసంవాదము కలుగదు గదా.

౩౭. అతికష్ట తపములఁ దపముసేయుపార్వతిని హరుఁడు చూచెను. వరించినవరునిప్రాప్తి యసంభవ మని తోఁచిన కన్యకలకు వేఱ గతి యే మున్నది.

వ్యతిరేకము.

౩౮. ఆ వటురూపధారి గౌరీశిఖరమునకుఁ బోయి తపఃకృశయయి రాహుపీత ప్రభగలుగు చంద్రుని తనువును జయించు పార్వతిని దూరమునుండి చూచెను.

౩౯. సర్వదా ప్రకాశమాన మగు ముఖముచేత రాత్రి గాంతిహీన మగు పద్మమును, బగలు గాంతిశూన్య మగు చంద్రబింబమును దిరస్కరించు కృశాంగి.

౪౦. శీర్ణపర్ణాంబువాతాశన కష్టతపము నాచరించుచున్నను నన్యతప స్విలవలె గర్వము నొందని తపశ్శాలిని.

౪౧. తపో నామకమాసముచేతఁ బ్రసిద్ధమగు శిశిరఋతువును తన దీర్ఘతపస్సుచేత నధఃకరించినది.

విభావన.

౪౨. కాశ్మీరానులేపనము లేకున్నను బీతవర్ణముగల నంగలేఖను నలక్త కము పూయకున్నను నెఱ్ఱగా నుండు నధరోష్ఠమును ధరించు సౌందర్య శాలిని.

సమాసోక్తి.

౪౩. దంతప్రభయనుపుష్పములును, పాణు లనుపల్లవములును, అణఁగి యుండు జట లనుమత్సరణములు గలిగి వనమందు నిలిచియున్న తన్వి.

అతిశయోక్తి.

౪౪. పార్వతి కృశించియున్నను తపస్తేజః ప్రకటితమగు నిజ లావణ్య సంపదచే నకృశగాఁ గనఁబడుచుండెను. అది నిస్సంశయము.

౪౫. అట్లు పరమేశ్వరుఁడు చింతించుచుండెను. ఏమి యామె రమణీయత! పార్వతి కౌమారమున నున్నను తపఃప్రభావమున యౌవనమున నున్నట్లు గనఁబడుచున్నది.

౪౬. చంద్రకాంతి వికసించిన పద్మమునఁ బ్రసరించినయెడలఁ బార్వతి కరమున నున్న ముక్తాక్షమాల కుపమానము గాఁజాలును.

౪౭. ఈమె కటాక్షములు దిక్కులందుఁ బ్రసరించినపుడు వానికి ముందు గానే స్మరబాణపరంపరలు ప్రయాణము చేయును అని తలఁచెదను.

యథాసంఖ్యము.

౪౮. బాహుచంక్రమణాననములచేత మృణాలహంసపద్మములను జయిం చు పార్వతిచే స్పష్టముగా సకలనళినులు జితము లయ్యె.

౪౯. ఎప్పుడును సూర్యబింబము చూచుచుండుదృష్టిచే నాతపము పానముచేయుచుఁ జేసిన జపములమూలమున శ్యామిక (నల్లమచ్చ) చంద్రభ్రాంతి చేతనో యనునట్లు ముఖమునఁ బడెను.

ఉత్ప్రేక్ష.

౫౦. ఆ గౌరికపోలఫలకములు తాదృశావస్థ నొంది యన్యోన్యదర్శనా భావముననో యన్నట్లు క్షామత నొందినవి.

స్వభావోక్తి.

౫౧. ఈమృగార్భకము ప్రణయమున క్షణమాత్రము దాఁగియుండి సగముప్రక్కకుఁ దిరిగి శృంగాగ్రముతో క్షణమాత్రము దువ్వుచు భగవతిని లోలను గావించుచున్నది.

ప్రేయస్వ దలంకారము.

౫౨. పార్వతియు సుతవాత్సల్యమున నపేక్షతో మృగార్భకమును నొడి లో నుంచుకొని లాలనచేయఁ దొడఁగెను.

రసవదలంకారము.

౫౩. ఈ రీతిగఁ బార్వతీ గుణగణములను భావనచేయు పరమేశ్వరునకు సంభృతానల సంకల్పుఁడగు కందర్పుఁడు ప్రబలుఁ డయ్యెను.

౫౪. ఒడలు చెమ్మటచేఁ జెమర్చుచున్నను బులకలు బహుళములయ్యెను. ఆ పులకోత్కరము కదంబకలికాకోశకేసరప్రకరోపమ మయ్యె.

౫౫. ఆ పరమేశ్వరుని దృష్టి క్షణమాత్ర మౌత్సుక్యగర్భముగాను క్షణము చింతానిశ్చలముగాను క్షణము ప్రమోదాలసముగాను నుండి యాతని ముఖమున కలంకార మయ్యెను.

ఊర్జస్వి.

౫౬. ఆహిమవత్పుత్రికను సన్మార్గము విడిచి హఠాత్కారమున గ్రహింపఁ బ్రవర్తించునంత కామవికారము హరునకు వృద్ధినొందెను.

పర్యాయోక్తము.

౫౭. ఏ శివునిచేత గజాసురవధూజనము లంబాలకము,సాస్రలోచనము, మకరఘాతారుణస్తనము భగ్నవలయము నగునట్లు చేయఁబడెనో

౫౮. అట్టి యీశ్వరుని సయితము నెవఁడు దగ్ధదేహుఁ డయ్యు వ్యాకులత నొందించెనో యట్టి యనంతవీర్యుఁడగు మకరకేతనునకు నమస్కారము.

సమాహితము.

౫౯. ఆమె మనోహరమగుచూపును విలాసములను భ్రూవిభ్రమములకు స్వేదరోమాంచసంకులమయ్యుఁ బ్రసన్నముగా నుండు ముఖమును జూచి.

౬౦. మదనజ్వరపరితప్తము లగు తన యవయవములను గుదురుపాటు నొందించుకొనెను. స్వస్తి వచనపూర్వకముగఁ గృత్రిమబ్రహ్మచారియగు గిరిశుఁడు గిరిపుత్త్రిక దగ్గఱకుఁ బోయెను.

ఉదాత్తము.

౬౧. హరుఁడు పార్వతితో నిట్లనియెను. ఏ హిమాద్రియందుండు శబరకాంతలకుఁగూడ వేణుకుంజర ప్రభవములగు ముక్తాఫలము లలంకారములో.

౬౨. ఎందుండు గంధమాధనము పుష్యరాగేంద్రనీల వైడూర్య పద్మరాగమయములగు శిఖరములతో నాకాశము నొరయుచున్నదో.

౬౩. ఏ హిమవంతుని యుపత్యకలు కార్తస్వరమయములో. మరకత పర్వతము పాదోపాంతము నాశ్రయించియున్నదో.

౬౪. ప్రళయకాలమున భూమి పాతాళపాతినియైనపుడు ఏహిమవంతుఁడు భూమితో దిగి పోవక నిలఁబడియుండి తన యాయామము ప్రకటించెనో.

౬౫. ఆదివరాహము ఘుర్ఘురారావము చేసినపుడుగూడఁ గంప మన నేమో యెఱుఁగక స్థిరుఁడయి యుండెనో యట్టి హిమవంతుని పుత్త్రికవు.

శ్లిష్టము.

౬౬. సర్వసమృద్ధిగల హిమవంతుని పుత్త్రిక వగుటయేకాక, నీవు స్వయముగాఁ బ్రభాతసంధ్యవలెఁ బల్లవాతామ్రభాస్వత్కరవిరాజినివి. ఫలలుబ్ధహితప్రదవు.

౬౭. ఇందుకాంతముఖివి, స్నిగ్ధ మహానీల శిరోరుహవు, ముక్తాశ్రీవి, త్రిజగద్రత్నమవు, పద్మరాగాంఘ్రి పల్లవవు.

౬౮. అపారిజాతవార్తవయ్యును భూమిస్థితనందనశ్రీవి. అబిందుసుందరివయ్యును గళల్లావణ్యబిందుకవు.

అపహ్నుతి.

౬౯. ఇది తపస్సుకాదు. నిజముగా హాలాహలవిషము. చంద్రకళాకోమలలగు నీవంటివారలకు విశేషముగా హాలాహలవిషమే.

విశేషోక్తి.

౭౦. మహాసమృద్ధిగల గృహమునఁ బుట్టుగు. రూపము వయస్సును మన్మథమిత్త్రములు. అయినను (రూపయౌవనైశ్వర్యము లను భోగసాధనము లున్నను) నీకు సుఖప్రాప్తి లేదు. ఈ సందర్భము విన్నచో నెవని చిత్తము చిత్రము నొందదు.

౭౧. ఇట్లసంగత మగునీచేష్టితము చూడఁగాఁ గొన్ని విషయము లడిగి తెలిసికొనవలెనని మనము తొందరపడుచున్నను నోట మాట రాఁజాలకున్నది.

**విరోధము.**

౭౨. అయినను ఏమిచేయను. నీ యాకార మెక్కడ? నీతపఃపాటవ మెక్కడ? ఈ వింత నన్నూరకుండనీయక మాటలాడించుచున్నది.

**తుల్యయోగిత.**

౭౩. భవదీయశరీరమార్దవము చూచినవారి చిత్తమున మాలతీచంద్ర రేఖాకదళులు కఠోరము లని తోఁపకుండునా?

౭౪. ఈ యోగపట్టము, ఈ జటాజాలము, ఈ చెట్టుపట్ట, ఈ మృగాజిన ము నీ యవయవముల కుచితములా? చెప్పు.

**అప్రస్తుతప్రశంస.**

౭౫. దుర్గమప్రదేశవనలక్ష్మలు ఫలపుష్పసమృద్ధము లయ్యును నసం ప్రాప్తోపభోక్తృకములయి స్వదేహములందు జరదవస్థనుబొందును.

**వ్యాజస్తుతి.**

౭౬. అనన్యోపమానమగు నీ రూప సంపద ధిక్కారపాత్రమగుచున్నది. నీ కనురూపవరుఁడు లోకత్రయమునను లభింపఁడు.

**నిదర్శనము.**

౭౭. కామిని రూపవతియైనను నుచితపతిని బొందఁజాలనియపుడు చంద్ర రహితరాత్రివలె శోభాశూన్య యగును.

**సంకరము.**

౭౮. నేను జెప్పుచున్నాను. అత్యంతోచితుఁడగు వరచంద్రుఁడు నీకు లభింపఁడు అయినను ఎవనియందో యొకనియం దాదరము కల్పించు కొనుము.

౭౯. ఈ తపఃక్లేశమంతయు వరుని నిమిత్తమే యయినచో నీవు వ్యర్థముగా నర్థింపనేల? నీ రూప మూలమున యువలోక మంతయు నీపాదబద్ధ కింకరలోక మగును.

౮౦. చారు కర్ణికయు, సచ్ఛాయవర్ణికయు నగు చిత్రస్థపద్మినివలె దృష్టిమాత్ర సుఖప్రద వయి యిట్లుండకు.

౮౧. స్మరవ్యాధుఁడు హరునిచేతంబోలె నీచే ననంగీకృతుఁ డయినను ధార్ష్ట్యముననో యన నీ శరీరమును క్షణమయినను విడువఁడు.

ఉపమేయోపమ.

౮౨. యుద్ధమున శత్రు శిరములఁ బద్మములనుబోలె వేగమునఁ బడఁ గొట్టునపు డెవని చక్రము కరోపమమో యెవని కరము చక్రోపమమో.

సహోక్తి.

౮౩. తారకామయయుద్ధమున నెవని చక్రాభిధాన ప్రేష్యునిచేత స్వర్గనివాసిజనము మృత్యువుతోపాటు ప్రాప్త మనోరథముగాఁ జేయఁబడెనో.

పరివృత్తి.

౮౪. యుద్ధములందు హిరణ్యాక్షవధాది సమయముల నమరారుల కురము నిచ్చి జయలక్ష్మితోఁగూడ యశస్సు నేతఁడు గ్రహించెనో.

౮౫. వాసుకిబలమునఁ బరిభ్రమించు మందరాద్రి శిఖరమునుండి పడిన రత్నములతో క్షీరసాగరమును నింపి యెవఁడు కౌస్తుభము గ్రహించెనో.

౮౬. బలిచక్రవర్తి భూమినంతను వ్యాపించి యాగమున స్వర్గమును జయింప నభిలషించినపు డెతఁడు స్వర్గవాసుల కభయమిచ్చి తాను ఖర్వత్వమును స్వీకరించెనో.

ససందేహము.

౮౭. ముగ్ధజన మెవని చేతిలోని శంఖమును జూచి యాతని చేతిలోనిది సమస్తరాక్షస హృదయ దళన జాతమగు యశఃపుంజమా? యశఃపుంజము ముద్దగాఁ జేయఁబడెనా?

౮౮. నాభీపద్మస్పృహ గలిగి వచ్చిన హంసమేమో? హంస చలించునా యని శంక నొందెనో.

౮౯. సూర్యకాంతిగల పక్షీంద్రునిపై నున్న యేశ్యామవ్యక్తి మేరు పర్వతముమీఁద నున్న నీలాబ్దమా? కాక ప్రళయాగ్నినుండి బయలుదేరిన ధూమమా? యని శంకింపఁబడెనో.

అనన్వయము.

౯౦. ఎవనివాణి స్వీయవాణివోలె, ఎవనిక్రియ స్వకీయక్రియకరణి, నెవని రూపము నిజరూపముభాతిని లోకలోచన లోభనముగా నుండునో.

సంసృష్టి.

౯౧. అట్టి వైకుంఠుఁడు గూడ నీనిమిత్తము ఉషఃకాలమునఁ జంద్రుఁడు చంద్రికనుబోలె ధారాళూన్య సుధావృష్టియగు నా లక్ష్మిని విడిచి వచ్చును.

౯౨. కావున నోకమలేక్షణా లేచి యతిధన్యుఁడగు నా మహానుభావుఁ డెవఁడో యాతనితో యౌవనసుఖ మనుభవించుచు గృహమున నివసింపుము.

భావికము.

౯౩. సముద్దీప్త్యనానాభరణశోభగల నీమూర్తితో నిరంజనలోచన వగు నీవు, పీడను బ్రీతినిగూడఁ గలిగించుచున్నావు.

కావ్యలింగము.

౯౪. నీ వలంకారములు ధరించిన స్థానముల నుండు గాంతి యితరప్రదేశ ములకంటెఁ దక్కువయయి, యలంకార స్థానములను దెలుపుచు దుఃఖమును గలిగించుచున్నది.

కావ్య దృష్టాంతము.

౯౫. బహుభాషణము లేల? వెడలుము. భర్తను బొందుము. మహా నదులు సముద్రమును బొందకుండునా?

ఇవి యుద్భటశ్లోకభావములు. ఉద్భటుఁ డలంకారలక్ష్యములు రచించుచు కుమారసంభవ కథైకదేశమగు వటురూపగ్రహణలీలాకథ యనుగత మగునట్లు రచించెనని స్పష్టముగాఁ గనఁబడుట లేదా ?

ఉద్భటుని భావములు నన్నెచోడుఁడు గ్రహించెనా?

ఇంకనుద్భటుని కుమారసంభవమునుండి నన్నిచోడుఁడు గ్రహించిన విషయములు పరిశీలింతము. మహా కావ్య లక్షణములలో నొకటియగు ఋతు వర్ణనము కాళిదాసు కుమార సంభవమందుఁ బార్వతీ తపశ్చరణసందర్భ మునఁ జేర్చినాఁడు. అంతకుముందె దేవలోకహితమునకై పార్వతియందుఁ బర మేశ్వరునికిఁ బ్రేమము గలిగింప మన్మథుఁడు ప్రయత్నించినపుడు వసంత ఋతువు వర్ణింపఁబడియెను.

తపోనుష్ఠానమున వ్రతకాఠిన్యమును దపస్సిద్ధిని గలిగించు [1]గ్రీష్మ వర్షాహేమంతములు పార్వతీతపోవర్ణనసందర్భమునఁ బ్రవేశపెట్టఁబడినవి. ఆయా ఋతువర్ణనమందుఁ బార్వతి తపఃక్లేశమునను సూచించుచు వర్ణించుట కొంత కలదు. శరచ్ఛిశిరర్తువులను కాళిదాసు గ్రహింపనే లేదు. తపోనుష్ఠాన విషయమున నా ఋతువులలో నితరఋతువులకంటె విశేషము లేదుగదా యని వానిని బరిత్యజించియుండును.

1. "గ్రీష్మే పంచాగ్ని మధ్యస్థో వర్షాసు స్థండిలేశయః
అప్సు వాసస్తు హేమంతే క్రమశో వర్ధయే త్తపః" అనిస్మృతివచనములు.

శరదృతు వర్ణనము.

ఉద్భటుఁడు రచించిన కుమారసంభవైకదేశమున మన్మథ దహనానంతరము తపోనిష్ఠ నున్న పరమేశ్వరునకుఁ గామవికారము గలిగించు సాధనముగా శరదృతువు వర్ణింపఁబడెను. శరదృతువు విరహిజనబాధక మను విషయమును మొట్టమొదట శ్రీమద్రామాయణమున వాల్మీకి సీతావియోగదుఃఖము నొందు శ్రీరాముని విరహామునువర్ణించునపుడు రచించెను. ఋతుసంహారాది గ్రంథములందునుశరదృతువు కామోద్రేకకారణముగా వర్ణించుట కనఁబడుచున్నది. దానితోపాటు శిశిరఋతువును నుద్భటుఁడు గ్రహించెను. ఆ శరదృతు లక్షణములు పరమేశుని మన్మథదహన పార్వతీ నిరాకరణములకుఁ బశ్చాత్తాపము నొందునట్లు గావించినవి యని యుద్భటునికావ్యమునఁ గలదు.

నన్నిచోడుఁడు శివభక్తాగ్రేసరుఁడు గానఁ బరమేశ్వరుని సామాన్య జనునివలె ఋతులక్షణములకు లొంగినవానినిగాఁ జేయ నిష్టపడలేదు. ఉద్భటుఁడు గ్రహించిన శరచ్ఛిశిర ఋతువులనుగూడఁ గాళిదాను గ్రహించిన గ్రీష్మవర్షాహేమంతములలోపాటు పార్వతీతపోవర్ణన సందర్భముననే చేర్చినాఁడు. శిశిరమునట్లే గ్రహించినాఁడు. ఇతర ఋతువులతో వసంతమును గూడ గ్రహించి షడృతువర్ణనము పూర్తి చేసినాఁడు. గ్రీష్మవర్షాహేమంతములందువలె మిగిలిన ఋతువులలోఁ బార్వతీ తపఃక్లేశరీతిచూప నవకాశము లేకున్నను "ఇట్లఖిల మనోరంజకం బై యతిరమణీయంబైన శరత్సమయంబునం బార్వతి తత్కాలోచితంబు లనుష్ఠించుచుండునంత" అని శరదృతువర్ణనాంతమునను "అని నిఖిల భువన మనోరంజకం బగుచు ... వచ్చెన, త్యలఘు వసంతము ... ... వ. అంతం బార్వతి వసంతానంత లతాంత సంతతి నంతకాంత కాక్రాంత పూజాత్యంతహోమాది క్రియలం బ్రవర్తించుచుండునంత" అని వసంతవర్ణనాంతమునను "ఇట్లతిదుస్సహ శీతోపేతంబులగు హేమంతశిశిరంబులందు నిరంతరోదకవాస నిరాహారాది ఘోరతపోవృత్తిం బ్రవర్తించుచుండునంత" అని శిశిరవర్ణనాంతమునను జెప్పినాఁడు. గ్రీష్మవర్షాహేమంతంబులను గాళిదాసమార్గముననే పార్వతీతపఃక్లేశము సూచించుచు వర్ణించినాఁడు. ఉద్భట కావ్యమును చూడఁగా శరచ్ఛిశిరంబులు గ్రహింప నుద్దేశము నన్నిచోడునకుఁ గలిగియుండును. కాని స్థలాంతరమున దానిని బ్రవేశపెట్టుటచే నుద్భట వర్ణనలఛాయలు గ్రహింప ననువుపడలేదు.

అంతేకాక ఉద్భటుఁడు రచించివ శరద్వర్ణనమునఁ బందొమ్మిది (3-21) శ్లోకములు గలవు. అందు మొదటియెనిమిది శబ్దాలంకారోదాహరణములు. తర్వాతివి నాల్గు రూపకమునకును మూఁడు దీపకమునకును, కడమవి నాల్గు పమకును నుదాహరణములుగా నేర్పఱుపఁబడినవి. అందుండి శరదృతు

సామాన్యవర్ణనీయవిషయములనుదక్క ప్రత్యేకముగా విశేషములను గ్రహింపలేదు. కొంచెము సేకరించినవి లేకపోలేదు. వర్ణ్యసందర్భమునుబట్టి వర్ణనరీతి మాఱుట సహజముగదా! మిగిలిన భాగమునుండి గ్రహించిన విషయములు కొన్ని కనఁబడుచున్నవి.

నన్నిచోడమహాకవి మొదటి యెనిమిది సర్గల భాగమునను గ్రమముగాఁ గాళిదాసకావ్యము ననుసరించినను, ప్రధాననాయకుఁ డగు పరమేశ్వరుని గుణశీలనిరూపణమున నుద్భటుని ఛాయలనుగూడ ననుసరించెను.

పార్వతికిఁ గల విరహచింతాదికము పరమేశ్వరునకుఁ గాళిదాసకావ్యమున లేదు. వివాహనిశ్చయానంతరము సప్తఋషులు మూఁడు దినములలో వివాహమువార్త మేర్పఱుపఁ బడిన దని చెప్పినపుడు మాత్ర మామూఁడు దినముల నీశ్వరుఁ డతి కృచ్ఛ్రముగాఁగడపె ననుటతప్ప నెక్కడను నీశ్వరుని వికారము ప్రకటితము గాలేదు. ఉద్భటుఁడు పరమేశ్వరుని సర్వసామాన్యజనుని బోలె విరహచింతకు లోనయినట్లు రచించెను. మన నన్నెచోడ కవిరాజు పరమేశ్వరుని నంతసామాన్యునిఁగాఁ గావింప నిష్టపడలేదు గాని, పశ్చాత్తాప విరహచింతలు తెచ్చిపెట్టి పార్వతీలోలుని గావించినాఁడు. అట్లు పరమేశ్వరుఁడు మాఱిపోవుటకుఁ గారణము పార్వతీతపస్సే యని సమర్థించుటకై పార్వతీ తపోగ్నిచే సర్వము తప్త మగుచున్నదని చెప్పిన సందర్భమున నీ క్రిందరీతిని రచించెను.

"క. పొండిగ నగజతపశ్శిఖి, మూండుజగంబులను దీవ్రముగఁ బర్విన బ్ర
హ్మాండము గాఁచిన కాంచన, భాండముక్రియఁ దాల్చెఁ దత్ప్రభాభాసితమై"
౬, ౧౪౭.

"క. గిరిజతపః ప్రభాతికిఁ, దరతరమ చలించె రజతధరణీధర మ
చ్చెరువుగ జిఱ్ఱునఁ దిరిగెం, బురహరుతోఁగూడ వెండిబొమ్మరముక్రియన్"
౬, ౧౪౮.

పద్యచ్ఛాయలుగూడఁ దదనుసరణమును స్పష్టపఱచునుగాన, నవియుఁ గొన్ని చూతము.

| ఉద్భట శ్లోకములు | | నన్నిచోడ పద్యములు. |
|---|---|---|
| ఇతి కాలే కలోల్లాసి<br>కాదంబకులసం కులే,<br>త్రిదశాధీశశార్దూలః<br>పశ్చాత్తాపేన ధూర్జటిః. | ౨౪. | (పార్వతీ తపఃప్రభావమున రజత ధరణీ ధరము హరునితోఁగూడ వెండిబొమ్మరమువలె దిరిగె.) |

తాంశశిచ్ఛాయ వదనాం
నీలోత్పల దళేక్షణామ్,
సరోజ కర్ణికా గౌరీం
గౌరీం ప్రతి మనోదధే.
కృశానువ జ్జగ త్తస్య
పశ్యత స్తాం ప్రియాం వినా,
ఖద్యోతయితు మారబ్ధం
త త్త్వజ్ఞాన మహోమహః.
తస్యేతర మనోదాహ
మదహ త్ప్రజ్వల న్మనః
ఉమాంప్రతి తపశ్శక్త్యా
కృప్తబుద్ధేః స్మరానలః.
విరళాస్తాదృశో లోకే
శీలసౌందర్యసంపదః
చండాలశల్పే కందర్పం
ప్లుష్ట్వా మయి తిహీరో తే.
సంజాతాతుల నైరాశ్యా
కిం సా శోకా న్మృతా భవేత్.

వ. అంత నటఁజని కృతాంతాంతకుఁడు శంతు
లతాంతాస్త్రాభిహతాంతరంగుఁడై కాం
తా వియోగంబునం దురపిల్లుచు.

సీ. హిమవంతుఁ డింతి నా కీవచ్చు డెఁదీగియు
నామాట లే నేల యాడనైతి
నతఁడొండు నానోడి యతివనాకడ నుంచి
యేగినకన్నేల యెఱుఁగనైతి
నాబాల ననుఁ గూడ నాసించు చున్నచో
మిన్నక తప మేల పన్నికొంటి
నెలనాగ నామీఁద నెలయింప వచ్చిన
భావజుతో నేల పగయుఁ గొంటి
ఆ. దరుణి వలరసంబు దటిమిపైఁబడ నున్న
నెఱవెఱింగి కూడనేర కేల
బేలనైతి ననుచు బాలేందుధరుఁ డాత్మ
చింత విడిచి విరహచింతఁదగిలె.
౬, ౧౬౦ (819)

పయి పద్యములఁ గల పశ్చాత్తాపమునకు మూల ముద్భటునిదే. నన్నిచోడుఁడును విరహమునఁ బరమేశ్వరునిఁ దగిలించినాఁడు.

ఇతి చింతయిత స్తస్య
చిత్రం చింతావధి ర్న యత్
క్వ వా కామవికల్పానా
మంతః కాలస్య చేష్టితః.

మ. బొమ లల్లార్చుచు లోచన
ద్యుతులపైఁ బూరించుచున్ మందహా
సమరీచుల్ దళుకొత్తఁ బల్కునోలిపుల్
సంధించుచున్ లోలభా
వము సూచించుచు నీశుమోాల నెలమిన్
వర్తింపఁ జొచ్చెన్ మనో
రమణం బార్వతి రూపవిభ్రమ మహో
రాత్రంబు సాన్నిధ్యమై.
౬, ౧౬౧ (820)

'గౌరీంప్రతి మనోదధే' అనిమాత్ర ముద్భటుఁడు చెప్పెను. అహోరాత్రము పార్వతీసాన్నిధ్యమును గల్గించి భావనావిశేషములఁ గల్గించుట నన్నిచోడునిది,

సీ. ఉరుకపర్దారుణతరదీప్తులను మృదు
నవ సహకార పల్లవ విభాతి
నీలకంఠ ప్రభా జాలంబులను సమ
దాలోల రోలంబ మాలికలును
పాండురాంగాదుల బహుళదీధితులను
పూర్ణచంద్రాతపాకీర్ణరుచులు
గంగాంబుశీకరోత్కలితాహినిశ్వాస
ములమందపవనంబుఁ బొందుచేసి
తే. కాముఁ జంపినపగదీర్పఁ గడఁగి నూత్మ
భావమునఁ జొచ్చి చిత్తతాపావహంబు
లయ్యె నొకొనాఁగ శివుఁ డంగజాపహారి
యయ్యె విరహాగ్నిఁబడి వేఁగు నలసిపాలసి
౬,౧౬౪.

స దగ్ధవిగ్రహో ఽపి
వీర్యమాత్ర స్థితాత్మనా
స్పృష్టః కామేన సామాన్య
ప్రాణిచింత మచింతయత్.

మన్మథుఁడు దగ్ధవిగ్రహుఁ డయ్యు వీర్యమాత్రస్థితుఁడయి పరమేశ్వరుని పగ దీర్చికొనిన పద్ధతి వివరింపఁ బడినది.

వ. అని యనేక ప్రకారంబులం ద్రిలోచనుండు
రణరణకవ్యథాకలితహృదయుం డగుచు
నుండె నంత నగజతపఃప్రభావం బీశాను
బలాత్కారంబున నాకర్షింపం దొడంగిన.
౬,౧౬౫ (826)

వ. పరమేశ్వరుండు నిజమనోరథంబు సిద్ధి
నొందం బార్వతికిఁ బ్రత్యక్షంబుగాఁదలం
చి తదీయాంతర్గతం బారయ వేఁడి నిజరూ
పంబు చూపనొల్లక యాక్షణంబ. ......
తే. సుందరాకార మమర బాలేందుధరుఁడు
దాల్చి చనుదెంచె గిరిరాజతనయ కడకు.

పార్వతీతపఃప్రభావాకృష్టత స్పష్ట పఱుపఁ బడినది గదా.

తే. మేని కుంకుమరాగంబు మేలఁత తొప్ప
మోవి తాంబూలరాగంబు మెఱిగిన వాని
చారుతర మయ్యెఁ జూడ నాశైలతనయ
వీతరాగంబు ప్రకటించు విధమువోలె.
(ఇది పార్వతీతపోవర్ణన ప్రారంభమునఁ జేర్పఁబడినది.) ౭, అ: (741)

అంగలేఖా మకాశ్మీర
సమాలంభనపింజరామ్,
అనలక్తకతామ్రాభా
మోష్ఠముద్రాంచ బిభ్రతీమ్.

తపస్తేజస్స్ఫురితయా నిజలావణ్యసంపదా[యమ్
కృశామప్యకృశామేవ దృశ్యమానా మసంశ
అచింతయచ్ఛభగవా నాహోఽసురమణీయతా
తపసాస్యాః కృతాన్యత్వం కౌమారాద్యేన
లక్ష్యతే.

వ. ఇట్లు కృతకమునికుమారుండు సద్విధి న
భ్యర్చితుండై గిరిజరూపసౌందర్యవిభ్రమ
విలాసంబులు గనుంగొని మెచ్చి నిజాంతర్గ
తంబున.

సీ. భూతిపూసిన నింత వొడమెడు తనుకాంతి
తొడుప నెంతటి మెఱుం గడరి యున్నొ
వంది కందిన నింత వఱలెడు ముఖరోచు
లెలమిన నెంత సల్లలిత మగునొ
పొలయింపకయు నింత వెలిఁగెడుఁ జూ
డ్కుఁ లల్లార్చిన నెంత రమ్యంబులగునొ
జడలు గట్టియు నింత సక్కనైనదివేణి
దీర్చిన నెరులెంత దేశిణి(దేశి?)యగునొ
తే. యీడవిడిచిన మేదీగ యింత నయము
గలిగి యున్నది వాలిక గలిగెనేని
నెంత నవకమై యుండునో యింతికనుచు
శివుఁడు గిరిరాజసుత విశేషించె నర్థి.
౭...(838)

పార్వతియవయవములు కావలసిన సంస్కారములు లేకున్నను మనో హరములుగా నుండె ననుటకంటె సంస్కారములున్న నెంత యందముగా నుండెనో యని భావించుట మనోహారతరము. భంగ్యంతర మన్న ననవచ్చు.

త్వత్కృతే సోపి వైకుంఠః
శశివోపసి చంద్రికామ్
అప్యధారాం సుధావృష్టిం
మన్యే త్యజతి తాం శ్రియమ్.

ఇత్థం స్థితి ర్వరార్థాచే
న్మాకృథా వ్యర్థ మర్థితామ్
రూపేణతే యువా సర్వః
పాదబద్ధో హి కింకరః.

సీ. వారిరుహాసన నీ రూపు గనుగొన్న
నలకూబరుండైనఁ గలచివచ్చుఁ
బొలఁతి నీ భోగోపభోగముల్ చూచి జం
భారాతి యైనను గోరి వచ్చుఁ
గోమలి నీకళాకుశలత విని శత
దళసంభవుండైనఁ దగిలి వచ్చు
లలితాంగి నీశుభలక్షణోన్నతిఁ జూచి
పురుషోత్తముండైన మరిగి వచ్చు
గీ. నిన్నుఁ గోరి తపంబు నిష్ఠనోరులు
సేయఁ గోరుచోఁ దప మీవు సేసె దఖిల
రత్నముల గోరి వినిజనుల్ రాక జనుల
రత్నములు గోరి పైపడి రాకఁబోలు.
౭–౨౨ (858)

వైకుంఠుఁడు గూడ లక్ష్మిని విడిచి వచ్చును అనుశ్లోకభావమున నన్ని చోడుని వెంపకము చూడుఁడు. అట్టిఫక్కి యూతని కభ్యస్తము.

తదుత్తిష్ఠాతిథన్యేన
కేనాపి కమలేక్షణే
వరేణసహ: తారుణ్యం
నిర్విశంతీ గృహే వస.

కిం చాత్రి బహు నోక్తేన.
వ్రజ భర్తా రమాప్నుహి.

సీ. మణిభూషణపరిభా మంజరు లెలయించి
తనువల్లికకు వసంతంబు సేయు
సముదంచితాంగవిభ్రమములు వెలయించి
శృంగారలక్ష్మికిఁ జెన్ను సేయు
గాముకజనుల వీక్షణమాత్రి నెఱఁగించి
సౌభాగ్యవాము కుత్సవము సేయుఁ
గోరిక రతికళాకుశలతఁ బ్రికటించి
దర్పకు రాజ్యపదస్థుఁ జేయు
తే. సారసంసారమెల్ల నిస్సారమేల
చేయ నెత్తెదు వలదు నాచెప్పు సేయు
తరుణి నిను వేఁడికొనియెదఁ దపము సేయ
నర్థి సేయుట యెం డేమి ఠైనఁ జేయు.
౭,౪౦. (871)

చ. ఎలబోఁటవోని మేని నవ
యించియు రాగరసంబు నిండుకుం
డలా యనువీఁగుఁ జన్నుల బె
డంగెడలించియు మారుపువ్వుఁదూ
పుల నగులోల దృగ్రుచుల
బోహముపుచ్చియు భోగవృద్ధి ని
ష్ఫలముగఁ జేసియుం దుదిఁ
దపంబున నయ్యెడి దేమి సెప్పుమా.
౭-౪౧ (872)

ఇది యుద్భటుని శ్లోకములకు వివరణరూపమే యని స్పష్టమగుచున్నది.

**ఉద్భటుల ప్రశంస.**

ఈయుద్భటుఁ డాంధ్రగ్రంథములందు శైవులలోఁ బ్రశంసింపఁ బడినవాఁడె యగునా ? యీతఁడు వేఱా ? యను సంశయము గలుగును. తద్విషయము పరిశీలింతము.

నన్నిచోడుఁడు కుమారసంభవమున సంస్కృతకవిప్రశంసలో నుద్భటునిఁ బ్రశంసించినాఁడు. మల్లికార్జునకవి శివతత్త్వసారమున బొందితోఁ గైలాసముఁబొందిన శివభక్తుల ప్రసంగమున [1]నుద్భటునిఁ జెప్పినాఁడు. పాలుకురికి సోమ

1. క. హరలీలాస్తవరచనా
స్థిరనిరుపమభక్తిఁ దనదు దేహముతోఁ డ
మరచిర విమానమున నీ
పురమున కుద్భటుఁడు ప్రీతిఁ బోవఁడె రుద్రా. శివతత్త్వసారము ౪౧౦.

నాథకవిబసవపురాణమున నుద్భటకథ యొకటి గలదు. సాధారణముగా శివ తత్త్వ సారమునఁ [1]జెప్పఁబడినభక్తుల చరిత్రములను బసవపురాణమున విస్త రించిచెప్పుట కలదుగాన శివతత్త్వసారమునఁ జెప్పఁబడిన యుద్భనిచరిత్రమే బసవపురాణమునఁ జెప్పఁబడె నని గ్రహింప నవకాశము గలదు గాని యీ విషయమున నట్లు గ్రహించుటకుఁ గొన్ని ప్రతిబంధకములు గనఁబడుచున్నవి. అవి మున్ముందు తెలుపఁబడును. ఆ బసవపురాణోద్భట కథయే కొన్నిమార్పుల తోఁ దెనాలి రామలింగకవిచేఁ బ్రబంధముగా రచింపఁబడినది.

ఇంకఁ గన్నడమున 'ఉద్భటయ్య' అనియు 'ఉద్భట'అనియుఁ బేళ్లతోఁ బ్రసిద్ధుఁడగు కర్ణాటకకవి యొకఁడు గలఁడు. ఇతఁడు [2]హరీశ్వరరాఘవాంక కవులచే స్మరింపఁబడినవాఁడు. ఈతఁడు హరలీలాస్తవము వేయివృత్తములలోఁ రచించినని బ్రహ్మశివనకవి సమయపరీక్ష యనుగ్రంథమునఁ జెప్పినట్లు [3] కర్ణా టకవి చరిత్ర తెలుపుచున్నది. సోమరాజకవికృతమగు నుద్భటకావ్యమును బసవాంక కవిరచితమగు ఉద్భటదేవరకావ్యమును గలవు.

ఉద్భటప్రశంస లిట్లుండఁగా నన్నిచోడుఁడు ప్రశంసించినవాఁడును శివ తత్త్వసారమునఁ జెప్పఁబడినవాఁడును నొక్కఁడేయనియు శివతత్త్వసారోద్భట కథయే బసవపురాణమున విస్తారిత మయ్యె ననియుఁ గొందఱు చెప్పుదురు. అ ట్లనుటలో "కాలము సరిపడకపోవుట" "స్థలముభిన్నమగుట" మొదలగు కొన్ని విప్రపత్తు లున్న వని వారికిఁ దోఁచినను నైక్యముననే వారిముఖ్యాభి ప్రాయ మని తోఁచుచున్నది.

---

1. శివతత్త్వసారపీఠిక. కొ॥ లక్ష్మణరాయరచితము. 15 పుట. "శివతత్త్వసారమునందు నొకొక్కొక్క పద్యములోఁ జెప్పఁబడిన భక్తులచరిత్రములు విపులముగను రసవంతముగను బసవ పురాణమునందును బండితారాధ్యచరిత్రమునందును ద్విపదలలో వర్ణించెను"

2. చూ. కర్ణాటక కవిచరిత్ర. 223.

3. చూ. కర్ణాటక కవిచరిత్ర. 222 పుట.

4. (I) "ఉద్భటుఁడు— క. హరవీలా......శివతత్త్వసారము. క. క్రమమున నుద్భటుఁడు......నన్నిచోడకుమారసంభవము. ఉద్భటారాధ్య చరిత్ర మని తెనాలిరామలింగ కవి యాతని చరిత్రమునే తెనుఁగునఁ బద్యకావ్యముగా రచియించెను. తెలుఁగుదేశమున నుద్భ టారాధ్య పరంపరవారారాధ్యులు పలువు రున్నారు. ముడిగొండవా రుద్భటారాధ్యపరంపర వారని యుద్భటారాధ్య చరిత్రమునఁ గలదు. అతఁడు ఘూర్జరదేశమునఁగల బల్లకి పురవాస్తవ్యుఁ డని బసవపురాణాదులందుఁ గలదు. కాశ్మీరరాజగు జయాపీడునిసభలో విద్యాపతిగా నుండె నని (క్రీ. శ. ౭౭౯ నుండి ౮౧౩ వఱకు) రాజతరంగిణిలోఁ గలదు. బసవపురాణపీఠిక. ౭౩ పుట. బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిులుగారు"

(II) చూ. ఉద్భటారాధ్య చరిత్రపీఠిక పుట XVII. బ్రహ్మశ్రీ వేటూరిప్రభాకర శాస్త్రిులుగారు.

నన్నిచోడుఁడు ప్రశంసించినయుద్భటుఁడు కావ్యాలంకారసారసంగ్రహాదులు రచించిన కాశ్మీరవిద్యాపీఠాధిపతి. శివతత్త్వసారమునఁ జెప్పఁబడిన యాతఁడు హరలీలాస్తవరచనాస్థిరభక్తిచే దేహముతోఁ గైలాసమునకుఁ బోయినవాఁడు. ఈతఁడు హరలీలాస్తవము నేయి వృత్తములలో రచించెనని సమయపరీక్ష యనుగ్రంథమున తెలుపఁబడినవాఁడు కానోవును. ఈతనినే కన్నడకవు 'ఉద్భటయ్య, ఉద్భట' అనుపేళ్లతోను ప్రశంసించి యుందురు. ఆ సంప్రదాయముననే శైవకవులు తెనుఁగున నతనిఁ బ్రశంసించి యుందురు. బసవపురాణోద్భట చరిత్రనాయకుఁడు మఱొక యుద్భటుఁడు. ఈతని [1]కథ సంగ్రహముగా బసవ పురాణానుసారమున నధో భాగమున నియ్యఁబడినది. అందు జాతుల యుచ్చనీచతలు ప్రధానము కా వనియుఁ గేవల శివభక్తియే ముఖ్య మనియు లోకము భక్తులమహిమను గనుఁగొనలేక పోయినను బరమేశ్వరుఁడు గ్రహించి భక్తులకీర్తిని స్థిరపఱుచు సాధనము చేయు ననియు శివభక్తులదేహము కాల్చిన పొగ తగిలినను గైలాసవాసము లభించు ననియును జెప్పఁబడినది. శివతత్త్వసారపద్యమున హరలీలాస్తవ రచనాస్థిర భక్తి గల యుద్భటుఁడు బొందితోఁ గైలాసమునకుఁ బోవుట ముఖ్యవిషయము. దేహముతోఁ గైలాసమునకుఁ బోయిన వానిచరిత్రమును గైలాసమునకు జీవుఁడు పోయినతర్వాత శవమును గాల్పఁగాఁ బొగ తాఁకుట చే నితరు లందఱును గైలాసమునకుఁ బోయిన కథయును నొకటి యెట్లగును?

1. బిల్లకి పురమున నుద్భటుఁడు గలఁడు. అతఁడు భోజరాజునకు గురువు. 'బొమ్మవ్వ నాఁగఁ, బ్రాణేశనద్భక్తి పరురాలు గాన, నతిపయుఁడాను సమంచితభక్తి, గతినిరంతర సుఖస్థితిఁ దేలుచుండ, మనుజులత్యద్భుత మానవులగుచుఁ, బనుపుచు నిట్టి సద్బ్రహ్మణోత్తముఁడు, కులహీను లును దాను గూడియున్నాఁడు, తలఁపంగఁ బెద్దలు దాక యిభ్భువిని, ననుచు నభ్భోజ రాజు న కెఱిఁగింప, వినియుఁ దొల్లిటియట్ల కొనియాడుచుండ' నాపరమేశ్వరుఁ డుద్భటయ్య గారి పరమ భక్తిని మెఱయింతు నని 'తన్నుఁ గాఁ గూర్చుకొనెను'. అప్పుడు దహనక్రియలు సేయఁగా ఆ పొగ తాఁకుటచే నచ్చటి మఱ్ఱిమీఁదనున్న భూతములు ఒకటి తక్కువ యేడు నూఱు కైలాసమునకుఁ బోయినవి. ఏడునూఱు భూతములలోఁ దక్కువ యయిన భూత మొకటి అప్పుడా హారసంపాదనకుఁ బోయి యుండుటచే నందుఁ జేరలేదు. మఱునాఁడు వచ్చి తనవా రుద్భటయ్య పొగచేఁ గైలాసమునకుఁ బోవుట తెలిసికొని తన కట్టి యవకాశము దాఁటి పోయినందులకు దుఃఖిచి యేడ్వసాగెను. రాజదివిని యేమి యని యడుగఁగా భూత మిట్లు చెప్పెను. రాజా! పండ్రెండువేల యేండ్లనుండి యేడునూఱు భూతములు ఉద్భటయ్యగారి మరణము గోరి యీ మఱ్ఱిమీఁదఁ గసు పెట్టికొని యున్నవి. వారిలోనే నొకఁడను. ఎప్పుడును ఎక్కడకుఁ బోకుండఁగ నుంటిమి. నే నుపరాహ్ని బాధ కాఁగఁజాలక తిండి సంపాదించుకొనఁ బోయితిని. చెడితిని. ఉద్భటయ్యగారి పొగ తాఁకి భూతము లన్నియుఁ గైలాసమునకుఁ బోయినవి. నే

అవి పరస్పర విరుద్ధములు. ఒకటి కాఁజాలవు. కావున నా కథా నాయకులును వేఱే యనవలెను. అప్పుడు పెక్కండ్రుద్భటులు గల రనవలయును. కన్నడమునఁ గలయుద్భటకావ్యమునందలి నాయకునకుఁ గుమారపాల ఘూర్జరుఁ డనియు నుద్భటుఁడనియుఁ బేర్లు గలవు. అతఁ డొకరాజు. ఆతని వివాహాది వర్ణనమున గావ్యమునకు 'శృంగారసార' అనియుఁ బేరుగలిగినది. తెనుఁగునఁ బండితారాధ్యచరిత్రమునఁ గుమారపాల ఘూర్జరుని చరిత్ర యొకటి గలదు. ఆతని చరిత్రమును శృంగారసారమునందలి చరిత్రము నొకరీతిగనే కనఁబడు చున్నవి. 'శృంగారసారమునఁ గొన్నిచోట్ల నుద్భటుఁ డనియుఁ గొన్ని చోట్ల ఘూర్జరపాలుఁడనియు నుండుటచేత నుద్భటకావ్యమను వ్యవహారము గలిగినది. ఇతఁడు ఉద్భటనామాంతరము గల కుమారపాల ఘూర్జరుఁడు.

ఉద్భట దేవరకావ్యమను కర్ణాటకావ్య మొకటి మద్రపురిని గల దొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునఁ గలదు. అది తాళపత్ర గ్రంథము. అదిబసవాంక కవివిరచితము. అందును గథాంశము కుమారపాల ఘూర్జరచరిత్రమే. కథానాయకుని నామములుగా 'ఘూర్జరభూధవ' 'ఘూర్జరనాథ' 'ఉద్భట' 'ఉద్భటదేవ' పదములు వాడఁబడినవి. ఈతనిచరిత్రము తెనుఁగునఁ బండితారాధ్య చరిత్రమునఁ గలదు. అందు ఘూర్జరుఁ డనియుఁ గుమారపాల ఘూర్జరుఁ డనియు, నుపయోగింపఁబడెను. ఉద్భటుఁ డనునామాంతరమతనికి వాడఁబడలేదు. అంతేకాక యాకథలోనే శివభక్తప్రభావములను దెలుపుచు నిదర్శనముగాఁ గొందఱను జెప్పి "వటముతో నేణ్నాఱు వరభూతములను, నిటలాక్షుపురికి నుద్భటుఁడు గొంపోఁడె" (పండితారాధ్య చరిత్ర. పురాతనప్రకరణము ౧౩౯ పుట) యని యుద్భటు నొక దృష్టాంతముగాఁ జెప్పినాఁడు. కర్ణాటకకావ్యములం దుద్భట కుమారపాలఘూర్జరప్రభృతినామము లొకనికే కలవు. ఆచరిత్రమే కన్నడమున సుప్రసిద్ధమయి యుండును. కావుననే కాఁబోలు భీమకవి బసవపురాణమును తెనుఁగునఁ గలపాలకురికి సోమనాథ రచితకృతినుండి కన్నడమున గ్రహించుచు నుద్భట

నొకఁడనే దురదృష్టవంతుడనై నిలిచియుంటిని "భూనాథ యింకనైనను గట్టె లిందువైపిందు, బొంకుగా దేగెడఁబొగదాఁకఁదడవ, వినుము నేఁ గైలాసమునకు నేగుటకు, జనులకు నెల్ల దృష్టముగ నీ యున్న, వటము వేళలతోన వడిఁ బెటికికొని, యిట యందఱును జూడనట యేగుదాన" యని చెప్ప రాజు సకేయని కట్టెలుసేర్చి యంటింప 'భుగులు భుగుల్లనఁ బొగ మబ్బిమీఁది, కెగయులోన నదిగదిగఁ బఱతెంచి, భోజుఁడు దనమిత్ర బాంధవులు, నాజనావళి యును నమ్మబ్బిత్రావఁక, భూతంబులైపొగ వొలయుంగఁడడవ, ఖ్యాతిగా మబ్బి వృత్తుముఁగూడఁ బెటికి, కొనుచు కైలాసమున కేగె భోజ, జననాథ జనయూథ సహితంబుగాఁగఁ, దెల్ల మీ యుద్భట దేవుని మహిమ'' అని కలదు. బసవపురాణము. ౭, ఆ. ౨౧౯. పుట.

చరిత్ర బసవపురాణములోనిది గ్రహింపక పండితారాధ్య చరిత్రలోని కుమారపాల [1]ఘూర్జరుని చరిత్రము జేర్చియున్నాఁడు. కుమారపాలఘూర్జరోద్భట నామములు వాడినాఁడు. తనదేహము కాల్చినప్పటిపొగచే నేణ్ణూఱు భూతములును కైలాసమునకుఁ బోయిన యుద్భటునికథ భీమకవికావ్యమున నటఁ గానరాదు. హరలీలాస్తవము వేయి వృత్తములలో రచించెనని బ్రహ్మశివకవిచేఁ బ్రశంసింపఁబడిన యుద్భటుఁడును ఘూర్జరపాలా పరనాముఁడు నొకఁడే కావచ్చునను సూచన కర్ణాటక కవిచరిత్రమునఁ గలదు. అందే "సంస్కృతమున నలంకార గ్రంథ కుమారసంభవములు రచించిన యుద్భటుఁడు శైవకవులు స్తుతించిన యుద్భటుఁడగునో కాఁడో తెలియదు" అని కలదు.

ఏమయిన నుద్భటనామము గలవారు పెక్కండ్రు గలరనుట స్పష్టము. మన నన్నిచోడుఁడు ప్రశంసించిన యాతఁడు కాశ్మీరదేశవాసియగు నాలంకారిక మహాకవి. ఈతఁడు వీరశైవుఁడుగా నోపఁడు. బొందితోఁ గైలాసముఁ బొందు ప్రభావ మీతనికున్నట్లు ప్రమాణములు లేవు. కావున నీతఁడు మల్లికార్జునుఁడు స్మరించినవాఁడును గాఁడు. పాలుకురికి సోమనాథుఁడు బసవపురాణమునఁ బ్రసంగించినవాఁడును గాఁడు. తదిరుఁడగు కుమారపాల ఘూర్జరాపరనామధేయుఁడును గాఁడు. బసవపురాణమునఁ జెప్పఁబడినవాఁడును గాఁడు. అని స్పష్టమగుచున్నది.

ఇంకొక్క విశేషము. కొందఱు విమర్శకులు కన్నడమున నుద్భటుఁడను కవి యున్నాఁడు. తత్కవికృతమైన [2]కుమారసంభవ మొకటి యున్నది.

---

1 కుమారపాలఘూర్జరుఁడు తనభార్యతో నెత్తమాడుచుఁ జిఱునవ్వునవ్వెను. భార్య యాతని చిఱునవ్వునకుఁ గారణ మడుగఁగా ఓహిళుఁడు ఒంటరిగాఁ గైలాసమునకుఁ బోవుచున్నాఁడు. తనపరివారమును దనదేశమును గొనిపోఁగూడదా యని నవ్వితిని. అని కైలాసమునకుఁ బోవు ఓహిళునిఁజూపెను. ఆమె యోహిళునిఁ జూచి సంతసించి "నీవు ద్యూతాదివ్యసనములఁ బడియున్నావు. ఆ మహాభక్తునిఁజూచి పరిహసింతువా?" యనిభర్తతో ననఁగాఁ నేను నా పరివారమును నాదేశమందున్నవారలనందఱను నాతోఁ గైలాసమునకుఁ దీసికొనిపోయెదను. ఓహిళుఁ డెంతటివాఁడు. అని యనేకభక్తుల ప్రభావము లాకెఁ డామెకుఁ దెలిపెను. ఇవియే కర్ణాటకకావ్యములందును తెనుఁగునను గల కథలోని ముఖ్యవిషయము.

2. "కన్నడమునందు నుద్భటుఁడను నొకకవి యున్నట్లును దత వికృతమైన కుమార సంభవము నన్నెచోడుని కుమార సంభవమునకు మాతృకమై యుండు ననియును ఉద్భట దేవ చరిత్ర మను కన్నడ గ్రంథము ప్రతి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్నదనియును యూనివర్సిటీ రీడరుగాఁ బనిచేసిన శ్రీ బుట్టా శేషగిరిరావుగారు చెప్పుచున్నారు" అని మ॥రా॥శ్రీ నారాయణమూర్తి పంతులుగారు. రక్తాక్షి సం॥ ఆషాఢమాన భారతి ౧౯౫. పుట. vol. I. 1924.

అదియే నన్నిచోడుని కావ్యమునకు మాతృకయై యుండు నందురు. అది యంతయుఁ బ్రమాణార్హము కాదు.

ఈ విషయము విమర్శతరంగిణి[1]లోఁగూడ స్పృశింపఁబడినది. మ॥రా॥శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుగారు చెప్పిన ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారముననున్న తాళపత్రగ్రంథము బనవాంకకవి రచించినయుద్భటదేవరకావ్యము ఉద్భటదేవచరిత్రమనువేఱుగ్రంథము గానరాదు. అందలివిషయము కుమారపాల ఘూర్జర చరిత్రమేయని పైని చెప్పఁబడినదిగదా. ఉద్భటకుమారసంభవమునకును దానికిని సంబంధమే లేదు.



1. చూ. విమర్శతరంగిణి. ౨౧౩ పుట. మ॥ రా॥ శ్రీ నడకుదిటి వీరరాజు పంతులు గారు,

# చతుర్థ ప్రకరణము

---

నన్నిచోడ కుమారసంభవమునకుఁ గాళిదాసోద్భట కుమారసంభవములు మూలగ్రంథప్రాయములు. ఇంక నెన్నో పద్యములు సంస్కృత కర్ణాట కాంధ్రకవుల గ్రంథములలోనిపద్యముల భావములతో సాదృశ్యము గలవి గనఁబడుచున్నవి. ఇతర కవులభావము గ్రహించినంతమాత్రమున భావచౌర్య మన రాదు. ఇతరభావములను సందర్భశుద్ధిగా స్వల్పమగు మార్పు చేసియో చేయకయో గ్రహించుట ఛాయోపజీవనమను కవిలక్షణముగా నాలంకారికు లంగీకరించిరి. అట్టివి కొన్ని చూతము.

**సంస్కృతము.**

"కింకవేస్తస్య కావ్యేన
కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం
న ఘూర్ణయతి య చ్ఛిరః."
చాటువు.

**నన్నిచోడకృతి.**

"క. ముదమున సత్కవికావ్యము
నదరఁగ విలుకానిపట్టినమ్మును బరహృ
ద్భిదమై తల యూఁపింపని
యదికావ్యమె మలరిపట్టినదియున్ శరమే.
('పట్టినదియున్ శరమే' అని ముద్రితము.
అది పొసఁగదు.)

**సంస్కృతము.**

"మధ్యందినార్కసంతప్తః
సరసీంగాహతే గజః
మన్యే మార్తాండగృహ్యాణి
పద్మాన్యుద్ధర్తు ముద్యతః"
దండికావ్యాదర్శము.

**నన్నిచోడకృతి.**

"వ. తదవసరంబున ఘర్మాంశుకరావళి కులికి
తదీయాప్తబంధువులైన యరవిందంబుల
కలిగి దండింపఁ బోచ్చునట్లు వేదండంబులు
కమలషండంబుల కరుగుదెంచె"
౧, ౯౧.

**సంస్కృతము.**

"యాత్యేకతో స్తశిఖరం పతి రోషధీనా
మావిష్కృతోఽరుణపురస్సర ఏకతోఽర్కః
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇ వాత్మదశాంతరేషు."
శాకుంతలము.

**నన్నిచోడకృతి.**

"అస్తగిరిఁ బొందె రా జుదయాద్రి నెక్కె
నినుఁడు తేజస్వులగువారి కెల్లప్రొద్దు
మానితంబగు నిల నొక్కమాట పొందు
హానివృద్ధులు సూచించు నట్లవోలె."
౨, ౧౯౦. (II, 190)

ఇట్లు సంస్కృత కావ్యనాటకములనుండి గ్రహించినవి శతాధికములు గలవు.

కన్నడము.

"సిడిలొళె తప్పు పోర్వ సిడి
లంతిరె శాళొళె శాళ్ పళంచి మా
ర్కడివిడె నోడలంజి దెసె
దేవతెగళ్ పెఱపింగె తోళ తీన్
కిడె నలిదొందెరల్కుదురె
యప్పెయు మొందెరడానెయప్పెయుం
తోడర్దొడనాడి తర్తిటియది
ర్దొడె జోళమనెంతు నీగువెం."

పంపభారత. 10-42.

"సురలోకం దొరెకొళ్వదొందుపరమ
శ్రీలక్ష్మియుం బర్పదా
దరదిం దేవనికాయదొళ్ నెరెవుదొం
దుత్సాహమే తన్నమె
య్సిరిభాగ్యం నెరమప్పదొందెరణదొళ్
గెల్వాటియం తప్పు నం
గరదొళ్ జోళదపాత్రియం
నెఱపిదం గండం పెరం గండనే."

పంపభారత. 10, 43.

"......తావిర్వరుం కెర్దువం
బిసుటర్ జోళదపాత్రియం బగెదు
దిల్లా ద్రాణియుం ద్రోణనుం"

గదాయుద్ధ ౨, ౧౧.

నన్నిచోడకృతి.

"మునుమిడి వైరివాహినుల
మట్టిపడం బడ వ్రేసినట్టి కై
పునః బయి కెత్తువాహకుల
పొంక మఱం దల కొంతకోసి మున్
కొనివడిఁ బాఱుపందలను
గోపులనూరెలఁ దోలిమార్చుచే
ర్చునబరి కెల్లి గాల్గలన
జొన్నలు గొన్న ఋణంబునీఁగుదున్"

౧౧, ౮౨ (II, 612.)

పయి పద్యములు, పై గ్రంథములందు యుద్ధసన్నద్ధులగు భటుల పరాక్రమమును ప్రభుభక్తిని దెలుపు సందర్భములోనివి. నన్నెచోడుని 'జొన్నలుగొన్న ఋణమునీఁగుటయుఁ' బంపని 'జోళమనెంతునీగు' 'జోళదపాటి' అనునవియు రన్న 'జోళదపాటియం' అనునదియు సమానభావములేకదా. సంస్కృతమున యావనాళమనఁబడు జొన్నలు జీతములుగాఁ బూర్వము జీవిక కిచ్చియుందురు. అది క్రమముగా జీవనాధారపదార్థపర్యాయ మయి యున్నది. "వారి యుప్పుతిని బ్రతుకుచున్నాము" "వారిగంజి త్రాగి యున్నాము" మొదలగువానియందు ఉప్పు, గంజివలె 'జొన్నలు' జీవికాపర్యాయమయినది. కొందఱు దీనినే భర్తృపిండ మందురు. పోషకుఁడు పెట్టు భోజన మని తాత్పర్యము. ఈరీతి కన్నడమునఁ బ్రాయికముగాఁగలదు.

"దానాంభఃపీనగండస్థలకరినికరం
బాత్తెయో మెచ్చువేటా
బానేయాశ్వోత్కరం బాత్తెయొ
మణినిచయంబాత్తెయో పేటిమెందా
దీనానాథర్గె వృద్ధద్విజమునినికర
క్కందెసర్ పోపినం "కః
కేనార్థీ కో దరిద్రో'' ఎనుతుమని
తుమం ధర్మజం సూ ఱెగొట్టమ్.''

పంపభారత. 6-40.

'వ. అంత విరోధాన్వితులైన సుభటోత్త
ములు 'కఃకేనార్థీ కోదరిద్ర' యనిగోసనం
బులుపుచ్చి సర్వస్వదాను లగుచుండిరి.
...ఇట్లు సేసు లనేకప్రకారంబుల దీనా
నాథ విద్వజ్జనంబుల నపారవసుధారా
సారంబులం దేల్చుచుండిరి.

౧౧, ౫౯. (II, 628)

('కఃకే నార్థీ కోదరిద్రః' అనుచోట 'కనిక నార్తికో దరిద్ర' అని వ్రాఁత ప్రతియందును ముద్రితమునందును గలదు. ఒకప్పుడు 'కనకనాస్తికో దరిద్ర'యని భ్రమపడితిని. కన్నడప్రయోగము చూచిన తర్వాతఁ బయిరీతిని బాఠము నిరూపించితిని.

"నెగర్దాభారతమల్లళంతనుజబా
ణాఘాతదిం భీమభీ
మగదాదండవిఘాతదిం కురునృపా
నీకం పడల్వట్టు జీ
రిగెయొక్కల్గెణెయాగిబిర్ద
భటరిం బిర్దళ్వదిం బిర్ద దం
తిగళిందం జవనుండుకాటి
దవొలాయొత్తంకురుక్షేత్రదోళ్.''

గదాయుద్ధ 3,౨.

"అడి తొడె పొఱ్కుటం తెగలెక్కె కణకాల్
కొరలెం బివుం బెరల్
నడువురబెన్ బసిఱ్ తోళకుకర్చురె
ముయ్యుమును బు మూగుపె
ర్దొడెళటి ముం(వం?)మడంపరడు
నందినొసల్ పణెగణ్ కదంపివెం
బెడెయనె నట్టువుర్చిదివు
నీర్దువుపార్థనంబుగళ్."

పంపభారత. ౧౨-౧౩౬.

"క॥ దురమున మెడ తొడ మొల
బరి శిర మురమక్కు ప్రక్క
బడుమములుం గె
డ్చెరసై యేర్పడ కలిభీ
కరమయ్యె జముండు కుడిచి
క్రక్కినభంగిన్. (II, వ, ౧౬౦.)

పయి కన్నడపద్యముల చాయనే తెలుఁగుపద్యము రచింపఁబడినట్లు తోఁచుచున్నది.

పంప భారతములోని వర్ణనములరీతియుఁ గొన్నిపద్యముల కూడికయు నన్నయ తిక్కనల కవిత్వమునను గననగును. నన్నిచోడకవిత్వమున నంత మాత్రమేకాక, కర్ణాటకపదములును దత్సమాసములును గూడ దొర్లినవి. అవి గ్రంథ విస్తరభీతిచే నాఁపఁదలఁచితి.

ఆంధ్రమునఁ గల పోలికలనుజూపునపుడు ముందు నన్నయ్యభట్ట సోమ నాథుల గ్రంథములందలి సాదృశ్యము చూపఁదగియున్నను దిక్కన కేతనల గ్రంథముల సాదృశ్యము స్పష్టతరముగాను నధికతరముగాను నుండుటచేత ముందు తత్సాదృశ్యము చూపఁబడును. మఱియును దిక్కన కేతనల గ్రంథ భాగములేకాక వానికి మూలములగు సంస్కృతభాగములు గూడ గ్రహింతము. దానిచేఁ దద్రచనాపూర్వోత్తరములుగూడఁ గొంత బయలువడుట కవకాశము గలుగును.

నన్నిచోడుఁడు

చ. మురిసెడిరూపులున్ మురిసి
మొగ్గెడిరూపులు మ్రొగ్గిజిట్టునం,
దిరిగెడిరూపులుం దిరిగిత్రెళ్లెడిరూపులు
త్రెళ్లి నేలపైఁ, బొరలెడిరూపులుం
బొరలిపోయెడిరూపులుఁ బోయిక్రమ్మఱన్, మరలెడిరూపులున్ మరలి
మ్రగ్గెడురూపులు నయ్యె నయ్యనిన్"
ఉ. "వెక్కుడిరూపులున్ విఱిగి
వెండిక వెండిక వ్రాలురూపులున్,
నిక్కుడిరూపులున్ మురిసి

తిక్కన్న

"వ... వెండియు వెఱచఱవక తఱిమి పెనంగు
నబ్బలంబు లతనిబాణపరంపరల బలితంపు
బరువునం జేసి.
ఆ. కూలురూపును దన్నికొనియెడిరూపును
నొఱలురూపు నేలనొఱఁగురూపు
బొరలురూపు నయ్యె నరవాజిగజములు
ప్రధనభూమిఘోర భంగిగాఁగ.
వ. రణభూమి నభిరామఘోరంబుగా ననేక
ప్రకారక్రూరశరంబులు దాఁకి తునియు
రూపును రుధిరంబుదొఱఁగురూపును నొఱ

(1) భార. ద్రో. ౧౯ అధ్యా 25 మొదలుకొని—

"తాం స్తథావ్యాకులీకృత్య త్వరమాణోధనంజయః, జఘాననిశితైర్బాణైః సహస్రాణి శతానిచ, శిరాంసిభల్లైరహరద్ బాహూ నపిచసాయుధాన్, హస్తిహస్తోపమాంశ్చోరూన్ శరై రన్యా నపాతయత్, పృష్ఠచ్ఛిన్నాన్ విచరణాన్ బాహుపార్శ్వేక్షణాకులాన్, నానాంగావయవైర్హీనాన్ చకారారీన్ ధనంజయః,......తైర్హన్యమానైశ్చపతద్భిః పతితైరపి, భ్రమద్భి శ్లిష్టవద్భిశ్చ క్రూర మాయోధనం బభౌ...

భార. ద్రో. 90 అధ్యా. 20. "గజస్కంధ గతానాంచ పురుషాణాం కిరీటినాం, భిద్యంతే చోత్తమాంగాని భల్లైస్సన్నతపర్వభిః, సకుండలానాం పతతాం శిరాంసి ధరణీతలే,...యంత్రబద్ధాలికవచా వ్రణార్తా రుధిరోక్షితాః...వమంతోరుధిరం ముఖైః, అదృశ్యత మహారాజ తస్మిన్ పరమసంకులే,...అదృశ్యంత భుజా శ్ఛిన్నాః, నిహతై ర్వారణై రశ్వైః క్షత్రియైశ్చనిపాతితైః, అదృశ్యత మహీతత్ర దారుణ ప్రతిదర్శనా."

నీర్గెడిరూపులు రోలిసెత్తురుల్
గ్రక్కెడిరూపులుం దలరి
కాళులుగొట్టెడి రూపులుం గడున్
స్రుక్కెడి రూపులుం గలనఁ
జూడ భయంకర మయ్యె నయ్యెడన్''
"విఱిగెడిరూపులున్ విఱిగి
వ్రేలెడిరూపులు దల్లడిల్లి వా
చఱచెడిరూపులుం గలయఁ
జాల్పడురూపులు నొచ్చి నేలపై
నొఱఁగెడురూపులుం జెలఁగ
నూర్చెడురూపులు నస్త్రిఘట్టనన్
నఱు మగురూపులుం బృథుర
ణంబున నగ్గల మయ్యె నయ్యెడన్'
(II, 698; 699; 700.)
౧౧, ౧౬౯, ౧౭౦, ౧౭౧.

లురూపును ద్రుళ్ళిపడయురూపును దూఁ
గురూపును బడి పొరలురూపును నెత్తురు
గ్రక్కురూపును జిక్కురూపును రూపు
సెడురూపునునై కరితురగ నికరంబు వికలంబుగా విజృంభించిన నతనిసంరంభంబు
సైరింపం జాలక.''
(వరునగా. భారత. ద్రోణ.
౧, ౨౬౬; ౨౬౭; ౩, ౫౧.)

సంస్కృత భారతములోని భాగము నితర గ్రంథభాగమునుబోలె భావమును గ్రహించి కరుణభీభత్సములు స్ఫురించునట్లు తిక్కనసోమయాజి యాంధ్రీకరించెను. నన్నెచోడకవి తనకావ్యమున సంకులయుద్ధవర్ణనచేయు సందర్భమున వికలమగురూపులనెత్తికొని జానుఁదెనుఁగున ముక్తపదగ్రస్తముగాను యమకముగాను భారతభాగమునకుఁ బ్రబంధపక్కీ కవచము తొడిగి గ్రహించిన ట్లున్నది. నన్నిచోడ పద్యములలోనే యొకదానినొకటి మించునట్లు రచింపఁబడినవి. మొదటఁ జూపిన పద్యము చివర రచింపఁబడియుండును. హృదయంగమతమమగుటచే మొదటి స్థాన మాక్రమించినదేమో! మిగిలినవి గూడ రసోచితములే యగుటచేతఁ దర్వాతి స్థాన మాక్రమించియుండును.

తిక్కన సోమయాజియే నన్నిచోడునిభాగము చూచియుండినచో దానిని మించునట్లు ఎంతో రసవంతముగా రచించి యుండును. తిక్కన సోమయాజిభాగము నన్నిచోడకవి చూచియుండును.

"క. కరములుద్రెవ్వినఁ బండులఁ
గరాసి కఱచికొని రౌద్రగతి ననిమిషో
త్కరము దెగఁ బఱచె నొక్కఁడు
సురవాహిని దఱియుకొమ్ముఁ
జొఱయఁ బోరన్.''
౧౧, ౧౫౭ (II. 726)

"వ.... అతనింజుట్టిముట్టి యస్త్రశస్త్రంబులం బొదువుటయు నతండు.
ఆ.వె. వానినెల్లద్రుంచి వలవచ్చుకొనిలీల
నిగుడుచోఁ ఱవోలె నెగడు వడక
తఱిమి రక్తనదులు వఱపె మస్తకకూర్మ
హస్త భుజగతతుల నతిశయిల్ల.'' (1)
భార. కర్ణ. ౩-౧౫౮.

ఈ పద్యములలో విశేషము పరిశీలింతము. సంస్కృతముననున్న వల నుండి చేప నీటిలోనికి వెడలినట్లు అన్నస్థలమున గవిబ్రహ్మ కేవలమత్స్యము కంటెఁ జోటి వలను వడిగాఁ ద్రెంపఁగల దని చోటిను గ్రహించి రక్తనదులఁ బ్రవహింపఁ జేయించి మస్తకములు కూర్మములుగాను హస్తములు భుజగములు గాను రూపించినాఁడు.

భావనాప్రధానుఁడగు మనకవిరాజశిఖామణి యుత్తచోటికంటెఁ గొమ్ముఁజోటి శీఘ్రముగా వలను ద్రెంపుటకు సమర్థ మని యెంచి సురవాహినీ శబ్దప్రయోగమున దేవతాసేన, గంగానది యను రెండర్థములకు సరిపడునట్లు రచించి తిక్కనచోటికిఁ గొమ్ములు తెచ్చిపెట్టుటకు భావనగావించి చేతులు దెగిపోయి కత్తి పందులతోఁ గఱచుకొని దేవతాసేన పైకిఁ బోవు రాక్షసుని సర్వపాత్రముగాఁ జేసినాఁడు. తిక్కనచోటి చూఱగొని కొమ్ములు పెట్టిన వాఁడు నన్నిచోడకవిరాజశిఖామణి యనుటకు సంశయం బేల ?

"క. ఆతతముగ శుక్రుఁడు దత్
స్వాతిగతుండయినఁ గురియు సంతతధారా
పాతమునుబోలె దనుజ
వ్రాతముపై గుహుఁడుబాణవర్షముగురిసెన్"
౧౨, ౧౩౫. (II, 917)

"క. [2]స్వాతిగతుం డగు శుక్రుం,
డే తెఱఁగఁ బఱఁగ జేయు నెసకపువర్షం,
బా తెఱఁగున సాయక వ,
ర్షాతిశయం బావహించె నతఁడు నరేంద్రా."
భార. కర్ణ. 3, ౭౨.

"క. విని చెవుల ముట్టి తోలం
గని కన్నుల నమలి నాలుకను మూర్కొనిము
క్కునఁ బురుషుఁ డెఱుఁగు మన మా
రనుశబ్దస్పర్శరూప రసగంధంబుల్."
౬, ౬౭. (I. 724)

"క. కనుఁ గన్నుఁ వినుఁ జెవియై
కొనుఁజవి జిహ్వయయి మూరుకొనునాసికయై
తనువై స్పర్శము గైకొను
యనపద్యా! బుద్ధియాత్మయందనిలుచుచున్."
భార. శాంతి. ౫. ౧౬౯.

ఈ భారతపద్యమునకు మూలశ్లోకము కనఁబడ లేదు. తిక్కన బుద్ధికిని నన్నిచోడుఁడు పురుషునకునుఁ గర్తృత్వమేర్పఱచిరి. పద్యగతియం దనుకరణము స్పష్టము. ఇంక శృంగారవర్ణనసందర్భమున భావశబలతాదులును, అం దుప యోగించిన పదజాలమును బరిశీలింతము.

"సీ. ఎలరారు కనుగవ వోలయించుఁ గ్రేవల
నెఱిగాని మెఱుఁగులు దఱగవింప
......... .............

చ. అని యని యుగ్గడించు ధృతి
యల్లలనాడినఁ దల్లడించుఁ బై
కొను తలపోఁత నించు మదిఁ

1. "తా విదీర్య మహాసేనాం శరైః సన్నత పర్వభిః, నిశ్చక్రామ రణా ద్భీమః మత్స్యో జాలా ది వాం భసి." భా. కర్ణ. 77-37.

2. యథా ప్రావృషి కాలమేఘః. కర్ణ. ౬౯, ౭.

గీ. ఒత్తవించుఁ దఱుమ నూకించుఁ దాలిమి
కగ్గలించు నెఱయ నప్పళించు
మదనశరవిభిన్నహృదయాబ్జుఁడై మహా
దేవుఁ జూచి గౌరిదేవి తివుట.''
౪, ౪౧ (I. 520)

సీ. ''పులకాంకురంబులు దలలెత్తిమేను గం
పింపఁ గోమలిఁగౌఁగిలింపఁ దలఁచు
రాగోత్కటమున సైరణ లేక మానినిఁ
గాయ్యానఁ బై బడి గవయఁ దలఁచు
లలితాంగి యవయవములు సూచి మదిఁ దని
వోవక చూడ్కులఁ ద్రావఁ దలఁచు
నధరోష్ఠ మదరంగ నంతస్స్మితాంశులు
దలకొత్తనేమేనిఁ బలుకఁ దలఁచుఁ
దనమహత్త్వంబు దలఁపక తరుణిపొందు
వడయఁ గీడ్పడి తేఁకువ వాపఁ దలఁచు
భావజాస్త్రాభిహతి మహాదేవుఁడొక్క
వ్రేలుమిడిఁబెంపుసెడి కడు విరలి గొనియె.''
౪, ౪౫. (I, 524.)

గోర్కులు పేర్చిన నప్పళించు నె
ట్టన తెగ నగ్గలించు నచటన్
జనులం బరికించు బుద్ధి దూ
లిన వెస నెంతయుం గళవ
ళించు మనోజ వికారముగ్నుఁడై.
భార. విరాట. ౨, ౩౧

''సీ. వామాక్షి రుచిరలావణ్యంబు భావించుఁ
దన్వంగి రూపు చిత్తమున నిలుపుఁ
గంబుకంధరిచెన్ను కై వడిఁ దలపోయు
నంగనసౌకుమార్యముఁ దలంచు
భామిని సహజ విభ్రమ మెదఁ గీలించుఁ
బడఁతి చెయ్వులు మదిఁ బట్టుకొలుపు
మానిని గర్వంపుమాట పొం దూహించుఁ
దళితాబ్జముఖి తిన్నఁదనము మెచ్చు
తే. నడరి కోర్కులు చిత్తముత్తాడ వెడఁగు
పడినయుల్లంబు పట్టునఁబఱుపఁ దనకు
వశముగాకున్న నెంతయు వంతఁ బొందుఁ
జింతయొసకంబు వడిగొని చిక్కువఱుప.''
భార. విరాట. ౨, ౫౨.

''చ. తలరు నలంపురున్ నవయుఁ
దాపభరంబున వెచ్చనూర్చు మేః
నలయఁగ నొల్లఁబోవు వెగ
డందుఁ గలంగుఁ బరిభ్రమించుఁ గొం
దలపడుఁ దల్లడం బడరి
ధైర్యముదూలిన బెగ్గడిల్లు వి
చ్చలువిడిఁ బేర్చునెవ్వగల
సందడి డెందముగంది చేడ్పడన్."
ఇవ్విధంబున మదనవేదనాదోదూయమాన మా
నసుం డగుచు.
భార. విరా. ౨, ౫౩.

ఇది మన్మథదహనమునకుఁ బూర్వము పరమేశ్వరునకుఁ గలిగిన మనో వికారవర్ణనసందర్భములోనిది. ఇటఁ దత్కాలమున రససిద్ధి లేమిం జేసి రసాభాసతుల్యమే యని తలంపవచ్చును. భారతమునఁ దిక్కన ప్రయోగించినదియు రసాభాసస్థలమే. కావున వర్ణనస్థలములుగూడఁ గొంచెము సాదృశ్యము గలవే,

ఈ పద్యములలో విశేషము పరిశీలింతము. సంస్కృతమునను్న వల నుండి చేప నీటిలోనికి వెడలినట్లు అన్నస్థలమున గవి బ్రహ్మ కేవలమత్స్యము కంటెం జోటి వలను వడిగాం ద్రెంపంగల దని చోటిను గ్రహించి రక్తనదులం బ్రవహింపం జేయించి మస్తకములు కూర్మములుగాను హస్తములు భుజగములు గాను రూపించినాండు.

భావనాప్రధానుండగు మనకవిరాజశిఖామణి యుత్తచోటికంటెం గొమ్ముంజోటి శీఘ్రముగా వలను ద్రెంపుటకు సమర్థ మని యెంచి సురవాహినీ శబ్దప్రయోగమున దేవతాసేన, గంగానది యను రెండర్థములకు సరిపడునట్లు రచించి తిక్కనచోటికుంగొమ్ములు తెచ్చిపెట్టుటకు భావనగావించి చేతులు దెగిపోయి కత్తి పండులతోం గలిచుకొని దేవతాసేన పైకిం బోవు రాక్షసుని సర్పపాత్రముగాం జేసినాండు. తిక్కనచోటి చూలిగొని కొమ్ములు పెట్టిన వాండు నన్నిచోడకవిరాజశిఖామణి యనుటకు సంశయం బేల ?

"క. ఆతతముగ శుక్రుండు దత్
స్వాతిగతుండయినం గురియు సంతతధారా
పాతమునుబోలె దనుజ
వ్రాతముపై గుహుండుబాణవర్షముగురిసెన్"
౧౨, ౧౩౪. (II, 917)

"క. [2]స్వాతిగతుం డగు శుక్రుం,
డే తెఱంగం బఱంగ జేయు నెసకపువర్షం,
బా తెఱంగున సాయక వ,
ర్షాతిశయం బావహించె నతండు నరేంద్రా."
భార. కర్ణ. 3, ౪౨.

"క. విని చెవుల ముట్టి తోలం
గని కన్నుల నమలి నాలుకను మూర్కొనిము
క్కునం బురుషుం డెఱుంగు మన మా
రనుశబ్దస్పర్శరూప రసగంధంబుల్."
౬, ౬౭. (I. 724)

"క. కనుం గన్నై వినుం జెవియై
కొనుంజవి జిహ్వయయి మూరుకొనునాసికయై
తనువై స్పర్శము గైకొను
యనవద్యా! బుద్ధియాత్మయందనిలుచుచున్."
భార. శాంతి. ౫. ౧౯౯.

ఈ భారతపద్యమునకు మూలశ్లోకము కనంబడ లేదు. తిక్కన బుద్ధికిని నన్నిచోడుండు పురుషునకునుం గర్తృత్వమేర్పఱిచిరి. పద్యగతియం దనుకరణము స్పష్టము. ఇంక శృంగారవర్ణనసందర్భమున భావశబలతాదులును, అందుప యోగించిన పదజాలమును బరిశీలింతము.

"సీ. ఎలరారు కనుగవ వొలయించుం గెంపివల
నెఱిగాని మెఱుంగులు దఱగవింప
......... ..............

చ. అని యని యుగ్గడించు ధృతి
యల్లలనాడినం దల్లడించుం బై
కొను తలపోఁత నించు మదిం

1. "తా విదీర్య మహాసేనాం శరైః సన్నత పర్వభిః, నిశ్చక్రామ రణా ద్భీమః మత్స్య జాలా దివాం భసి." భా. కర్ణ. 77-37.

2. యథా ప్రావృషి కాలమేఘః. కర్ణ. ౬౯, ౭.

గీ. ఒత్తవించుఁ దఱుమ నూకించుఁ దాలిమి
కగ్గలించు నెఱయ నప్పళించు
మదనశరవిభిన్నహృదయాబ్జుఁడై మహా
దేవుఁ జూచి గౌరిదేవి తివుట.''

౪, ౪౧ (I. 520)

సీ. "పులకాంకురంబులు దలలెత్తిమేను గం
పింపఁ గోమలిఁగౌఁగిలింపఁ దలఁచు
రాగోత్కటమున సైరణ లేక మానినిఁ
గాయ్యనఁ బైఁ బడి గవయఁ దలఁచు
లలితాంగి యవయవములు నూచి మదిఁ దని
వోవక చూడ్కులఁ ద్రావఁ దలఁచు
నధరోష్ఠ మదరంగ నంతస్స్మితాంశులు
దలకొత్తనేమేనిఁ బలుకఁ దలఁచుఁ
దనమహత్త్వంబు దలఁపక తరుణిపాందు
వడయఁ గీడ్పడి తేఁకువ వాపఁ దలఁచు
భావజాస్త్రాళిహతి మహాదేవుఁడొక్క
వ్రేలుమిడిఁచెంపుసెడి కడు విరలి గొనియె.''

౪, ౪౫. (I, 524.)

గోర్కులు పేర్చిన నప్పళించు నె
ట్టన తెగ నగ్గలించు నచటన్
జనులం బరికించు బుద్ధి దూ
లిన వెన నెంతయుం గళవ
ళించు మనోజ వికారమగ్నుఁడై.

భార. విరాట. ౨, ౩౧

"సీ. వామాక్షి రుచిరలావణ్యంబు భావించుఁ
దన్వంగి రూపు చిత్తమున నిలుపుఁ
గంబుకంధరిచెన్నుకై వడిఁ దలపోయు
నంగనసౌకుమార్యముఁ దలంచు
భామిని సహజ విభ్రమ మెదఁ గీలించుఁ
బడఁతి చెయ్వులు మదిఁ బట్టుకొలుపు
మానిని గర్వంపుమాట పాం దూహించుఁ
దళితాబ్జముఖి తిన్నఁదనము మెచ్చు
తే. నడరి కోర్కులు చిట్టుముట్టాడ వెడఁగు
పడినయుల్లంబు పట్టునఁబఱుపఁ దనకు
వశముగాకున్న నెంతయు వంతఁ బొందుఁ
జింతయొసకంబు వడిగొని చిక్కుపఱుప.''

భార. విరాట. ౨, ౫౨.

"చ. తలరు నలంచురున్ నవయుఁ
దాపభరంబున వెచ్చనూర్చుమేః
నలయఁగ నొల్లఁబోవు వెగ
డందుఁ గలంగుఁ బరిభ్రమించుఁ గొం
దలపడుఁ దల్లడం బడరి
ధైర్యముదూలిన వెగ్గడిల్లు వి
చ్చలువిడిఁ బేర్చునెవ్వగల
నండడి డెందముగంది చేడ్పడన్."

ఇవ్విధంబున మదనవేదనాదోదూయమాన మా
నసుం డగుచు.

భార. విరా. ౨, ౫౩.

ఇది మన్మథదహనమునకుఁ బూర్వము పరమేశ్వరునకుఁ గలిగిన మనో వికారవర్ణనసందర్భములోనిది. ఇటఁ దత్కాలమున రససిద్ధి లేమిం జేసి రసాభాసతుల్యమే యని తలంపవచ్చును. భారతమునఁ దిక్కన ప్రయోగించినదియు రసాభాసస్థలమే. కావున వర్ణనస్థలములుగూడఁ గొంచెము సాదృశ్యము గలవే,

నన్నిచోడుఁడు తత్తద్భావప్రౌఢయములకుఁ గారణములు దెల్పుట తిక్కనకంటెఁ గొంచెము విశేషము.

"క. గిరులైన వజ్రమై జల
ధరపటలములైన మారుతంబై వడిఁ గే
సరులైనను శరభమ్మై [డగుచుర్''
యురగము లగుటయు విహంగమోత్తముఁ
౧౨, ౮౩. (II, 824.)

"క. [1]గిరియై పటిలేర నళని
శరమును మేఘత్వమొంది సాయకవృష్టిం
గురిసినఁ బవనాస్త్రంబును
బరువడినిగుడించి గురునిపట్టి జెరల్చెన్."
భార. ద్రో. ౫,౭౬.

సంస్కృతశ్లోకము ననుసరించిన భారతపద్యమే మొదటిది యన వచ్చును.

"అట్టి కదనంబున—
అది నావల్లభు నుత్తమాంగ మది నా
యాత్మేశు వక్షస్థలం
బది నానాథు పదద్వయం బది మదీ
యాధీశబాహుద్వయం
బది నాఁటెని కటిప్రదేశ మని తా
రంతంత నొక్కొక్కడం
గదనాగ్రంబున నేటితెచ్చిపాడవుల్
గాఁజేతురోలిన్ సతుల్.''

(పాడవుల్ గావింతురోలిన్ అని ముద్రితము. 'చేతురు' అని రూపము ప్రయోగించిన దోషము కవికిఁ గలుగు నని శాంబోలు దిద్దివేసిరి.)

సీ. [2]అట్టలకడ నుత్తమాంగముల్ గానక
యలమట నలుగడ నరయువారుఁ
దలలు చేతులఁగొని తనువు లత్తలమునఁ
దఱుచు పీనుఁగులలోఁ దడవువారు
శిరములు మేనులఁ జేర్చిభావించి ని
జాన్యముల్ ప్రవేశింపఁ జఱచువారు
తునియలు పెక్కైనఁ బనివడిఁ గూర్చి కూ
పులు, గనుంగొని మూర్ఛ మునుఁగువారు
తే. నైన కౌరవపాంచాల మానినీజ
నముల నచ్యుత చూడుము నాథజనక
పుత్త్రసోదరశవములపొంత శేగి
పెక్కు దురవస్థ లొందెద రక్కటకట!
భార. స్త్రీ. ౨, ౨౨.

---

1 శ్లో. "సోఽభవ ద్గిరి రత్యుచ్చః శిఖరై స్తరుసంకటైః......తతోఽహసన్నివ వజ్ర మస్త్రి ముదైరయత్, తత స్స తోయదో భూత్వా నలస్సేంద్రాయుధో దివి, అశ్మవృష్టిభి రత్యగ్రోద్రాణి మాచ్ఛాదయ ద్రణే, అథసంధాయ వాయవ్య మస్త్రి మస్త్రివిశారదః.''
సం. భార. ద్రో. ౧౫౬ అధ్యా. ౧౦౫.

2 "విశిరస్కానథోకాయాన్ దృష్ట్వా ఘోరాభినందినః, ముహ్యంత్యనుచితానార్యో విదేహాని శిరాంసిచ; శిరః కాయేన సంధాయ ప్రేక్షమాణా విచేతసః, అపశ్యంత్యోపరం తత్ర నేద మస్యేతి దుఃఖితాః; బాహూరు చరణానన్యాన్ విశిఖోన్మథితాన్ పృథక్, సందధంత్యో సుఖా విష్టా, మూర్ఛంత్యేతాః పునఃపునః; ఉత్కృత్తశిరస శ్చాన్యాన్ విజగ్ధాన్ మృగపక్షిభిః, దృష్ట్వా కాంశ్చిన్నజానంతి భ్రాతౄన్ పరమయోషితః''
సం, భార. స్త్రీపర్వ, 16 అధ్యాయము, 51, 52, 53 శ్లోకములు.

"వ. ఇట్టి సాంపరాయ రభసంబున.
ఉ. ఆడెడిరూపులుం గలయ
నాడెడి గ్రద్దలుఁజప్పలించి పో
రాడుపిశాచముల్ నెగసి
యాడెడు నట్టలు వానిఁ జిట్టుసు
ట్టాడెడుభూతసంకులము
నంగద నిల్వక చుట్టుచుట్టుగా
నాడెడు జంబుకాలిఁ గల
హావనిభీకర మయ్యెఁజూడఁగాన్."
౧౧, ౧౮౯. (II, 758.)

"క. వీచియు నొత్తియు నెత్తియుఁ
ద్రోచియుఁ బఱచియును ద్రిప్పి తూలిపడంగా
వైచియు గజయూథంబులఁ
బాచియుఁబవనుండుసంపెఁ బ్రబలగజబలముల్.
వ. ఇట్లనేకప్రకారంబుల భంజించుమహా
ప్రభంజనహాతికిఁ గుంజరఘటంబు లబ్బ
గింపక.
గీ. ధార కులికెడు మదజలధార లుడిగి
గర్జసెడి పుట్టుపాడ వెందుఁ గానకుండ
మారుతాహతి నిలుపక పోర నభ్ర
పటలిగతిఁ దూలి మదకరిఘటలువాఱె."
౧౨, ౩౦; ౩౧; ౩౨. (II, 811, 812, 813.)

"సీ. ప్రేవులు గండలు పెఱికిపేటాడియం
గదఁగొని మెదళు లగల్చికొనుచు
రాగిలి రక్తంబు ద్రావుచు లోచన
గుళికల నొలిచి మ్రింగుచును గుండె
కాయ లాదటమెయిఁ గబళించుచును గ్రొవ్వు
దెమలిచి నములుచు నెముకయాట
చవిగొని యానుచుఁ జావకయున్న రూ
పులు నచ్చుటకుఁ గాఁగఁ బెలుచఁ దన్ని
తే. కొనినవెఱఁబాయఁ బాఱుచుఁజెనకితోడరి
కాటులాడుచు నున్న సృగాలములును
గాకములు రాపులుఁగులును గ్రద్దలును వృ
కంబులును మానసము వికలము సేయ"
వ. [1]అ గ్గాంధారరాజనందన కలను గలయఁ
గనుంగొనె." భార. స్త్రీ. ౨, ౯.

"క. [2]శరవేగంబున గద
పరుసఁదనంబునను గలఁగఁ బడి చేడ్పడనా
కరులం దోలెను భీముఁడు
వెరవున గోపకుఁడు గదుపువెలిచినమాడ్కిన్.
క. పెనుగాలిఁ దూలుమొగిళులా
యన నిభములు విఱిగి నిజబలావళి సదియం
దనమీఁదఁ బాఱ దుర్యో
ధనుఁడదలిచి సర్వసైన్యతతిఁబురికొల్పెన్."
భార. భీష్మ. ౨, ౨౧౪; ౨౧౬.

---

1. "దదర్శసాబుద్ధిమతీ దూరాదేవ యథాంతికే, రణాజిరంనృవీరాణా మద్భుతం లోమహర్షణమ్, అస్థికేశపరిస్తీర్ణం శోణితౌఘపరిప్లుతం; శరీరై ర్బహుసాహస్రై ర్వినికీర్ణం సమంతతః, గజాశ్వరథయోధానా మావృతం రుధిరావిలైః, శరీరై రశిరస్కైశ్చ విదేహైశ్చ శిరోగణైః, గజాశ్వ నరనారీణాం నిస్స్వనై రభిసంవృతమ్; సృగాల బకకాకోలకంకకాక నిషేవితమ్, రక్షసాం పురుషాదానాం మోదనం కురరాకులమ్, అశివాభి శ్శివాభిశ్చ నాదితం గృధ్రసేవితమ్." సం. భార. స్త్రీ 16 అధ్యా. 3 మొ.

2. "గజమధ్య మనుప్రాప్తః పాండవ స్స వ్యరాజత,...మహాభ్రజాల మతులం మాతరిశ్వేవ సంతతమ్, తే వధ్యమానా బలినా భీమసేనేన దంతినః, ఆర్తనాదం రణే చక్రు ర్గర్జంతో జలదా ఇవ." సం. భార. భీష్మ. ౧౦౩. అధ్యా. ౩౧, ౩౨

భారతమునఁ బవనజుఁడు మన కావ్యమునఁ బవనుఁడును గజయుద్ధముల కేర్పడిరి. వారు మహాప్రాణ పుత్త్ర మహాప్రాణులుగదా. మహాంగ యుద్ధ సందర్భమున భారతమందలి పవనసుతుఁడే కుమారసంభవమందలి పవనుని స్ఫూర్తికిఁ గారకుఁడు గావచ్చును.

తిక్కన భారతాంధ్రీకరణమున మూలములోని భావములు ఛాయారూపముగా గ్రహించెను. వాని చాయలఁ బోయి వానికి వన్నె తెచ్చుటకు యత్నించినవాఁడు నన్నిచోడకవిరాజశిఖామణి యని స్పష్టముగాఁ గనఁబడుచున్నది. ఇట్టివి లెక్కకు మిక్కిలిగానున్నవి.

భారతమునసేకాక నిర్వచనోత్తర రామాయణమునందును సామ్యము గల భావములు గొన్ని కనఁబడుచున్నవి. అవి పై భావమును దృఢపఱచుటకు సాధనము లగును.

"సీ. బాహుబలోన్నతిపాటించి రాక్షసా
ధీశుపట్టిన చెఱ లెల్లవిడిచి
షణ్ముఖభుజశిలా స్తంభాగ్రమునజయ,
శ్రీఁ బొందె సాలభంజికవిధమున."
౧౨, ౧౯౧. II, 974)

"శ్రీరాస్తాం మనుమ క్షితీశ్వరభుజా
స్తంభే జగన్మండల ప్రాసాదస్థిరభార
భాజి దధతీ సా సాలభంజీశ్రియమ్."
నిర్వచనోత్తర రామాయణము. ౧.౧

"క. మహనీయవప్రగోపుర
బహురత్నోత్కీర్ణసాలభంజిక లొప్పన్
విహరణ తత్పర నిర్జర
మహిళాతతివచ్చియున్నమాడ్కి బెడం [గై."
నిర్వ. ౧, ౪౯

పై భావము సంస్కృతకావ్యములనుండి యెవరికివారే గ్రహింపవచ్చు ననవచ్చును. కాని, భావసామ్యముచూపుట కుదాహరింపఁబడినవి. ఒకరి పుస్తకము మరొకరు చూచి రని యంగీకరించినపక్షమునఁ దిక్కన తనకవిత్వమునఁ బ్రథమాశీర్వచనశ్లోకముననే నన్నిచోడుని పద్యభావము గ్రహించె ననుటకంటెఁ దిక్కనభావము సరసముగా నుండుటచేతను, తిక్కన యందలి యాదరముచేతను నన్నిచోడకవి కుమారవిజయసందర్భమున గ్రహించె ననుటయే సయుక్తికము.

"చ. కడితలవారు వ్రేయఁ గడి ఖం
డములై పడి వండఁ దర్గిన, ట్లడగొని
యుండె...రణభూమి గృతాంత
కుశానసంబో నాన్."
౧౧, ౧౯౦. (II. ౪౫౯)

"సీ. అవయవభేదంబు లమరక తునియలై
యున్నగాత్రంబు లొక్కొక్కచోట
........................
తే...కల్పాంతమున జము శానసంబు
నింటిలోపలఁ బోలె నొప్పెసఁగెఁ జూడ."
నిర్వ. ౪, ౭౧.

"సీ. పరితాపశిఖిశిఖల్ దరికొని వనములోఁ
గార్చిచ్చులై కొని కాలుచుండు
నుడుగక వెసలు నిట్టూర్పులు జగములఁ
బ్రళయానిలంబులై పర్వి చెగయు
ఘోరనఁదొరఁగు కన్నీరువారాశికి
నేఱులై వెసఁ గూడి పాఱుచుండు
వగఁగూడి కడుఁగంది వందిన మైతీఁగ
కప్పున దెసలఁ జీకటులు గవియు"

౪, ౧౭౨. (I. 65)

"సీ. ఉడుగక కాల్చుచునుండెడి శోకంబు
లతితీవ్రహవ్యవాహనుఁడుగాఁగ
నిట్టూర్పుగాడ్పులు గుడిఁ చుటయ విల
సిల్లఁ బ్రోజ్జ్వలితంబు నేఁత గాఁగ
బాయక యొనరించు బహువిలాపంబులు
రాజితమంత్రాక్షరములుగాఁగ
కన్నీరుఘోరన గ్రమ్మించుటలపారఁ
బోరినాజ్యధారలపోఁతగాఁగ."

నిర్వ. ౫, ౧౧౨.

ఉభయకవిమిత్త్రునికిఁ గృతి యిచ్చిన యభినవదండి కేతన పద్యములను మన నన్నిచోడుని పద్యములను సరిచూచిన నేమి తోఁచునో చూతము.

(కపట బ్రహ్మచారివేషమునఁ బార్వతిని బరీక్షింప వచ్చిన పరమేశ్వరుఁడు పార్వతితో నను సందర్భమున)

"సీ. మగలాడువారికి మరిగి ముచ్చిలి బంది
వెట్టికన్నంబులు వెట్టి తెరువు
ద్రెక్కొని చని పరదేశంబు లుడుగక
ద్రిమ్మరి వ్రేళ్లను బోమ్మఁబోయి
యాచకులై వేఁడి నీచుల సేవించి
కలమెక్కి చని యాలఁ గయ్యమాడి
యేనుంగునకుఁ బాడి యిల్లెన్ని యేనియుఁ
గష్టముల్ పడిరాక గలదుగాక
గీ. మగలఁ గోరి తొల్లి మగువలు తపములు
చేసి నవసి రనినఁ జెట్టలెందు
గలవె దీని కచ్చునిలిపితి నీవ నీ
వలన సతుల పురులు వొలిసెఁ గాక."

౭, ౩౬. (I. 866)

"వ. అనిన విని యదియును (వేశ్యయు) దేవా! దేవర పిలిచి యడుగ బొంకు పలుకుట ప్రాణగొడ్డంబు చర్మభస్త్రిక మా యొద్ద నునికి గల దవధరింపు మని యిట్లనియె.
సీ. [1]కన్నంబువెట్టి తెక్కలిగొని యంకంబు
పలువురతో నాడి బందివెట్టి
జూదంబునకుఁ జొచ్చి చూఱకాండ్రం గూడి
పరదేశముల కేగి తెరువు లడిఁచి
యాలి రోయిడి తల్లి నాఁగి బిడ్డల నమ్మి
కన్నతండ్రులతోడఁ గయ్యమాడి
రాజులఁగొల్చి క్రూరంపుఁ జెయ్వులు నేసి
లజ్జాభిమానంబు లుజ్జగించి
తే. ధనము లార్జించి మిండాటమునకుఁ జొచ్చి
యిచ్చఁ గ్రీడింతు రింతవ ట్టైటేఁగి యొటేఁగి
యజినరత్నంబు మీ కిచ్చి నాతఁ డెవ్వఁ
డతని నెఱుఁగింపు మని నన్ను నడుగఁదగునె.

దశకుమారచరిత్రము, ౬-౫౪.

సంస్కృతదశకుమారచరిత్ర వాక్యములఁ జక్కఁగా నాంధ్రీకరింప వలసినవాఁడు కేతనకవి. వేశ్యాగృహమునకుఁ బోవువారు ధనార్జనమున కెన్ని హీనపుఁబనులు చేయుదురో వివరించియున్నాఁడు. కేతన వెంపరము కడుంగడుఁ

1. "నైవమన్యాయోపార్జితకులస్య యద్దాతుఽపదేశః, నహ్యర్థైరన్యాయోర్జితై రేవ పురుషా వేశ ముపతిష్ఠంతి."

సం. దశకుమారచరిత్ర. ౨ ఉచ్ఛ్వాసము.

ప్రశంసనీయము. పద్యరచనయు జాను దెనుగున మనమున కెక్కుచున్నది. నన్నిచోడఁడీపద్యము ననుకరించుట కభిలషించియుండును. ఇందు వేశ్యా విషయమున మగవారు పడెడు కష్టములు చెప్పఁబడినవి. సామాన్యముగా స్త్రీల కొఱకు నట్టి బాధలు గలుగుట చెప్పఁదగు నని యెంచి 'మగలాఁడువారికి మరిగి ... ... ఇట్లెన్ని యేనియును గష్టముల్ వడి రాకగలదు' అని మనకవిమార్చెను. ఇందుఁగల నీచమార్గములు దంపతుల విషయమునను, అందును బార్వతీసందర్భ మునను జెప్పుట యౌచిత్యభంగకరముగా నున్నది. అది యటుండనిండు. కేతనపద్యము మూలోపబృంహకము. అతఁ డాసందర్భమునఁ జెప్పక తప్పనిది. స్వతంత్రకావ్యము రచించు నన్నిచోడకవి దీనిని జేర్పకపోయినను బాధలేదు. కేతన పద్యాదరమే నన్నెచోడునిచే నీ పద్య మీరీతి రచింపఁజేసిన దని తోఁచె డిని. ఇట్టివి చూపఁబోయినచోఁ బరశ్శతములు గనఁబడును.

తిక్కన కేతనల కవిత్వములసాదృశ్యమును, - సాదృశ్యమేకాదు అను సరణమును జూపఁ బడినవి. నన్నయ్య సోమనాథుల సాదృశ్యానుసరణములు గలుగుట కైముత్యన్యాయసిద్ధమే. అయినను మచ్చుచూతము.

నన్నిచోడుఁడు

"తే. ఆదిమార్తులు శివశక్తులచలమతులు
హరుఁడు సతియును సురతార్థులై విహీన
తరములగు మృగరూపముల్ దాల్చి రనినఁ
గామమాయలు నెవ్వారు నేమి గారు.
౧, ౧౦౪.

"ఉ. ఆయము లిచ్చు డాజిమొన
కాయము పెంచుట పెక్కుమన్ననల్
నేయుట పోరికిఁ మొనసి
చేయుటగా మది నిశ్చయించుచున్
నాయకుకోర్కి దీర్ప నని
నాయెడ నూఱడి నట్లు బొమ్మనం
జేయిడి నిద్రవోయిరి ని
శిధి భటుల్ సమరంబ కోరుచున్
౧౧, ౪౩. (II. 622)

నన్నయ్య

"ఆ. ఎంతశాంతులయ్యు నెంత జితేంద్రియు
లయ్యుఁ గడు వివిక్తమైనచోట
సతులగోష్ఠిఁ జిత్తచలన మొందుదు రెందుఁ
గామశక్తి నోర్వఁ గలరె జనులు."
'నొంపఁగలరె' పాఠాంతరము.
భార. ఆది. ౭. ౩౮.

"క. వితత ధనుర్విద్యా విదు
షునుఁగర్ణు సహాయుఁ బడసి కౌరవవిభుఁడ
ర్జునువలని భయము నెడి బ్రో,
మ్మునఁ జేయిడి నిద్రవోయె ముదితాత్ముండై."
భార. ఆది. ౬, ౬౩.

ఏ విధమునఁ జూచినను నన్నిచోడుఁడు తిక్కన్నకు సమీపస్థుఁడుగాను, నన్నయ్యకు దూరస్థుఁడుగాను గనఁబడుచున్నాఁడు. సర్వవిధములను గవితలో సాదృశ్యమెంతయో కలదు. వీరేశలింగము పంతులుగారు కవులచరిత్రమున

నీపద్యముల సామ్యమును బట్టియే నన్నయపద్యము నన్నిచోడుఁడు చూచినట్లు నిరూపించిరి.

నన్నిచోడుఁడు.

''సీ. నేలయు నింగియుఁ దాళముల్ వాయింప
నెండమావులఁబట్టి బండతలయు
మ్రోఁకాలు ముడివెట్ట రోఁకటఁ జిగుళులు
గోయఁ జట్రాతిపైఁ గుఱింక నిడుపు
లేక చిత్రములు వ్రాయ నాకాళమున దాఁప
రములిడ మంచు గుంచములఁ గొలువ
నేనుంగు పురుడోమ రా నారఁ గొన గాలి
గంటిక నిసుమునఁగట్టు దాల్ప
నీరినడు [illegible] దెంప నేలఁదె న్నుండి చే
వెల్వఁ గలియుఁ ద్రచ్చి వెన్నఁగొనఁగఁ
గడవ నేర్పుగలిగి కందువ మానెఁడై
కత్తిగొంటు లయిన యత్తగంతు.''

౭, ౧౩౮. (II, 135)

సోమనాథుఁడు

''నెట్టణ నేలకు నింగికి నూత్ర
పట్ట మోఁకాళ్లును బట్టతలలును
ముడిఁబెట్టఁ దననీడ గడవంగఁబాఱి
వడి నెండమావుల కడకాళ్లు గట్టఁ
బాయక (గ?) రెండుగాఁ బాటెడునీరు
వ్రేయఁ బులిజున్ను గోరో యని యమ్మ
రానార యొలువఁ జట్రాతిపైఁ గ్రుంక
నేనుంగుపురుడోయ(మ?) నిసుకత్రాడ్వేయ
లలిఁగొన దిశలు తాళములు వాయింపఁ
జెలఁగుచు ఱోఁకటఁ జిగురులు గోయఁ
గలివెన్నఁ బుచ్చఁ గొండలు దొంతిఁబేర్ప
నిల మంచుఁ గుంచానఁ గొలువరే పగలు
నేయ నాకసమునఁ జిత్రరూపములు
వ్రాయ వాయువుఁబట్టి వడగండ్ల గుండ్లు
గట్టవెన్నెల గుంపుగాఁజేయఁబుచ్చి
పుట్టినప్పుడ నేర్చు బుద్ధులపోలిక
కోలానకత్తియ గొరబఁ ప్రోడ
యాలంబె తల్లిదా నల్లుని జూచి.''

పండితారాధ్య చరిత్ర, పురాతన ప్రకరణ,
౧౨౧ పొరట. మలహణుని కథ.

ఇట్టివి [1]తిక్కన కేతనల గ్రంథములనే కాక, తర్వాతి గ్రంథములగు మల్హణచరిత్రాదులలోను గాన నగును. [2]కన్నడమునను గనుపట్టెడి.

1. సీ. ''నేలయు నింగియుఁ దాళముత్ గాఁజేసి
యేపునరేఁగి వాయించి యాడఁ
గుల పర్వతంబులు గూల్చి యొండొంటితోఁ
దాఁకంగ వీఁకమైఁ దన్నియాడ'' భారత. విరాట. ౨, ౧౩౩.

2. ''ధరణీచక్రముమం వియత్తళముమం గంటికిక్కువర్ ముంచిన,
చ్చరి యప్పంతుఱ డొందుమాడి పెణెవర్ కల్లల్లి నారెత్తువర్
త్వరితం బిన్నణదిం బిసిల్గుదిరె యింతం దేఱువర్ మేరువం
భరదిందం పిడిదెత్తువర్ మళలాళం నీర్గాడువర్ జోడెయర్.''

నయసేనకృత ధర్మామృతము.

ఆశ్వాసాద్యంతములందుఁ జేసిన రచనను బరిశీలించినను దిక్కన కేతన నన్నిచోడుల కావ్యములలో సాదృశ్యము స్పష్టముగాఁ గనఁబడుచున్నది.

ఆశ్వాసాద్యంతరచన

తిక్కన నిర్వచనోత్తరరామాయణమున ద్వితీయాది ప్రత్యాశ్వాసాది యందును మొట్టమొదటి పద మేవిభక్తితో నుండునో యా విభక్తిఁ జేర్చిన పదములతోఁ దదశ్వాసాదియందును తత్పూర్వాశ్వాసాంతముననుజేయు కృతి పతిస్తుతిపద్యములు రచించుట గలదు. ద్వితీయాశ్వాసాది పదము "శ్రీరామ చంద్రుఁడు" అనునది. దాని ననుసరించి ద్వితీయాశ్వాసాదినిఁ బ్రథమాశ్వా సాంతమునను గల కృతిపతిస్తుతి ప్రథమాంతపదములతోనే కూర్పఁబడినది. పంచమాశ్వాసాది పదము 'శంభునిచే' అనునది. దాని ననుసరించి పంచమా శ్వాసాది చతుర్థాశ్వాసాంతములందలి కృతిపతిస్తుతి తృతీయాంతపదముల తోనే రచింపఁబడినది. ఈ రీతిగా నొకచోట షష్ఠియు, నొకచోటఁ జతుర్థియు నుపయుక్తములు.

భారతమునఁ బ్రత్యాశ్వాసాదియందును 'దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె' నని యుండుటచేత, నందలి కృతిపతిస్తుతి సంబుద్ధ్యంత ములతోనే రచింపఁబడినది. నిర్వచనోత్తరరామాయణపద్ధతి కేతనదశకుమార చరిత్రయందును గలదు. అదేరీతి నన్నిచోడుని కుమారసంభవమునఁ గలదు గాని, యొకచోట భేదము గనఁబడుచున్నది. ఆశ్వాసాది పదము ననుసరించి యున్నట్లే యాశ్వాసాంతపదము ననుసరించియునదిగలదు-తృతీయాశ్వాసాంత మున 'గిరిజపూజించె బసిఁడితామరలవరదు' అనునదిచివరది. 'వరదు'నుదాని ననుసరించి ద్వితీయాంతపదముతో నచటఁ గృతిపతిస్తుతి రచించెను. చతుర్థా శ్వాసాదిని 'ఇట్లు పార్వతి పరమభక్తియుక్తిం దగిలినిరంతర శుశ్రూషా తత్పర యగుచుండ నంత' అని యున్నది. లేదా 'వరదు' అనునది చివరఁగలపద్యము చతుర్థాశ్వాసమున మొదటిదిగా గ్రహించిన సరిపడును.

మఱియు, నాశ్వాసాదిపదమునుబట్టి కాక,యాశ్వాసాది పద్యమునఁగాని గద్యమునఁగాని గల యీశ్వరవాచకమునుబట్టి కృతిపతిస్తుతి రచించుటయుఁ గలదు. "హరిపరమేష్ఠిపురందరాద్యమరసహితుండై న యీశ్వరు హిమవం తుండు సుప్రభాతార్చనావిధి నభ్యర్చితుంజేసి" అనుదానిలోని 'యీశ్వరు' అనుదాని ననుసరించి తత్పూర్వకృత కృతిపతిస్తుతి యున్నది.

వాక్యమధ్యమున నాశ్వాసము ముగించుటయుఁ గలదు. నవమా శ్వాసాంతమున "మహాప్రసాదంబని వీడుకొని నిజాంతర్గతంబున" అనియు, దశమాశ్వాసాదిని "దహనాంబకుఁ దలఁచి" అనియుఁ గలదు. నడుమఁ గృతి పతిస్తుతి ద్వితీయాంతసహితము. వాక్యమధ్యమున నాశ్వాసము ముగించుట

కేతనకావ్యమునను గలదు. దశకుమారచరిత్ర పంచమాశ్వాసాంతమున "క ...నరనాయకు పాలికిఁగొని చని నిశ్శంకత, నకుటిలమతి వ్రాలెఁ దత్స భాంతరభూమిన్" అనియు, షష్ఠాశ్వాసాదిని "వ. అతని కిట్లని విన్నపంబు సేయుము" అనియుఁ గలదు. దాని ననుసరించి యందలికృతిపతిస్తుతి షష్ఠ్యంత పదములతోఁ గవి రచించెను.

కృతిపతులకును దత్తత్కథా సందర్భోపస్థితపురుషులకును శ్లేషమూల మునఁగాని, యభేదోపచారాది మూలమునఁగాని సరిగానన్వయించుట యట్టి ప్రయోగములవలన నూహ్యము. ఆ పక్షమున నుత్తరరామాయణమునఁ నాశ్వాసాద్యంతములఁ గొన్నిచోట్ల రావణవిద్యుజ్జిహ్వాదులప్రసంగము గలుగుట యంత మనోహరముగాఁ గనఁబడదు. కేతనకావ్యమునఁ గృతిపతికి రాజవాహనాదులతో నభేదము సూచించుట సరసముగానే యున్నది. నన్నిచోడుఁడు కృతిపతి కథానాయకుల కభేదమున్స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు గానఁ గృతిపతిస్తుతి కనుకూలముగాఁగథానాయిక ప్రసక్తివచ్చినచోటనే యాశ్వాసాంతము గావించినాఁడు. నన్నిచోడుఁడు కాళిదాసకుమారసంభవము నందలి సర్గమున కొకయాశ్వాసముగా రచించినచోటఁగూడఁ గథానాయక ప్రసంగము వచ్చుటకై కొంచెము పెంచియుఁ గొంచెము త్రుంచియు నాశ్వాస విభాగముఁ జేసినాఁడు.

నిర్వచనోత్తరరామాయణముకంటె దశకుమారచరిత్రయు, దానికంటెఁ గుమారసంభవమును నీవిషయమున సముచితతరసంవిధానము గలవని చెప్పవచ్చును. నన్నిచోడునిపద్ధతిని దిక్కన చూచియున్నయెడల నిర్వచనోత్తరరామాయణమందలి యాశ్వాసవిభాగము నున్నదానికంటె వేఱుగాఁ జేసియుండు నని నాభావము.

ఆశ్వాసాంత చ్ఛందస్సు

ఆశ్వాసాదియం దండలును గృతిపతిస్తుతి కందముతోఁ జేయుట కలదు. ఆశ్వాసాంతపద్యచ్ఛందస్సులలో నొక్కొకరి కొక్కొకపద్ధతి గనఁబడుచున్నది. అందులను నొకనియమము గాననగును.

సాధారణముగా సంస్కృతకావ్యములందును సర్గాంతశ్లోకము విశేష చ్ఛందముతో రచించుట గలదు. అట్లే, నన్నయ్య యాశ్వాసాంతములందు మాలినీవనమయూరాది విశేషవృత్తములు రచించెను. తత్పూర్వమొకకందము చేర్చుట కలదు. కావున నాశ్వాసాద్యంతములఁ గందములనుచేర్చి చిట్టచివర నొక విశేషవృత్తము రచించుట నన్నయ్య భారతమున సామాన్యనియమము. ఆదిపర్వప్రథమాశ్వాసాంతమునఁ గందమునకుఁ బూర్వ మొక సాధారణ వృత్తమును సభాపర్వాంతమున రథోద్ధతవృత్తమును విశేషముగానున్నవి.

ఆ పద్ధతి ననుసరించియే కాఁబోలును తిక్కన్న తన గ్రంథములందు నొకవృత్తము నొక కందము నొకమాలినియు నియతముగా రచించెను. కేతన దానినే యనుసరించెను. ఎఱ్ఱాప్రగడ భారతమున నన్నయ్యవలె రచించి నను నృసింహపురాణమునఁ గందము వృత్తముఁ గందము విశేషవృత్తము గలుగునట్లు రచించెను.

నన్నిచోడుఁడు వృత్తముఁ గందము వృత్తముఁ గందము నొక మాలిన్యాది విశేషవృత్తము గలుగునట్లు రచించెను. ఈతఁడు తిక్కనరీతి నినుమడింపఁ దలఁచి నట్లున్నది. తిక్కన చిట్టచివర మాలినియే వాడినను నన్నిచోడుఁడు నన్నయ్యవోలె మాలినియేకాక వనమయూరాదులు నుపయోగించెను. ఈ రచనయందుఁ గ్రమాభివృద్ధి గనఁబడుచున్నది. ఈ దృష్టితోఁ బరిశీలించినచో నన్నిచోడుఁడు తిక్కనకేతనలకంటె నభివృద్ధిచేసినవాఁ డనవలెను. సోమనశ్రీనాథాదులును దర్వాతి కవులును దిక్కన ననుసరించిన వారే కాన, వారి రచననుబట్టి విప్రతిపత్తి పరిగణింప నక్కఱలేదు.

మొత్తమున నన్నిచోడుని కావ్యమునఁ దిక్కన కేతన కావ్యముల సాదృశ్యమేకాక కొంత యనుకరణమును గనఁబడుచున్నది.

ఇంక షష్ఠ్యంతము లని వాడఁబడు రచనావిశేషము పరిశీలించిన నందును దిక్కన కేతన కావ్యములసాదృశ్యము కుమారసంభవమునఁ గనఁబడును.

షష్ఠ్యంత రచన

అభీష్ట దైవ వాచకపదమునకో మహాపురుషవాచకపదమునకో కొన్ని విశేషణములు చేర్చినపుడు విశేష్యమున కున్న విభక్తియే విశేషణములకుఁ జేర్చుట యొక సంప్రదాయము. సంస్కృతమున విశేష్యమునకుఁ బోలెఁ దద్విశేషణమునకును దత్సమానవిభక్తిప్రత్యయము జేర్చుట గలదు. తదనుసారియే పయి తెలుఁగు సంప్రదాయము. కొన్నిచోట్ల విశేషణములను బ్రథమతోఁ గూర్చి తద్విశేష్య మేవిభక్తితో నున్నను 'అగు, అయిన' మొదలగు పదములుచే నన్వయము గూర్చుట గలదు. విశేషణములు ప్రథమాసహితము లయినను అగు, అయిన మొదలగు పదముల యన్వయము లేకయే షష్ఠీ ప్రత్యయాంతముతో నన్వయించుట కొన్ని ప్రయోగములలోఁ గలదు.

దేవతా కృతిపతి స్తోత్రాదులయందు సందర్భమును బట్టి ప్రథమా ద్వితీయా తృతీయా షష్ఠీ ప్రభృతి విభక్త్యంతము లుండును. ఇవి దేవతా

స్తోత్ర[1]నామావళి వంటివి. ఈ క్రింది శాసన భాగములు చూచిన వీని ప్రయోగ రీతి తెలియును.

"వరశక వర్షంబు లుడు వల్లభ తర్క ఖేందు సంఖ్యగా... ...నాదిండ్ల అందు ప్రసిద్ధిగ శూలపాణికిన్.

క. వ్యాలేభచర్మధారికి, మూలస్థానంబునాదిమూర్తి శ్రీకా,
పాలికి మృడునకు హరునకు నీలగ్రీవునకునీశునికి సుమపతికిని.

క. స్థిరమతి గడియమదేవులు, దిరమై యుండంగ నఖండదీపము నిలిపెన్.
దరతర మున్నతముగ నీ (నా?) ఖరకర జలజారి తారకముగ ధరిత్రిని[2]."

"తన్మూలస్థానమునం బుణ్యమూర్తికి భాస్వద్వ్యాలాక్షివహ్నిదగ్ధ వ్యాలాంగ భవాంగునకు మహాదేవునకున్.

ఇంద్రారాధ్యున కాదిదేవునకు బాలేందు... ...చంద్రార్కంబుగా దీపిక నిల్పె నుత్సాహంబుతోన్[3]."

మఱియొకచోట నొకపురుషశ్రేష్ఠుని వర్ణించుచుఁ దృతీయాంతములుగా రచించినవి గలవు.

"శ్రీ[4] కాంతాకాంతుచే నాశ్రితబుధజనాభిస్థిరప్రాజ్యరాజ్యశ్రీ కాంతా కాంతుచే... ....

... ... ... ...మృగా రాతిచేన్"

"పరనరపాలమాలి... ...త్రిదశేంద్ర నిశాత హేతిచేన్, సురకరిపతి ...యశోభానురనిధిచే సుకవితరణిసురనిధిచేతన్, సరనిధి...బుధ విస్తరు చేత నన్నకుండా పురనాథుండైన రుద్రభూపతి చేతను.

---

1. ఇట్టివిశేషణములను నామావళి యనిపేరు యొక శాసనమున వాడినారు. "వ.ఇట్టి శ్రీ కొంకరాజుల కిష్టభృత్యుఁడైన (స) రయణనామావళి యెట్టిదె.

ఉ. శ్రీ విలసద్విలాసజి (త) జిష్ణునిచే నహిసీమ కిష్ణుచే
దేవ సమానుచేత నరదేవశిఖామణి చేత ధాన్య వా
టీనర వృత్తిశాసన పటీయశి నాంటగి మేలు నాయక
శ్రీవిభుఁడొప్పెం బోఁయ వశీకృత సజ్జన లోకుండై భువిని".

ఇది (శ. స. ౧౦౮౩.) నరసారావుపేటతాలూకా తిమ్మాపుర గ్రామమునకు త్తరమున నున్న తాళిస్తంభము మీఁద చెక్కఁబడియున్నది. అని మ॥ రా॥ శ్రీ జయంతి రామయ్య పంతులుగారు వ్రాసిరి. శాసన పద్య మంజరి. ౫ వ పుట.

2. South Indian Inscriptions. Vol. IV. No. 672.

3. South Indian Inscriptions. Vol. IV. No. 675.

4. తెలింగానా శాసనములు. కరీం నగర శాసనము. 14 పుట. శక వర్షంబు ౧౦౮౪.

వెలయ సమాత్య సంపదయు విశ్రుతమైన నియోగ వృత్తులం, దలమశితాలిపత్రము లతర్క్యవిభూషణలేపనాంబరం, బులుందగు వృత్తులుం బడసి భూసుర వర్గముం బోషించి దేవతా, నిలయములతి (లందు?) బెక్కొనర నిల్పుచుం బూజలు బ్రీతిం జల్పుచుక్."

కొన్నిచోట్ల నితరవిభక్తులతోను గలవు. ఆశ్వాసాద్యంతముల స్తోత్రములు సర్వ విభక్తియుతవిశేషణములతోను గూర్పఁబడుట లేదా ? అట్లే యివియు నున్నవి. ఇవి సాధారణముగా నారాధనలయం దుపయోగించు స్తోత్రనామావళివలె భక్త్యతిశయానుసార ముపయోగించుట యొకయాచారమయి యుండును. కావుననే తిక్కన విరాట పర్వాదిని "ఈ దృశంబులగు పుణ్య ప్రబంధంబులు దేవ సన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషం బగుటంజేసి, క. ఓంకారవాచ్యునకు ... ... భక్త పరతంత్రునకున్. ఏను విన్నపంబు సేయు తెఱంగుగా నతస్సన్నిధిం గల్పించుకొని యమ్మహాకావ్యంబు సంగతంబుచేసెద." అని రచించెను. పుణ్య ప్రబంధము వినిపించుట యొక విధమగు నారాధనము. అట్టి యారాధనము చేయుటకు మన మున సన్నిధానము కల్పించుకొని తా నెవనికి విన్నపంబు సేయఁ దలఁచెనో వానిని స్తుతించి యాతని నామావళి షష్ఠ్యంతములతో నుపయోగించెను. ఈరీతి దేవతా దీపదానాదులం దుండుట యాచారమయి యుండఁగా గావ్యారంభమున నిట్లుచేర్చుట యెట్లు అను సంశయమును దీర్ప నా పద్ధతిని సమర్థించుచు నిదియొక యారాధన విశేష మనుకారణము చెప్పుటచే నీరీతి తిక్కనోపజ్ఞ మని స్పష్టమగుచున్నది. నిర్వచనోత్తర రామాయణమునఁ గృతిపతి యగు మనుమజనవిభుని వర్ణించుచు "ఒక్క రూప కాని యెక్కుడు డిగ్గను గానరాదు ముఖవికాసమునకు, నన్యరాజు లీడ యరిరాయవేశ్యాభు, జంగుడైన మనుమజన విభునకు.

"క. అమ్మనుమనృపతి కభ్యుద
యమ్ముగనేఁ జెప్పఁ బూని నట్టి కథకు నా
ద్యమ్మయి యయోధ్యయను నా
మమ్మునఁ నెగడిన పురోత్తమము వర్ణింతుక్."

అని యున్నది. మనుమజనవిభునకు నన్యరాజు లీడుగారు. అని చెప్పి యా మనుమనృపతి కభ్యుదయ మగునట్లు నేఁ జెప్పఁ బూనిన కథకు ... అనునపుడు మనుమనృపతికి అనుదానకి విశేషణములు వేఱుగాఁ బ్రయోగింపలేదు. కావున, నిచట షష్ఠ్యంతము లనఁబడునవి లేవు. ఆ రీతిని దేవతారాధన విషయముననే కాని, కేవలము మనుజుని స్తుతించుచోట నుపయోగించుట తిక్కనకు సమ్మతము కా దని తోఁచెడిని.

కేతన దశకుమార చరిత్రమునఁ బ్రథమాశ్వాసాంతమునఁ గృతిపతి యగు తిక్కన్నను వర్ణించి 'ఈదృశగుణభూషణునకు ... సతతశుద్ధాత్మునకున్.' అని పదునొకండు పద్యములలో గుణస్తోత్రనామావళి ద్వితీయాశ్వాసాది నున్న షష్ఠీ విభక్త్యంతపదానుకూలముగా షష్ఠ్యంత సహితముగాఁ గావించి ద్వితీయాశ్వాసాదిని "శ్రీ శ్రితవత్సునకు సుదా, త్తశ్రౌత ... తిక్కనామాత్యునకున్. వ. అభ్యుదయ పరంపరావృద్ధిగా నా చెప్పం బూనిన కథా ..." అని కూర్చెను. తిక్కనామాత్యున కభ్యుదయపరంపరాభివృద్ధి కలుగునట్లు నా చెప్పఁ బూనిన కథ అను సందర్భమున షష్ఠ్యంత ముపయోగించినాఁడు. ఇచట నాశ్వాసాంతమును షష్ఠ్యంతమును గలసిపోయినవి గాని, యాశ్వాసాంతములం దుపయోగింప నుద్దేశించిన వృత్త కంద మాలినీ పద్యముల నుపయోగించి తత్పూర్వముకందములతోఁ దిక్కనను స్తుతించుట యేర్పఱచికొన్నాఁడు.

నన్నిచోడుఁడు గూడ నదే సంప్రదాయము ననుసరించి 'సద్గురుండైన జంగమ మల్లికార్జునదేవునకున్ క. శ్రీకంఠమూర్తి కమల శ్లోకునకు ... ... మల్లికార్జున మునికిన్. వ. పరమభక్తియుక్తి నావర్జితహృదయుండనై సకల భువన భవనావతార కారణుండైన పరమేశ్వరు నవతారం బగుటయుం దదంశావతారంబుగా వ్యావర్ణించి నా చెప్పంబూనిన దివ్యకథా సూత్రం బెట్టిదనిన' అని రచించెను. ఇం దెనిమిదిపద్యములలో షష్ఠ్యంత నామావళి రచింపఁ బడినది. తిక్కన కేతనల సంప్రదాయముననే కావ్యారంభమున షష్ఠ్యంత స్తుతి యితఁ డవలంబించినాఁడు. ఈ రీతిగఁ దిక్కన త్రోవ ననుసరించినవా రా కాలముననే మఱికొంద ఱుండియుందురు. ఈ రీతి నన్నిచోడుని రచనవేళకు క్షుణ్ణమయి యుండును. కావుననే తిక్కన భారతమున సమర్థింపఁ బూనినట్లు సమర్థింపఁ బూన నన్నిచోడున కావశ్యకత యేతోఁపలేదు. కృతిపతికిఁ బరమేశ్వరునకు నభేదము స్పష్టముగాఁ జెప్పినను కావ్యవిషయము విన్నపము చేయునపు డట్టిసమర్థనము చెప్పలేదు. మల్లికార్జునున కావర్జిత హృదయుండనై చెప్పఁ బూనిన అనుదానిలో మల్లికార్జున విశేషణములు క్షుణ్ణమార్గము షష్ఠ్యంతమున లుపయుక్తములయ్యె. కావునఁ దిక్కనయే కావ్యారంభమున షష్ఠ్యంతములనుపయోగించుటకు మూలపురుషుఁడుగాని, నన్నిచోడుఁడు గాఁడని తోఁచుచున్నది. మునుపు మనవారు షష్ఠ్యంతములు తిక్కనోపజ్ఞము లనుచుండెడివారు. [1]ఈ నడుమఁ దన్మూలపురుషత్వము నన్నిచోడునికిఁ గట్టిపెట్టిరి. అది సమంజసము

1. "ఇతఁడు (నన్నిచోడుఁడు) తన పుస్తకమునందు సుకవిస్తుతియుకుకవినిందయు షష్ఠ్యంత పద్యములును వేసియున్నాఁడు. వీనిని వేయుటలో మొదటివాఁడని యింతవఱకును తిక్కన సోమయాజికి వచ్చిన ప్రతిష్ఠ యిప్పు డాతనినుండి తొలఁగి యీతనిని జేరుచున్నది." వీరేశలింగము కవుల చరిత్ర. ప్రథమ భాగము: 197. పుట.

గాదు. తిక్కనకల్పన యనుటకుఁ దాను చేసిన సమర్థనము సాక్ష్య మిచ్చు చుండఁ నాతని మూలపురుషత్వము పరులపాలు చేయు నేల?

మొత్తముమీఁదఁ దిక్కన్నసాదృశ్యమే కాక తదనుసరణము గూడఁ గుమారసంభవమున స్పష్టముగఁ గన నగుచున్నది. ఇంక యుద్ధపద్ధతియందుఁ గల సాదృశ్యము చూతము.

యుద్ధవర్ణనము

నన్నిచోడుఁడు సంస్కృత కుమార సంభవ పూర్వోత్తర భాగముగూడఁజూచి కొంత యనుసరించినను దేవాసుర యుద్ధవిషయమున దాని ననుసరింపక భారత ఫక్కి ననుసరించినట్లు కనఁబడుచున్నది. పురాణములయందును గుమారతారకుల యుద్ధములు వర్ణింపఁ బడినవి గాని, వాని ఫక్కి వేఱుగా నున్నది. ఇది దేవ దానవ యుద్ధమయినను మానవయుద్ధమునఁబోలె నిందు వర్ణనలు గలవు. దేవసేనలలో నిత్యాఁకుఁడు మానవుఁ డున్నను రాక్షససేనలో మానవులు లేరు. రాక్షస సేనలో యుద్ధరంగంబునఁ బడియున్న భర్తలఁజూచి దుఃఖించు స్త్రీల వర్ణనము భారతస్త్రీపర్వవర్ణనానుసారిగానే యున్నది.

దేవతాస్త్రీలకు బాష్పోద్గమము, నిద్ర, మరణము మొదలగు మానవ చిహ్నాలు చూపఁబడినవి. కొన్నిచోట్ల నమర్త్యత్వము స్పష్టపఱచు వర్ణనలును గలవు.

సంగ్రహముగాఁ దద్విషయము గ్రహించినచో దాని ఫక్కి స్పష్టపడును.

ఈ యుద్ధము మూఁడు దినములు జరిగిన యుద్ధము. దేవతలు పరమేశ్వరానుగ్రహమునఁ గుమారుని సేనానాయకునిగాఁ బడసి, తారకుపై దండెత్తఁబోవఁ జక్రపాణి "వాని నెఱింగించి పంపక పైఁజను టనుచితం బనిన" రాయబారముఁ బంపిరి. అందు సంధి విగ్రహోక్తులలో "భక్తిఁగీడ్పడి సేనాని పనుపుసేసి, తడవు లేదేనిఁ గలిగిరే నడువు మొండె, సెఱవుసేయక దివిజుల చెఱలులేక, విడువు మొండేని మన్నాన విడువు మొండె" యనిదేవదూత చెప్పెను. అప్పుడుతారకుఁడు "విడు మని వేఁడనావలన వేల్పులు ముందఱ వీరిఁదెచ్చియుఁ, ల్లడయిడిపోయి రే భుజబలంబున నెమ్మెయినాఁచి కొంటినే, యడరఁగ దారు నెమ్మెయి రయంబునఁగ్రమ్మఱఁ గొంటయొప్పుగా, కడుగుట యొప్పునే యడిగినంతన యిచ్చుట నాకు నొప్పునే" అన దేవదూత కుమారు విశేషించి తారకు నిరాకరించి బలుకఁ దారకుఁడు వాని వధింపఁబోవ దూతవధ కూడ దని శుక్రుఁడు నివారింపఁ దారకుండు దేవదూతం దోలించి పొమ్మనెను. అంతఁ దారకుఁడు పంపినదూత కుమారుని సభ కరిగి తారకు విశేషించి చెప్పిన వానిం బరిభవింప నెత్తిన గణముఖ్యులను నచ్యుత ప్రార్థి

తుఁడై కుమారుఁడు వారించి దానవదూతను సత్కరించి తారకుఁడు సెప్పి పంపిన హిమవంతంబు నుత్తరంబునఁ గలను జరుపుట కొప్పుకొని పంపెను. ఇది భారతములోని రాయబారమును, రెండు పక్షములవారి చర్యలను బోలియున్నది. వీరభటులును దత్పత్నులును శిబిరంబుల విడిసినప్పుడు స్త్రీల సంభాషణములును వియోగము గల్గునని పడిన వేదనలును వీర పురుషుల మనోనిశ్చయంబులును సర్వత్యాగమును వీరసన్యాసంబును గన్నడమందున్న పంప భారత గదాయుద్ధాదుల ఛాయలను సూచించును. కన్నడమందలి సాదృశ్యముఁ జూపినచోటఁ గొన్ని పద్యములు మాత్రము చూపఁబడినవి.

నాయక ప్రతినాయకులు తమతమ వీరభటులతో యుద్ధసన్నద్ధు లయి రణరంగంబునకు వచ్చి, ఘూర్ణిల్లుచున్న సమయంబునఁ "తారకుఁడు సుర నరోరగ గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాద్యఖిల భువన భవనాధీశ్వరులు పూర్వపరిచితులైనం దదీయానంతైశ్వర్య ప్రభావిభాతిశయంబుల భేదింపనేరక విభ్రాంతాంతరంగుండగుచుఁ బన్ని నిలిపిన గీర్వాణానంత సామంతు లెవ్వ రెవ్వరిందుధరనందనుం డెవ్వం" డని దనుజ గురు నడిగినం గని, వారి భావించి, చూచి [1] వీ రేకాదశరుద్రులు, అష్టవసువుల్ వీరు .. అని వారి వారిం జేకొని చూపెను.

దేవతాసేనలోఁ "గుమారుండు సమరగురుం గనుంగొని యీ పన్ని నిల్పిన దనుజ సామంతు లెవ్వ రెవ్వ రిం దుం దారకాసురుం డెవ్వం డెఱింగింపు" మనిన మహాప్రసాదంబని [2] "కాలనేమి యితఁడు ... ఉగ్రదంష్ట్రుఁ డితఁడు ... వాఁడుచిరుండు ..." అని వారివారిం దెలిపెను.

ఇది భారతయుద్ధాదిని నర్జునుఁడు కృష్ణునితో "తే. కౌరవులలోన నివ్వఁడెవ్వారితోడ, ననికిఁ గడఁగుదునో చూచికొనఁగవలయు" నని యడుగుటను గృష్ణుఁడు నీ వీకూడిన కౌరవులం జూడు మని చూపుటను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

ఇందొక్క విశేషము నన్నిచోడుని సూక్ష్మ పరిశీలము నుద్ఘోషించుచున్నది అదేదన ?

తారకుఁడు కుమారు నొకని నెఱుఁగ కున్నను మిగిలినవారి నెఱుఁగఁడా యట్లడుగనేల యను శంకను గలిగించుకొని తత్పరిహారము చేయఁదలఁచికాఁబోలు "పూర్వ పరిచితులైనఁ దదీయానంతైశ్వర్యప్రభావిభాతిశయంబుల భేదింపనేరక" యడిగినట్లు సయుక్తికముగా సమర్థించినాఁడు.

అంతఁ గుమార తారకులు విజృభించి చేతులు వీచిన నుభయ పక్షములవారును దాఁకిరి. అంత ఘోరయుద్ధ మయ్యె. ఆ భయంకర సంగ్రామ

1. చూ. ౧౧, ౭౬ మొ. ౯౯ వఱకును.

2. చూ. ౧౧, ౧౦౦ మొ. ౧౦౩ వఱకు.

మున వికలములగు రూపులతో సేనలు గూలెను. ఈ సంకులయుద్ధమున రూపులు సెడినవారి వర్ణన భారతయుద్ధమున ద్రోణపర్వమున రూపులు సెడి పడినవారి వర్ణ[1]నలకుఁ బుత్త్రికగా నున్నది.

అనంతరము చిత్రవధములును, నట్టలాడుటయు, రణరంగమునఁ బడిన పతుల యవయవములు ప్రోవుచేసి, పొడవులుగాఁ గూర్చి వీరపత్నులు దుఃఖించుటయు, గ్రద్దలాడుటయు, బిశాచములు నృత్యము చేయుటయు మొదలగునవి స్త్రీపర్వ భాగములను బోలియున్నవి. ఇదియుఁ దిక్కన భారతసాదృశ్యము చూపుచోటఁ జూపఁబడినది. అనంతరము సూర్యాస్తమయ మగుటయు శిబిరంబులకుఁ బోవు వీరులు పడిపోయిన బంధుమిత్త్రాదులను దీసికొని పోయి రాత్రియందు దివ్యౌషధ ప్రయోగంబుల విశిఖవేదనావిముక్తులఁ జేయుటయు స్వభావద్యోతకముగా వర్ణింపఁబడెను.

ద్వితీయ దివసయుద్ధము

రెండవనాఁ డుభయబలంబులను గుమారతారకులు చేయివీచుటయు నుభయసేనలలోని వీరులు మార్కొనుటయు వర్ణితములు. అందుఁ బ్రతిపక్ష గజబలంబును జంపుటకుఁ బవనుఁడు కుదిరెను. ఇది భారతమునఁ బవనతనయుఁడు (భీముఁడు) గజయుద్ధమున కుదిరిన ట్లున్నది. మాయాయుద్ధము చేయునారుణికి దిక్పతులలో నొకఁడగు నిరృతి సరిపడినాఁడు. జంభాసురుఁడును సురవల్లభుఁడును, నరకుఁడును హరియును మొదలగువారు బలప్రతిబలములనుండి కదిసి పోరు భయకరము గావించిరి. తుదికిఁ దారకకుమారులు కదిసి యుద్ధము చేయునపు డమరేంద్రాదులు భయమంది కంపమొందు తఱిని[2] గుమారుఁడు "దృష్టిముష్టి శీఘ్రసంధాన దూరాపాత లక్ష్యవేధాద్యనేకవిధ ధనుర్విద్యాకౌశలంబు మెఱయం దొడం"గెను. అందలి ధనుర్విద్యాకౌశల మీరీతి వర్ణింపఁబడెను.

"క. దొనఁగోల గోలవేగం,
బున నరిఁగొల్పుటయుఁ దిరుపుఁబోరిఁ బోరి విడుపుం,
జనుటయు దనుజులఁ గొనుటయు,
ననిమిషులకు నైనఁ గాంచ నరుదయ్యె ననిన్."

క. దొనపై గొనయముపై నో,
లినవడి నెడతెగక యంగుళీయక ఖచితో

1. చూ. ఇందే తిక్కన సాదృశ్యము చూపినచోటు పుటలు 126, 127, 128.
2. చూ. ఇందే. పుట. 131.

ర్వనుపమ వరరత్నోజ్జ్వల
వినుతద్యుతు లెసఁగెఁ గోర విలిచినభంగిన్."

౧౩, ౧౫౭. (II. 939.)

కవిరాజశిఖామణి ధనుర్విద్యాకౌశల మిందుఁ గూర్చి చూపినాఁడు. ఇది దేవదానవయుద్ధమయినను మానవయుద్ధమగు భారతయుద్ధముకంటె నెక్కువగా మానవసహజవర్ణనలతో నిండియున్నది. " అంత సామంతులెల్ల, నస్తమించిరి. రవియును నస్తమించె." మహాసేనుఁడు నిజశిబిరంబునకు బృందారకానందకరుండయి పోవుచుండె. తారకుఁడు పరిమితపరివారముతోఁ బోవుచు వీరస్త్రీ విలాపంబులు వినెను. " ఇట వీరస్త్రీ విలాపములు భారతస్త్రీపర్వస్త్రీవిలాపమును బోలియున్నవి.

**మూఁడవనాఁటి యుద్ధము.**

తారకకుమారులు నిజబలంబులకుఁ జేయివీచిన వారు మహాఘోర సంగ్రామము గావించిరి. ఇందుఁ గుమారగజమును దారకగజమును జేసిన యుద్ధము ద్రోణపర్వమందలి యేనుఁగులు వీటతాటము సేయుటను జ్ఞప్తికిఁ దెచ్చును.

అంతఁ దారకాసురుఁడు విజృంభింపఁ గుమారుఁ డాతని మదమడఁగ నేయ 'దానవేంద్రుండు నిజభుజబలాయుధాఖిల విద్యాబలంబుల నిర్జింపనేరక తన యాపద్ధనంబగు రాక్షసమాయాబలంబుల నిర్జింప నుద్యుక్తుఁడై పిడుగులయి తాఁకుట జడనిధులై ముంచుట మొదలగు నానావిధ మాయా ప్రయోగంబులు ప్రయోగించి యుపద్రవకరుండుగాఁగఁ గుమారుఁడు హర చరణస్మరణపరిణతాంతఃకరణుండై దానికిఁ బ్రతీకారంబుగా దివ్యశక్తిని బ్రయోగించెను. అంత దానవారి మాయలన్నియు నదృశ్యము లయ్యె. తుది కాశక్తిచేతనే తారకాసురుఁడు గూలెను.

ఇందుఁ గల భారతసాదృశ్యములఁబట్టి సంస్కృత భారతానుసరణము గలదని యూహింపవచ్చునుగాని, ఆంధ్రభారత కర్ణాటక భారత (విక్రమార్జున విజయ) సామ్యము లుండుటచేత, వ్యాసభారతయుద్ధవర్ణనమును నన్నిచోడ కావ్యయుద్ధవర్ణనమును నేకాంతరితములై యున్నట్లు స్పష్టమగుచున్నది.

నన్నిచోడుఁడు దన కావ్యమున నంగరసముగా గ్రహించిన వీరరసమున కుల్బణము గలిగింపఁ దదంగములుగా శృంగారరౌద్రభీభత్సకరుణములు సందర్భోచితముగాఁ జేర్చి కావ్యము రసవంతముగాఁ గావించినాఁడు.



K—19

# పంచమ ప్రకరణము

కాళిదాస కుమారసంభవమునఁ బార్వతీ పరమేశ్వర సంయోగాంతకథ తోనే శృంగారరససిద్ధి యయినదనియును బయి కథ గలిపినయెడల రసభంగ మగుననియు మున్ను చెప్పఁబడినది. తారకాసురవధాంతకథ రచించిన నన్నిచోడుఁడు వీరరస మంగముగాను శృంగారరసము ప్రధానముగాను గావ్యము రచించునపుడు రసపోషణ మెట్లు చేసెనో చూతము.

**రసపోషణము.**

ఇందు నాయికానాయకులు సతీపరమేశ్వరులు. వారే శివశక్తులు. వారి సంయోగశృంగారమును విప్రలంభశృంగారమును మరల సంయోగశృంగార మును వర్ణించుట కనువుగాఁ గాళిదాసకథకుఁ బూర్వాపరములఁ గొంత కథ కలుపుకొన్నాఁడు. కొంత కల్పించుకొనెను. అది సవిమర్శముగాఁ బరిశీ లింతము. మూలవాక్యములనే కథాను సంధానప్రకారము కూర్చుకొనుచుఁ జూతము.

"పరమేశ్వరుండు దాక్షాయణీ మనోహరాకార వరయౌవన భావహావ విలాస విభ్రమ సౌందర్యగుణంబుల కంత కంతకనురక్తుండై — క. మాటలఁ జెయ్వుల బేటం, బేటముగా నలవరించె నెనఁగఁగసతి లా, లాటతటనయనుఁడిం పగు, కూటముల కపూర్వసురత గుణకోవిదుఁడై — ఇట్లియ్యిరువురు నన్యోన్య రాగాతిశయంబునం గామకేళీలాలసులగుచు నలి రమించిరి. కైలాసనగము మీఁదఁ బరమసుఖలీల నా జగత్పతియు సతియు." ఆ కైలాసమున జరుగు కరికరిణీరతంబు దాక్షాయణిచూచి, 'కౌతుకరతై కాలీన భావాభిలాషదృగత్యు జ్జ్వలదీధితుల్ పఱపె నీశాననాబ్జంబుపై క. తదవసరంబునఁ బరమేశ్వరుండు నిజజీవితేశ్వరి కన్నెఱింగి దానికి సమ్మతించినం గని సంతోషించి — క. సతి కరిణి యగుడుఁ ద్రిజగ, త్పతి కరియై కూడె' ... .. ఇట్లు పరమేశ్వరుఁడు సతీదేవియు 'సామజకేళీలాలసులై విహరించి రంత సద్యోగర్భంబున. క. [1] పురుషాకారము

1. గణేశపురాణాదులందు గణపతికి గజాననత్వప్రాప్తి బహువిధములఁ జెప్పఁబడినది. నన్నిచోడుఁడు గ్రహించినరీతి యందుఁ గానరాదు. మళయాళమున నొకస్తోత్రమునఁ గల దని యింతే (42 పుట) ప్రదర్శింపఁబడినది. ఈభావము తేవారమను తమిళగ్రంథమునను గనఁబడు చున్నది. చూ. తేవారమ్, పళివలమ్, 815 పుట.

పటుమద, కరివదనముఁ గుబ్జపాదకరములు లంబో,దరము హరినీలవర్ణముఁ, గర మొప్పఁగదాల్చి విఘ్నకరుఁ డుదయించెన్." పయిభాగముఁ బరిశీలింపఁగా నిందలి ప్రధాననాయకుల ప్రేమాతిశయము భోగలోలతయు వర్ణించి, సంయోగ శృంగారము కవి నిరూపించినాఁడు అని స్పష్టమగుచున్నది.

**విప్రలంభ శృంగారము**

వారు గజానను నాడించుచు సుఖస్థితి నుండ దక్షుఁడు వచ్చెను. ఈశ్వరుఁ డాతని నాదరింపఁడయ్యె, అతఁడత్యభిమానియై పరమేశ్వరుఁడు చేసిన యనాదరమునఁ గ్రుద్ధుఁడయి మరలఁ బరమేశ్వరు నవమానింపఁ దలఁచి యొక యాగమునకు సంకల్పముగావించి, యల్లుర నందఱం బిలిపించి, సతీదేవిని రావించి యీశ్వరునిఁ బిలువఁడయ్యె. సతీదేవియెదుట దక్షుఁడు పరమేశ్వరు నిరాకరించుచు మాటలాడ సతి పతినింద సహింపఁజాలక శరీరమును త్యజించెను. సతీదేహత్యాగమున సతీపరమేశ్వరులకు దుర్భర విరహ మేర్పడినది. సతి జన్మాంతరమునఁ బరమేశ్వరునిగూడ నిశ్చయించి మేనక గర్భమునఁ బ్రవేశించెను. అప్పటనుండియు సతీదేవి యభిలాష మీశ్వరుని భర్తగాఁ బడయుటయే కాక, పతి శరీరార్ధభాగము నాక్రమించి శరీరభేదరూపవిరహముగూడ లేకుండఁజేసికొనుటయే. అదియే ప్రేమమునకుఁ బరమావధి. ఆ విషయము కవి కొన్నిచోట్ల బీజముగా నాటి యున్నాఁడు.

గర్భవతులగు స్త్రీల గుణములు గర్భస్థశిశువులకుఁ గలుగును. గర్భస్థ శిశు తేజము బలవత్తర మయినచో శిశుగుణములే గర్భిణులకుఁగల్గును. కావున సతీదేవి గర్భమునఁ బ్రవేశించినదిమొదలు మేనకకు గల్గిన గుణములను వర్ణించుచు

---

"పిడియదన్ ఉరు ఉమై కొళమికు కరియదు
వడికొడు తనదడి వళిపడు మవరిడర్
కడి కణపది వరవరుళినన్ మికు కొడై
వడి వినర్ పయిల్ వలి వలముఱై ఇఱైయే."

తేవారమన దేవహారము; దేవమాలిక, దేవస్తోత్రమాల. అందు వలివలమ్ అను క్షేత్రమందలి దేవుని స్తుతి. ఉమ కరిణీరూపము గైకొన, బహుదాతలుండువలివలపురమునందున్న దేవుఁడు గజరూపము గైకొని తనపాదము సేవించినవారి కష్టములు నివారించు గణపతిని జనింపఁజేసెను. అని తాత్పర్యము. ఇది మలయాళపు స్తోత్రముకంటెఁ జాలఁ బ్రాచీనము. అష్టమశతాబ్ది రచనలోనిది. ఇది ద్రావిడదేశ సంప్రదాయసిద్ధము. అందును గణపతి యుమకు జనించినట్లే యున్నది. అయినను నన్నిచోడుఁడు తన సందర్భమున కనుకూలముగా సతీదేవికి గజాననుఁడు జనించినట్లు రచించెను. ఆతనికి లభించిన కథలో గణపతి సతీదేవికి జనించినట్లే యున్నదేమో. రస పోషణమునకై కలిపిన కథాసందర్భ మతిసరసముగా నున్నది.

"ఉ. ఆ ధవళాయతాక్షి విషమాక్షు సదాశివు మెచ్చఁ గోరు నా
రాధన సేయఁ గోరు నుడురాజశిఖామణిఁ జూడఁ దారభూ
మీధర మెక్కఁగోరు నెడ మేనక మానక భక్తియుక్తి గం
గాధరుఁ గొల్వఁగోరు మది గౌరి మనంబునఁ గోర్కి గూడఁగాన్"

3, ౨౫ (I. 268.)

"... ... గర్భపంజరమున వసియించియును నిజరమణుఁడైన, యీశు నర్ధాంగ మెక్కటి యెక్కనెత్తు,నగజకోర్కులఁ బెనఁగి మేనకయునెలమి" అని చెప్పియున్నాడు.

అంత, సతీదేవి పార్వతియై జన్మించి, యాటపాటలలోఁ గూడ శివు నారాధించుచు శివుఁడు గురుఁడుగాఁగ విద్యలన్నియు నేర్చి, పూర్ణయౌవనాలంకృతయై యొప్పుచుండ, హిమవంతుని సన్నిధికి నారదుఁడు వచ్చి, శివశక్తి భేదంబులు దెలిపి, పార్వతిపూర్వప్రపంచంబువిశేషించి, యెఱింగించి, "యీ దేవి లోకజనని, మహాదేవున కగ్రమహిషియై పేర్మి సురేంద్రాదుల కర్చిత యగు" నని యమ్మహాముని సనియెన్. "అని చెప్పుటచేతసతియేపార్వతి యనుట నిశ్చిత మయ్యెను. మఱియుఁ బరమేశ్వరుని కగ్రమహిషియై దేవహితము గావించి, యింద్రాది పూజిత యగుటయు సూచితము. మఱియును "(సర్వేశ్వరుఁడు) ఇట్లు చనుదెంచి తదీయ వివాహవేదికాతలోపరి దుకులాంబరాలంకృత మణిపీఠాసనాసీనుండై యున్నంత హైమవతి దేహార్ధంబు గైకొన నజ్జులు వెట్టునట్లు తత్పీఠార్ధంబు నలంకరించుచు" అని చెప్పుటచేత బరమేశ్వర దేహార్ధస్వీకరణము పార్వతికి ముఖ్యాభిలాష మని తెలుపఁబడుచున్నది.

ఇంకఁ బరమేశ్వరునకు సతీదేవియందుఁ గల యనురాగాతిశయము గూడఁ జూపుటకుఁ గవి దక్షాధ్వర ధ్వంసానంతర మీక్రిందిరీతి రచించెను.

"గీ. సతివియోగాగ్ని మనములోసంతతంబుఁ,దగిలికొని కాలదానికిఁదనువుసేయఁ
దలఁచియో కాదునిక్కమ తపముసేయ, వలచియో హిమగిరికి నీశ్వరుఁడు వచ్చె."

అంత హిమవంతుఁడు పార్వతిని బరమేశ్వరుని పరిచర్యకై యొప్పగించి చనియెను. పార్వతియుఁ బరిచర్య సేయుచుండె.

దేవకార్యార్థము మన్మథుఁడు శివునికి వికారము కల్పింపఁ బూన నీశ్వరుఁడు మొదటఁ గొంత వికార మొందినను వశ్యేంద్రియుఁడుగాన మన్మథ దహనము గావించి యంతర్ధాన మొందుటవలన సమీపసుఖస్థితిపోయి మరల విరహమునకుపక్రమ మయ్యెను. పార్వతి విరహభరము భరింపఁ జాలక, తపమునఁ బరమేశ్వరుని భర్తగాఁ బడయఁగోరి ఘోరతప మాచరించెను. ఆ తపోమహి

మచేత నీశ్వరుఁ డా కృష్టహృదయుఁడయి పశ్చాత్తాపమొంది బ్రహ్మచారి రూపమునఁ బార్వతిని బలుకరించి సంతసించి యామెను బరిణయమయ్యెను. అప్పుడు విప్రలంభ శృంగారము ముగిసెను.

సతీదేవియే పార్వతియై జన్మించి మరలఁ దనపతినే పొందుటచేత నిది విప్రలంభశృంగార మన నొప్పును. కొందఱు సతి మృతినొందినది గాన నది కరుణరసమనవలెఁగాని, శృంగార మెట్లగునని సంశయింపవచ్చును. మృతినొందిన నాయిక యానాయకునే జన్మాంతరమునఁ గలసినచో నది విప్రలంభ శృంగారమగునుగాని తదితరము గా దని రసవేత్తల నిర్ణయము. విస్తరమేల ?

ఇంక సంయోగ శృంగార మారంభమగును. పార్వతీ పరమేశ్వరుల వివాహముఁ దదుత్సవములును దంపతులసంయోగమును శృంగారస్థాయిగా వర్ణింపఁ బడినవి. అంతఁ గుమారోత్పత్తియుఁ బార్వతీపరమేశ్వరులు గుమారుని సేనాపతిగ నియమించి యుద్ధమునకుఁ బంపుటయు యుద్ధమును వర్ణితములు. వీరరసోపబృంహణమునఁ గూడఁ బ్రధాననాయకులను విడువక యీ క్రిందిరీతిని గవి ప్రసంగించియున్నాఁడు.

"వ. ఇట్లతిరమణీయ మణిమయోత్తుంగ సింహాసనాసీనుండై నిజ జననీ జనకులగు నుమామహేశ్వరుల పురోభాగంబునఁ బరభాగిల్లుచు నఖిలామర పరివృతుండై పేరోలగంబుండి. ... ..." "పరమేశ్వరుండు లక్ష్మీగణేశ్వరుల సహాయులుగా నియమించి తారకునిర్జించిసురల రక్షించునది యని యనేక ప్రకారంబులం గుమారు వీడుకొలిపిన మహాప్రసాదం బని హరగిరజల వీడ్కొను సురసేనలం గైకొని." ... ... "మహాదేవునియోగంబున మహాసేనుండు సేనానియై ... తెరలనెత్తు దెంచుచున్నవాఁడు." "అంతఁ గుమారుం డుమామహేశ్వర చరణస్మరణ పరిణతాంతఃకరణుండై యుద్ధసన్నద్ధుం డగుటయు."

"ఇట్లు మాయావి ... అనివారితోపద్రవకరుం డగుచున్నంగని కుమారుండుహరచరణస్మరణపరిణతాంతఃకరణుండై దానికిఁ బ్రతికారంబు గని పరమేశ్వరప్రదత్తంబైన దివ్యశక్తి యభిమంత్రించె."

ఇట్లు యుద్ధసమయంబునఁ బ్రధాననాయకులనువిడువక యందు సంబంధమున్నవారినిగాను, కుమారునికి యుద్ధారంభ యుద్ధమధ్యములందు ధ్యేయులనుగాను నిరూపించుట కవి నైపుణ్యమును దెలుపుచున్నది. అంతఁ దారక వధమయ్యెను. గుమారుఁడు దేవతలతో శివపురంబునకుఁ బోయెను.

"అంత.

క. మనను లోడఁగూడి కడసనఁ,దనువులు నెఱయంగ వేడ్క దంపతులకువా,
రని సంయోగము గలిగెన, ననిశము నది యర్ధవిరహ మనఁదగు జగతిన్.

అని నిశ్చయించి, శివశక్తు లత్యంతానురక్తచిత్తులై నిరంతర సుఖంబు నం దనివిసనక

సీ. పృథుజటాబంధంబు వెన్నెటివేణియుఁ
గపిలాంబకముగల్కి-కన్నులు గన్ను
నహికుండలంబు తోయజకర్ణపూరంబు
గడ్డంబు జిగిదొలకాడుచెక్కు-
గురుభుజాదండంబుఁ గోమలహస్తంబు
దనరారు నురమును ఘనకుచంబుఁ
బులితోలు మేలిదువ్వలువు నంచిత
పుష్పచయపరాగంబు లాతూరసంబు
మానితముగ నిరంతర మదన సుఖము
వెడవుదాల్చెనోయనఁ బోలు పొందుగాఁగ
నర్ధనారిమైయున్న సర్వాత్ముఁ గనిరి
తారకారియు నఖిల బృందారకులును.

వ. కని పరమానందంబున.

క. హరి పరమేష్ఠి పురందర, సురనరఫణిసహిత మగజ సుతుఁ డత్యంతా
దరమునసీశ్వరు పదపం, కరుహంబుల కెఱఁగియున్నఁ గని హర్షముతోఁ.

వ. అర్ధనారీశ్వరుండై యున్న యీశ్వరుం డమరులం గని కరుణామృతరసంబున నోలలాప్చుచు మహాసేనుం గ్రుచ్చి యెత్తుకొని ... ...

ఇట్లఖిలభువనస్వామికుమారు లన్యోన్యదివ్యాంగంబు లాలింగన సుధామృతాంబుధి నుడుపంబుగాఁ బట్టి విహరించి తదనంతరంబ హరి పరమేష్ఠి పురందరాద్యఖిల సుర నర ఫణి మునిగణంబులకు వరదుం డనేక వరంబు లొసంగి నిష్కంటకంబైన సకల భువనభవనసామ్రాజ్యపదవులందు సుప్రతిష్ఠులం జేసి యుమామహేశ్వరులు కుమారు ననేక వేదశాస్త్రాగమ పురాణేతిహాసకథాబృహత్కథాద్యఖిలవిద్యావేదికలయందుఁ బారంగతుం జేసి పరమాత్మ జ్ఞాన ధ్యాన విధానంబు లుపదేశించుచు," ...

"అనేక ప్రకారంబులఁ బరమేశ్వర తత్త్వంబు లుపదేశించి,శివలోకానుకారియైన కుమారావలోకనంబునం గుమారుఁ గుమారపదవీ సుప్రతిష్ఠుం జేసి, పరమేశ్వరుండు ... ... పరమ సుఖలీలం బ్రవర్తిల్లుచుండె." అనెను.

పయి భాగములను జక్కఁగఁ బరిశీలించినయెడల, నన్నిచోదుని శృంగారరసపోషణము తెల్లమగును. కవి వీరరసోల్బణత్వము తగ్గించుటకై, కుమా

రునకు విద్యాబుద్ధులు చెప్పించుట మొదలగు విషయములు గొన్ని పనికట్టుకొని ప్రదర్శించి నట్లున్నది. హరిపరమేష్ఠ్యాదులను సామ్రాజ్యపదవులందు సుప్రతిష్ఠితులఁజేసి యుమామహేశ్వరులు చివర కాకుమారునిఁ గుమార పదవీ సుప్రతిష్ఠితునిఁ జేసి రసుటచే వీరరస ప్రాధాన్యము తగ్గించి పరమేశ్వరుని ప్రాభవముఁ దెలిపి శృంగార రసప్రాధాన్యము స్పష్టపఱచెను.

కాళిదాసకావ్యమునఁ బార్వతీజననాది పార్వతీపరమేశ్వరసంయోగమువఱకుఁ గలకథాభాగ మితివస్తువు. నన్నిచోడునికావ్యమున శివశక్తులు (సతీ పరమేశ్వరులు) సుఖలీల విహరించుట మొదలు అర్ధనారీశ్వరత్వము పొందుటవఱకుఁగల కథాభాగ మితివస్తువు. కావ్యద్వయమందును శృంగారమే ప్రధానరసము. ఆంధ్రకావ్యమున వీరరసము నంగరసముగాఁ గరుణాదుల కంటె నధికముగాఁ జూపినాఁడు. మిగిలిన రసము లన్నియు సందర్భానుసారము హృదయంగమముగాఁ బ్రవేశపెట్టినాఁడు. నవరసములును వెల్లివిరియఁజేసిన నన్నిచోడకవిరాజశిఖామణిప్రతిభావిశేషము నిరుపమానము. [1]కవిరాజనఁగాఁ గవులకురాజను యౌగికార్థమే కాక యాలంకారిక పరిభాషలోఁ జెప్పినట్లు భాషావిశేషమున నానాప్రబంధములం దాయారసమున స్వతంత్రుఁడయిన యాతఁడు కవిరాజను పారిభాషికార్థమును మన నన్నిచోడుని విషయమున సఫల మయినది.

మొదట నన్నిచోడుఁడు ప్రతిజ్ఞచేసినట్లు కావ్యమంతయుఁ బ్రతిపద్యరసోదయ మయియున్నది. కొన్నిరసములకుఁ గొన్ని పద్యము లుదాహరణముగా గ్రహింతము.

గ్రంథమునఁ బ్రాయికముగా నున్న శృంగార వీరరసంబులకు నుదాహరణము లంత వశ్యకములు గావేమో గాని యితరరసములతోపాటు, ఒకటి రెండు పద్యముల నుదాహరించుట యుచితమని తోఁచెడిని,

శృంగార రసము

చ. "నయమున భీతి వాపి మది నన్నునఁ దేకువ వాపి మాటలం
బ్రియ మొనరించి పొంతనల బేటముఁ బెంచుచు సమ్మదంబునం
బయిఁ బడి గుహ్యముల్ బయలు పర్పుచుఁ జెయ్యుల లజ్జ వాపుచున్
మెయివడి గౌరి నీశ్వరుఁడు మేకొలిపెన్ రతికిం గ్రమంబునన్."

1. "యః అన్యతర ప్రబంధే నిపుణః స మహాకవిః. యస్తు తత్ర తత్ర భాషావిశేషే తేషు ప్రబంధేషు తస్మిం స్తస్మిం శ్చ రసే స్వతంత్రః స కవిరాజః తే యదిజగత్యపి కతిపయే" కావ్యమీమాంస. ౫ అధ్యా.

సీ. నిడువాలు చూడ్కులు నిగిడించి మగిడించుఁ
బతికన్నుఁగవ వొలపంబు తెలుపఁ
బొరిఁబొరి మైతీగ వ్రేందించు నెడలించుఁ
జోఁకానఁ బ్రియుమేను సుడియు వెడల
వెడఁ దొక్కుపలుకుల వినిపించుఁ గొదలించుఁ
గలయ వల్లభు పల్కుపలుకు పొంత
దరహాస రుచిమోవి దలకించుఁ దళుకించు
విభు పరిహాసోక్తి వెరవుఁబొరవు
సెరవుసేయ కధిపు చెయ్వుల మెయివడి
నడరుఁ గాన దాన కానియదియ పోలెఁ
దరుణి నెమ్మనమునఁ దమకంబు లజ్జయు
నలఁతి కగ్గలింప నాఁక గొనక. ౯, ౧౪౬, ౧౪౭. (II. 345 346.)

కం. తరతర మంజలు దళుకఁగఁ బరువిడి మృదుతర
రతములఁ బరిణతు లైరా, హరగిరితనయలు." ...

వీరరసము

"మ. అతులోత్సాహముతోడ దానవబలం బార్వంగ దోర్వీర్య ద
ర్పితుఁడై భోరన వచ్చి తాఁకె నమరుల్ భేదిల్లి భీతిన్ హతా
హతిమార్వెట్టక పాఱఁ దారకుఁడు గోపాసక్తి వీరానురా
న్వితుఁడై యెక్కుడిదంచు రోయుచు మహావీరున్ గుమారున్ వడిన్"
౧౨, ౧౨౫. (II. 910)

కరుణ రసము

"సీ. తరల ముక్తాహారతతి వీడి కుచములఁ
గన్నీరుధారలు గడలుకొనఁగఁ
దాంబూల రాగంబు దళుకి కెమ్మోవుల
నురువులుగొని లాల లురులు దేఱఁ
బుష్పావతంసముల్ పొలుపడి కరతలా
బ్జములు శిరోవతంసములుగాఁగఁ
బత్త్రభంగంబులఁ బాసికపోలస్థ
లములపై నీలాలకములు సెదర
మంజులంబగు తూర్యసమ్మర్ద ముడిగి
తమ మొగంబున నార్త రావములు సెలఁగ

శోకమగ్నలై సతు లుద్దఁ జూచుచుండఁ
బురము సొత్తెంచెఁ దారకాసురుఁడు మగిడి.''

౧౨, ౧౬౧. (II. 944.)

"ఉ. అక్కట వేల్పులార ! కుసుమాయుధు నొఱడిచావు సూచి మీ
రెక్కడ మాయమైతి రసమేక్షణ! మన్మథు నీఱుసేసి నీ
వెక్కడ పోయితయ్య పొడవెవ్వరుఁ జూడక కానలోన నే
నెక్కడసొత్తు నాకు దెస యెయ్యది యో వలరాజ ! చెప్పవే.''

౮, ౮౦. (I. 559.)

అద్భుత రసము

"సీ. గజయూథముల నోలి కబళించి నయగతి యనంగమునుమిడిమ్రింగువారు
రథ్యసారథి హేతి రథికాళితో నశ్రమమున రథంబులు నములువారు
దురగదళంబులఁ గరతలంబుల నొత్తి పిడిచి క్రొన్నెత్తురు పీల్చువారు
దనుజులఁ బృథుపాదతలహతి వడిఁ జంపి సారుగా నేలపైఁ జమరువారు
నగుచు గణనాథు లసురుల శాసురముగ
భూనభోవివరాంతరాపూరిలోరు
భీషణాకారములు దాల్చి పెచ్చువెరిగి
చంపి నసియాడి రొకనిమిషమున సమయ.''     ౧౨, ౧౦౪. (II. 886)

హాస్య రసము

గీ. "హరుఁడు గనుగీట సురసతు లావనీరు
లప్పు డింద్రుపైఁజల్లిన తెప్పలెల్ల
వ్రాల విడిచి సురేంద్రుఁడు వానఁ బురులు
వృదియఁ బడియున్న పురినెమ్మిఁ బోలియుండె.''

౯, ౬౭. (II. 266.)

భయానక రసము

"చ. అలుకం జండిక వేర్చి వేయు నిశితోగ్రాస్త్రాహతిఁ రక్తబీ
జులు దేహాఘము లోలిఁ వ్రస్సి మహి నెచ్చోనెక్కిఁ గ్రొన్నెత్తు ర
గ్గలమై యెచ్చటు పుట్టభూతలము నాకాశాంతరాళంబు ది
క్కులు బ్రహ్మాండము నిండి రొక్కమొగి రక్షోనాథు లుగ్రాకృతిఁ.''

౧౨, ౧౮౯. (II. 890.)

బీభత్సరసము

"క. దురమున మెడ దొడ దల మొల
బరి శిర మురమక్కు ప్రక్క బహుమములుం గె

ద్భరనై యేర్పడ కతిభీ
కరమయ్యె జముండు కుడిచి క్రక్కినభంగిన్." II. 760.

"చ. కడితలవారు వేఱయి గడిఖండములై పడి వండఁ దర్గిన
ట్లడగాని యుండె ముత్తునియలై పడ నల్గడలందు గాలఁ గాల్
మొడిచిన యట్ల యుండె నడుముల్ దెగిపోయినఁ బన్నిదం బొగిన్
బొడిచిన యట్ల యుండె రణభూమి గృతాంతకు బానసంబొనాన్." II. 759.

రౌద్ర రసము

"మ. హరి మర్దింతుమొ బ్రహ్మఁబట్టుదుమొ యింద్రాద్యష్ట దిక్పాలురం
బరిమార్పన్ వధియింతుమో త్రిదశులన్ భంజింతుమో లోక సం
హరణం బిప్పుడ చేయనెత్తుదుమొ విశ్వాధీశ్వరుం డీశుఁడా
వ్వరిపై నల్గెనొ చూడుఁ డంచుఁ బ్రమథవ్రాతంబు రౌద్రాకృతిన్."
I, 188.

"మ. అది కాలాగ్ని శిఖాకలాప మది గల్పాంతాంతకాస్ఫోటకం
బది లోకత్రయభక్షణక్షమన ముద్యద్భైరవాడంబరం
బది సంహార హరోగ్ర నేత్రశిఖ శౌర్యాటోప వీరగ్రహం
బది నాఁ దారకుఁ డెత్తుదెంచె నతిరౌద్రాకారుఁడై పోరికిన్" II. 900.

శాంత రసము

మ. "స్ఫురదాధార సరోజపీఠ హృదయాంభోజాతరంధ్రార్పిత
స్మరణాయత్త సముద్ధితోజ్జ్వల తరాత్మజ్యోతి రుద్ధాంగరుక్
సరసస్ఫాటిక హర్మ్యమధ్య కనకస్తంభంబు నాఁ బర్వున
త్త్యురు జూటాకృతి నున్నశంభు దెసవో నుల్కెన్ మనోజుం డెదన్"
I. 495.

"సీ. పడి మోక్షమార్గంబు విడువక
నడతున న్నతఁ డేల లోకుల గతిచరించు
ననిశంబుఁ బరమాత్మ నాత్మఁ గూరెడు
నాతఁ డొరులసంగతి నేల బొరసియుండు
న నుపమ ముక్త్యంగనాధీశుఁడుగఁ గోరు
నతఁ డేల కుజనుల సతుల కొఱఁగుఁ
బరమయోగామృతవరరస సేవనఁ
దలివినవాఁ డేల సవుల కెఱఁగు
గీ. నోటువడి శరీరమొల్ల నట్టి వాఁడు దే
హేంద్రియంబు లిచ్చ లేల చలుపుఁ

గర్మ విహితయోగ నిర్మల చరితుఁడౌ
పురుషుఁడేల క్రియలఁ బొందు నొందు.'' I. 721.

ప్రతి పద్య రసోదయమగు నీ కావ్యము పఠించి పరమానంద మొంద వలసినదే. ఇట్లు చూపినఁ దనివి తీఱదు.

ఇంతమహాకవి గూడ రసభంగము గొన్నిచోట్లఁ గలిగించె ననవలసి వచ్చినది. "అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్'' అనుటకు లక్ష్యములు గొన్నిగలవు.

కొన్ని యనౌచిత్యములు

1. "వ. రతి మన్మథుని వెండియు నన్వేషించి ప్రలాపించుచు I. 541.

గీ. నన్ను నొరయ వేఁడియే నాథ యిచటఁ
బొడవుసూపక డాఁగి తీపొదలలోన
నిన్నుఁబాసి చరింతునే నిమిషమైనఁ
గామ రహితంబుగా రతి గలదెయెందు. I, 542.

క. రతిహితుఁ డవనఁగ నెప్పుడు
రతిసంగతి నుండుదీవు రతి నిప్పుడు దుః
ఖతఁజేసి పోయి తక్కట
రతి వంచన సేసి పోక రసికుల గుణమే.'' I, 543.

ఈ పద్యముల చివరపాదము దుఃఖసమయమున రతీదేవిచే ననిపించుట యుచిత మనితోఁపదు.

2. పార్వతి తపోవనంబునకుఁ బోవుచుఁదన చెలులయెదుటఁ దనవీళతో నిట్లనియె. I. 682.

"మ.... ... ... ... ... ... ... ... నాచేవాయుడుంగాక మ ద్గురు వృత్త స్తనసంగతిం దొఱఁగితే ఘోషావతీ నీ వనున్.'' I. 6-25

ఇదియు నట్టిదే. కాని విస్రంభ స్థానమని యెకపక్షముగా దీని నొప్పుకొన వచ్చునేమో.

3. "క. స్మరమందిరమ్ము శోభాకరముగ
మెఱుఁగారుపసిఁడి కంభము లనఁగాఁ
గరమొప్పు నగతనూజకుఁ, గరభోరులు
వెలుచు మదన కరికర లీలన్'' I. 291.

ఇది పార్వతీవిషయ మగుటచేతనిదియుచితముగా లేదనియే చెప్పవచ్చును

శివవీర్యవార్థులు.

చ. " అమితసువీర్యవార్థులిల నప్పటికప్పటి కుద్భవించుచుం
గ్రమమున నుర్విలోఁ గులనగంబులు దుంపలువోలె నుండెమే

ఘము లనయంబు దెట్టువులు కట్టి కెలంకులఁ జేరెఁ బై విమా
నములు పవిత్రసంఘు మన నల్లడ నోలిన తేలిపాఱఁగాఁ." II, 354.

ఇది యత్యుక్తియై యశ్లీలతా స్ఫోరక మగుచున్నది.

శైవుల కది మహాపదార్థముగాన, వారి కాభక్తియుండుట సహజమే. వారి కశ్లీలస్ఫూర్తియుండదు. కాని కావ్యమున నెంతయో మనోహరముగ సామాన్యదంపతులచర్యలు వర్ణించినకవి రసవంత మగు మహాకావ్యమున నిట్లు రచించుట యనావశ్యక మని తోఁచెడిని.

చతుష్షష్టి కళానైపుణ్యము

"క. ఓలిన కడచన నరువది
నాలుగు విద్యలను నేర్పు నైసర్గికమై
వాలిన సుకవులకుం గా
కేల తరమె కృతులు చెప్ప నెవ్వారి కైనన్." I. 42.

అని మనకవి చెప్పినట్లు మనకవి చతుష్షష్టి కళాపరిజ్ఞానమున నిరూఢుఁడని యాతని కావ్యమే చాటుచున్నది. అవి యన్నియుఁ జూప నిచట నవకాశములేదు. ఒండు రెండు మాత్రము చూతము. అందు ముందు కవి చిత్రకళానైపుణ్యము పరిశీలింతము.

చిత్రకళ.

సాధారణముగాఁ జిత్రకళలో బొమ్మలుచేయుట మనకవుల వర్ణనము ననుసరించి చూచినయెడల మూఁడు విధములుగాఁ గనఁబడుచున్నది.

౧. కరువునఁబోయుట. మూసలోఁ గరఁగిన బంగారు మొదలగునది యచ్చునఁ బోసి బొమ్మచేయుట. అట్లు పోసి చేసినది పోఁతబొమ్మ. మెత్తని పదార్థముపై నచ్చుతో నొత్తి చేసినదియు నీరకములోనే చేరవచ్చును.

౨. గండరించుట. రాయి మొదలగునవి చెక్కి బొమ్మగాఁ జేయుట. అట్లు చేసినదే చెక్కిన బొమ్మ. అదియే గండరువు; గండార మనియువాడఁబడినది.

కన్నడమున 'కంటరిసు' అనఁగా రాతిపయి నక్షరములు, బొమ్మలు మొదలగునవి చెక్కుట అను నర్థమున శాసనములలోఁ గలదు. తెనుఁగునఁ గూడ 'కండరించు' అనియో 'కంటరించు' అనియో యుండు నని కొంద ఱన వచ్చును. తఱచు 'గండరించు' అనుపదము కనఁబడుటచే 'గండరించు' అనియే గ్రహించితిని.

3. చిత్తరువు. పలక, పటము మొదలగు వానిపై రేఖలు గీచిబొమ్మ చేయుట; రంగులు తూలికతోఁ బూసిచేయుట; మన్ను, మొదలగు వానితోఁ

రూపమేర్పడునట్లు చేయుట అను పలురకములుగాఁ జిత్రములుచేయుట. ఈ మూఁడు విధములును నన్నయ్యభట్టు పద్యమునఁ బ్రదర్శింపఁబడెను.

"చ. కరువునఁ బోసిరో విధునికాంతి సుధాబ్ధి తరంగ దెచ్చి గం
డరు వొనరించిరో హరుజటాస్థలికిం దొడవైన యేటి వె
న్నరువునఁ జేసిరో యన మనోజ్ఞసితచ్ఛవి నుల్లసిల్ల నుం
దరతురగోత్తమంబు దవుదవ్వులఁ గాంచిరి చారులోచనల్."

భార. ఆది. ౧. ౧౮౩.

ఇదే శబ్దరత్నాకరమున గండరువు పదముక్రింద 'పడియచ్చు' అను నర్థముతో నీయఁబడినది.

తిక్కన్నయు గండరించుట యీ క్రింది రీతిని జూపినాఁడు.

"తే. మిగిలి బ్రహ్మాండ భాండంబు పగులవ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకా లానలమున
గండరించిన రూపంబు కరణి భీముఁ
డతి భయంకరాకారత నతిశయిల్లె."

భార. విరా. ౨. ౧౩౪.

ప్రళయకాలానల మను నొకపదార్థము చెక్కి చేసిన రూపము రీతిగా భీముఁ డతి భయంకారాకరుఁ డయ్యెనని భావము.

ఈ పద్యమున గండరించుటనఁగాఁ బుట్టుట యని శబ్దరత్నాకరనిఘంటువున గండరించు పదముక్రిందఁ గలదు. అది విచార్యము. స్థూలదృష్టితోఁ దాత్పర్యముగాఁ జెప్పినది. అచ్చటనే మఱియొక యుదాహరణము గలదు.

"నవకల్పలతికనవకంబు నాతిగా శ్రీనందనుఁడు గండరించి నట్లు" మార్కండేయ. 3. ౯౩. ఇక్కడను మన్మథుఁడు నవకల్పలతికను స్త్రీగా గండరించినట్లు అని యర్థము. ఇట అంతర్భావిత ప్రేరణముగా గ్రహించి 'పుట్టించు' అని శబ్దరత్నాకరకారుఁడు వ్రాసినాఁడు. అదియు సరిగాదు.

ఈ సంప్రదాయ మితరకవులలోను గలదు.

"క. కరువున గండరువునఁ జి
త్తరువున నినచంద్రరుచులఁ దారలరుచులన్
హరిహరవిధాతృలకు నీ
హరిణమున సరిరూపు వడయు నలవియె యింకన్."

రా. ఆర. కాం. ౨. 33.

గండరువు అనుదానిని గండార మనియు వాడుట గలదు.

"ఉ. దోరవుఁ జన్నుదోయి పయిఁ దొంగలి తెప్పల దాఁచి చూపు నీ
హారము లేని క్రొమ్మెఱుఁగులై నిలువం గొలువల్లఁ జొచ్చి య
చ్చేరువ కంబమున్ గదిసి చిత్తరువో కరువో యనంగ గం
డారవు బొమ్మవోలె నచటం గదలించుక లేక యుండఁగన్."

ఉత్తర హరివంశము. ౧. ౬౦.

ఇటఁ జిత్తరువో కరువో యని యుత్ప్రేక్షించి గండరించిన బొమ్మను నుపమానముగాఁ గవి గ్రహించినాఁడు. గండారపుబొమ్మ శబ్దమును గుఱించి ఉత్తర హరివంశ టీకలో బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రుల వారిక్రిందిరీతిని వ్రాసిరి. "ఈ కవి ప్రయోగించినపదములు కొన్ని యితరత్ర గానరాకున్నది. శబ్దరత్నాకరమునఁ జేరని పదము లీకృతిలోఁ బెక్కులున్నవి. 'గండారపుబొమ్మ' అను పద మీకవి ప్రయోగించినాఁడు. శబ్దరత్నాకరమున నిదిలేదు. దేశ్యనామార్థకోశమున, 'గండారపుబొమ్మనగా, మండలమున దృష్టిబొమ్మ' అని యున్నది. ఇట్టి వీకృతిలోఁ బెక్కులున్నవి."

విచారింపఁగా నీయుదాహరణమున దిట్టిబొమ్మ అను నర్థము పొసఁగదు. కరువును జిత్తరువును జెప్పిన తర్వాత గండారపుబొమ్మ చెప్పుటచేత గండరించిన బొమ్మ యనియే యర్థము పొసఁగును. వా రుదాహరించిన దేశ్యనామార్థకోశార్థమును జిత్యమే. దేనియందైనను విశేషమును గ్రహింపఁ దలఁచినయెడలఁ దత్పూర్వాపరస్థితి దెలిసికొనుట యావశ్యకము. అందును నిఘంటుకారులును విమర్శకులుఁ గూడ వేఱు మార్గములు ద్రొక్కినచో టిది. కావున నింత వ్రాయవలసి వచ్చినది. ఇంకఁ బ్రకృతమునకువత్తము. నన్నిచోడ కావ్యమున.

క. "కరువునఁ బూరితమై లో
హరసములోఁ గాలునట్టు లంగజశోకో
ద్ధురశిఖ రతితను విమ్మగఁ
గరఁగియుఁ బొడవఱక లోనఁ గాలుచు నుండెన్."

ర. ౯౯. (I. 578.)

ఇందు కరువు అనఁగా మూస అను నర్థమునఁ బ్రయోగించెను గాని 'కరువునఁ బోయుట' ప్రత్యేకముగాఁ బ్రయోగమునఁ గనఁబడలేదు.

**గండరించుట**

"మ. కమనీయాత్మక సర్వలోహమణి సత్కాలేష్టికానిర్మితో
త్తమ హర్మ్యంబుల గండరించిన కపోతవ్రాతపంక్తుల్ బిడా

లము లోలింగని వానిమీఁది కలుకన్ లంఘించెఁ గాకున్నఁదద్
భ్రమనై నూఁగినఁ బల్కవెండెడ గడీపారావతానీకముల్."

౭. ౧౧౬. (I. 947.)

ఇటఁ బారావతచిత్రములు బిడాలములకు సజీవమగు పారావతము లను భ్రాంతి గలిగించినవి. అవి పల్కకుండుట యొకటి తప్ప రూపమున నిజ మగు పారావతము లనియే తోఁచెను. చిత్రవిద్యా నైపుణ్యపరమావధి బొమ్మను జూచి సజీవపదార్థ మనుకొనునట్లు చిత్రించుటయే గదా! అది యే జీవకళ తెచ్చుట. చిత్తరువు వ్రాయుట లక్షణసహితంబుగాఁ జెప్పిన చోటు చూతము. "(పార్వతి) అంతం దనుసంతాపంబు వాపనోపక పరమేశ్వరు రూపు చిత్రించి చూచిననైన నూఱట యగునో యని చిత్రసాధనంబులు గొని పలక ఘట్టించి మెఱుంగిడి త్రివటించి తిట్టంబు కొలఁదికిం దెచ్చి ఋజ్వా గతంబున రేఖ నూల్కొలిపి పత్రక బిందుక నిమ్నోన్నతాపాంగ మా నోన్మానంబు లలవఱచి సలక్షణంబుగాఁ జిత్రించి వన్నెవగొలిపి కందెఱ తెఱచిన

చ. కలకల నవ్వునట్లు దమకంబునఁ గన్గవ విచ్చి భ్రూలతల్
వెలయఁగఁ జూచునట్లు దనివ్రోవగఁ దెల్వియుఁ గాఁగలింపఁ జే
తులు పచరించిన ట్లదటుతో రతికేళికి నప్పళించు న
ట్లెలమి నటించుచుండె సతి కీశ్వరు రూ పెదుటం బ్రసన్నమై.

వ. తదనంతరంబు నిక్కువంబుగాఁ దలంచి లజ్జించి, నేయోసరించుచు నపాంగావలోకనంబు సురంగంబై పొలయం దదాసక్తి యగుచుండునంత.

౫. ౧౧౮, ౧౧౯, ౧౨౦ (I. 597, 598, 599.)

చిత్రరచనావిధానము దెలిపి, యట్లు రచించిన జిత్తరువుఁ జూచినపుడు గలుగు ఫలమును మనోహరముగాఁ గూర్చిన నన్నిచోడుని చిత్రకళానై పుణ్య మెంత మెచ్చుకొనినఁ దృప్తి తీఱదు.

మఱియొకచోట మూఁడు విధములను వేఱు పదములతోఁ గూర్చి నాఁడు.

"ఉ. అత్తనుమధ్యరూపు గడు నందముగాఁ గుసుమాయుధుండు నా
చిత్తమునందు రేఖగొని చిత్రము వ్రాసెనొ పోలుపొంద న
చ్చొత్తెనొ నేర్పునం గలయ నూన్చెనొ గా కిది తన్మనోభవో
న్మత్తవికారమో మదనుమాయయొ నిక్కువమో తలంపఁగాన్ "

౬. ౧౧౬. (I. 825.)

ఇందుఁ జిత్రమువ్రాయుట, అచ్చొత్తుట, కలయఁ గలిపిన పదార్థముతో బొమ్మచేయుట అనునవి చెప్పఁబడినవి. ఇట మనసును గలయఁగలుప శక్యమా యను శంకను నివారింపఁ దలఁచి 'నేర్పునఁగలయనూన్చె' నని ప్రయోగించి యుండును.

ఇట్లే సకలకలాపారంగతత్వము వెల్లడియగునట్లు రసవంతముగా మనోహారముగాఁ బ్రబంధము నిబంధింపఁబడినది. ఈతని రచన కానందించి దీనిని మేలుబంతిగారచించినపద్యములలోఁజిత్తరువు విషయమందలిపద్యముచూతము.

"చ. కలకల నవ్వినట్లు తెలికన్నుల నిక్కమ చూచునట్లు తోఁ
బలుకఁ గడంగినట్లు పలుభావగభీరత లబ్బినట్లు వెం
పొలయఁ దనర్చి జీవకళ యుట్టిపడఁగ శివ వ్రాసి యిచ్చె నా
చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకెను దాను బోటియున్."

పరిభావతీప్రద్యుమ్నము.

కవి లోకజ్ఞత

ఇట్టి భావకకవిభావనావిశేషములును లోకజ్ఞానమునుఁ దెలిసికొనఁ గొంత యత్నింతము.

జంతు విషయము.

కామకేళీలాలసకరికరేణువులస్వభావ మెంత రమ్యముగా వర్ణించెనో చూడుఁడు.

ఏనుఁగులు

"శా. బేటం బేటముగా నిభంబు గరిణిం బ్రేమంబుతోఁ జేరి లా
లాటం బొత్తు లలాటపట్టమునఁ గేలంగేలు వేష్టించుఁ గ్రీ
గోటం మేయొరయున్ వరాంగములు సోఁకుం బుష్కరాగ్రంబునం
దాటోపం బొనరించుఁ గూడఁ బ్రియం గామాసక్తి నాసక్తిమై."

౧, ౧౦౦.

కరి కరిణిని జేరి లలాటముతో లలాటము చేర్చుటయుఁ దొండముతోఁ దొండము చుట్టుటయు గ్రీగోటితో నొడల గీరుటయుఁ దుండము చివర భాగముతోఁ గరిణీ రహస్యావయవములను దాఁకుటయు నెంత సహజములో! అవి కవి యెట్లు వ్యక్తపఱిచెనో చూడుఁడు.

చాతకము

"చ. ఉడుటఁ దెమల్చి మ్రింగు సరసోదకబిందుల మౌక్తికంబులం
గదఁ గబళించుఁ బిల్చు వడగండులకుం దను వొనరించు...దో

యదము లదల్చి దూఱు నచిరాంశులతాగ్రము లెక్కు మెల్పునం
జదలకు నుప్పరం బెగయుఁ జాతకపోతకముల్ సెలర్చుచున్". I, 750.

చాతక పోతకములు ఉదకబిందువులు త్రాగుచు నడుమనడుమఁ బడు వడగండ్ల దెబ్బలు తగులకుండఁగ తనువ్రొసరించి తప్పకొనుటయు, మేఘములను వడగండ్లు వర్షించినందులకు నదలించి దూఱుచుండుటయు, మెఱపులు మెఱసినపుడు ఆకసమువై కెగురుచుండుటయుఁ బక్షిజాతి సహజస్థితి. అది కవి మనమున కెక్కునట్లు వక్కాణించుట నైపుణ్యమును జాటదా.

వైద్యకము.

పార్వతీ విరహావర్ణనసందర్భమునఁ జలికత్తెలు పార్వతీతో నన్నమాట.

సీ. మృదురీతి నూర్పుఁ దెమ్మెరలు నూల్కొల్పవే
తెఱవ నీలేఁత మైతీగెయొలయ
నరుణాధరద్యుతి నభ్యుదయింపవే
పొలఁతి నీయాననాంభోజ మలర
దరహాసచంద్రికా స్ఫురణ పూరింపవే
రమణి నీ నయనోత్పలములు వ్రెలయ
భాషామృతము గర్ణపథములఁ జొనుపవే
చెలువ నీ జీవంబు చేతరింప

వెలఁది నీవ నీకు వెజ్జవై వలవంత
యవయవములఁ దీర నవయవముల
వలను మెఱయ కేల వలరాజు చలము సా
ధ్యమ్ము సేసెదమ్మ తలిరుఁబోఁడి. I, 614.

ఈ సందర్భమున నేయేద్రవ్యము లెట్లుపయోగింపఁదగునో చక్కఁగఁ జూపఁబడినది. చూ. I. 616, 618, 620 పద్యములు.

అవి యన్నియు వైద్యశాస్త్రోక్త ప్రక్రియలు.

సాంఘిక విషయములు.

"బ్రాహ్మణో న హంతవ్యః" I. 230.

"మాతంగ దూషితంబగు సరోవరంబు సద్ద్విజవర్జనీయంబుగాదె ఇట శ్లేషగలదు."

గీ. కొలను వన్యేభములు చొచ్చి కలయఁగలఁపఁ
బులువు లుండక వెలువడిపోయెఁ బోక
తగదె మాతంగ దూషితంబగు సరోవ
రంబు సద్ద్విజవర్జనీయంబు గాదె. I. 92.

రజస్వలను దాఁకినచో స్నానము జేయవలె.

క. సోఁక నలినీరజస్వల, సోఁకిన దోషంబువాయ సూర్యుఁడు గలితా
శంక నపరాంబునిధిలోఁ, గ్రుంకె నొకో యనఁగఁ బ్రొద్దు గ్రుంకుడు
నంతన్. II. 89.

స్త్రీలు ఈఁత యీఁదుట, అందనేకవిధముల నేర్పుచూపుట.

చ. నెలఁతలు గొంద ఱొక్కొ-లని నీరులలోపలఁ గ్రుంకిపోయి మై
బలసిన భూషణద్యుతులు పర్వఁగ నొక్కొట వేచి రక్కడన్
వెలుఁగుచు నాగకన్యకలు వేడుకతో జలకేళి సల్పఁగా
నొలసి రయంబున న్నెగసిరో యని చూపఱు మెచ్చి చూడఁగన్.
II. 282.

వెలికిలఁ బరుండి యీఁదుట.

"... ... వెల్లీత యీఁదె కోమలి కొలనన్." II. 283.

ఈఁతలో చాతుర్యము.

"చ. తనముఖ మంబుజాత మని తందడి మూవు నలివ్రజంబుతోఁ
జెనఁగు విదగ్ధమోహిల నొకబేలుసతిం గని యోలఁబెట్టి పి
ల్చిన నది దన్నుఁబట్ట నని చేరిన తేఁటుల దాని మూవికొం
డనుచును గ్రుంకిపోయి చదురాలయి నవ్వుచు లేచె నొక్కెడన్."
II. 287.

సన్నబట్టలు.

"ఉ. అంబర నామధేయ ముచితార్థముగా జలసిక్తమై దుకూ
లంబు లదృశ్య మయ్యెఁ గడులజ్జఁ జలింప సతుల్ విటాళి మో
హంబునఁ జూడ గాలిఁ దడి యాఱితదంబరముల్ గటిప్రదే
శంబులఁ బొల్చెఁ దత్సతులు సంతస మంద విటాళి వందఁగన్"
II. 292.

బాలికలు నేర్వఁదగిన విద్యలు.

పార్వతి విద్యాభ్యాసమున నివి కూర్పఁ బడినవి.

సీ. "హరుమోహిల సద్భక్తి నాడుచోటన నాట్య
విషయమ్ము లన్నియు వెలయఁ గఱచె
లీల నీశ్వరు నంకమాలికల్ వాడుచో
గీత భేదంబులరీతు లెఱిఁగె
శివురూపు పల్మఱు చిత్రించి చూచుచో
వినుతంబుగాఁ జిత్ర విద్య వడసె

శశిమౌళిఁ జిత్రపూజలు సేయుచోటఁ బ
త్త్రచ్ఛేద కుసుమబంధములు నేర్చె

గీ. మఱియు నఖిలలోక మాన్యంబులగు విద్య
లెల్ల నివ్విధమున నెసక మెసఁగ
నభ్యసించె నీశ్వరార్చనాబలమున
హరుఁడు గురుఁడు గాఁగ నగతనూజ." I. 221.

నాట్య విషయములు, గీత భేదములు, చిత్ర రచనలు, పత్రచ్ఛేదములు (ఆకులు కత్తిరించి బొమ్మలుగాఁ జేయుట) పూలు కట్టుట, మొదలగు లోకమాన్య విద్యలు బాలికలకు నేర్పఁదగినవా రెంత నాగరికత గలవారో యూహింపఁ దగును.

రాజు, రాజ్యము.

రాజు కువలయహితుఁడు గావలె.

"గీ. కువలయారి సనిమెఁ గువలయ హితుఁడగు
రాజు వచ్చె నని కరంబు నమ్మి
రమణలోక మెల్ల రాగిల్లు నట్లెఱ
సంజ గలయఁ బర్వె సకల దిశల. II. 91.

గీ. రాజరుచి వాయఁ గువలయరమణ దఱిఁకి
కలయఁ దమ్ముల మొగముల నెలమి మిగిలె
శీత కరుఁడైన రాజు వాసిన ధరిత్రి
వందుఁగా కెందు దాయలు వగతు రెట్లు. II. 188.

చ. సుజనజనైకభూషణము శూరత దుర్జనదూషణంబు స
ద్ద్విజ విబుధాశ్రితప్రతతి వేడుకఁ బ్రోపును రాజ్యచిహ్నగా
క జలమహాభిషేకమునఁ గట్టిన పట్టము వీజనంబు భూ
భుజులక కాక యున్నియును బుట్టికి నైనను లేవె చూడఁగాన్.
II. 564.

క. కరదండాహత పరనృప, ధరణీతలవిషయభోగి దగు నధిపతిగాఁ
బరదండాహత నిజభుజ, పరిపాలిత విషయభోగపరుఁ డధిపతియే.
II. 559.

ఉ. మంచిగఁ బ్రీతిఁ బాయక సమస్త జనంబులు దన్నుఁగొల్వ జీ
వించిన ధన్యుఁడా మహిమ వీడిన జీవము మేన నిల్ప నా
సించి విభుండు దానొకట సేవకుఁడై మనుకంటె ముందఱా
ర్జించిన కీర్తి నిల్వ గతి సేకుఱఁగా నని చావు సేగిమే." II. 562.

**దుర్వివేకి రాజ్యలక్షణములు.**

"క. నుతవర్ణాంతర నిమ్నో, న్నతతల నిఖిలోచ్చ నీచ నానావస్తు
స్థితి సమము సేసె గతగా, రత< జీకటి దుర్వివేకి రాజ్యము పోలెన్." II. 98.

ఇది సంస్కృత కుమారసంభవమున< గాళిదాసు రచించిన (8-57) శ్లోకమునకు నాంధ్రీకృత పద్యము. మనకవి మూలభావము నాదరించెను.

**సేవకులకు జీతములు.**

"క. భావజ విభు< డలి శుక పిక
సేవకతతి కెడరు దీఱ జీతము సేయన్
గా వెలి< బోసిన పసి<డుల
ప్రోవులు నా< దమ్మి లెలమి<బూచె బెడంగై." I, 447.

"చ. మునుమిడివైరివాహినుల ముట్టి పడల్వడ వ్రేసినట్టి కై
పున< బయికెత్తు వాహకుల పొంక మఱింద లకొంత కోసి ము
న్నొకని వడి<జాలు పందలను గోవుల సూరెలు దోలి మార్పు పే
ర్పున< బరికెల్లి గాల్లలన జొన్నలుగొన్న ఋణంబు నీ<గుదున్." II, 612.

చిన్నజీతములవారికి గింజలు కొలుచుట నేటికిని గలదు. జొన్నలు పండు చోట జొన్న లిచ్చెదరు. ఈ కవియున్న దేశమున జొన్నపంట హెచ్చుగ నున్నదని యూహింపవచ్చును గాని, యిది పంప భారతము నుండి గ్రహించిన భావము అని స్ఫురించు చున్నది. పంప జొన్నలు పండుచోట నున్నవా<డు. ఈ కవి గూడ జొన్నపండెడి దేశములోని వా<డే.

**రాజునకు భటులకు నుండవలసిన భావము.**

"క. ఈవలయు నర్థ మిచ్చియు, సేవకు మన్నింపవలయు జితమతి విభు< డా
యీవికి మన్ననకుం దగ<, జావలయు భటుండు పతికి జయమున<గోరన్."
II, 615.

**సంగీతము.**

"క. తేనియ మునురో యమృతపు
వానరొ యె పుండ్రేక్షు రసము వఱ్ఱోడిన వె
ల్లో నా< దుంబరు నారద
గానరసం బభవు నోలగంబున< బర్వెన్" II. 235.

"వ. అంతం దత వితత ఘన సుషిరాత్మకంబులై మృదుస్ఫుటాదిలక్షణ లక్షితంబులై నందికేశ్వరాది వాద్యనికరాతోద్యంబులు హృద్యంబులై చెలంగ"—

అభినయము.

"చ. అలఁతుల నిల్పి హస్తములు హస్తవిలాసముతోఁ బెనంగఁ జూ
డ్కులు దెలిచూడ్కులం దెలమిఁ గూడి రమింప మనంబు దన్మనో
బలమున నుల్లసిల్ల నిజభావము భావవిశేషసంపదల్
వెలయ రసంబులం దభినవించె రసంబులు సాంగికంబుగాన్" II. 237.

సరసాహారము రాగహేతువుగాదు.

"మ. సరసాహారము రాగహేతు వను టజ్ఞానంబు పారావతో
త్కరముల్ సిక్కనిరాలు మ్రింగియు సదాకామార్తులై యుండఁ గే
సరి సాం ద్రామిషభుక్తియైనను సకృత్సంభోగ మందున్ మనో
హరవిజ్ఞానమె కాక రాగరసమం దాహారనిర్వృత్తియే. II. 998.

ముక్తిసాధనము.

చ. "తలఁ కఱ నిల్పి శాంతమెదఁ దాల్చి మమత్వము మాల్చి ధైర్య మి
ట్టలముగఁ బెంచి మోహము లడంచి యఘాళిఁ ద్రుంచి కోర్కియ
గ్గలముగ మాన్చి యీషణలఁ గ్రాఁచి సదాశివుఁ గాంచి యాత్మలో
పల ననురక్తి నిశ్చలత భక్తిఁ దలంచిన ముక్తి సేకుఱున్ I. 727.

తరు. హృదయాంబుజములోన నెప్పుడుఁ బాయకేర్పడి వెలుఁగుమాహేశ్వరరూప
మది పరంజ్యోతి సదాధ్యానవృత్తియందచిత్తంబు లయంబుగావించు
నది భావభావ్యంబు లడఁగిన మఱి నిజాకారుఁ డగు పరమాత్ముఁడు దాన
పదిలమై నిలుచు నిర్బంధమై నిష్ప్రపంచమై నిర్వాణపదవి దా నదియు.

సీ. భావించి మెచ్చింపఁగా వచ్చునందమే
వగప భావంబు భావ్యంబు దాన
ప్రణుతింప మెచ్చింపఁ బడయుద మందుమే
తనర శబ్దంబు నర్థంబుదాన
పూజించి మెచ్చింపఁ బోలుఁ బొ మ్మందుమే
తగిన కర్మంబుఁ గర్తయును దాన
కాన మనః ప్రవాక్కాయ కర్మంబులు
శివునియంద నిలిపి చిత్తవృత్తిఁ

దన్ను శివునికంటె నన్యంబు గాకుండ
నెఱిఁగి తలరకుండు డిదియ ముక్తి
గాన మోక్ష మొందఁ గర్మమార్గంబునఁ
బడయఁగడఁగు టెల్ల భ్రాంతి గాదె." I, 729.

కవిత్వశక్తి.

తత్తద్రసావిష్కరణానుగుణంబు లగు వర్ణనలను దదవలంబనము లగు భావములను దత్ప్రకాశకములగు పదములను నన్నిచోడుఁడు కర్ణరసాయనమగు నట్లు గూర్చెను. ఆ విషయము కవియే యిట్లు చెప్పెను.

"చ. సరళముగాఁగ భావములు జానుఁదెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వ రసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయన లీలఁ గ్రాలఁగాన్.

సీ. మృదురీతి సూక్తు లిం పొదవింప మేలిల్లు భావమ్ము నెలమిఁ గ్రీడావహముగ
మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లు వోవఁగఁ గాంతి సుధాసూతికాంతిఁ బెనయ
వర్ణనలెల్లచో వర్ణన కెక్కంగ రసములు దసుకొత్తి రాలువాఱ
దేశిమార్గంబులు దేశీయములుగా నలంకారములు దా మలంకరింప
నాదరించి విని సదర్థాతిశయముల బుధులు నెమ్మనమున నిధులునిలుప
వలపదే సమస్త వస్తుకవీశ్వర (నూత్నరుచిర) కావ్యరత్నవీథి."

పయిభావములు (క్రీ. 1145) ద్వాదశ శతాబ్దియందును గల వని యీ క్రింది పద్యమున స్పష్టమగుచున్నది.

"చ. తలంపు సదర్థ భావమునం దద్గతసూక్తులఁ గూడ వన్నె కా న(లు)
గొలుసుగొనంగ బ్రావడ్లు గోరినభంగ్గిక వచ్చిమట్టం గో
మలగతి దేసిమార్గ్గములు మట్టుపడం గ్గటనంబ్బులొప్ప నా
ద్యులక్రియం జెప్ప నేచ్చె నృపధూర్జ్జటి భీమయపండ్డం డిమ్మహిని."

South Indian Inscriptions Vol. VI. No. 103.

దేశిమార్గములు.

ఇందు దేశిమార్గము లననేమో కొంచెము పరిశీలింపవలసి యున్నది. ఈ దేశిమార్గము లనుసంప్రదాయము కన్నడమునఁ బ్రాచీనగ్రంథము లందును గనుపట్టుచున్నది.

"చ. బగెపొస తప్పుదాగి మృదుబంధ దొళొందువు దొంది దేసియొళ్
పుగువుదు పొక్కు మార్గదొళె తప్పదు తళ్తొడె కావ్యబంధ మొ
ప్పుగు మెళమావు కెందళిరపూవిన బణ్పొ తెయిం బ్బల్లు దుం
బి గళిసె తుంబి కొగిలెయె బగ్గిసె సుగ్గియొళొప్పువం తెవోల్."

పంప విక్రమార్జున విజయం. ౧-౮.

అందు ముందు పూర్వులచే నిర్వచింపఁబడిన 'మార్గ'మును వివరింపఁ దగును. అలంకార శాస్త్రజ్ఞులు వేఱు వేఱు దేశముల రచింపఁబడిన సంస్కృత కావ్యము లందలి రచనాభేదమును గ్రహించి యందలి ప్రసాదానుప్రాసాది

గుణముల భేదమును బట్టి వైదర్భీగౌడీ ప్రభృతి రీతులనేర్పఱచిరి. వైదర్భీగౌడీ రీతులకు మార్గమని పేరిడిరి. మిగిలిన వానికి నవి యుపలక్షణము. దేశభాషలలోఁ గవిత్వము రచించువార లాయా దేశ్యపదముల కూర్పును బట్టియును వానికిని దద్భవ పదములకును నెనసిన యొనయికను బట్టియును వానియందుండు గుణములను బట్టియును గలుగు నందచందములకు నాలంబనమగు రచనకు 'దేశి' యను పేరు వాడియుందురు. అది యా యా దేశమును బట్టి, యాయా దేశియగును. తత్తత్ప్రాంతములందలి యుపయోగమం దుండుభేదములను బట్టియు దేశిలోఁ గొన్ని భేదము లేర్పడును. దాని నేర్పఱుచుకొనుటలో సంస్కృతమందలి మార్గమునుగొంత యననుసరించుటంజేసి మార్గమునకు దేశి యనుజ వంటిది. కావుననే మనవారు 'దేశి' మార్గముతోడిదకాఁ జెప్పిరి. అది లాక్షణికులు ప్రత్యేకము నిరూపింపక పోయినను, పయి పద్యములలోఁ గవులు స్పష్టముగా దేశిమార్గములు మట్టుపడవలయు ననియు దేశిమార్గములు దేశీయములుగా నుండవలయుననియుఁ జెప్పిరి గదా! ఆంధ్రాలంకారికులు సంస్కృతాలంకార గ్రంథముల నాధారముగఁ జేసికొని రచించిన గ్రంథములలో వైదర్భీ ప్రభృతులను మాత్రమే చూపియున్నారు. దేశిని గుఱించి వివరింపఁ బూనలేదు. దేశిలో నున్న విశేషములు వివరింప నెంతయో పరిశోధించి పెద్ద గ్రంథము రచింపవలసియున్నది. తత్సమమిశ్రమగు కావ్యములలో మార్గమును విడువఁజాలరుగాన దేశిమార్గములను గవిత్వముఁ జెప్పవలయు ననిరి. అట్లే వారును జెప్పిరి. మన సన్నిచోడుఁడు "దేశిమార్గములు దేశీయములుగా" (ఇట దేశీయములన నందములుగా నని యర్థము) ప్రబంధము రచించెను. దేశికవిత్వ మన దేశభాషలోఁ జెప్పిన కవిత్వమనియు మార్గకవిత్వ మన సంస్కృతకవిత్వమనియు సామాన్యార్థము. మార్గశబ్దపారిభాషికార్థము నుండియే యది సిద్ధించినది.

**జానుఁదెనుఁగు**

కావ్యాదర్శాదులందును దేశభాషాకవిత్వమును దేశియని వాడిరి. తెనుఁగు దేశిలో వాడుకలో నున్న తెనుఁగుమాటలను జానుఁదెనుఁగని వాడిరి. అదే యచ్చ తెనుఁగు. జానుఁదెనుఁగున కుదాహరణముగా నీయఁబడిన సోమనాథునిపద్య * మచ్చ తెనుఁగుననే రచింపఁబడెనుగదా. ప్రాంతమాటలు విడిచి వాడుకలోనున్న మాటలువాడుట యెప్పుడును గవులు గోరుచునే యుందురు.

* "బలుపొడతోలు సీరయును బాపసరుల్ గిలుపారుకన్ను వె
న్నెలతల సేదుకుత్తుకయు నిండినవేలుపుటేఱు సల్లుపూ
సలు గలఱేని లెంకనని జానుఁదెనుంగున విన్నవించెదన్
వలపు మదిం దలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా!"

కొన్నిచోట్ల రసావిష్కరణమునకో పాండిత్య ప్రకర్షమునకో గూఢపదములు గాఢముగాఁ గొంద ఱుపయోగింతురు. అది తాత్కాలిక సందర్భములను బట్టి యుండును.

పదపరిశరము.

దేశిమార్గముల ననుసరించి గ్రహించిన పదజాలములోఁ గాళిదాసాది కావ్యప్రయుక్తపదములు గొన్నియును సంస్కృతకావ్యప్రయోగముల యందున్న యర్థములకంటె భిన్నములగు నర్థములఁ బ్రయోగించిన సంస్కృత పదములు గొన్నియును సంస్కృత కావ్యములలో నప్రసిద్ధము లయినను గర్ణాటకాంధ్ర గ్రంథములయం దుపయుక్తములగు పదములు గొన్ని యును నాంధ్రకర్ణాటక భాషాసమప్రయుక్తము లగు దేశ్యతద్భవములలోఁ గొన్నియును నాంధ్రకర్ణాటకభాషలలో శివకవు లుపయోగించినవియుఁ బ్రాచీన గ్రంథములలోఁ గాన రానివియు నగు పదములలోఁ గొన్నియును నాంధ్ర తమిళ భాషా సమప్రయోగములలోఁ గొన్నియును మన నన్నిచో డుని కుమారసంభవమునఁ గన్పట్టుచున్నవి.

శివకవులకవితలోను దదనంతరకవులకవితలోనుగనఁబడు పదములుతత్ ప్రాచీన కావ్యములఁ గనఁబడకుండుటకుఁ గారణ మి ట్లూహింపవలసియున్నది. వీరశైవమతము దేశమునఁ గల వేద జైన బౌద్ధమతములను బ్రతిఘటింప వలసియుండెను. ఆమతము జాతి భేదశూన్యమై సార్వజనీనవిశ్వాసమును సంపాదించినది. అందుఁ జేరిన వారిలో బ్రాహ్మణులు మొదలగు విద్యాసంస్కా రము గలవారు కొందఱున్నను బెక్కండ్రు విద్యాసంస్కారదూరములగు జాతులకు సంబంధించినవారు. వారుమాలలు, మాదిఁగలు, సాలెవాండ్రు, మడివాలువారు, కుమ్మరవాండ్రు మొదలగు వారు. వారు నానాదేశస్థులు, ఆ యా భాషలలో సంస్కారశూన్యులు వాడుకొను (గ్రామ్య) భాష మాటలాడు వారు. వీర శైవ మత ప్రచార పీఠమగు కల్యాణీకటక మాంధ్ర కర్ణాటక ద్రావిడ మహారాష్ట్రాది జనుల సమావేశమున కనువైన స్థలము. ఆంధ్ర కర్ణాటకాదిపద సంకరమున నొకవిధమగు మార్పు చెందిన దేశ్యాది పదజాల మేర్పడినది. ఈ కాలమున యుద్ధపరిభాషలను రాజకీయాందోళనాదివిష యమునందలి పరిభాషలను దెలుపు (సంస్కృతాంధ్రాంగ్లహిందీ ప్రభృతిమిశ్ర) పదజాల మెంత బయలుదేఱినదో మన కనుభవసిద్ధమే కదా! వారిలోబోధ కులు బోధించునపుడు తత్తత్పరిచితభాషలో సర్వజనసుబోధముగా దేశి బహుళముగా నుపన్యసించుటయు రచించుటయు సంభవించును. వారు సంస్కృ తమును వలదని నిషేధము చేసియును రసపుష్టికో, పండితాకర్షణమునకో సంస్కృత పదజాలమును గూడ నుపయోగించుచుండెడివారు. వారును గవిత

లో మార్గమును విడువనివారేకదా. కాని సంస్కృత నియమము లుల్లఘించి మతాచారములందుఁ బోలె భాషాసంప్రదాయమునను స్వతంత్రత కొంత చూపిరి. అవి వారిశిష్యబృందమువారు సాధించి గ్రంథములకెక్కించి యుండిరి.

తద్ గ్రంథపఠన సంస్కారమునఁ దర్వాతి గ్రంథములకుఁ గూడ నది యెక్కి యుండును. కన్నడమున లాక్షణికు లాపరిణామము గ్రహించి శివకవుల కంటెఁబూర్వులగు జైనకవులును బ్రాహ్మణకవులును బ్రయోగించిన పదజాలమును బ్రాచీన కర్ణాటక మనియు, శివకవుల కవితలో మాత్రము గనఁబడు పదజాలమును నవీనకర్ణాటక మనియు విభజించికొనిరి. తెనుఁగున నట్టి విభాగము లేకున్నను, బ్రాఁతమాటలు ప్రయోగింపఁ గూడ దనియు జాను తెనుఁగున గ్రంథములు రచింపవలయు ననియుఁగవులే యుద్ఘోషించుచుండిరి.

ఆ మహాభాషాపరివర్తనమునఁ గన్నడము మొదలగు వానిలోఁ దెనుఁగు పదములును దెనుఁగున నితరభాషాపదములును గొన్ని చేరియుండును. ఆంధ్ర కర్ణాటకాదిభాషలు సహజముగా సోదరస్థితి నున్న భాషలు గావునఁ బరస్పరము గలసిమెలసి యుండి యేది యే భాషకు మొట్టమొదట సంబంధించినదో తెలిసికొనుటకుఁగూడఁ గష్ట మగునంత నెనయికను బొందినవి. అట్టి నవీనపదజాలము నన్నయాదికవితలో నుండుట యసంభవము గదా. పండ్రెండవ శతాబ్దియందును దదనంతరమునను బయలుదేఱిన గ్రంథములలోఁ గన నగును. అట్టి పదములు గొన్ని తిక్కనాదుల కవితయందును గలవు. నన్నయాదికవితామాత్రప్రమాణులగుటచేఁ గాఁబోలుఁ గొందఱు తదనుసారమునఁ దిక్కన కేతనాదుల గ్రంథములలోనిపదములను మార్పుగావించి రని స్పష్టముగాఁగనఁబడుచున్నది. కొన్నిమాత్ర ముదాహరింపఁ బడును.

I. 'గమకి' యను పదము చూతము. భారతమున నుద్యోగ పర్వమున (౩-౨౩౨) "ఉండం గవి గమకి ప్రముఖ విద్వజ్జనంబులు" అనుచోటఁగలదు. 'గమకి' అనఁగా మంచిశయ్యలో (గమకముగా) పద్యము చదువువాఁడు అని యర్థము 'కవి గమకి వాగ్మివాదులు' అని దిద్దఁబడని తెలుఁగుగ్రంథములందును 'కవి గమకి వాగ్మివాదియర్' అని కన్నడపు గ్రంథములందును సుప్రసిద్ధముగా నున్నది. భారతమున దీనిని 'గణక' అను పదముగా మనగ్రంథపరిష్కర్తలు దిద్దివేసిరి. తాళపత్ర గ్రంథములందు 'గమకి' అని కొన్నిటిలోను 'గమక' అని కొన్నిటిలోను గనఁబడినది. పోనిండు మరల 'గమకి' అని సవరణ చేయవచ్చును. ఈ పదము కన్నడపదమా? తెలుఁగు పదమా? రెండును గావు సంస్కృతపదము. ఇది సంస్కృతముకంటెఁ గర్ణాటకాంధ్రములంచే ప్రాయికముగాఁ బ్రయుక్తమయి యున్నది. ఆంధ్రగ్రంథముకంటెఁ బ్రాచీనమగు కన్నడగ్రంథమున నుండుటచేతఁ గన్నడపు సంప్రదాయ

మనవలెను గదా! అప్పుడు 'గమకి' ప్రయోగము చేసిన తిక్కన గ్రంథము కర్ణాటకపద దూషిత మందుమా ?

II. మఱి యొకటి. 'సూయాణ' మనియొక పద మున్నది. తిక్కన విరాట పర్వమున (౧-౩-౩౮౧) "తగునాజ్ఞ సూయాణముగ నొనరించె మంచిగ నేల నాలుగు చెఱఁగులను" అనుచోటఁ బ్రయుక్తము. సూయాణ మనఁగా చీర, సాలువ, తెఱ మొదలగు వాని యంచులయందు సూదితో దార మెక్కించి హంస మొదలగు వాని బొమ్మలు వచ్చునట్లు కుట్టు చేతికుట్టుపని. దీనికిఁ బ్రాంత కన్నడమున నెన్నియో ప్రయోగము లున్నవి. ప్రయోగములే కాక శబ్దమణి దర్పణమున 'సూచీయాన' అను సమాసములో మొదటి పదమందలి చివర యక్షరము లోపింపఁగా సూయాణము అను రూప మేర్పడిన దని నిరూపింపఁ బడి యున్నది. తెనుఁగు ప్రయోగముకంటెఁ గన్నడమందలి ప్రయోగమే ప్రాచీనతరము. ఇప్పుడు ఇతరభాషాపద ముపయోగించె నని తిక్కనను దూషింతురా? 'సూయాణము' అచ్చులో నిలిచి యున్నది. కాని, భారతము లక్ష్మీపతి గారు తెలుఁగు భారతమునకుఁ డీక వ్రాసిరి. వారి తాళపత్ర గ్రంథమున 'సూయాణమును' 'సయ్యానము'గా దిద్దిరి. అది సరిగాదు. అది [1]సూయాణమే. 'సూచీవానము' అనుచేతి కుట్టుపని. ఇది చతుష్షష్టి కళలలో నొకటి.

III. పొయితల అని కేతన ప్రయోగించెను. (దశకుమార చరిత్ర-౨) (పొయ్ = అసత్యము, అబద్ధము, తమిళము) పొయితలై అనఁగా అబద్ధపు గల. అది నిజముగాఁ దలకాదు, తలవలెఁ గనఁబడు తల అని యర్థము. దొంగలు కన్నములోఁ దూఱుటకు ముం దింటిలోని వారు మెలఁకువతో నున్నారో లేరో పరీక్షించుటకుఁ జేతతల కన్నములోఁ దూర్చెడివా రఁట. ఇది దొంగల సాధనములలో నొకటి. ఈ తమిళపద ముపయోగించిన కేతనను దూషింతురా! ఇట్టి వనేకము లున్నవి. విస్తరమేల.?

అయినను ముఖ్యముగాఁ జూపఁదగిన పద మొకటి గలదు. 'అది బింధము' కేతన దశకుమారచరిత్రమున "కలము బిందంబైన ... ..." అని యున్నది. దీనిని మొట్టమొదటఁ బ్రకటించిన వీరేశలింగము పంతులుగారు 'భిన్నంబైన' అని యొకచోటను 'భిత్తంబైన' అని మఱొకచోటను దిద్దిరి. నన్నిచోడుని కవిత్వమున 'బిందము' అనునది రెండుచోట్లఁ గలదు. 'భేదంబు బిందంబు' అని విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణిలోఁ జెప్పియున్నాఁడు.

ఇట్టిపదముల ప్రయోగమున నన్నిచోడునికవిత్వ మితర భాషా దూషిత మనిన వీరేశలింగముపంతులుగారు కేతననేల దూషింప కుండిరి?

---

1. దీనిని గుఱించి విపులముగా. 12-12-1936. ఆంధ్రపత్రిక చూడఁదగును.

వారు దిద్దివేసిరిగాన మొదటఁ బరులదృష్టిలో నది పడలేదు. తాళపత్ర గ్రంథమున 'బిందము' అని కనఁబడుచున్నది.

ఇట్టిపదములన్నియు నాంధ్రకర్ణాటక ద్రావిడభాషాసమప్రయోగములు గ్రహించిన సర్వవిధముల సమంజస మగును.

కవుల చరిత్రమున (౧౯-వ పుట) "నన్నిచోడుని కవిత్వ మన్యభాషా పదదూషితము కానియెడల సుత్తమమయినదే" యని వీరేశలింగము పంతులుగారు వ్రాయుట న్యాయ్యముగాదు. భారతకవితా శైవకవితా సముచ్చయ మనఁదగు నన్నిచోడునికవిత యన్యభాషాపదదూషితముగాదు. ద్రావిడ భాషాసమప్రయోగపద భూషితము.

ఇచ్చట నొక్కవిషయము పరిశీలింపవలసియున్నది. ఈతని కవిత్వమున 'తలతంత్రము, కేనము, గోమిని' మొదలగు పదములు గలవు. ఇవి నవీన కర్ణాటక భాషలోని వని ప్రయోగములను బట్టి కర్ణాటకపండితులు దెలుపుదురు. ముఖ్యముగా భారత నిఘంటువు షట్పదీకవిత్వములోనిభారతపదములకు మాత్రమే యేర్పడినది. నన్నిచోడుని కవిత్వమున నా నవీనకర్ణాటక భాషలోని వని యెంచఁబడిన పదములుగన నగుచున్నవి. కావున శైవకవి ప్రయుక్తములగు కర్ణాట కాంధ్ర పదములుగూడఁ గుమార సంభవమునఁ బ్రయుక్తము లయి యున్నవి.

వైరి సమాసములు.

ఈ పదములలోఁ గొన్ని సమస్తపదము లుండునుగదా! వానిలో "తద్భవముగాని దేశ్యముగాని సంస్కృతసమముతో సమసింపరాదు అనియు నట్లు సమసించినవి వైరిసమాసము లనియు' భాషానుశాసకులు చెప్పుదురు. ప్రాణగొడ్డము, కలికంఠుఁడు, ముల్లోక విభుఁడు మొదలగునవి తెనుఁగునఁ బ్రాచీన రచనయందును గనఁబడుచున్నవి. అవి గ్రామ్యము లనియుఁ బెద్దలు ప్రయోగించిరి. కానఁ దర్వాతివారు గ్రామ్యము లని గ్రహించిరి. ఇట్టివి వైరి సమాసము లని విన్నకోటపెద్దన చెప్పియుండెను. మిగిలినవారు గ్రామ్యము లనిరి. కన్నడమున శబ్దమణిదర్పణ కారుఁడీ విషయమునఁ గొంత విచారణ గావించి యిట్టిసమాసములు గొన్ని మాత్రము గ్రహించి మిగిలినవి గ్రహింపరాదని నిషేధించి యున్నాఁడు. తద్భవ దేశ్య పదములకును సంస్కృతములకును సమాసము కూడదు అను సామాన్య సూత్రమునకు విశేషవిధిగాఁ దద్భవము చేయుటకు వీలులేని సంస్కృత పదము తద్భవముతో సమసింప వచ్చును అని వచించెను. 'ముఖతావరె, అరసు కుమారం' మొదలగునవి యుదాహరించి 'మాణిక్య భండార' మను ప్రయోగము సాధువు కాదని నిరసించెను. ఆ విశేష విధిచే ననుగృహీతములగు వైరి సమాసములు గొన్ని నన్నిచోడుని

కావ్యమునఁ గలవు— రాగ దీవియలు, అమరలేమ, చౌషష్టి కళలు మొదలగునవి. అవి ముద్రణమునఁ గొన్ని దిద్దిరి గాని వ్రాఁతప్రతిలోఁ గననగును. ఇట్టివి ప్రాచీనకావ్యములలో నొకటి రెం డున్నను శివకవుల కవిత్వమునఁ బ్రాయికముగా నున్నవి. ఇట్టి వానిని సాధించుటలోఁ గొందఱు ప్రాణగొడ్డము ప్రాణకోష్ఠక శబ్దభవ మందురు. ప్రాణకోష్ఠక శబ్దము ప్రయోగమున సుప్రసిద్ధమయినపుడు గదా తదుచ్చారణ లోపముననో యుచ్చారణ సౌలభ్యముననో యట్టిరూప ముద్భవించుట. అదియే యప్రసిద్ధమగునపుడు 'ప్రాణగొడ్డమును' సాధించుటకై 'ప్రాణకోష్ఠకము' గల్పించుకొనుట యుచితము గాదని నా భావము. పదపదార్థ వాక్యాన్వయసరణి కొంత శివకవుల కవిత ననుసరించి నన్నిచోడుఁడు ప్రయోగించెను. 'త్రిభువన పెండేరము' అరాతి భయదరాయ పెండార బిరుదాభిరాము నుభయరాయ గండాంకు'' మొదలగునవి బిరుదములలో నుండుటచేతఁ దిక్కన కేతనలును గ్రహించియే యున్నారు.



# షష్ఠప్రకరణము.

---

తిక్కన కేతనల పద్యముల యనుకరణముచేతనే కుమారసంభవ కవిత్వ మేనాఁటిదో తేలుచునేయున్నను, కొందఱు నన్నయ్యకు బూర్వము నూఱుసంవత్సరములనాఁటి కవిత్వ మనుటచేతఁ గొంత విమర్శనము చేయవలసియున్నది.

నన్నయ్య నాఁటిరీతి.

నన్నయ్యకుఁ బూర్వాపరంబుల రచనలోని పద్ధతులు కొన్ని నిరూపించి యవి నన్నిచోడకవితలో నెట్లున్నవో చూతము. నన్నయ్యకుఁ బూర్వమందు గ్రంథములు కానరావుగాన శాసనములలోని కవితారీతినిబట్టి చూతము.

సీసములోని విశేషములు.

I. "సీ. ... ... ...నన్నేలు నలరామ విభునితోడ
నెడటి (నబో) యల నడవి సా (న్పా?)
లోహాసనంబెక్కి రాహాను నొడిచిన వల్లభుకొల్పున నెల్ల నెఱుంగ
కన్నరా భూపతి వెన్నాజిలోం జూచె సంకిలం డనుజేని పంకముడిచె
దణ్ణాడై వచ్చిన బెణ్డైనబోఱనిం జేకొని కాచె భూలోకం బెఱుంగ
కిసరవుం ముడహాల నిరుతంబు దట్టె నాండు నచలపురము సొచ్చె
[నచలితుణ్డు
వల్లభుణ్డు గుణకె నల్లుణ్డు వచ్చినం బణ్డరంగచూవె పణ్డరంగు."

ఇది శకసం. ౮౧౮ అగు నాఁటి చాళుక్య భీముని శాసనము.

II. "శ్రీ విష్ణువర్ధన భూవిభుదయ భూమిదేవింబోల్ రేవలదేవి కనిన
సోమలదేవి గుణారామ జగదేక సుందరి మత్తేభ మందగమన
దొల్లి భీమేశ్వరవల్లభునకు సితమణిబంధ మిచ్చె సన్మణియుతముగ
నురువిచ్చె గంగనాం బరువిడి వినివారిం బురడించు నట్లు సరసిజాస్య
కనకరచితరుచిరకల్పావనీరుహ
కుసుమ మిచ్చెఁ దనకు నసము వెరుగ
వెణ్డి మండతో నఖండితద్యుతి దీప
మమర నిచ్చె విమలకమలనేత్రి.

ఆ. వె. సకల వసుమతీశ మకుట సద్రత్న
కిరణరుచి విరాజ చర(ను?) ణ్డయిన
నిజభుజప్రధాని బెజయిత దేవని
కూంతు సరియ పోల్పం గాంత లెందు"

ఇది శక సం॥ ౯౮౭ లోనిది.

III. "సీ. శ్రీశకునేండ్లు భూపతివైశైల నందాబ్ధభవసంఖ్య నొంద వేంగి
దేశంబు గిమిడియగోసల గిండ్రిసింగి దేశంబుమటి యొడ్డదేశ మనఁగఁ
జనినభూపాలుర నని నొచ్చ్చె చలమర్తి గణ్డన్డై నెగడిన మణ్డలికుణ్డు
భూసురవంశుణ్డు శాసననిభభోగి బణపతిసౌజన్య గుణయుతుణ్డు
దీర్ఘాసి భగవతిదేవిదేవాలయ మునముందటంగడు ఘనతరముగ
మణ్డపమెత్తించె భణ్డన విజయుణ్డు గణ్డగోపాలు ణ్డఖణ్డవర్తి
దీవియవెట్టె నద్దేవికి నవ్వేలం దనమనోవల్లభి వనజనేత్రి [మున.
దీవియవెట్టం బద్మావతియును క్షోణీన శశులు గలయంతకును ముద?
గగనభూమిచంద్ర- ఖరకరోదకశిఖ
మారుతాత్మమూర్తి మహిమమథన
యిష్టపూర్తఫలము లెల్లకాలంబును
మెచ్చుతోడం దమకు నిచ్చుచుణ్డు."

దీర్ఘాసిశాసనము శకసంవత్సరములు ౯౯౭ అగునాఁటిది.

ఈ శాసనములు ప్రకృతము సీసముల నియమము తెలిసికొనుటకే గ్రహింపఁబడినవి. 'దీర్ఘాసి భగవతిదేవి దేవాలయ' అనుచోట దుష్కర ప్రాసమగుటచే యతి ప్రయోగించి యుండును. అచటఁ దప్ప మిగిలిన సీసముల నన్ని దళములందును బ్రాసయతి నియతముగాఁ బ్రయోగింపఁబడినది.

IV. "సీ. లాటవిలాసినీలాలాటతిలకునిం గేరలీకరలగ్న కేళిపద్మం
గన్నాటసుందరీ కర్ణావతంసునిం గుంతలీకుంతల కుసుమదామ
గాడసతీనేత్ర కాలాంజనుని నంగభామాకపోలా ప్తపత్రరచను
నేపాలకామినీనీరంధ్రకుచహారు నంధ్రీతనూకుంకుమాంగరాగు
రమణతోనాది దానుల రాసికెక్కి
దీనజనములయెడ తెల్లం దీర్చు చు (న్న)
యనఘచారిత్రు మాడపండనిన తగిలి
పొగడ విందము నెల్ల భూభుజుల సభల."

ఇది శక. ౧౦౬౮ లోనిది.

నన్నయ్యభట్టు కవిత్వమున సీసములందుఁ బ్రాసయతి ప్రారంభించి నచోఁ దుదివఱకుఁ బ్రాసయతియే యుంచుట, యతి ప్రారంభించిన యెడల యతియే ప్రయోగించుట, కొన్నిచోట్ల గీతములందుఁ బ్రథమ తృతీయ చరణములందును, ద్వితీయ చతుర్థ చరణములందును సమాన మగు నియమము గలుగుట మొదలగు నియమములు కనఁబడుచున్నవి. భారత సంపాదకులలోఁ

గొంద తా నియమము పాటింపక శిథిలభాగములు పూరించినపుడో యర్థము స్ఫురింపనపుడో కొన్ని దిద్దివేయుటచేతఁ గ్వాచిత్కముగా నట్టి నియమము లేనిస్థలము లుండవచ్చును. తాళపత్త్రగ్రంథములలోఁ బరిశీలించినయెడల సరియగు పాఠములు లభించు నని తోఁచును. కొన్నియట్లు దొరకినవి. ఆ నియమము క్రమముగాఁ బోయినది. తిక్కననాఁటి కవిత్వమున నది యొక యలంకార మయినది. నన్నిచోడుఁడు తన కవిత్వమున నక్కడక్కడ నలంకారరూపముగానో నన్నయ్యాయనుకరణముగానో, యట్టివి ప్రయోగించినను సర్వసాధారణముగా నా నియమమును పాటింపలేదు. ఈతఁ డా నియమపుంపునాఁటివాఁడు గానే కాఁడు. ఆప్రాంతమున నున్నయెడల నది మానఁగలఁడా?

**అక్కరలు**

ప్రాచీనశాసనములలో వృత్తములు గానరావు. సీసము, గీతములును నక్కరలును గలవు. యుద్ధమల్లుని శాసనమున నక్కరలున్నవి. నన్నయభట్టు భారతమున నక్కర లున్నవి. ఎఱ్ఱాప్రగడ భారతమున నన్నయ్యభట్టు రచనకా రచింపఁ దలఁచెఁ గాన నక్కర లుపయోగించినాఁడు. నృసింహ పురాణమున నక్కరల నుపయోగింపలేదు. తిక్కనాదులు నక్కర లుపయోగింపలేదు. నన్నిచోడుఁడు నన్నయ్యకుఁ బూర్వుఁడో తత్ప్రాంతమువాఁడో యయినచో నక్కర లుపయోగించి యుండుట సహజము.

**అవధారణార్థకము**

అవధారణార్థమున నన్నయ్యకవిత్వమునను తత్ప్రాంతకవిత్వమునను 'అ' ఉపయోగించుట సంప్రదాయ సిద్ధము. తర్వాతి కవిత్వమున 'ఎ,ఏ,' అనునవి యుపయుక్తములు. నన్నిచోడుని కవిత్వమున నవధారణార్థమున 'ఏ' లు గనఁబడుచున్నవి. ముద్రితమున 'ఏ' లు 'అ' లుగా మాఱిపోయినవి. 'చేనఁబండినవిత్తు చేనికెఫలకాంక్ష' అని వ్రాఁతప్రతి. 'చేనిక' ముద్రితము. "నిజమైయున్నవి రుద్రచిహ్నాలివె పీనిం బుచ్చి రానేర్చిరే" ఇట ముద్రితమున నట్లె యున్నది. ఇదియు దిద్దుద మనుకొనుఁడు. నన్నయ్యకుఁ బూర్వుఁడన్న విశ్వాస మున్నపుడు 'ఇవె' అన్నది లేఖక ప్రమాద మనిపించును.

"తరుణీరాజ. భువనంబు లన్నియుఁ బుట్టించు కర్త్యపుడు వానిఁ గైకొని ప్రోచుఁజంద్రుండు
అవయవంబుల వాని నడఁచుధర్మ్యుండు నతిభక్తి నా కిచ్చెనర్చన లర్థి
నివి వారిలోనఁ దానే పెద్దపొంది యాశానుఁ డేఁ దనయింటికిఁ జన్న
నవమాన్యుఁ జేసె నాయల్లురు నేనునై తన్నుఁ జేయుదునాగమబాహ్యు."
I. 146.

"క. తొల్లిటి దోషములైనవి
మెల్లను సైరించిమి మాకు నింకటఁదాన్నే
వల్లె యని నడచి మదిఁ దన
వాల్లభ్యము దక్కఁజూడ వచ్చినఁ జాలుఁగా." (II. 490.

ఇవియు నన్నిచోడుఁడు నన్నయ్య కర్వాచీనుఁ డనియే చాటును.

**పవలకు బవలకు యతిమైత్రి**

పవలకు బవలకు యతిమైత్రి నన్నయ కవితలోఁ గానరాదు. భారతారణ్యపర్వమున (౧.౩౧౧) చ ... ... పర్వతము గ్రహించినట్లు బలవంతుఁడు దాని గ్రహించి ఘోర నక్షత తనుఁడయ్యె" అనుచోట 'గ్రహించినట్లు తన బాహువుల దాని గ్రహించి' అని యప్పకవి పాఠ మున్నది గాని 'బలవంతుఁడు' అన్న పాఠమే తాళపత్ర గ్రంథమునఁ గలదు. అదియే నన్నయ ప్రయుక్తమని తోఁచెడిని. తిక్కనకవిత్వమున భారత శల్యపర్వమున (౨.౨౧.)

'క. ... అప్పురుసఁదన మేమిసెప్పుదుఁ

బౌరి మిడుఁగుఱు లెగసి కైదువులపొడి రాలెఁగా" అను చోట పవలకు లేక బవలకు యతి కనఁబడుచున్నది గాని, యచట 'కైదువులు' అని తిక్కన ప్రయోగించి యుండును. 'కైదువు' అనుదానికి 'కైదువు' అను రూపాంతరము కన్నడమునఁ గలదు. అట్లె తెనుఁగునను నుండవచ్చును. తెనుఁగు కన్నడముల సమానప్రయోగములు గల పదములు తిక్కన కవితలోఁ బెక్కులు గలవు. భారతమున నితర స్థలములందు బవయతి లేదుగాన నిటఁ'గైదువు' అనుటయే సమంజసము. ఇట్టి యతి నన్నిచోడకావ్యమునఁ గలదు.

"సీ. వినువీథి నెడయాడి బిసినికౌఁగిటిలోన, నిలఁదావగొనియున్న వెలుఁగుఱేఁడొ. (II. 421.)

"ఆ ... ... .. సురవిరోధి,
బలములిట్లు పన్నివచ్చెనో పటురజ
స్తమయుత ప్రదోషతా విభూతి"

ఇట్టి వింకను గలవు. ఇవి యతిప్రాచీనత్వప్రతిబంధకములు.

**చిత్రకవిత**

ఆరోహి ణ్యవరోహిణీ రూపచిత్ర కవితావిశేషములును, గందగర్భవృత్తములును, జతుర్విధకందమును, నాగబంధ మురజబంధ చక్రబంధములు నరసముగా నుపయోగించిన నన్నిచోడునికాలము నన్నయ్యకుఁ బూర్వమో సమీపమో యనుట పొసఁగునా ? నన్నయ్యయే కాదు తిక్కన్నయు నివి యుపయోగింపలేదు. తిక్కన్న స్త్రీపర్వమునఁ గొన్ని విశేషవృత్తము లుపయో

గించుట యొకవిశేషముగా మెచ్చుకొనెదము. నన్నయ్యకాలమున నది లే దందుము. అట్లే బంధకవిత తెనుఁగునఁ దిక్కనకాలమునను వ్యాపించి యుండ లేదని తోఁచెడిని. అది నన్నిచోడుని కవితలోఁ గలదు. వానిలో నాగబంధ చక్రబంధములు దీని యనుబంధమునఁ బొందుపఱుపఁబడును.

ఇంక వ్యాకరణ విషయములు చూతము—

'నః కా' సూత్రము

షష్ఠీ ప్రత్యయమగు 'కు' వర్ణకమునకుఁ బూర్వము నకారము వచ్చుట భారత కవిత్వమున సార్వత్రికము. అదిలేని రూపము లర్వాచీన ప్రయోగము లలోఁ గనుపట్టును. అట్టివి నన్నిచోడకవితలోఁ గలవు.

"క. కరములను రాహువు దివా
కరుఁబట్టఁగ నభము కెగయు గతి బొలుపెసఁగెన్," II. 734.
"కానుకు బిందమయ్యెడిన్" II. 16.
నభమునకు అనియు నిందుఁ బ్రయోగము గలదు.

చేతురు మొ॥ రూపములు

వైయాకరణు లందఱును నిషేధించిన రూప మిందుఁ గానగును' యోపధకధాతువులకు (చేయు, కోయు, నేయు, వేయు మొదలగువానికి) చేతురు, కోతురు, నేతురు, వేతురు, మొదలగునవి నిషిద్ధములు. 'చోపధకము లకు (చూచు, వేఁచు, ఏచు, వైచు, మొదలగువానికి) చూతురు, వేతురు, ఏతురు, వైతురు, అను రూపము లగును. వాని సాదృశ్యమునుబట్టియే యోపధకములకుఁ గూడఁ దకారము లోకులు వాడియుందురు. 'చేతురు' అని నన్నిచోడుఁడు ప్రయోగించెను. నన్నిచోడుని ప్రయోగము ప్రాచీనత్వప్రతి బంధకమని యెంచి కాఁబోలును సంపాదకులు దాని రూపుమాపినారు. ఇందే (130 పుట) యిచ్చిన "ఇది నావల్లభు ... ... ..." పద్యము చూడఁదగును. ఇవి దిఙ్మాత్రముగాఁ జూపఁబడినవి. నన్నయ్య కవితలో లేనివి తర్వాతి వారి కవితలో నున్నవి యెన్నియో నన్నిచోడుని కవితలో నున్నవి.

సంధివిశేషము

"శా. భ్రూలాస్యం బధరోష్ఠకంపము ముఖాంభోజాతసౌరభ్య మా
లోలాలోకన వక్త్రమొక్కెడ చాలు నొ్నంప నీయల్కవోఁ
గా లీలావతి దీనిపై మగుడ నీకన్నీరు లింకేల న
న్నేల నొ్నల్లక పుష్పబాణునకుఁ బట్టీఁ జూచితే నిర్దయా" (II. 176.)

ఇందు నన్ను ఏలన్=ఏలుటకు, ఒల్లక=ఇష్టపడక అనియర్థము. న న్నేలుట కిష్టపడక మన్మథునకు పట్టి యియ్య చూచితివా? అనిభావము. ఇట్టి

ప్రయోగములు నన్నయ్యభారతమునఁ గానరావు. ఆకారణమున నేకాఁబో లును సంపాదకులు 'ఏలా యొల్లక' అని ముద్రింపించిరి. దిద్దుటకు మన మెవ్వరము ? దిద్ద నావశ్యకతయు లేదు.

**స్వార్థకసంధి**

'పట్టీఁజూచితే, వయిపద్యమున నేకలదు. ఇట్టి వింకను ననేకములుగలవు.

**మొట్టమొదటి పద్యము సంస్కృతమున రచించుట**

నన్నయభట్టు భారత రచనారంభమునఁ "శ్రీ వాణీగిరిజాః ..." యిత్యాది త్రిమూర్తి స్తవము సంస్కృతమున రచించెను. పావులూరి మల్లన్నయు విష్ణ శ్లోక పెద్దన్నయు నట్లే కావించిరి. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున శ్లోకమే రచించెను. తిక్కన భారత విరాటపర్వారంభమున హరిహర స్తవము తెనుఁగుపద్యమున రచించినను "కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా ..." అను శ్లోకమును బ్రవేశపెట్టినాఁడు. సంస్కృతము విడవలేక పోయినాఁడు. నన్న య్యాదులకుఁ బూర్వమందు రచింపఁబడిన కర్ణాటక భారతాదులందు గ్రంథ మధ్య దేవతాది స్తవము గూడ సంస్కృతమున రచించుట గలదు. మనవారికి దేవతాధ్యానాదులం దాంధ్రపద్యపఠనముకంటె సంస్కృతశ్లోకపఠనము నధి కాదరముతోఁ జేయుదురు. కావుననే నన్నయ్యభట్టు రాజరాజ నరేంద్రుఁడు సభారంభమునఁ గావించు ప్రతిదిన స్తవముగా "శ్రీ వాణీగిరిజాః ..." ఇత్యాది శ్లోకము పఠించినట్లు రచించినాఁడు. భారత రచనా విఘ్నపరిసమాప్తికొఱకుఁ జేయుహరిహరాది స్తవము తర్వాత రచించెను. అట్టియౌచిత్యము నిర్వచనోత్తర రామాయణాది గ్రంథారంభమునఁ జేసిన శ్లోకములలోఁ గానరాదు. తిక్కన విరాటపర్వాదిరచనను దర్వాతివా రనుసరించిరి. నన్నిచోడుఁడు నట్లే కావించె ననవచ్చు. పూర్వశాసనములోఁ గొన్నిసంస్కృతములో నారంభ మయి తెనుఁగుతో ముగిసినవి గలవు. ఇది సాధారణసంప్రదాయ మయినది. వారివారి సంస్కృతాదరమును బట్టి, యర్వాచీనులుగూడ శ్లోకములు రచించిన రచించియుండవచ్చును. దానికేమి ?

**క్రొత్త కన్నడము నందలి పదములు**

ఆంధ్రమునకుఁ గన్నడమునకును సాధారణమగు పదజాలము గొంత యున్నది. కేవలము కన్నడములోని పదములు తత్ప్రాంత వాసులచే వాడఁ బడినవియు నాంధ్రకవులు గ్రహించినవియుఁ గొన్నియుండవచ్చును. వానిలో నన్నిచోడుని కవితలో హాస (క్రొత్త) కన్నడమునఁ బండ్రెండు పదుమూఁడు శతాబ్దులకవులుపయోగించినవియుఁ దత్పూర్వుల కవిత్వములోఁ గానరానివియు నగు కొన్ని పదము లున్నవి. అవి నన్నయప్రాంతమున నున్నవనుట కవకాశ ములేదు. అట్టివానిలో గొన్నిచూతము.

తలతంత్రము.

"ఉ. దారలు వట్టఁబంపు తలతంత్రము దా పడి నంపు రత్న భం
డారముతోడ గుట్టపు దడంబులు మూఁగలి వంపు... ..." II. 575.

ఇందుఁ దలతంత్ర మన సేన. హానా (క్రొత్త) కన్నడమునఁ 'తళతంత్ర' అనునదికలదు. ఇది వట్పదీ కవిత్వమున నే కలదు. ప్రాచీనకవుల ప్రయోగము లలోఁ గానరాదని తద్భాషాపండితులు వచింతురు. ఇందలి 'రత్నభండారము' నట్టిదే.

గోమిని

గోమిని యనఁగా లక్ష్మి. ఇదియు నవీనకర్ణాటకపదమే.

" సీ. తరణి కూటమున మేమెఱలి పద్మిని మేన
మొలతెంచు మధుమద మొలుకకుండ
మేల్కాని గోమిని మెలఁగి మై మురిసినఁ
బొదిగొన్న యకరువు సెదరకుండ." I, 351.

పుడమిపుఁడు

"పుడమిపుఁడుర్ ధనాఢ్యుఁడును భూరిబలుండును శౌర్యవంతుఁడుర్"
(II. 614)

ఈ శబ్దమును గుఱించి కొంత విచారణ చేయవలసి యున్నది. 'పొడవిప' అనునది కన్నడమునఁ గల రూపము. ఇది పదుమూఁడువ శతాబ్ది ప్రాంతపుదే కాని తత్ప్రాచీనము కాఁజాలదు. కారణ మేమన ?

కన్నడమునఁ బ్రమాణమగు శబ్దమణి దర్పణమునఁ జెప్పిన ప్రకారము తత్భవమునకును దద్భవమునకును సమాసము గలదు గాని, సంస్కృతసమమునకును దద్భవమునకును సమాసము కూడదు అని సామాన్య సూత్రము. తద్భవము చేయుటకు వీలులేని పదములును దద్భవములును సమసింప వచ్చునని విశేషసూత్రము గలదు. కావున 'పొడవీస' అనుపదమున పొడవి అనునది పృథ్వీ శబ్దభవము. 'ఈస' అనునది ఈశ శబ్దభవము. ఈ రెండు తద్భవములును సమసించి 'పొడవీస' కావచ్చును గాని, తద్భవమగు పొడవి అనునదియు, ఈశ అను సంస్కృతమును సమసింపరాదు. కావున, 'పొడవీశ' అనరాదు. 'పొడవిప' అనుదానిలో 'ప' అనునది వ్యస్తపదముగా నుండఁదగదు గాన 'పొడవి' పదముతో సమసింపరాదు. కావుననే, ప్రాచీన కర్ణాటకమునఁ 'పొడవీస' అనురూప ముండిన నుండవచ్చునుగాని, 'పొడవిప' అని యుండదు. అందు శైవకవులు క్రొత్త కన్నడమున ద్వాదశశతాబ్దిప్రాంతమునఁ బైనియమము పాటింపక 'పొడవిప' 'పొడవీశ' అనియుఁ బ్రయోగించిరి. ఆసంప్రదాయమును బట్టియే తెలుఁగుకవు లాపదములకు బదులు 'పుడమిాశుఁడు,

పుడమిపుఁడు, పుడమీశ్వరుఁడు' అనునవి ప్రయోగించిరి. తెనుఁగున 'పుడవి' రూపము గలదు గాన, పుడవిపుఁడు పుడవీశుఁడు అని మొదటఁ బ్రయోగించి యుందురు. అది కన్నడమునకు దగ్గఱి రూపము. ఆ పదమునకు లఘుటీక వ్రాసిన మ. రా. శ్రీ. రామకృష్ణకవిగారు "పుడమి శబ్దము సంస్కృతమో లేక కఱకంఠాది శబ్దములవలె సాధువు లయ్యెనో కాని, యాంధ్రకర్ణాటక భాషలలోఁ బుడమీశాది సమాసములు బహు ప్రామాణిక ప్రయోగములలోఁ గానవచ్చుచున్నవి. కన్నడమున "పొడమీశం గదెయనెత్తి తిరిపిద నాగళ్" గదా.౮-౪౦" అని వ్రాసిరి. పయిన చెప్పిన రీతిని 'పొడవీస' అను రూపము కావచ్చును గాన, గదాయుద్ధమున నదియే ప్రయుక్తమయి యుండు నేమో! 'పొడవీశ' హళాసకన్నడరూపము. 'పుడమీశ' అని యేకన్నడమునను నుండదు. 'పుడమిపుఁడు' అను ప్రయోగమే త్రయోదశ శతాబ్ది లోనివాఁడో తర్వాతి వాఁడో యని చాటుచున్నది. ఈ విషయమునఁ గర్ణాటక పండితులతో సంప్రతింపఁగా గదాయుద్ధములోని 'పొడవీశం' ప్రక్షిప్తమయియుండు నని యును, 'పొడవీస, పొడవీశ; పొడవిపతి, పొడవిప 'అనునవి ప్రాచీనములు గావనియుఁ గ్రొత్త కన్నడములోని వనియును జెప్పుదురు. అయినను శబ్దమణి దర్పణ రీతిని సాధ్యమగు రూపములు దెలుపఁబడినవి.

**కేనము**

కేనము = అసూయ, మానసిక భేదము, ఆలోచన, అఱమఱిక, వెను దీయుట అను నర్థములందు నన్నెచోడుఁ డుపయోగించెను. 'కేణ' క్రొత్తకన్నడమున నే కలదుగాని ప్రాచీనకావ్యములలోఁ గానరాదు. 'కేణ' అనఁగా ఆలోచనయని కన్నడ నిఘంటువులలో భారత నిఘంటువునఁ గలదు. (అది పట్పదీ ప్రయుక్త పదములకేఁ యేర్పఱపఁ బడినది.) కావునఁ దత్పద ప్రయోగము గావించిన కవి ద్వాదశ శతాబ్దికంటెఁ బ్రాచీనతరుఁడు గాఁజాలఁడు.

"గాంగేయుఁడుఁ దారకాసురుఁడుఁ గేనము లే కని సేసి రీసునన్"

(ఇట వెనుఁదీయక అని తాత్పర్యము.) I. 925.

"నిజనందనల బుజ్జగించి వెలయాలికేనంబు లలవడ నోజ గొల్పుచు"
(ఇట వేశ్యకుండవలసిన మోసములేక మాయ అని యర్థము.)

"కేనము లేకనురక్తమైన భాషాంగన దక్కనేలిన మహత్త్వము"
ఇట అఱమఱిక అనఁదగును. ఇట్టి వనేకము లున్నవి.

ఇంక నన్నిచోడుఁడు నన్నయభట్టునకుఁ బూర్వుఁడని సాధింపఁ బూనిన వారు చూపిన కారణములు పరిశీలింతము.

దీర్ఘపూర్వక బిందుప్రాసము

సంపాదకులగు మ. రా. శ్రీ. రామకృష్ణకవిగారు ద్వితీయభాగపీఠికలో (9 పుట) "ఇంక నన్నిచోడుఁడు నన్నయ్యభట్టుకంటెఁ బ్రాచీన తరుఁడని కుమార సంభవములోని వ్యాకరణ ఛందో విశేషాపూర్వపద ప్రయోగములు సహస్ర ముఖముల ఘోషించుచున్నవి. ఇతఁడు దీర్ఘముమీఁది యరసున్న నెఱసున్నగా వాడుకొనెను. "మూఁడు జగంబులను దీవ్రముగఁ బర్విన బ్రహ్మాండము కాంచిన కాంచన భాండము" ఇత్యాదులు పెక్కులు గలవు. ప్రాసములఁగాక నడుమను సైతము దీర్ఘముమీఁది యరసున్న నెఱసున్నగా నుండుఁగాని, నేఁటి కాలపు భాషావైశద్యము ననుసరించి, యర్ధానుస్వారముగా ముద్రించితిని" అని వ్రాసిరి. వారే మొదటి సంపుటము పీఠికలో (5 పుట) "ఈతని కాలములో దీర్ఘముమీఁది బిందువు పూర్ణబిందువుగానే వాడుచున్నట్లును కృష్ణదేవరాయల కాలమునకే యది యర్ధబిందు వయ్యె ననియు నీ కృతివలనఁ దేలుచున్నది. దీర్ఘ ములమీఁది నెఱసున్నలు సోముఁడు గూడఁ బ్రయోగించి యున్నాఁడు." అని ఉత్తర హరివంశోదాహరణములును భీమకవి నృసింహపురాణమునుండి యొకటి యు నుదాహరణములుగా నిచ్చినారు. "కావుననే, శ్రీనాథునివఱకును నర్ధ బిందు ప్రాసమును సడలనీయక ప్రయోగించిరి"—అని వ్రాసిరి.

పయి వానిని బరిశీలింపఁదగును; వారే శ్రీనాథునివఱకును సడలనీయక యుంచిరను నెఱబిందువుప్రాసమును నతిప్రాచీనతను సాధించుటకుఁగూడ నుప యోగ పఱుతురా? అది యెట్లు పొసఁగును? శ్రీనాథుని ప్రాంతమువాఁడనుటకుఁ గూడ నడ్డురాదు గదా! ఈ బాధ కలుగుననియే కాఁబోలు మ. రా. శ్రీ. నడ కుదిటి వీరరాజు పంతులుగారు తమ వ్యాసమున పూర్ణబిందు ప్రాసమును బ్రాచీనతా సాధనముగాఁ గొని రామకృష్ణకవిగారు చూపిన యుత్తర హరి వంశోదాహరణమున నక్షరపతనభేదమునఁ బాఠభేదమును సాధించిరి. ఆ విష యము ప్రకృతము పరిశీలింప నవకాశము చాలదు. భీమకవి ప్రయోగమున నట్టిసాధనములు లేక కాఁబోలును "భీమకవి కాలము తేలలేదు. ఆతఁ డెప్పటి వాఁడైనను శివభక్తుఁడు గావున,సోమనాథునివలెనే శైవకవియగు నన్నిచోడుని వ్రాతయందుఁగల ప్రమాణబుద్ధిచే నట్లు వ్రాసియుండు"నని సరిపెట్టిరి. నన్న య్యకుఁ బూర్వముననే కానియట్టి ప్రాసము ప్రయోగించుట కలవాటు లేదని వారి భావము.

దీర్ఘము మీఁదఁ బూర్ణబిందు వుపయోగించుట తాళపత్ర గ్రంథ పాఠములు చూచినచో సర్వసాధారణముగా నుండును. కొన్నిచోట్లఁ బ్రాస ములలోఁగూడ నుపయుక్తమయి యుండును; అవి దిద్ది, తమ యిష్టప్రకారము

పాఠములు గ్రహించినపు డేదియును నిల్వదు. నవీనములలోని దగు అహోబల పతి కాళిందీ కన్యా పరిణయమున—

" క. కాంతకు మదిఁబుట్టెఁడు తల
పోంతలతో వేడి యూరుపులతో మరుబల్
కోంతలతో మయి పూంతల
రోంతలతో శేలు ప్రాస్వ లుత్తము లయ్యెన్." ౨-౩౪.

అని కలదు. ఇట్టిది సింగన్న భాగవతమునను గలదు. పాలుకురికి సోమ నాథుని ప్రయోగమునకు భీమకవి ప్రయోగమునకు శైవాభిమానమును నన్ని చోడుని ప్రయోగమునఁగల యాదరణమును గారణ మనిరి. అహోబలపతిని గూడ శైవగణములోనఁ జేర్చెదరా ? కూంతురు, కాంచినపాలు, కాంపురము, పాంతచింతపండు మొదలగునవి నేటి తెలుఁగువారి వాఁడుకలోఁ గూడ మద్ర పురీప్రాంతమున వినఁబడచున్నవి. ఏ తాళపత్రము, ఏ శాసనభాగమును చూచినను నిది ప్రాచీనతమమేయన వీలు గానరాదు. కావున, నన్నయకుఁ బూర్వుఁడని సాధించుట కిది యుపయోగింపదు.

తర్గు, మర్గు, గొర్కారు మొ.

రెండవభాగము పీఠికలో "తర్గు, మర్గు, మొదలగు రూపములు ప్రాకృతములుగా దీనిలోఁ బ్రాసస్థానముననే ప్రయోగింపఁబడియె. నన్నయకాలముననే తగ్గు అనురూపము వికృతిచెందెను. తగ్గు, మ్రగ్గు, భారతప్రయోగములు నన్నయ్యభట్టులోనే కలవు. నన్నెచోడునికాలమునకుఁ బిదపఁగూడఁ గన్నడమున 'మర్గు' అనియె ప్రయోగింపఁబడుచుండెను. "విజయప్రారంభ దొళ్ మర్గిపోదదటఘ్నా పనికాయ, పుష్పకచయం వ్యోమైకసంకీర్ణకం" అని బలిగ్రామశాసనము. చోళుని క్రొక్కారు, ఇక్క, క్రుక్కిదం, అక్కజము, త్రొక్కిన, ఒక్కఁడు, చొక్క, ఉక్కటి, స్రుక్కిరి, క్రక్కిరి, నెక్కిరి, అక్కిలి, గ్రిక్కొను, కక్కొక్క, చొక్కి, తెక్కలు, మొదలగు శబ్దములు గూడిన ప్రాస స్థానములు శోధింపఁగాఁ గొర్కారు, ఇర్క, కుర్కిదము, అర్కజము, తొర్కిన, ఒర్కడు, చొర్క,ఉర్కిరి, సుర్కిరి, కర్కిరి, నెర్కిరి, వెర్కిరి, అర్కివి, కిర్కొని, కర్కొర్కి, చొర్కి, తెర్కల, మొదలగు భాషాంతరరూపములు గలుగుటచే నట్టిపదములే ప్రాసములవచ్చుటఁ జోళుఁడీప్రాచీనరూపములే యుపయోగించె నని తలఁచుచున్నాను. లేఖకులు నవీనరూపములు వ్రాసికొని ప్రాచీనరూపములు దోషములని వర్జించియుందురు. II.

శా. ఆకొర్కారను రాజు మొగ్గిల నిజరావానంత గేయాభ్రనా ।

ద్వైకాలోద్యము ... ... ... ఇత్యాది స్థలములఁ బ్రాసములలో రేఫాధిక్యము దోషము గాదని లాక్షణికు లంగీకరించిరి. ఏల ? ప్రాచీనశబ్దములు కొర్కారనియే యుండఁగాఁ గాలక్రమమున భాష మాఱి, క్రొక్కారయ్యె. అంతం బ్రాస విరోధమునకు గతి యేమని రేఫ సంయోగముచే దోషము లేదనిరి. ఇదియే దీనితత్త్వము" అని రామకృష్ణ కవిగారు వ్రాసినారు.

నన్నెచోడుడు కొర్కారు, అర్కజము, నుర్కు, తర్గు, మర్గు, మొదలగునవియే యుపయోగించియుండె ననియు వ్రాయనకాం డ్రాపూర్వరూపములు దుష్టము లని భ్రాంతిపడి త్రగ్గు, మ్రగ్గు, క్రొక్కారు, అక్కజము, న్రుక్కు మొదలగు రూపములుగా దిద్దిరనియు వారిభావము. త్రగ్గు, మ్రగ్గు, న్రుక్కు మొదలగు రూపములు నన్నయ్యకాలముననే వచ్చినవఁట. అనఁగా నన్నయ్యకుఁ బూర్వుఁడగు నన్నెచోడుని కాలమున కారూపములు లేవని కదా వారిభావము. వారుదాహరించిన 'ఆక్రొక్కార'ను అను పద్యమున ఆ కొర్కారు అని యుపయోగించియుండఁగా 'క్రొక్కారని దిద్ది ప్రాసమున రేఫసంయోగమునకు గతి యేమని యెంచి రేఫ సంయోగమున దోషము లేదని యనిరి అని వ్రాసిరి. నన్నిచోడుని గ్రంథమున 'క్రొక్కారు' న్నదా ? 'కొర్కారు' న్నదా యని పరిశీలించుటకు నన్నెచోడని ప్రయోగాంతరములే శరణముగాఁ గొందము. ఇతరాధార మేమున్నది ?

కొఱ్+త=కొఱ్త, తర్వాతి రూపము క్రొత్త; కొఱ్+కారు=కొర్కారు, క్రొక్కారు అని రూపావతారము. నన్నెచోడుఁ డేరూపములు ప్రయోగించెనో విచారింతము.

క్రొక్కారు

సీ. "వేసవి వడగాలి నోసిన లేదీగ క్రొక్కారుఁగని మవ్వ మెక్కునట్లు."
I. 397.

క్రొవ్విరులు

కొఱ్+విరులు=కొర్విరులు, దీని యర్వాచీనరూపము క్రొవ్విరులు.

ఉ. "క్రొవ్విరి తమ్మి తావిగొని క్రొవ్వలి మదంబునఁ దేలి తేఁటి కొం
డవ్విరిపువ్వుకంపు సొగియింపనిభంగి మహేశ్వరుండు నా
జవ్వని యావనం బనెడు చంద్రికఁ గ్రోలు చకోరభంగిమైఁ
దివ్వఁడులోకవర్తనకు దేవతలెంత విహీనభాగ్యులో." II. 356.

ఈ పద్యమున 'కొర్విరి' అని కవి యుద్దేశించె ననఁగలమా ? మిగిలిన ప్రాసస్థానములఁ గల పదములు పరిశీలింపుఁడు. ఎవ్విరి ఎర్విరిగాను, తివ్వఁడు తిర్వఁడుగాను మార్పఁ దలఁచెదరేమోకాని 'జవ్వని' జర్వనిగాఁ గూడ మార్పఁ

దలఁచెదరా ? అసంభవము. ఇది ముద్రితపాఠము. ఇందే (78 పుట) చూచునది. దాని ప్రకారము 'యవ్వన' అని పాఠము. అదియు 'యర్వన' కాఁజాలదు.

సుక్కి—

ఉ. వెక్కిడిరూపులున్ ... ... ... ... ... రూపులున్
నిక్కిడి రూపులున్ ... ... ... ... ... నెత్తురుల్
గ్రక్కిడి రూపులున్ ... ... ... ... ... కడున్
స్రుక్కిడి రూపులున్ గలనఁజూడ భయంకర మయ్యె నయ్యెడన్.
II. 699

క. స్రుక్కిరి నరములు ద్రెస్సినఁ
గ్రక్కిరి రుధిరములు గలయఁ గదనములోనన్
నెక్కిరి శవసంకులమున
వెక్కిరి గొఱిప్రాణులైన వీరులు గలనన్. II. 695.

అక్కజము

క. క్రిక్కిఱిసిన శవములలో
నొక్కఁడు నలియఁబడి యుండనోపక వడి బల్
దిక్కులకు నెగసెనో యన
నక్కజముగ నెగసి యట్టలాడుచునుండెన్. II. 743.

ఇందు 'అక్కజము' 'అర్కజము' చేసి, 'క్రిక్కిఱిసి' 'కిర్కిఱిసి' గాను 'నొక్కఁడు' 'నొర్కఁడు' గాను మార్చినను, 'దిక్కు' 'దిర్కు' చేసెద మని యత్నించువా రుందురా ? కావునఁ గవిప్రయుక్తరూపము అక్కజము అనియే గాని, అర్కజము గాదని వేఱ చెప్ప నక్కఱలేదు. మనకవి 'ఆక్రొక్కరనియే ప్రయోగించె ననవలయును. రేఫాధిక్యమునఁ బ్రాసమున దోషము లేదనుట మన నన్నిచోడుని కిష్టమైనదే. కావుననే "క. శిష్టాచారులు ... శ్లిష్టాత్మకు ... భీష్ట ... స్రష్ట్రన్వయకరులు." (I, 717) అని రచించెను. 'స్రష్టృ + అన్వయ = స్రష్ట్రన్వయ' యనవలె ననుట నన్నిచోడుఁ డెఱుఁగనివాఁడుగాఁడు. ముద్రితమున నిట 'స్రష్టాన్వయ' యని యున్నది. ఎట్లు ?

తఱుఁగు, తర్గు, తగ్గు, తగ్గ

"శా. భర్గుం డంతకవాహినుల్ శరహతిన్ భంజించు నట్లైమ్మెయిం
దర్గంగా రథపత్త్రముల్ విఱిగి వేదండాంకురానీకముల్
సుర్గాడన్ భటకోరకంబు లలరన్ సూత్నాశ్వపు ష్పౌఘముల్
మర్గింతుం బరసైన్యపద్మవనమున్ మద్బాణ వర్షంబునన్." II. 604.

ఇందున్న 'తర్గు మర్గు' లు 'ప్రాకృతము' లఁట. 'నన్నయ్యకాలమునకే తగ్గు అనురూపము వికృతిచెందె' నఁట. 'తగ్గు మ్రగ్గు భారతప్రయోగములు నన్నయభట్టులోనే కల' వఁట. ఎట్లు? నన్నయ్యకవితలో 'తఱుంగు మఱుంగు' లే కాని 'తగ్గు మ్రగ్గు' లు కానరావు. తర్వాతి వారిలోఁ గొందఱు ఎఱుంగు ఎర్గుగా వాడినట్లు తఱుంగు మఱుంగులు తర్గు మర్గులుగా వాడిరి. తర్గ మర్గులు ప్రాచీనరూపములు గాఁ జాలవు.

క్రౌంచపదము

నన్నిచోడుని ప్రాచీనతకు గొప్పగారణముగాఁ జూపిన విషయము పరిశీలింతము. అది 'క్రౌంచపదవృత్తయతివిశేషము'. ముందు క్రౌంచపదవృత్తరీతి పరిశీలింతము. క్రౌంచపదము సంస్కృతమున నిరువదియైదవదగు 'అతికృతి' అను ఛందములోనిది. దీని పాదమున కిరువదియై దక్షరములు. 5, 5, 8, 7యతి.

"క్రౌంచపదా భ్మౌస్భౌ ననననా న్గౌ విషుశరవసుమునివిరతి రిహ భవేత్."
భ, మ, స, భ, న,న, న, న, అను గణములును ఒక గురువు నుండవలెను.

కన్నడమందు నాగవర్మచ్ఛందమున సంస్కృతానుసారముగానే యున్నది.

"శీతకరోర్వీవాత శంశాంకర్ యుగమిత సురపుర నివహదకడెయోళ్
భూతగణేశం భూతశరాశా గజదళె యతిగళు మెసరిదె వెసరిం
నీతియుతే కేళ్ సాతిశయోక్తి క్రమదొళె నెగళ్దు దతిశయరచనో
పేత మశేషోర్వీతలకం క్రౌంచపద మతిశయ పద రచనెగళిం."

తెనుఁగునఁ గ్రౌంచపదము ఇరువది నాల్గవది యగు సంకృతి చ్ఛందము లోనిది. కావుననే పాదమున కిరువదినాల్గక్షరము లుండును. సంస్కృతకర్ణాటకములకంటెఁ బాదమున నొక్కక్షరము తెనుఁగునఁ దక్కువయగును.

I. "పంచశరాభా! సంచితపుణ్యా! భమసభనననయ పరిమితమైనన్
గ్రౌంచపదాఖ్యం బంచిత మయ్యెం గ్రమయతి దశవసుకలితము గాఁగన్"
కవిజనాశ్రయము.

II. "ఇరువదినాల్గవ సంకృతిచ్ఛందంబునందు
'కాంచనభూషా సంచయ మొప్పన్ ఘనకుచభరమునఁ గా నసియాడన్
జంచలనేత్రల్ వంచనతోడన్ సముచితగతి వెనుచని తనుఁ గొల్వన్
అంచితలీలన్ మించిన శౌరిన్ హరిదిభపరిమిత యతు లొనఁగూడన్
ముంచి రచింపం గ్రౌంచపదం బిమ్మొగి భమసభననముల నయమొందున్"
ఛందోదర్పణము. ౨. ౧౧.

III. "పంచమకేశుం డిచ్చిన భాస్వద్వరమున మనమున బవరము గోరన్
వంచనతో బాణాసురహస్త వ్రజములు దరిగెను వడి హరి యంచున్

బ్రాంచిత లీలన్ శంకర నంది ప్రకటిత విరతులు భమసభనాన్యల్
క్రాంచపదీ వృత్తమ్మునఁ జెన్నారఁగఁ బలుకుదు రిలఁ గవివరు లెల్లన్."
అప్పకవీయము. ఆ. ౪.

నన్నయరచనయందుఁగాని తత్ప్రాంతశాసనములలోఁగాని యిది లేదు. తిక్కన భారతమున దీని నుపయోగించెను.

"కౌరవసేనావీరులు లావుం గడిమియుఁ జలమును గడఁక యెలర్పన్
ధీరతసొంపుం గ్రూరతపెంపుం దెగువయు నెఱపఁగఁ దెరలక వీఁకన్
భోరనఁ ద్రోవంగా రభసం బేపును గలితనమును బొలుపు వహింపన్
వారు భయంబుం గూరుటకుంగా వలసెను రుధిరము వదనము సేర్పన్"
భారత. స్త్రీ. ౧. ౧౬౬.

ఇంక నన్నిచోడుని పద్యము చూతము—

"చంచుల నాస్వాదించుచు లేదూం డ్లకరువు ప్రియలకు నలఁదుచు మైరో
మాంచము లోలిం గంచుకితంబై పొడమఁగ నలరుచుఁ బులినములం గ్రీ
డించుచు సంభాషించుచుఁ బ్రీతిం బొలుచుచుఁ జెలఁగుచుఁ బొలయుసనుద్యత్
క్రాంచగతుల్ వీక్షించుచు భాస్వజ్జలనుఁడు శరవణసరసికి వచ్చెన్."
II. 395.

౧. పయి లక్షణములను లక్ష్యములను బరిశీలించినఁ దేలిన దేమి ?

ఈ వృత్తము సంస్కృతమునను గన్నడమునను బాదమున కిరువదిమై దక్షరములు గలిగియున్నది. తెనుఁగునఁ బాదమున కిరువది నాల్గక్షరములే. దీనిని దెనుఁగున నిరువదియైదవ ఛందమున వాడక యిరువది నాల్గవ ఛందమున వాడుటను సర్వలక్ష్యలక్షణములును ధ్రువపఱచుచున్నవి. ఇంక యతి. సంస్కృతమున యతి పదాంతవిరామము. కన్నడమున నదియును లేదు. కర్ణాటకులకుఁ గవనమున యతి నుల్లంఘించుటయే యొక విశేషముగాఁ జెప్పుదురు. వారికిఁ బ్రాసము తప్పనిది. కావునఁ గన్నడమునఁ బయి పద్యములలో ద్వితీయాక్షర ప్రాసనియమ మున్నది. దానితోపాటు ద్వితీయాక్షరమే ప్రతిపాదమందును సప్తమాక్షరప్రాసముగాఁ గూడ నున్నది. దీనినే తెనుఁగునఁ బ్రాసయతి యందుము. ఇది లక్షణమున లేకున్నను, కర్ణాటకాంధ్ర లక్ష్యములందు నియతముగాఁ గనుపట్టుచున్నది. కవి పని కట్టుకొని ప్రయోగించినట్లు స్పష్టమగును. కేవల మనుప్రాసాలంకారార్థము కాదు. ఈ వృత్తమున కీలక్షణము తప్పఁ బ్రాచీనకర్ణాటక గ్రంథములందుఁ బ్రయోగము లేదని కర్ణాటకపండితులు చెప్పుదురు. ఈ పద్యము రచించిన నాగవర్మ వేంగీదేశస్థుఁడుగాన నాంధ్ర భాషాకవితాసంప్రదాయమున నది రచించియుండును. కాని యితర వృత్తములయందుఁ బోలె నిందును సంస్కృతరీతినే యనుసరించెను. కేవల కర్ణాటకు

లది యనుసరింపక విడిచిపెట్టిరేమో! తిక్కన పద్యమునందును లక్షణపద్యములందును ద్వితీయాక్షరప్రాసమును సప్తమాక్షరప్రాసమును బాదాద్యక్షరానుగుణయతియుఁ గలవు. ఈ ఛందమున సరసిజవృత్తము గూడఁ బుట్టినది. కవిజనాశ్రయమునను, ఛందోదర్పణమునను దానిలో షష్ఠాక్షరప్రాసమునుఁ బాదాద్యనుగుణయతియును గలవు.

ఈ ఛందముననే యష్టమూర్తియను వృత్తము ఛందోంబుధిలోఁ గలదు. అందు సప్తమాక్షరప్రాసము లేదు. యతినియమము కలదు. ఈ యష్టమూర్తి వృత్తము నప్పకవియు నీఛందముననే యిచ్చినాఁడు. తన్వి యనువృత్తమును దీనిలోనే చేర్చినాఁడు. అష్టమూర్తివృత్తమున సప్తమాక్షరప్రాసము లేదు గదా యని యితరవృత్తములలోఁ గూడ నప్పకవి మానివేసియుండునేమో. సరసిజవృత్తమునఁ దిక్కన్న షష్ఠాక్షరప్రాస ముపయోగించినాఁడు.

“శ్రీరమ్యత్వం బారంగఁ బెంపూర్జితముగ మణివిరచితమకుటములున్
దారుం జూడన్ సారవిభూతిన్ ధరణిపు లనిమిషధవనిభు లగుచున్.”

భార. స్త్రీ. ౨. 32.

క్రౌంచపదమున ద్వితీయ సప్తమాక్షరముల ప్రాసము తెనుఁగు సంప్రదాయమునఁ గలదు. మన కవి దానినే యనుసరించి రెండు ప్రాసములుఁ గూర్చి పాదాద్యక్షరానుగుణయతిని బాటింపక ద్వితీయదశాద్యక్షరయతిని బ్రయోగించెను. అదియే నన్నిచోడుని పద్యమునఁగలవిశేషము. ఇట్లు ప్రయోగించుటప్రాచీనతకు గొప్పకారణ మఁట. దానికై వారు వ్రాసినది చూతము.

“ నన్నెచోడుని క్రౌంచపదమున యతి విచిత్రముగా నున్నది.

“చంచులనాస్వాదించుచు ... ... ... ... ...శరవణ సరసికివచ్చెన్”

ఇందుఁ గందసీసములవలెఁ బ్రతిపాదము రెండు రెండు భాగములుగా విభజింపఁబడి కందమువలెఁ బూర్వార్ధమునఁ బ్రాసమును ద్వితీయార్ధమున విశ్రమమాత్రమే కూర్పఁబడియె. ద్వితీయప్రాసనియతి మాత్రము నన్నియ తిక్కనకవిజనాశ్రయకారాది ప్రాచీనులు పాటించిరికాని,యప్పకవి తన్మర్మము తెలియక వదలెను. తన్వి త్రిభంగి మొదలగు వృత్తములకును నీ నియమము కలదు. క్రౌంచపదము మాత్రా ఛందమునఁబడి శీర్షకమగును. ఎట్లన రెండవ నాల్గవ గణముల నాల్గుమాత్రలుగా నుచ్చరించి, కడపటిగురువు త్రోచివైచి, పూర్వగురువు రెండుమాత్రలుగాఁ బలికిన సీసమగును. ఇట్లే తన్వీక్రౌంచ పదములలోనుండి ధ్రువజాతి శీర్షకము పుట్టె నని నందిభరతమునఁ జెప్పఁబడియె. రెండవపాదము “మాంచములోలిగఁ గంచుకితంబయి పొడమఁగ నడరుచుఁ బులినములను.” అను సీసపాద మగును. ఇందుఁ బూర్వార్ధమునఁ బ్రాసయతియు, నుత్తరార్ధమున విశ్రమమును గలదు. ఇట్టి నియమములు గల సీసములు

నన్నయభట్టు భాగములోఁ బెక్కులు గలవు. ద్రవిడభాషలోఁ దిరువాయ్ మొళి యను ప్రబంధమున సీసము ననుకరించు పద్యములలోఁ బ్రాసయతియే కలదు. అట్టివే ప్రాసనియత సీసములు నన్నయ ప్రయోగించెను. నన్నయకాలముననే క్రౌంచపదము వృత్తము కావునఁ బ్రథమాక్షరవిరతి ముఖ్యమని ప్రాసమునను రెండు విరామస్థానములు ప్రయోగించిరి. ఇదినన్నిచోడుని ప్రాచీనతకు గొప్ప కారణము." (ద్వితీయసంపుట పీఠిక. 10, 11, పుటలు.)

నన్నయభట్టుభాగమునఁ గాని, తత్ప్రాంతకాల శాసనాదులందుఁ గాని, క్రౌంచపదము కానరాదు. వారువ్రాసినదానిలో నన్నయ్యనాఁటి కిది యున్నట్లు "ద్వితీయప్రాస నియతి మాత్రము నన్నయ తిక్కన కవిజనాశ్రయకారాది ప్రాచీనులు పాటించి"రని వ్రాసిరి. నన్నయ పాటించినవారిలో నుండెనా ?

"నన్నయకాలముననే క్రౌంచపదము వృత్తము కావునఁ బ్రథమాక్షర విరతి ముఖ్య మని ప్రాస మున్నను రెండు విరామస్థానములు ప్రయోగించిరి" అనివ్రాసిరి. నన్నయకాలమున నెవరు ప్రయోగించిరి. మొదలే లేదే. నన్నయ కాలముననే వృత్తమఁట. తత్పూర్వము మాత్రాగణపద్య మనిగదా వారి భావము. అది నన్నిచోడుఁడు ప్రయోగించె ననియు దానంజేసి నన్నయ్యకుఁ బ్రాచీనుఁడనియుఁ గద వారి యుద్దేశము.నన్నయకాలమునఁగాని తత్పూర్వమునఁగాని తద్వృత్త ప్రయోగమే కానరాదు. ఈలెక్కయంతయు నేల ? ఉన్నప్పటికే జాత్యాదిపద్య మందు రనుకొంద మన్నను, నన్నిచోడుని పద్యము నాల్గుపాదములందును నక్షరగణబద్ధమయియే యున్నది. జాతికివలె మాత్రాగణములు ప్రయోగింపఁబడలేదు. మఱొకటి. ఇది మాత్రాగణమునఁబడి శీర్షకమగునఁట. ఏమిది? ఇది మొదట సీసమువంటి పద్యమా ? నన్నయ్యనాఁటికి వృత్త మయి నదా ? ఇది మాత్రాగణమునఁ బడి శీర్షకమగునా ? దానికిని దెనుఁగు సీసమునకు సంబంధమా ? ఏదో యొక భాగముఁ గైకొని కావలసిన పద్య భాగముగాఁ జేయుటకు ఒక గురువును రెండు లఘువులుగాఁ జేసి చివర లాగివేసి మొదలు త్రెంచి యేవోమార్పులు చేసినచో నేదో కాదా ! అదేదో యొక పద్ధతినున్నయెడల నాలోచింపవచ్చును. "ఇట్లే తన్వీక్రౌంచపదములలోనుండి ధ్రువజాతి శీర్షకము పుట్టె నని నందిభరతమునఁ జెప్పఁబడియె" నందురు. శీర్షక మనఁగా మన తెనుఁగు సీసమా ? దానినే నందిభరతుఁడు చెప్పెనా?ఆ శీర్షకమున కర్థము వేఱు. ఈ సీసమునకు సంబంధమేమియును లేదు. జానాశ్రయి, ఛందోమంజరి మొదలగు గ్రంథములు చూచిన నది తెల్లమగును.

ఈ విషయమును విమర్శించుచు వీరేశలింగముపంతులుగారు కవులచరిత్రలో "నాబుద్ధి కిది నన్నిచోడుని ప్రాచీనతకుఁ గారణముగాఁ గానఁబడదుగాని, యాతనికిఁగల కర్ణాటకభాషా పక్షపాతిత్వమునకుఁ గారణముగాఁ గనఁబడుచున్న

ది. నన్నయ్యకాలముననే క్రౌంచపదము వృత్త మయ్యెనఁట! అయినపక్షమున యతిస్థానము లన్నియు మైత్రి కలవయి యుండుట యాంధ్రభాషాకవిత్వమర్యాద. ఈ మర్యాదను వదలి, కర్ణాటకభాషాకవిత్వ మర్యాదనవలంబించుట తెలుఁగుసంప్రదాయమునకు విరోధము. నన్నయభారతమం దక్కరలున్నవి. నన్నయకు నూఱుసంవత్సరములకు ముందుండిన యుద్ధమల్లుని శాసనములో నన్నియు నక్కరలే. ఇటీవల నక్కరలు వాడుకలోనుండి తొలఁగుటయు, క్రౌంచపదము వాడుకలోనికి వచ్చుటయుఁ దటస్థించినది. నన్నెచోడుని కుమారసంభవమునం దక్కరలు లేకపోవుటయుఁ గ్రౌంచపద వృత్తముండుటయు నతఁడునన్నయ్యకు మిక్కిలి తరువాతివాఁడని స్థాపించుటకు గొప్ప కారణముగా నున్నది." అని వ్రాసిరి. ఇది యుక్తియుక్తముగానే యున్నది. కాని కర్ణాటకభాషా పక్షపాతిత్వ ముండుటచేఁ దెనుఁగు లక్షణము వీడి, కర్ణాటకలక్షణ మవలంబించినాఁడనుట కొంత విచార్యము. కర్ణాటకమర్యాద ననుసరించి రచించినయెడలఁ బాదమున కిరువదిరెండు దక్షరము లుండవలయును. ఇం దిరువదినాల్గే యున్నవి. ఇది తెలుఁగు మర్యాదయే. కన్నడమున యతియే లేదు. ఈతఁడు యతి ద్వితీయదళమున గ్రహించినాఁడే. తిక్కనాదులపద్ధతినే రచించుచుఁ బ్రథమాక్షరయతి మాని, ద్వితీయదళాద్యక్షరయతి గ్రహించినాఁడు. అది యాంధ్రమందున్న దానికిఁగొంత మార్పుగాని, కన్నడపుమర్యాద యిం దేమియును లేదు.

నాగవర్మమొదలు తిక్కనవఱకుఁ గలవారు ప్రయోగించిన లక్ష్యలక్షణములు క్రౌంచపదము వృత్తమని స్పష్టపఱచుచున్నవి. ఆ తర్వాత మాత్రాగణపద్యమయిన దనవలెనుగదా. అప్పుడు మనకవి తిక్కన కర్వాచీనుఁడు గావలసియుండును. లేదా, నాగవర్మకు బహుపూర్వకాలమున మాత్రాగణపద్యముగా నుండి తర్వాత వృత్త మయిన దనవలెను. అప్పుడు సప్తమ శతాబ్ది ప్రాంతమువాఁడు కావలయును గదా ! ఇది ప్రాచీనతకు గొప్ప కారణమో నవీనతకు గొప్పకారణమో యూహింపుఁడు.

నన్నిచోడునికవిత్వమునుబట్టి, కవికాలనిర్ణయము గావింపఁబూని రచించినవ్యాసములలోని కొన్నిముఖ్యవిషయములు పరిశీలించుట యుక్తము.

త్రిమూర్త్యాదిస్తవపద్ధతి

1. "కుమార సంభవ గ్రంథారంభమున మూర్తిత్రయ, భాస్కర, గజానన, షణ్ముఖ, మార, గౌరీ, సరస్వతీ స్తోత్రములు వేర్వేఱు పద్యములు గావింపఁబడినవి. ఆంధ్రభారతము మొదటి శ్లోకమున నున్న త్రిమూర్తిస్తుతి రాజరాజ నరేంద్రున కన్వయించున ట్లొనర్చిన నన్నయభట్టు, చిరకాలమునుండి పరంపరగా వచ్చుచున్న యీ పూర్వ స్తోత్ర పద్ధతిని విడిచిపెట్టలేక, దానిని సంగ్రహించి, యవతారిక నడుమ "హరిహరాజ గజాన

నార్క షడాస్య మాతృ సరస్వతీ గిరిసుతాదిక దేవతాతతికిన్నమస్కృతిఁ జేసి..." అని నగము పద్యములో నందఱ దేవతలను జేర్చి, వారి కందఱకు నొకచే నమస్కారము గావించినట్లును, పిమ్మట నదిక్రమ క్రమముగా మాఱి పోయినట్లును గాననయ్యెడి " [1]అని గలదు.

నన్నయ్యభట్టుకంటెఁ బూర్వమే నన్నిచోడుఁడు గావించిన త్రిమూర్త్యాదిస్తవము చూచి, నన్నయ్య భట్టు సంప్రదాయము విడవఁ జాలక పద్య మధ్యమున నిమిడ్చినాఁడనియు, ఆతర్వాత నా సంప్రదాయము మాఱిపోయిన దనియు, నన్నయ్య గావింపఁ దలఁచిన దేవతా ధ్యానము మొట్ట మొదట శ్లోకమున రచించె ననియు వారి భావము గదా!

నన్నయ్యభట్టు మొదట రచించిన త్రిమూర్తి స్తవము రాజరాజ నరేంద్రుఁడు సభారంభమునఁ గావించినది గాని భారత రచనారంభకృత దేవతా స్తోత్రమునకు సంబంధించినది గాదు. వేదశాస్త్రపురాణేతిహాసాదులయందుఁ బ్రామాణ్యము గలిగి హరిహరబ్రహ్మల స్తుతించుచు రాజరాజు సభారంభ మునఁ జేయు నిష్టదేవతాధ్యానము సంస్కృతమున నుండుట యుచితమే గదా! కావుననే నన్నయ యది సంస్కృతమున రచించెను. రాజరాజ నరేంద్రుఁడు సభలో నన్నయభట్టారకుని భారతరచనకుఁ బ్రేరింప, నాతఁడు దాని కంగీకరించి భారతరచనారంభమునఁ గావింపవలసిన హరిహరాది స్తవము గావించినాఁడు. ఈ హరిహరాది స్తవము నన్నయకంటెఁ బూర్వ మందు గన్నడ భాషలో భారతము రచించిన పంపకవిముఖ్యుల గ్రంథము లందుఁ గనఁబడుచున్నది. నన్నయ్య నన్నిచోడాదులు పంపకవి గ్రంథములు చదివి కొన్ని విషయములు గ్రహించినట్లు ప్రబల ప్రమాణములు గలవు. గ్రంథవిస్తర భీతిచే నవి యిచ్చుటఁ జూపఁ దలఁపలేదు.

విక్రమార్జునవిజయ మను నామాంతరము గల పంపభారతమున గ్రంథాదిని ౧ పద్యము మొదలు నారాయణ, ౨ మహేశ్వర, ౩ ప్రచండ మార్తాండ, ౪ మనోజ, ౫ సరస్వతీ ౬ మాతృ (అంబా), ౭ వినాయక స్తవ ములు గలవు. అనఁగా హరిహరార్క మారసరస్వతీ మాతృ వినాయక స్తుతు లిందుఁ గలవు. బ్రహ్మ స్తవము గానరాదు. నన్నయభట్ట రాజరాజనరేంద్రులు త్రిమూర్తులయందు సమానభక్తిగలవారు గావున బ్రహ్మను, శివభక్తులు గాన షడాస్యపార్వతులనుగూడ నన్నయ స్తుతించి యుండును. పంపభారత మునఁ గవి మన్మథ స్తవము చేయునపుడు "సహజ మనోజ నోజ నెమగీగ

1. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ౧౪ సం. ౨ సం. ౧౨౩ పుట. మ. రా. శ్రీ. నడకుదిటి వీరరాజు పంతులుగారు రచించిన వ్యాసము.

విచిత్ర రతోత్సవంగళం" అనఁగా మన్మథుఁడారాజునకు విచిత్రరతోత్సవ మిచ్చుఁగాత మని రచించెను. భారతధర్మైకనిష్ఠుఁడయిన రాజరాజ నరేం ద్రుని ప్రోత్సాహమున భారత మాంధ్రీకరింపఁ బూనిన నన్నయ్యభట్టార కుఁడు భారతరచనారంభమున మన్మథస్తవమో మన్మథస్మరణమో గావించుట యసంగత మని, మన్మథ ప్రశంస విడిచియుండును. కావుననే 'మాతృ సరస్వతీ' అనియే రచించియుండును.

నన్నిచోడుఁడు శివపారమ్యవాది గావునఁ గుమారసంభవాదిని ముందు రెండు పద్యములలో శంకరస్తవము గావించి తర్వాత నితరుల స్తుతించెను. అందు విశేష మొకటిగలదు. విష్ణు, వాగ్విభు, రవి, గణనాథ, షణ్ముఖ, మార, నగజాతా (పార్వతీ) భారతీ దేవతలను స్తుతిచేయుచు, వా రు పరమేశ్వరుని యవయవములనుండి పుట్టిరనియో పరమేశ్వరభక్తు లనియో తెలిపి,శివపారమ్యము స్పష్టపఱచినాఁడు. మారప్రశంసలో కం. "హరుఁడాదిగ సకలచరా, చరమయజీవాలినెల్ల సతతముగామా, తురులుగ వశగతిఁజేసిన, మరుఁడీవుత మఖిలవశ్యమతి మత్కృతికిన్" (౧౯) అని రచించి 'హరుని వశ గతిఁ జేసినమరుఁడు' అనునది హర్షింపలేక కాఁబోలు వెంటనే "చం. ... సర్వజీవులం, దనవశ మర్థిఁ జేసి మను దర్పకు నోర్చిన వీతరాగి—నీశు నాత్మ నుభగస్థితిమై మెయి నర్ధనారిఁ జేసిన నగజాత మత్కృతిని జేకొని తత్సుభగత్వ మీవుతన్" అని పార్వతీస్తుతిలోఁ మన్మథ ప్రశంసను దెచ్చి 'శివుఁడు దర్పకు గర్వమణఁచిన వీతరాగియని' యతిశయము చూపినాఁడు. నన్నిచోడకవి కన్నడ భాషయందలి కావ్యములు పఠించినవాఁడే. అందున్న కొన్ని విశేషములు గ్రహించినవాఁడే గానహరిహరాది వర్ణనము పంపభారతమునుండి గ్రహించి యుండు ననవచ్చును.

నన్నయభట్టుపద్యమధ్యమం దిమిడ్చిన హరిహరాదిస్తుతిసంప్రదాయము తర్వాతమాఱిపోయిన దనుట కవకాశము లేదు. తిక్కనసోమయాజి నిర్వచ నోత్తర రామాయణారంభమున మనుమభూపాలునికి మొదట "శ్రీరాస్త్రాంమను మక్షితీశ్వరభుజాస్తంభే" అని యాశీర్వదించి "చం. హరి హర పద్మగర్భు లను నాది కవీంద్రుల... నూత్న సత్కవీశ్వరులను భక్తిఁ గొల్చి"..."అని హరిహర బ్రహ్మస్తవసంప్రదాయము నిలిపినాఁడు. భారతరచనారంభ మునఁ దన కిష్టదైవమగు, హరిహరనాథునిఁ బ్రధానునిగాఁ జేసి మిగిలిన వారిని విడిచినాఁడు. కేతన వరుసగా హరి, శంక, రా; జాదిత్య, దంతిముఖ, మయూరవాహన, దర్పక, భైరవీ (మాతృ) స్తోత్రములు గావించెను. హరి హరాజాది స్తుతి సంప్రదాయము నన్నయ్యతో నంతరింపలేదు. పూర్తిగా మాఱను లేదు. నన్నయ్య చేసిన స్తుతికంటె వివరముగా స్తుతిచేయుటచేత

నన్నిచోడకవి ప్రాచీనుఁ డగునా ? అట్లయినచోఁ గేతనను గూడ నన్నయ్య కంటెఁ బూర్వుఁ డనవలసి వచ్చును. అది పౌర్వాపర్య నిర్ణయ సాధనముగాదు.

అట్లు వోలెము.

2. "అట్లు వ్రోలె, పగిదివ్రోలె, కరణివ్రోలె, మాడ్కివ్రోలె, భంగవ్రోలె, ఇత్యాది (పురాతన) ప్రయోగము లిక్కవి గ్రంథమున లెక్కకు మిక్కిలి యున్నవి. నన్నియ గ్రంథమున "అట్లవ్రోలె, అనున దొక్కటియు తిక్కనదానియందు "ఇట్లువ్రోలె" అనునదియుఁ గానఁబడుచున్నవి. నన్నయ నాఁటినుండియే దీనికిఁ బ్రచారము విరళమైనట్లు తోఁచెడి. (పాల్కురికి సోమన మాత్రము శివభక్తుఁడగు నీతనియెడఁ గల భక్తిగౌరవాదులచే కరణియుఁ బోలె, భంగియుఁబోలె,నిత్యాదిగ నచ్చటచ్చటఁ బ్రయోగించెను)." అని వ్రాసిరి. పై ప్రయోగములు ఎప్పుడు విరళములుగా నుండెనో ఎప్పుడు ప్రాయికముగా నుండెనో పరిశీలించినచో వానిని ప్రాయికముగా వాడిన నన్నిచోడుని కాలము తేలు నని యొప్పుకొనుట మంచిదే. పైని చెప్పినట్లు నన్నయ కాలమున విరళమే యని యొప్పుకొనవచ్చును గాని, నన్నయ్య తర్వాత నిన్నూఱు వత్సరంబుల కాలమున నున్న తిక్కన సోమయాజి గ్రంథమందు లెక్క కనేకములుగానె యున్నవి గాని, వారు వ్రాసినట్లు 'ఇట్లు వోలె' ఒకటియే లేదు.

I. "చం. ఏను హితంబు చెప్ప నిటులేచి దురాచరణంబు లిమ్మెయిన్
మానవు రోగి చేఁదయిన మం దఱువుం దెవు లంటఁ దాఁకినం
గాని యెఱుంగఁ డప్పు ప్రతికారము గల్గునె యట్లపోలె నీ
దైన నికృష్టవృత్తి ఫల మంది తలంచెదు గాక పిమ్మటన్."

నిర్వచనోత్తర రామాయణము ౮-౬౫.

II. "ఆ. నాఁడె చెప్పఁగన్న నాకు రాధేయున,
కెట్లు సూడఁ బోలె నట్లువ్రోలెఁ,
బడినపాటుఁ బడుదు మడియాన నీచేత,
భంగపడితి వింకఁ బలుకు లేల ?" భార. భీష్మ. ౨-౧౨౧.

III. "తే. ఇట్టు లొండొంటిఁ గదియంగ నెలమి నడచి
బలము లొక్కింతసేపు నిశ్చలతఁ బొలిచె
మవ్వ మెసఁగు వనంబులు మావు లెంత
యైనఁ జెలువార సొగసి యున్నట్లు వ్రోలె"

భార. ద్రోణ. ౧, ౧౩౬.

ఇంకఁ దత్కాలమందున్న కేతన కవిత్వమునను గూడఁ జూతము.

IV. క. "షాం, గారెడు నేతికిఁ బయిపై,
నీ రలికిన యట్లువ్రాలె నిష్ఫల మయ్యెన్."
దశకుమారచరిత్ర ౯-౮.

V. "తాళములచందంబు వ్రాలె" దశకుమార చరిత్ర ౯-౮.

VI. "సాలభంజికతనులీలఁబోలె" దశకుమార చరిత్ర ౨-౧౧౭.

తిక్కనాదులలో బహుళముగా నున్న యీ ప్రయోగములు నన్నయకుఁ బూర్వుఁడ నుటకు సాధనములు గావు. పయి వెచ్చు, మనకవి తిక్కన కేతనల ప్రాంతము వాఁడని ఘోషించుచున్నవి.

'డు, ట' ప్రత్యయములు

3. "కాంచు డరు దయ్యె" "ఒదవుడిదేమి" "చం. వడిఁ ద్రిదశాలినోర్చు డాక వావిరి బీరముగాఁగ రజ్జు సెె, వ్వడదియు నీవుచేసిన తపోవిభవంబున యబ్జ గర్భుచే... ..." II. 516. (ఈ పద్యమున "రజ్జు దెవ్వడు నది" అని వ్రాత ప్రతియందు గలదు. ఎప్పడును "రజ్జుదువు" అని తాత్పర్యము. ఇది ప్రకరణోచితము.) మొదలగువానియందు 'డు' ప్రత్యయాంత రూపము లుండుట నన్నయకంటెఁ బ్రాచీనుఁ డనుటకు సాధనముగాఁ జెప్పఁ జూచెదరు. నన్న య్యయుఁ దిక్కనయుఁ గూడ 'డు' ప్రత్యయ సహితములును బ్రయోగించి రనియు వారే చెప్పుదురు. నన్నిచోడకవి 'ట' ప్రత్యయ సహితములును బ్రయోగించెను. "నన్నిచోడుని గ్రంథమున భావార్థక టకారము తనకుఁ బరమైన యచ్చుతో సంధింపఁబడినప్పుడే యిట్టి డత్వము చెందుచున్న" దని యొక సిద్ధాంతము చేయుదురు. అదియును నిలఁబడ వీలులేదు.

"ఉ. నా, చెప్పుటయాఁడు గర్జ మని చేకొనక ... ..." యనికలదుగదా.

ఇట 'డు' ప్రత్యయ సహిత మన వీలులేదు.

ఇది తిక్కన ప్రయోగించెనని యొప్పుకొనుచు దీనినే ప్రాచీనతరత్వ సాధనముగా గ్రహించుట యుక్తమా?

'వక్రము' ప్రయోగవిశేషము

4. "వ. దేవదూతం గని శుకుండు వక్రింబై యందఱ కెడసొచ్చి" (II. 519) అనియు "కం. కరి మదగర్వంబునఁ గే, సరిపై నుఱుకు రవడింప నమకట్టుటయున్, బోరిఁబోరి నంకుశఘట్టన, నరుదుగఁ గుదియించు నమ్మహామాత్రుక్రియన్. వ. శుకుండు వక్రింబై" (II. 544.) అనియుఁ గలవు. ఈ పదము నన్నయాది ప్రయోగములలోఁ గానరాదు. ప్రాచీన శాసనములలోఁ గలదు గాన, నన్నిచోడకవి నన్నయభట్టారకునకు మిక్కిలి పూర్వుఁడని వే నోళ్లఁ జాటి చెప్పుచున్న" దందురు.

ఈ పదము ప్రాచీన శాసనములలో నున్నంతమాత్రమునఁ దర్వాతి కాలమున లేదనవచ్చునా ? శక సంవత్సర ౧౪౫౫ కాలమందలి శాసనమున-"ఈ ధర్మాన యవ్వరువక్రమై యవ్వరు తప్పికొన్నాను"—[1]అని కలదు. దానికేమి శుక్రుండు వక్రుండై అనవలెనుగదా? ప్రాచీనము గావుననే వక్రమై యని యున్నదేమో అని కొంద ఱందురు. వక్రము అనఁగా అడ్డు అని యర్థము. దీనికి వక్రంబు సేయువారు అనఁగా అడ్డుచేయువా రని యర్థము. విశేషములు విశేష్యములుగా నుపయోగించుటయుఁ గలదు. వక్రమువచ్చువా రనఁగా అడ్డుగా వచ్చువారు అని యర్థము. నిర్వక్ర పరాక్రముఁడు మొదలగు చోట నప్రతిహతము, అడ్డులేనిది అనియే గదా అర్థము. శుక్రుండువక్రంబై = శుక్రుండు అడ్డై. ఇట్టి ప్రయోగములు తర్వాతి కవులలోను గలవు. హరిభట్టు నారసింహపురాణమున "ఆశరపుంగవులు ... జీర్ణములైరి" (౧, ౧౭౭.) అని కలదు. ఇట్టివి పౌర్వాపర్య నిర్ణాయకములు గాఁజాలవు.

**ఉపమానోపమేయములు భిన్నలింగములుగానుండుట.**

5. "ఉపమానోపమేయ విపర్యయభిన్నలింగ భిన్నవచనాదు" లీతని గ్రంథమునఁ గొలఁది మీఁటి చూపట్టుట యొక ప్రాచీనతాసాధనము అని వ్రాసిరి. అవికొలఁదిమీఁటియనుటలో కొంత తప్పించుకొనుటకై త్రోవ నిల్పుకొనిరి. ఇట్టివి తిక్కన సోమయాజి భారతమునఁ జిత్తగింపుడు. "విజయ రోహణాద్రి" భీ. 1-106 "కవ్వడియనుకాఱుమొగులు", భీ. 1-108; భీ. 2-63; భీ. 2-157; 159; భీ. 2-222. ఇట్టి వెన్నియో గలవు. గ్రంథవిస్తరమేల ? వారు చూపినవి మఱికొన్ని కారణాభాసములుగలవు గాని యవియును నన్నిచోడుఁడు నన్నయ భట్టుకంటెఁ బూర్వుఁడని సాధింపఁ జాలినవికావు. మొత్తము మీఁద భాషా విషయములఁ బరిశీలింపఁగా నన్నిచోడుఁడు నన్నయకాల ప్రాంతము వాఁడనుటకవకాశము కనఁబడలేదు.

ఇంక శాసనప్రామాణ్యమునఁ గవికాలము నిర్ణయించినవారి రీతి చూతము.

**శాసన ప్రామాణ్యము.**

నన్నిచోడునికాలము వివాదగ్రస్తము. అయినను విమర్శకులలో నెవ రెట్లు చెప్పిరో ముందు తెలిపి, తర్వాత నా యభిప్రాయము తెలిపెదను. నడుమ నడుమ వారివాదములను బరిశీలనచేయు సందర్భమునను నా భావము కొంత చెప్పక తప్పదుగదా.

---

1. South Indian Inscriptions vol. IV. No. 803,

మ.రా.శ్రీ. మానవల్లి రామకృష్ణకవిగారు కుమారసంభవప్రథమ భాగము ప్రకటించినపుడు (1909 సం.) దాని పీఠికలో "ఇతఁడు క్రీ. శ. ౯౪౦ లోఁ బాశ్చాత్యచాళుక్యులతో యుద్ధముచేసి రణరంగమున నిహతుఁడయ్యెను" అని వ్రాసిరి.

దాని పైని 1911సం॥ ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో మ.రా.శ్రీ. బుట్టా శేషగిరిరావుగారు వేంకటాదిత్యుని కుమారసంభవ మనువ్యాసమున "క్రీ. శ. 940 అను తారీ ఖెక్కడనుండి వచ్చినది? దీనిని స్థిరపఱచు శాసన మెక్కడ నున్నది?" అని వ్రాసి, 940 సం॥ ప్రాంతమందున్న శాసనములను బట్టి, తాత్కాలిక దేశస్థితినిబట్టి యాలోచింపఁగా 940 లో రామకృష్ణకవిగారు చెప్పినయుద్ధములు జరిగినట్లు జాడలు లేవని తెలిపి యా వాదమును నిరసించిరి. ఆంధ్రుల చరిత్రమున 2,36 పుటలో మ.రా.శ్రీ. చి. వీరభద్రరావుగారును "పైని చెప్పఁబడిన (940 సం॥) నన్నిచోడునికాలమును స్థలమును (ఒరయూరపురస్థలము) సరియైనవి కావని చరిత్ర పరిశోధన వలనఁ దెలియుచున్నది" అని వ్రాసిరి.

మ. రా. శ్రీ. రామకృష్ణకవిగారు 1914 సం. నఁ బ్రకటించిన కుమారసంభవ ద్వితీయ భాగ పీఠికలోఁ (9 పుట.) దమ మొదటి నిర్ణయమునే సమర్థింపఁబూని "నన్నిచోడుఁ డొరయూరి నేలుచున్నవాఁడనియుఁ బాకనాటినేలుచుండి కృష్ణాతటమున క్రీ. శ. 962 లో శాసనములోఁ బేర్కొనఁబడిన చోడబల్లి కుమారుఁ డనియు విక్రమకేసరి సంభావించిన మల్లికార్జునునకు శిష్యుఁడనియు వనవాస దేశపుఁ జాళుక్య సామంతులతో యుద్ధముచేసి మృతినొంది యుండవచ్చు ననియు నా మనస్సున కుద్బోధన మగుచున్నది. " అని వ్రాసిరి. ఆ పీఠికలోనే 1, 2 పుటలలో క్రీ. శ. 850 మొదలు 1210 లోఁగా నన్నిచోడ నామము గలవార లనేకు లుండి రనియు, వారిలో నెవఁడు కుమారసంభవ కర్తయో నిర్ధారణ చేయుట సులభసాధ్యము కా దనియు వారే వ్రాసిరి. నన్నిచోడుఁడు రణనిహతుఁ డయ్యెనని తెలిపిన శాసనము తదితరులకు గోచరము గాదయ్యెను. దాని ప్రామాణ్యమెంతమాత్రమును గ్రహింపకయానిర్ణయము ననేకు లసడ్డ చేసిరి.

మ. రా. బుట్టా శేషగిరిరావుగారు—1900 సం. శాసన నివేదికలో (Epigraphical Report)నున్న చోళ వంశవృక్షమునం దున్న యొక శాఖలో నన్నిచోడుఁ డుండుట చూచి యాతనినే కావ్యకర్తగా నిర్ణయింప యత్నించిరి. ఆశాఖవారి వంశవృక్ష మిది—




ఇందు నన్నిచోడుని తండ్రి త్రిభువన మల్లదేవుఁడని యున్నది. కావ్యకర్త తండ్రిపేరు చోడబల్లి యని కావ్యమునఁ గలదు. త్రిభువన మల్లదేవుఁడను పేరును జోడబల్లియను పేరును రెండునుగూడ నొకనివే; అతఁడే నన్నిచోడునితండ్రి యనిరి. దానిని వారు సమర్థింప నీక్రింద నిచ్చిన నెల్లూరి శాసనములను గ్రహించి యొకనికే నాల్గుపేళ్లున్న వనిరి.

క్రీ. శ. 1145 బల్లిచోడ D. 48.
1147 బల్లయచోడ D. 68.
1148 త్రిభువన మల్లదేవచోడ G. 19-142.
1166 బల్లిచోడ D. 49.

1145 మొదలు 1166 వఱకు నాల్గు శాసనము లున్నవి. వారి ప్రశస్తులొక యక్షరమయినను భేదములేక సమముగానే యున్నవి. ఈ స్వల్పకాలమున నలుగురు వేఱువేఱు రాజులు పరిపాలించుట సంభవము గాదు గాన నొకఁడే పరిపాలించె ననియు, నతనికే బల్లిచోడ బల్లయచోడ త్రిభువన మల్లదేవ నామము లున్నవనియు నిశ్చయించుకొని పయి చోళ వంశ వృక్షములోని త్రిభువన మల్లదేవుఁడే నన్నిచోడుని తండ్రియగు చోడబల్లి యనిరి. అతఁడు 1148 లోనివాఁడుగాన, నతనికొడుకగు నన్నిచోడుఁడు క్రీ. 1150 ప్రాంతమువాఁ డనిరి. ఆతనికిఁ బాకనాటియం దిరువదియొక్క వేయిటి కధీశుఁడన్న బిరుదములేదను లోపమునుగూడ వారు దెలిపిరి.

దాని పయిని, మ.రా.శ్రీ. వీరభద్రరావుగారు 'త్రిభువన మల్లుఁడు చోడబల్లి కాఁజాలఁడు. త్రిభువన మల్లుని కొడుకైన నన్నెచోడుని తల్లి మాబల

దేవి యని యున్నది. కావ్యకర్త తల్లి పేరు శ్రీసతియని యున్న'దని యాక్షే పించుచు వ్రాసిరి. వారు చోళవంశ వృక్షమున బల్లయచోడునికిఁ గామచోడుఁడు పుత్త్రుఁడని యుండఁగా, ఆ బల్లయచోడుఁడే చోడబల్లియనియు, నాతనికి నగ్రమహిషి శ్రీసతి యుండి యుండు ననియు నామెకుఁ బుట్టిన వాఁడు నన్నిచోడుఁడు గావచ్చు ననియుఁ దాము చేసికొన్న యూహతోఁ "బండ్రెండవ శతాబ్దారంభమునం దనఁగా నన్నయ భట్టారకునకు నలువది డెబ్బది సంవత్సరములకుఁ దర్వాతి వాఁడుగా నుండవలయును." అనిరి. మఱొక యూహతో మఱొకటి చెప్పిరి. చిట్టచివర "నాకేసిద్ధాంతమును స్థిరపడి యుండ లే"దని ద్వితీయ భాగ పీఠికలో వ్రాసిరి.

మ. రా. శ్రీ. వీరేశలింగముపంతులుగారు కవుల చరిత్రలో శేషగిరి రావుగారి వాదమును బలపఱుపఁ బూనిరి. ఒకనికే నాలుగు పేళ్లు శాసనకర్తల భేదమునఁ గాన్పింపవచ్చుననియు, అట్టిది మైసూరు శాసనములలో నొక చోటఁ గల దనియు, ప్రశస్తులన్నియు నొక యక్షరమయినను భేదము లేకుండఁగ నుండుటచేత శేషగిరిరావుగారు అన్నట్లు "నన్నిచోడుని తండ్రి త్రిభువనమల్లచోడుఁ డయినట్లు స్థాపింపఁబడిన" దనియు వ్రాసిరి.

త్రిభువన మల్లదేవుని భార్యపేరు మాబలదేవి యని యుండఁగా మన కావ్యకర్త తల్లి పేరు శ్రీసతి యని యున్నదను వైషమ్యమును దొలఁగించుటకై మఱొక శాసనమున నన్నిచోడుని తల్లి పేరు 'మాచల' అని యున్నదని చూపి, 'శ్రీసతి' 'మాచల','మాబల' పేళ్లకు మాఱుపే రనియు గణసౌకర్యమునకు నన్నిచోడుఁడు 'శ్రీసతి' యని కల్పించుకొనె ననియు నూహించి యీ క్రిందివిధమున సాధింపఁబూనిరి—"మా + అబల - మా = శ్రీ (లక్ష్మి) అబల = సతి 'స్త్రీ' మాబల = శ్రీసతి. మా + అచల—మా = శ్రీ. అచలదేవి = (పర్వతపుత్రి) సతి. 'మాబల యని గాని మాచల యని గాని పద్యములో వేయ వలసిన చో దాని తుదను 'దేవీ' పదము చేర్పవలసి యుండును. కవి తాను రచించిన చంపకమాలలో గణసౌలభ్యార్థము మాబలార్థ బోధక మయిన 'శ్రీసతి' పదమును ప్రయోగించి యుండును" అని వివరించి, దాని దౌర్బల్యము మనసును బాధించుటచేతఁ గాఁబోలును "ఇది తృప్తికరమయిన సమాధానము కాక పోయినను, ఇంతకంటె మంచి యాధారము దొరకనప్పుడు దీనినే సరిపఱుచుకొనవలెను. ఇప్పటికి దొరకిన యాధారమును బట్టి నన్నెచోడుఁడు ౧౧౫౦ కిఁ దర్వాత నున్నవాఁడని యేర్పడుచున్నది" యని వ్రాసిరి.

మ. రా. శ్రీ. వీరరాజుగారు [1] 'వీరేశలింగముగారు చెప్పిన యుక్తి సరి యగునది కాదనియు, వారు చెప్పిన యర్థము 'పురాణార్థ' మనియు' వ్రాసిరి.

---

1. ఆం. సా. ప. పత్రిక. సంపుట. ౧౨ సంచిక ౨ పుట. ౧౧౩.

"మఱియుఁ గవి తాను జేయుచున్న వృత్తమునందు తన తల్లి పేరు చేర్చుటకై గణసౌలభ్యార్థ మిట్లు మార్చి యుండు నని యొక యుక్తిని గూడఁ జెప్పిరి. అదెట్టి యుక్తియో వేఱ విమర్శింప నక్కఱలేదు. ఎట్టివాఁడును దనతలిదండ్రుల నామ మిముడునట్టి వృత్తమును దలపెట్టునే కాని, తాను వ్రాయువృత్తమునఁ దన తలిదండ్రుల నామములఁ దూర్పుటకు వారిపేళ్లను మార్చ నేరఁడు ... ఇంతకును నన్నిచోడుఁడు చెప్పిన వృత్తము మాచల (మాబల) దేవి అను నామమునకుఁ జోటీయనిది గాదు." అనియు వ్రాసిరి. అది యెంతయు యుక్తి యుక్తముగానే యున్నది.

ఇక్కడ నొక్కమాట చెప్పవలసి యున్నది. వీరేశలింగముపంతులుగారు చెప్పిన యర్థము 'పురాణార్థమే' కాదు. అపార్థముగ గూడఁ గనఁబడుచున్నది. అది పరిశీలింపఁ దగును.

'మా + అచల—మా = శ్రీ. అచల (పర్వతపుత్రి) సతి, మాచల = శ్రీసతి.' అని వారి వివరణము. అచల అనఁగా భూమియని యర్థముగాని, పర్వతపుత్రి అను నర్థ మెక్కడనయినను గలదా? లేకపోయినను మాటవరుసకు గ్రహింతము. అప్పుడు శ్రీ పార్వతి అని యర్థము వచ్చినది. పార్వతి పూర్వజన్మమున సతిగాన శ్రీసతి యనలెను. మా + అబల = శ్రీసతి. 'మా' పర్యాయము 'శ్రీ'. అబల= స్త్రీ. అనఁగా సతియఁట ఇది యెట్లు? అబల యనగా స్త్రీశబ్దస్ఫూర్తిగలుగునుగాని సతీశబ్దస్ఫూర్తి గలుగునా? ఇవి యన్నియుఁ దాత్కాలికవాదసమర్థనైకసాధనములు. యథార్థమార్గాన్వేషణమునకుఁ బనికి రావు. ఇవి సంప్రదాయసిద్ధమార్గము దొరకనపుడు త్రొక్కెడు పెడదారులు. సంప్రదాయమును బరిశోధించిన నిట్లు కనఁబడుచున్నది.

మాచదేవ, మాచయ్య మొదలగునవి పురుష సంజ్ఞలుగాను, మాచలదేవి, మాచల, మాచవ్వ, మొదలగునవి స్త్రీ సంజ్ఞలుగాను గన్నడమునను నాంధ్రముననుగూడఁ గలవు. అట్టివి గొన్ని చూతము.

తె నుఁ గు న

| పురుష సంజ్ఞ. | స్త్రీ సంజ్ఞ. |
|---|---|
| 1. కేతయ్య | కేతల దేవి |
| 2. బమ్మయ్య | బమ్మలదేవి |
| 3. మంగన | మంగలదేవి (ఇది సంస్కృత మంగళ శబ్దము కాదు) |
| 4. మాచయ | మాచలదేవి |
| 5. శాంత దేవ | శాంతవ్వ, శాంతలదేవి |

| | |
|---|---|
| 6. సిద్ధసంగయ్య | సిద్ధల సంగళవ్వ, సంగవ్వ |
| 7. సోమయ, సోమన్న | [1] సోమల దేవి |
| 8. సుగ్గయ్య | సుగ్గల దేవి, సుగ్గవ్వ |
| 9. హొన్నయ్య | హొన్నల దేవి |

ఇవి బసవపురాణమునను నితర శైవగ్రంథములందును గలవు.

కన్నడమున

| | |
|---|---|
| 1. ఏచాంక | ఏచల దేవి. |
| 2. కాచి దేవ | కాచల దేవి, కాచవ్వె |
| 3. చందన్న | [2]చందల దేవి, చందవ్వె |
| 4. మాచ దేవ, మాచయ | మాచల దేవి<br>మాచల, మాచవ్వె |
| 5. శాంత | శాంతల దేవి |

'మాచ దేవ' అనుదాని స్త్రీరూపము 'మాచల దేవి'గాని మా + అచల అను పదచ్ఛేదమున కర్హమగు 'మాచల' పదముగాదు. 'మాచల 'లోని 'చ' వ్రాఁతను బట్టి 'బ'గా వ్రాఁతగాండ్రో చెక్కినవారో గ్రహించి యుందురు. మాబయ్య యనియో మాబదేవ యనియో యెక్కడ నయిన దొరకినచో మాబల దేవి పదము గ్రహింపవచ్చును. మాచల మాబలమ్మల పతులును, శ్రీసతి పతియు నొక్కఁడే యనుట న్యాయ్యేతరము. కావున, వీరేశలింగముగారు చెప్పినదియు దాని కాధారమగు బుట్టా శేషగిరిరావుగారి వాదమును బ్రమాణములుగాఁ జాల వని తోఁచెడిని.

త్రిభువన మల్లదేవచోడుఁడును 1166 సం. లో నున్న బల్లిచోడుఁడు వేఱు వేఱు పురుషులని మ. రా. శ్రీ. వీరరాజుగారు [3]స్పష్టపఱచిరి. వారు భిన్న పురుషులు. కావ్యకర్త తండ్రి చోడబల్లి మఱియొకఁడు. ఎందఱో సనామకు లుండవచ్చును. ఏకవంశస్థుల ప్రశస్తి లోకయత్నరమైన భేదము లేకుండఁగ నుండుటయును సుప్రసిద్ధమే.

ఇంతకుఁ జోడరాజుల శాసనములు శాసనపరిశోధకులకు దొరకినంతవట్టు కైనను మూలపాఠములైనను బ్రకటింపఁబడలేదు. 1900 సం.(Epigraphical Report) లో సిద్ధపఱచిన వంశవృక్షముగూడఁ దత్కాలలభ్యములయిన

1. సోమలదేవి శాసనమే యున్నది. 2. "చందలదేవి యాత్మజై మహాసతి దేవలె యంతు పాత్తల్లో, చందలదేవి యాత్మజై మనోరమె కాచలదేవి పొత్తల్లో" Mysore Epigraphica Karnatica No. 38

3. చూ. ఆం. సా. ప. పత్రిక సంపుటము ౧౪ సంచిక. ౨ పుట. ౧౧౨.

వానినిబట్టి యప్పటికిఁ గూర్చినదే కాని, యది సర్వసిద్ధాంతముగాఁ జాలదు అని శాసనపరిశోధకులే యొకచోటఁ దెలిపిరి. వానిలోఁ గనఁబడిన పేళ్లకెల్లను ముడిపెట్టవలయు నని యత్నించినచోఁ గష్టమే. ఇంతకంటె సరియయినది దొరకనప్పుడు ఇదే సరి యనుకొనవలె నని కొంద ఱందురు. కొన్ని తెలియకపోవచ్చును. తెలియనవు డూరకుండక యొకరి యయ్యల పేళ్లను అమ్మల పేళ్లను తాఱు మాఱు చేయఁబూనుట తగునా ?

మ.రా.శ్రీ. వీరరాజుగా రా సందర్భమున శాసనాధారము వీడి భాషా ప్రమాణమును బట్టి కాలనిర్ణయమునకుఁ బూనికొనిరి. అది భిన్నమార్గము. అంతలో మ. రా. శ్రీ. జయంతి రామయ్యపంతులుగారు పెద్దచెఱుకూరు శాసనము బయలువెట్టిరి. అందు ముఖ్యభాగము.

"అదేవీ త్కరికాలాఖ్యచోడ స్తస్యా న్వయేఽజని
చోడబల్లి నృప స్తస్మా న్నన్నిచోడ స్తదాత్మజః
సూరభూప స్సుత స్తస్య రాజరాజమహీపతిః
త స్యానుజో ఘటంకార నృపోఽహంకార శంకరః
తస్య చోడమహాదేవీ ప్రియా త త్తనయో నయీ
మల్లిదేవ నృపో యత్ర క్షాత్ర ధర్మాన్యలీయత
తస్య కాంతా మహాదేవీ నన్నిచోడ స్తయో స్సుతః
న్యగ్రహీ దుగ్రవీరారీ న్యగ్రహీ ద్విజయశ్రియం
గంగాదేవీ ప్రియా తస్య యా దేశె మతిచక్రమే
తాభ్యాం భూచక్రశక్రో భూ న్మల్లిదేవ మహీశ్వరః
ధర్మసంస్థాపనార్థాయ గాంగేయశ్చ కలియుగే పునః."

ఇందుఁ జోడబల్లి నృపునివలన నన్నిచోడుఁడు పుట్టె నని యున్నది. చోడబల్లి కొడుకు నన్నిచోడుఁ డని యున్నదిగదా చాలు ననికొనిరి.

ఈ శాసనము [1] క్రొత్తదిగాదు. 1900. సం. శాసన పరిశోధకులచే స్మరింపఁబడినదే. ఆచోడవంశవృక్షములో వా రీశాఖను జేర్పలేదు. మ. రా. శ్రీ రామకృష్ణ కవిగారు కుమారసంభవ ద్వితీయసంపుటపీఠికలో దీనిని స్మరించిరి గాని, వారి మతమున నన్నిచోడుఁడు క్రీ. సం. 940 ప్రాంతమునకు రావలయును గాన వారి కది యుపయోగపడలేదు. 'మన కవి నన్నయ్యభట్టు తర్వాతి వాఁడు'

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటము ౧౩. సంచిక 3. ౮. పుట ౧౮3.

"1897-వ సం. లో రాజకీయ శాసనాధికారులు సంపాదించిన శిలాశాసనములలో నిది 243 వది." See Epigraphy Report, Madras. for 1900.

అనుమతమువారగు రామయ్యపంతులుగారు దాని నుపయోగించికొనిరి.

అందు శాసనమును జెక్కించిన కాలములేదు. "శ్రీ మద్గణపతిక్ష్మేశః పరిదపూండిమిమం పునః, శ్రీమేశ్వరాయ దేవాయ ప్రాదా దాచంద్రతారకమ్ ..." అనియు "కాకతీయ గణపతి మహాక్షోణీశస్యధర్మార్ణాలంక్రితం" అనియు నుండుటచేత గణపతి కాలపుది అనఁగా శక. 1120 మొదలు 1182 వఱకుఁగల కాలములోనిది కావలయు ననిరి. దానిలో గణపతి కొంతకాలము రాజ్యము చేసిన తర్వాతఁ గమ్మనాఁడును పాఁకనాఁడును జయించెను. గుంటూరు మండలమున ఒంగోలు తాలూకాలో దయ్యాలరేపూరను గ్రామమును శకవర్షంబులు ౧౧౮౦ శ్రాహి శ్రీమన్మహామండలేశ్వర కాకతీయగణపతి దేవమహారాజులు బ్రాహ్మణాగ్రహారముగా నిచ్చిన ట్లొక శాసన మున్నది. గుంటూరు మండలమునఁ గొణిదెనలో నున్న శాసనమున ౧౧౮౭ శక సం॥ న ఓపిలి సిద్ధన చోడదేవ మహారాజులు శ్రీ మహాదేవరకు గణపతి మహారాజునకు ధర్మముగా మొగడ చెఱు విచ్చిన ట్లున్నది అని తెలిపి "వీనినిబట్టి పెద్దచెఱుకూరి శాసనము ౧౧౮౦ శకాబ్ది ప్రాంతమునం దని యూహించుట యాక్షేపణార్హముగా నుండదు" అని శాసనకాలము రామయ్యపంతులుగారు నిర్ణయించుకొని యీ క్రింది వంశవృక్షము మొట్టమొదట నేర్పఱచికొనిరి.




"౧౧౮౦ శక. సం. లో శాసనము స్థాపించిన రెండవ మల్లిచోడునకును మొదటి నన్నిచోడునకును నడుమ నాలుగు తరము లున్నవి. తరమున కిరువది యైదు లెక్కచొప్పునఁ జూచిన యెడల. మొదటి నన్నిచోడుఁడు శక సం. ౧౦౮౦ ప్రాంతపు వాఁ డగును. అనఁగా నన్నయభట్టారకున కించుమించుగా నూఱేం డ్లిటీవలివాఁ డగును" అని సిద్ధాంతము చేసికొనిరి.

దానిపయిని మ. రా. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రులుగా[1] రా శాసన శ్లోకములను బట్టియే 'మొదటి నన్నిచోడునకు సూరరాజు ఘటంకారుఁడు అను నిద్దఱుకొడుకులు' అని రామయ్యపంతులుగారు వ్రాసిరి. అట్లు కాదు నన్నిచోడు నకు సూరరాజు సూరరాజునకు రాజరాజు, ఘటంకారుఁడు అని యిద్దఱు కొడు కులు. ఘటంకార,మల్లిదేవ,నన్నిచోడ మల్లిదేవులు క్రమముగాఁ దద్వంశస్థులు అని శాసనము తెలుపుచున్నదని తెలిపి 'రెండవమల్లిచోడునకును మొదటి నన్ని చోడునకు నడుమ నయిదు తరము లున్న' వనిరి. దానికి రామయ్యపంతులు గారును నంగీకరించిరి. దానిచే రామయ్యగారు చెప్పిన శక సం. ౧౧౪౦ కాలము మఱొక యిరువదియైదు సంవత్సరములు వెనుకకుఁ బోవలసినదేకాని ప్రభాకర శాస్త్రులుగారు శాసనస్థాపనకాలమును ముప్పది సంవత్సరములకాలము క్రిందికి దింపినారు. అనఁగా శక. 1170–1180 ప్రాంతపుదన్నారు. అది చూతము.

"ప్రస్తుత శాసన కాలమును గణపతి వెలనాఁడు జయించి నప్పటి కాలముగానె (శక ౧౧౪౦) సామాన్య దృష్టిని రామయ్య పంతులుగా రట్లు వ్రాసిరి. ఈ శాసనము వెలనాఁడు జయించిన కాలముననే వెలయింపఁబడిన దగునేని దయ్యాల రేవూరి శాసనమువలె నిదిగూడ గణపతిపేరనే యుండఁ దగియుండును. కావున నిది యంతకుఁ గొంత తర్వాతికాలమున వెలయింపఁబడి నదయి యుండవచ్చును. ఆ తర్వాతి కాలము గణపతి యవసానకాలమగు శక ౧౧౮౦-కు లోఁగా నెప్పుడేని కావచ్చును గదా" యనివ్రాసి దాని కుపో ద్బలకముగా ఓరియంటల్ లైబ్రరీలోని శాసనముల వాల్యూం నెం. I. 792 పేజీలో నున్న తామ్రశాసనముఁ జూపిరి.

అందు మల్లిదేవుఁడు దానముచేసిన ట్లున్నది. ౧౨౨౧ శక సంవత్సర మాశాసనపుఁగాలము. మల్లిదేవుని తల్లిదండ్రుల పేళ్లందు లేవు. అందు గణపతి మహారాజులకు ధర్మము మొదలగునవి లేవు. అతఁడు సామంతుఁడుగాక స్వతం త్రుఁడుగా శాసనము స్థాపించిన ట్లున్నది. అయినను పెదచెఱుకూరిశాసనము చెక్కించిన మల్లిదేవుఁడును బయి తామ్రశాసనములోని మల్లిదేవుఁడును ఒకఁడే యని వారి భావము. దానికి వారువ్రాసిన ముఖ్యకారణ మేమో పరిశీలింతము. తామ్ర శాసనములో—

"న్యగ్రహీ దరిచతుర్విధసైన్యా న్యగ్రహీ దఖిలదిగ్జయలక్ష్మీమ్
మల్లిదేవ జగతీపతిశక్ర శ్శక్రసూను రివ చక్రిసహాయః"

అని మల్లిదేవ వర్ణనమునఁ గలదు.

ఇంకఁ బెదచెఱుకూరి శాసనమున రెండవ నన్నిచోడుని వర్ణనమున

1. ఆం. సా. ప. పత్రిక. సంపుటము, ౧౪ సంచిక ౧.

"తస్యకాంతా మహాదేవీ నన్నిచోడ స్తయో స్సుతః,
న్యగ్రహీ దుగ్రవీరారీ న్యగ్రహీ ద్విజయశ్రియమ్"

అనియున్నది. ఆ శ్లోకభాగముల సామ్యము నాశాసనములు రెండును నొకఁడే స్థాపించిన వని స్థిరపఱుచుటకుఁ గారణముగాఁ జూపిరి.

పెద్దచెఱుకూరి శాసనమున సుగ్రవీరారుల నిగ్రహించెను విజయశ్రీని నిగ్రహించెను అని యున్నపాఠమున కర్థము. విజయశ్రీని గ్రహించె ననుట యుక్తమని యెంచి మఱొక కవి "సైన్యాన్యగ్రహీత్" అని రచించియుండును. రెండు చోట్లనుగూడ శబ్దాలంకారముగా 'న్యగ్రహీత్' అనునవి గలవు. విజయలక్ష్మిని గ్రహించె నని యర్థము నిచ్చినదే సరసము. శాసనద్వయమున కుఁ గర్తయొకఁడే యని చెప్పుట కీ శ్లోకార్ధ భాగసాదృశ్యము చాలదు. వారు స నామకులుమాత్రమే కావచ్చును. శైవులలో మల్లిదేవ నామకు లనేకులుండుట సహజము. దానివలన వారిమతమున '౧౧౮౨లకు మల్లిదేవుఁ డున్నాఁడుగాన ౧౧౮౨ సం. గణపతి యవసాన కాలము. గణపతి యవసానకాల పూర్వసమీ పమునఁ బెద్ద చెఱుకూరి శాసనము గణపతికి ధర్మార్థముగా దానము చేసినాఁడు. ఆతఁడే గణపతి యనంతరము స్వతంత్రుఁ డయి తన స్వతంత్రతతోఁ దామ్ర శాసనము చెక్కించినాఁడు' అని తేల్చి ౧౧౭౦-౧౧౮౦ ప్రాంతమునఁ బెదచెఱు కూరి శాసనమును నిల్పిరి. శ్రీ రామయ్యపంతులుగారు చెప్పిన నాల్గు తరముల మీఁదను మరొకతర మెక్కినను శాసనకాలము ముప్పదిసంవత్సరములు క్రిందికి దిగినదిగాన వారిమతము నిల్చిన దని వారును దాని నంగీకరించియుందురు.

ఇంతకు రామయ్యపంతులుగారు 'నన్నిచోడుఁడు నన్నయభట్టారకుని తర్వాతివాఁడనుట యే ముఖ్య'మను[1] వాదమువారుగాని స్వల్పసంఖ్యాభేదమంతఁ గాఁ బాటించువారుగారు. లేకపోయినచో శ్లోకార్థసాదృశ్యమాత్రమున నామల్లిదేవుఁడే యీ మల్లిదేవుఁ డని యొప్పుకొనెదరా! ఇక్కడ మఱొక్క విష యము. ౧౧౮౯ గణపతికి ధర్మార్థముగా దానమిచ్చినట్లు ఒక శాసనము. రామయ్య పంతులుగారే చూపిరి. అట్లే ౧౧౮౦ సం.లో నా రీతి శాసనముండఁ గూడదా? అప్పుడు వెలయించినచో రేపూరిశాసనమువలె గణపతి వెలయించినట్లే యుండఁ దగియుండుట యావశ్యకమా?

శ్రీ ప్రభాకర శాస్త్రులుగారు పయికాలమును సమర్థించుటకై కొప్ప రపుశాసన మొకటి ప్రవేశపెట్టిరి. అందు 'శక సం. ౧౧౩౫ అగునాఁడు కామ

1. "నన్నిచోడుఁడు నన్నయ్యభట్టుకంటెఁ బూర్వుఁడని పెద్దచెఱుకూరిశాసనము తెలుప దనియు, చోడుఁడు నన్నయ్యభట్టుకంటెఁ దరువాతి వాఁడనుటయే యుచిత మనియు నీ చర్చయొక్క పర్యవసానము''. ఆం. సా. ప. పత్రిక. సంపు. ౧౮. సంచిక. ౨. పుట.౧౧౩.

చోడరాజు కొడుకులలోఁ బెద్దవాఁడు రాజకన్నరదేవుఁడుండెను. అతఁడు సోమేశ్వరుని నమస్కరించి దేవునికొఱకుఁ గొప్పర గ్రామ మిచ్చెను. అప్పుడే యాతని తమ్ముఁడు చోడబల్లి దేవుఁడు చీదెవల్లి గ్రామ మిచ్చెను. ... ... తదనంతరము పాలూర్పురమునఁ బుట్టిన వాఁడును 'ధృత' కాలాముఖ వ్రతుఁడును నగు మల్లికార్జును నభ్యర్థించి తత్పూర్వార్థభావియగు నాతనికి సోమేశ్వరవరస్థాన మిచ్చె' నని యున్నది. "నన్నెచోడకవి గురువగు మల్లికార్జునుఁ డీతఁడు కావచ్చు ననుట మిక్కిలి సంగతముగా నుండును" అని శ్రీ శాస్త్రులు గారువ్రాసిరి. శైవరాజుల గురువులలోఁ బెక్కండ్రుం మల్లికార్జుననామకు లుండ వచ్చు. కుమారసంభవమందలి మల్లికార్జుననకు శివునితో నభేదముచెప్పి వర్ణించుటచేత నతఁ డిట్టివాఁడే యితఁడే యని నిర్ణయించుట కవకాశము లేదు. లౌకికస్థితిని దెలుపు పాలూర్పురజననాదిక వృత్తాంతము కావ్యమందు లేదు. ఆతఁడు దానప్రతిగ్రహము చేసి నట్లందు లేదు. కాలాముఖు లనేకులు భిన్న భిన్నకాలములం దుండవచ్చును. ఇది కాలనిర్ణాయకము గాఁ జాలదు.

"వెదచెఱుకూరి శాసనమున, పాఁకనాఁడిరువదియొక్కవేయిటి కధీశుఁడు చోడబల్లికుమారుఁడగునన్నిచోడుఁడు దొరకినాఁడు. కొప్పరపుశాసనమునఁ దెలుఁగుచోడులచే నారాధితుఁడు, కాలాముఖదీక్షగొన్నవాఁడు నగు మల్లికార్జునగురువు దొరకినాఁడు. ఈ నన్నిచోడ మల్లికార్జున గురువు లేక కాలము వా రనుట స్పష్టము" అని శ్రీ శాస్త్రులుగారు వ్రాసిరి.

పెద్దచెఱుకూరి శాసనమునఁ 'బాఁకనాఁడిరువదియొక్కవేయిటి కధీశ్వరుఁడు' చోడబల్లి దొరకినాఁ డందు రే. అదియెట్లు? శాసనముఁజెక్కించిన మల్లిదేవచోడునకు "పాకనాంటి విషయ ఏకవింశతి సహస్ర గ్రామానునీ వల్లభ" అని బిరుద మొండుటచే నాతకిఁ బూర్వమయిదవ పురుషుఁడయిన చోడబల్లి కాబిరుద మున్న దని చెప్పఁగలమా? అది కేవలము వంశక్రమాగతమగు బిరుదముగాదు. చతుర్థవర్ణ జాతులగు వెలనాఁటిరాజులప్రశంసలోఁ గేయూర బాహు[1]చరిత్రమునఁ బాఁకనాఁ డిరువది యొక్క వేయిటి కధీశత సూచితము. ఇరువదియొక్కవేయి యనునది పాఁకనాఁటి గ్రామపరిమితిని తెలుపును. పాకనాఁటిలో నంతను గాని కొంతనుగాని పాలించిన వా రట్లు చెప్పుకొనుట కలదు.

---

1. "మ. అరు దండన్ వెలనాఁటి చోడమనుజేంద్రాజ్ఞాపనం బూని దు
స్తర శక్తిం జని యేకవింశతి సహస్ర గ్రామ సంఖ్యాకమై
ధరణిం జేర్చిన పాఁకనాఁడు నిజదోర్దండైకలగ్నంబుగాఁ
బలిపాలించె నమాత్య కొమ్మన జగత్ప్రఖ్యాత చారిత్రుఁడై."

కేయూర బాహుచరిత్ర. ౧-౨౪.

శాసనము చెక్కించిన మల్లిదేవున కాబిరుద మున్నట్లు పెదచెఱుకూరి శాసనమునఁ గలదుగాన, ఇరువది యొక్క వేయిటి కధీశుఁడు చోడబల్లిదొరకి నాఁడని సంతోషింప నవకాశములేదు. అదిగాక కావ్యకర్త నన్నిచోడుఁ డొరయూరు పురాధీశ్వరుఁడ నని చెప్పికొనెను. పెద్దచెఱుకూరిశాసనకర్త కందుకూరి పురవరాధీశ్వరుఁ డని చెక్కఁబడి యున్నది. పాఁకనాఁ డిరువది యొక్క వేయిటి కధీశుఁడు దొరకినాఁ డని సాధింపఁ బోవు వారివలెనే 'యందలి చోడబల్లి కందుకూరి పురవరాధీశుఁడు గాన, ఒరయూరి పురవరాధీశుఁడగు నన్నిచోడుని తండ్రికాఁడు' అని సాధింపఁబూను వారికి వారేమిసమాధానము చెప్పుదురో ! అప్పుడు మల్లిదేవుఁడు కందుకూరిలో నుండుటచేత నట్లు చెప్పికొని యుండు నని రామయ్యపంతులుగా రొక సందర్భమునవ్రాసిరి. ఒరయూరు పురాధీశ్వరుల మని చెప్పికొన్న వార లొరయూరనుండిచెప్పికొని రనఁగలరా? పెద్ద చెఱుకూరిశాసనము కావ్యకర్తయగు నన్నిచోడునిఁ దెలుపుచున్నదను విషయము వివాదగ్రస్తమే. 'చోడ బల్లికొడుకు నన్నిచోడుఁడు' అనునది తప్ప నం దితరసాధన మేమియును లేదు. ఒక వంశమునఁ దండ్రి కొడుకులపేళ్లు సమముగా నున్నవా రుండఁ గూడదా? "తల్లిపే రున్నను దలిదండ్రులపేళ్లును దనపేరును సమములుగా నున్నవా రుండఁగూడదా యను వాదము రాకుండునా'' యని రామయ్యపంతులుగారు వ్రాసిరి. నిజమే తలిదండ్రుల పేళ్లును దనపేరు నున్నను, ఆతని చర్యలనో గ్రంథమునో చెప్పు ప్రమాణములు లేనపుడుచేసిన నిర్ణయము సిద్ధాంతితము కానేరదు. ఇతరత్ర చోడబల్లి నన్నిచోడనామము లెన్నియో కనఁబడుచున్నవని యందఱు నొప్పుకొనెదరు గదా.

ఇంక మ. రా. శ్రీ వీరరాజుగారు చూపిన శాసన ప్రామాణ్యమును జూతము. వా రీపెద్దచెఱుకూరిశాసనమునే ప్రమాణముగా గ్రహించి, శ్రీ రామయ్యపంతులుగారు మొట్టమొదట నిర్ణయించికొన్న శాసనకర్తృకాలమునే (శకసం 1140) శాసనస్థాపనకాలముగా నొప్పికొని 'నన్నిచోడుఁడు క్రీ.౧౨౨౦. ప్రాంతమువాఁ'డని సాధింపఁబూనిరి.-శాసనములోనున్న "తస్యానుజోఘటంకారః'' అను శిలాక్షరములను 'తస్యాత్మజోఘటంకారః, అనిదిద్ది ఘటంకారునకు అన్నయగు రాజరాజును ఘటంకారునకు అబ్బనుగా నిర్ణయించుకొనిరి. అట్లు అన్నదమ్ముల వరుసను దండ్రికొడుకుల వరుసఁగాఁ జేయుటకుఁ గారణ మేమి చెప్పిరో చూతము. వంశక్రమము చెప్పునపుడు తండ్రికొడుకులక్రమమును దెలుపుచు సూరభూపునకు రాజరాజ ఘటంకారులు ఇద్దఱు కొడుకులని చెప్పుట యుక్తముగాని సూరభూపునకుఁ గొడుకు రాజరాజు, రాజరాజునకుఁ దమ్ముఁడు ఘటంకారుఁడు అనిచెప్పుట యుక్తముగాలేదు అని వారి భావము.

కావున వారు శిలాక్షరములను దిద్ది యన్నవరున యబ్బవరున చేసిరి అప్పు డాఱుతరములు సిద్ధించినవి. తరమునకు నలువది సంవత్సరముల చొప్పున లెక్కకట్టి క్రీ. ౯౪౦ ప్రాంతమున నన్నిచోడుని నిలుపఁజూచిరి. శాసనము లకుఁ బ్రామాణ్యము శిలాక్షరమయము లగుటచేతనేకదా! తగిన నిదర్శనాంతరములులేకయే శిలాక్షరములు దిద్దుట ప్రారంభించిననాఁడు శిలాక్షర ప్రామాణ్యమునకుఁ దిలోదకములీయవలసినదే కదా! ఇంతకు వీరరాజుగారు పెద్దచెఱుకూరిశాసనప్రామాణ్యమునఁ గొన్నిచోట్ల నర్ధాంగీకారమునే చూపిరి.

చోడరాజులలోఁ దెలుఁగుచోడులు పొత్తపినాఁడును పాఁకనాఁడును గమ్మనాఁడును మొదలగు స్థలముల నుండుటచేత వారాయానాఁటిచోడు లని ప్రసిద్ధిగాంచిరి. ఒక్కకాలవిశేషమున నాభాగము లన్నియు నేకరాజ్యముగా నుండియుండును. క్రమముగా వారివారి శాఖలు విడిపోయి యొక్కొక్క నాఁట రాజ్యముచేయుచుండి యుండుటచేతఁ గాలక్రమమున భిన్నశాఖల వారయియుందురు. ఇప్పటికి లభ్యము లగు శాసనములనుబట్టి శాసన పరిశోధకులుగూర్చిన వంశవృక్షమును జూడఁగాఁ గమ్మనాఁటివారి శాఖలో మనచోడ బల్లి నన్నిచోడులు పితాపుత్రులుగాఁ గానరారు. వేఱొకశాఖలో వీరి పేళ్లే లేవు.[1] పాఁకనాఁ డిరువదియొక్కవేయిటి కధీశ్వరుఁ డని యుండుటచేతఁ బాఁకనాఁటి చోడుఁడని గట్టిగా ననుటకును వీలు గనబఁడదు. కమ్మనాఁటివాఁడగు మల్లిదేవునికిని నట్టి బిరుద మున్నదిగదా. ఒరయూరు పురాధీశ్వరత యనేకులు చెప్పికొని రనుటకు సువిదితమే కదా. మన కావ్యకర్త యేశాఖలోనివాఁడో తెలిసికొనుట కిప్పటివఱకు నాధారము దొరకనేలేదు. ౧౯౦౦ సం. న శాసన పరిశోధకులు పెద్దచెఱుకూరిశాసనము నెఱిఁగి యుండియును, గమ్మనాఁటి శాఖలోఁ గాని యితరశాఖలోఁగాని యిముడకపోవుటచేతఁ గాఁబోలు వానితో దీనికి సంబంధమును జూపలేదు. ముందు ముందు ప్రకటింపఁబోవు శాసనము లలో నేదయిన లభించినచో మనకవివంశశాఖయుఁ దద్వృత్తమును దేలవచ్చునేమో? ఏ శాఖవాఁడో తెలియనపుడు పెద్దచెఱుకూరి శాసనములో నున్న వారే యీ చోడబల్లి నన్నిచోడు లనుట యెట్లు? రెండు శాఖలకును సంబంధము లేదేమో! ఒకవేళ నున్నదని చెప్పుటకు నిదర్శనములు దొరకినను 'బల్లిచోడునికొడుకు నన్నిచోడుఁడు' అనునంతమాత్రమున నా నన్నిచోడుఁడే

---

1. బల్లియచోడ మహారాజుల పేరఁ దామ్రశాసన మొకటి మద్రాసు మ్యూజియము నఁ గలదు. అందు వంశక్రమాదికము లేదు. అక్షరములపోలికనుబట్టి పండ్రెండవ శతాబ్ది ప్రాంతపుది యగు నని డాక్టరు శ్రీనివాసాచార్యులుగారు వ్రాసిరి.

See Journal of Indian History Vol XV, Part, 2. Serial No. 44. Page No. 259.

మన కావ్యకర్త యని ధ్రువపడదు. మనకవియే తారక సంహారానంతరము "వ. ఇట్లప్రతిహత శౌర్యుండును ... సకల భువన భవనాధీశ్వరుండును ... నగు తారకాసురు నామాక్షరంబులు సకల దిక్తట శిలాపట్టంబుల శక్తి ధరముఖ విజయప్రశస్తశాసన లిఖితాక్షరంబులయ్యె" (౧౨-౧౮౭) నని చెప్పియుండెను గాన నాతఁడును దనవిజయమును వృత్తమును శాసనమునఁ జెక్కించియే యుండును. అదియో యట్టిదియో లభించినపుడుగాని మనకవి యీనాఁటివాఁడని నిర్ణయింపనవకాశము లేదు. ఈవిషయములను బరిశీలించిన సహృదయులకు శాసనప్రామాణ్యమెట్లున్నదో విశదమగును.

శాసనప్రమాణము దుర్బలముగా నున్నపుడు భాషా నిదర్శనములను బట్టి కాలనిర్ణయముచేయుట విమర్శకులం దఱకును సమ్మతమే కాన నట్టి నిదర్శనములు వెనుకఁ జూపఁబడినవి. అవి సింహావలోకన న్యాయమున మరలఁ జూతము.

సింహావలోకనము

I. తిక్కన కేతనల గ్రంథభాగములందలి కొన్ని పద్యములను భావములను నన్నిచోడుఁ డనుకరించుటయే కాక వానికి మెఱుఁగు పెట్టఁదలఁచి రచించుట. (చూ. 126-136 పుటలు).

II. నన్నయభట్టునకు సమీపమునఁ బూర్వాపరకాలములం దున్న కవితాఫక్కిక నన్నిచోడుని కావ్యమున లేకుండుట. (చూ. 172-178)

III. నన్నిచోడుఁడు నన్నయ్యభట్టుకంటెఁ బ్రాచీనుఁ డనుటకుఁ జెప్పిన కారణములు సరిగా లేకపోవుట. (చూ. 181-194)

IV. నవీన మగు కన్నడము[?]నని వని ప్రసిద్ధి గల పదములు మనకవి కావ్యమున నుపయుక్తము లగుట. (చూ. 168-172)

V. ద్వాదశ శతాబ్ది ప్రాంతమున నెవనిచేతనో కాళిదాస నామమున రచింపఁబడిన దని యూహింపఁ బడిన సంస్కృత కుమార సంభవోత్తర సర్గ భాగము లోనిభావములు గొన్ని నన్నిచోడుఁడు గ్రహించుట.

VI. భారతకవితాశైవకవితాసముచ్చయముగాఁ గావ్యము రచించుట.

సిద్ధాంతము

మొదలగు నిదర్శనములవలనఁ దిక్కన కనంతర కాలమువాఁ డని తేలుచున్నది. తిక్కన కనంతర మిఱువదిడెబ్బది సంవత్సరములవఱకుఁ జోడరాజుల శాసనములు గన్పట్టుచున్నవిగానఁ దత్ప్రాంత కాలమున నన్నిచోడకవి వెలసియుండును. చతుర్దశశతాబ్దిప్రథమపాదమో త్రయోదశశతాబ్దిచతుర్థపాదమో

నన్నిచోడునిచే వెలసియుండును. అప్పటి కున్న యితరరాజులరాజ్యపాలమున నన్నిచోడునిపరిపాలన మెట్లు సందర్భించు నందు రేమో. మన కవిరాజశిఖామణి రాజశిఖామణి యైనను సాధారణసామంతతుల్యుఁడేగాని కొందఱన్నట్లు 'గోదావరిమొదలు సింహాళాంతమువఱకుఁ బరిపాలించినవాఁడు' గాఁడు. అట్టి యద్దురాఁగూడదు. ఈ విమర్శమందలి గుణదోషములకు సహృదయులే ప్రమాణము. ఈకవి కావ్యమున విశేషము లసంఖ్యాకములుగ నున్నవి. ఆంధ్ర ప్రబంధము లన్నిటికి నిది మేలుబంతి యనవచ్చు. అది చూపఁబోయిన నొక గ్రంథమగును.

కర్తవ్యము

ఈ ప్రబంధ మెంతయో పరిశోధించి సరియగు పాఠములతో విపుల వ్యాఖ్యతోఁ బ్రకటింపవలసియున్నది. అట్లు రచించి యాతని గ్రంథమునకుఁ బ్రశస్తి తెచ్చిననాఁడే యాతని ఋణము తీర్చినవార మగుదుము. మనలో గొంత ఋణము తీర్చినవారు శ్రీ మా. రామకృష్ణకవిగారు. కవిరాజశిఖామణి గ్రంథమును బఠించి పరమానంద మనుభవించుటయే యాంధ్రులాతనిఋణము తీర్చుట. అప్పుడు కవిరాజ శిఖామణి చెప్పినట్లు దత్తద్విషయముల ధన్యుల మగుదుము.

"సీ. జ్ఞానదీపంపు హృత్సదనంబులోఁ దాన దీవియగా నేచఁ దివురువారు
వలచేత వసువతీవలయంబు నవరత్నవలయంబుగా నిడ వలచువారు
భారతిఁదమమోము పసిఁడిమాడువులోన నిలువేల్పుగా నిల్పఁదలఁచువారు
అణిమాదిగుణమణిహారమ్ము లురమున హారంబు గా నిడఁ గోరువారు
తే. వెలయ సత్కృతి సదువుఁడు వినుఁడు వ్రాయుఁ
డీశ్వరాంబికా గుహు లిత్తు రీప్సితములు
వారి మేమెయిఁ గొనియాడు వారికోర్కు
లొనర జంగమ మల్లికార్జునుఁడు నొసఁగు.





నాగబంధము.

"చ. శరణు మహేశ భూరితర[1]సార సుఖప్రద కామకాల సం
హరభవరోగదారణ సురాసురవన్ద్య శరీర దుఃఖదు
స్తరకమలా[2]విహార హిమధామ సమస్తగ సోమదేవ వి
స్తీరితరమా దయారసయుతా యురులబ్ధి విభావనామయా.

అని నాగాభరణు నాగబంధ మురజబంధంబులఁ బ్రస్తుతించి"

కుమారసంభవము. ౧౦, ఆ. ౮౨; ౮3.

1. చారు; 2. లాప; 3. స్తరతర; అని వ్రాఁతను ముద్రితమునను గలవు. బంధమునకుఁగాని యర్థమునకుఁగాని యివి సరిపడవు. సంపడునట్లు సవరణచేసి గ్రహించుట యైనది.



చక్రబంధము.

"శా. ముక్తా ముక్త ఘనానురాగ మదనమోన్మాదైక సంసేవ్య సం
త్యక్తాకర్మ షడ్ప్రభేద మతివిద్యాదేహ శోభైకహా
భక్తాలంబక మంత్రతంత్రమయ సద్భావస్థితైకస్ఫురచ్ఛా
శాక్తేయా మునిచింత్యమాన భరతా సంతాపహా సద్యశా.

అని చక్రి శక్రాద్యమరచక్రంబు చక్రవిద్యాద్యనేక స్తుతిశతంబులం బ్రస్తుతించుచుండిరి."

కుమార సంభవము. ౧౨, ౯౭; ౯౮.

ఇందున్న విశేషములు వ్యాఖ్యయందుఁ గన నగును.

# అనుబంధము - II

ఇం దుదాహృతము లగు గ్రంథములలో ముఖ్యము లగువాని నామములు

తెనుఁగు

1 భారతము కవిత్రయము
2 నిర్వచనోత్తర రామాయణము తిక్కన
3 దశకుమార చరిత్ర కేతన
4 పండితారాధ్య చరిత్ర
5 బసవపురాణము
6 వృషభాధిప శతకము } సోమనాథకవి
7 శివతత్త్వసారము మల్లికార్జునుఁడు
8 కవిజనాశ్రయము భీమన
9 ఛందో దర్పణము అనంతుఁడు
10 భాగవతము పోతనామాత్యుఁడు
11 కేయూరబాహుచరిత్ర మంచన
12 ఉత్తర హరివంశము సోమన్న
13 అప్పకవీయము అప్పకవి
14 ప్రభావతీ ప్రద్యుమ్నము సూరన్న
15 నారసింహ పురాణము హరిభట్టు
16 ఉద్భటారాధ్య చరిత్ర [తెనాలి రామలింగ కవి]
17 వసు చరిత్రి భట్టుమూర్తి
18 ఆంధ్రుల చరిత్ర వీరభద్రరావుగారు
19 కవులచరిత్ర వీరేశలింగముపంతులు
20 విమర్శతరంగిణి వీరరాజుపంతులుగారు
21 శాసనపద్యమంజరి రామయ్యపంతులుగారు
22 తెలింగా శాసనములు
23 దక్షిణ హిందూదేశ శాసనములు (South Indian Inscriptions)
24 కుమారసంభవము (ముద్రితము, వ్రాతప్రతి) నన్నిచోడుఁడు
25 ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలు

తెనుఁగు

26 భారతి సంపుటములు
27 ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలు
28 ఆంధ్ర పత్రిక

కర్ణాటక గ్రంథములు.

1 కర్ణాటక కవి చరిత్ర ఆర్. నరసింహాచార్
2 విక్రమార్జున విజయము పంపకవి
3 గదా యుద్ధము రన్నకవి
4 శబ్దమణి దర్పణము కేశిరాజు
5 ధర్మామృతము నయసేనుఁడు
6 ఉద్భట కావ్యము

సంస్కృతము

1 కుమార సంభవము
2 శాకుంతలము } కాళిదాసు
3 కావ్యాలంకారసారసంగ్రహము (లఘువృత్తివివృతి వ్యాఖ్యలతో) ఉద్భటుఁడు
4 కావ్యమీమాంస రాజశేఖరుఁడు
5 భరతశాస్త్రము భరతుఁడు
6 భామహాలంకారము భామహుఁడు
7 రస గంగాధరము జగన్నాథకవి
8 కావ్యాదర్శము
9 దశకుమార చరిత్ర } దండి
10 భారతము వ్యాసులు
11 రాజ తరంగిణి కల్హణుఁడు
12 వాచస్పత్యము వాచస్పతి
13 ఖాదిర గృహ్యము
14 గోభిలీయము

## తమిళము

1 చిలప్పదికారము — ఇళఙ్గోవడిగళ్

2 తిరుమురుకాట్టిప్పడై — నక్కీరర్

3 తేవారము

## మళయాళము

రామ చరితము

## ఆంగ్లము

1. Sanskrit-English Dictionary Vaman Shivarama Apte
2. Karnataka - English Dictionary Kittel
3. Tamil Lexicon University of Madras
4. History of Sanskrit Literature A. Berriedale Keith
5. Sanskrit Poetics Pro. De.
6. Journal of Indian History, Madras.
7. Epigraphic Reports, Madras
8. Epigraphica Karnatika Mysore.
9. J. Buheler's Report of Tour in Kashmir J. B. B. R. A. S. Extra No. 1877.


| సంకేతములు. | వివరణములు. |
|---|---|
| ఆ. | ఆశ్వాసము |
| పు. | పుట |
| సం. | సంపుటము, సంచిక, సంస్కృతము (సందర్భానుసారముగా గ్రహించునది) |
| స్కం. | స్కంధము |
| మొ. | మొదలు |
| శ. స. | శకసంవత్సరములు |
| క్రీ. శ. | క్రీస్తుశకము |
| భార. | భారతము |
| నిర్వ. | నిర్వచనోత్తర రామాయణము |
| కా. సా. సం. | కావ్యాలంకారసార సంగ్రహము |
| కా. కు. సం. | కాళిదాస కుమార సంభవము |
| రా. అ. కా. | రామాయణము అరణ్యకాండము |
| ఆం. సా. ప. | ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక |
| తం. ప్ర. పా. | తంజావూరు ప్రతిపాఠము |
| ము. పా. భే. | ముఖ్యపాఠభేదములు |

# అనుబంధము - III

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 7 | 31 | ముద | మున | 93 | 25 | వేశే | లేశే |
| 15 | 20 | దీవ్య | దివ్య | 96 | 4 | మను | మును |
| 28 | 27 | డినన | డిరన | 97 | 17 | డుయా | డా |
| 31 | 12 | మును | ములను | 97 | 31 | 31 | 32 |
| 33 | 19 | శిలో్ప | శలో్క | 99 | 34 | శ్లోము | శ్లోకము |
| 34 | 25 | లము | లయము | 101 | 32 | రను | రనను |
| 49 | 13 | సమర్ప | నమర్ప | 103 | 6 | లికాకి | లికి |
| 49 | 28 | దరులి | దలిరుల | 105 | 17 | డది | డిది |
| 50 | 1 | మొలపు | మెలపు | 109 | 16 | ప్రాత | పాత్ర |
| 50 | 12 | నగే | నాగే | 109 | 14 | జరద | జరద |
| 51 | 7 | దయ | ద్వాయ | 112 | 14 | లోపా | తోపా |
| 51 | 7 | యథా | తథా | 112 | 30 | చివ | చిన |
| 52 | 1 | భుజ్త | భుజ్త్క | 118 | 11 | చిన | చెన |
| 53 | 17 | రు్మ | ర్మ | 121 | 2 | ముజే | ముఃజే |
| 55 | 3 | విక్ర | విక్రి | 125 | 26 | మునుబు | మునుంబు |
| 55 | 13 | పచా | పచచా | 125 | 25 | వ | ర |
| 55 | 34 | రంబు | రకంబు | 126 | 14 | మొగ్గ | మ్రొగ్గ |
| 61 | 23 | శిఃగాళ | శిగాళ | 126 | 28 | నద్భి | వద్భి |
| 66 | 16 | బందో | బంధో | 126 | 32 | హోత్రై | హాత్రై |
| 68 | 13 | గాఃజి | గాజి | 128 | 28 | గవిం | గలిం |
| 74 | 16 | ద్యాయ | ద్యాయు | 130 | 18 | పులు | పును |
| 75 | 18 | పోశ్చ | పాశ్చ | 132 | 1 | జూఃడు | జూఃడును |
| 76 | 21 | తోవ | తావ | 137 | 13 | నాఙుక | నాయక |
| 79 | 2 | లేనేలేదు | లేదు | 138 | 25 | థము | థమ |
| 81 | 11 | నది | నవి | 141 | 25 | ముష | మునష |
| 81 | 18 | న్నవి | న్నది | 141 | 25 | మునలు | ములు |
| 89 | 13 | ద్భటు | ద్భుటు | 142 | 27 | భల | బల |
| 89 | 15 | గోశ్మి | గాశ్మి | 144 | 29 | ణీయ | లీయ |
| 93 | 24 | త్రియా | క్రియా | 151 | 22 | తవ | తయావ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 153 | 10 | యనంగ | నంగముల్ | 182 | 15 | మర్గ | మర్గు |
| 155 | 21 | వీళ | వీణ | 186 | 14 | మద్య | ముద్య |
| 156 | 8,13 | ష్టిటి | ష్టి | 192 | 4 | భంగ | భంగి |
| 158 | 17 | జిత్య | జింత్య | 198 | 16 | నలె | నవలె |
| 161 | 7 | నలి | నందలి | 201 | 15 | యింకా | యించుకా |
| 170 | 19 | గల | దల | 204 | 8 | క్రదుం | కంద్రు |
| 170 | 20 | దలు | గలు | 204 | 21 | మాను | మావ |
| 171 | 3 | ములు | ములని | 208 | 12 | లో | లోఁ |
| 178 | 4 | క్వా | క్త్వా | 208 | 17 | పంపు | పంబు |
| 178 | 14 | వారికి | వారు | | | | |



